# ప్రేమామృతము

(నారద భక్తి సూత్రములు - టీక - సూత్రపద్యము - వివరణ గీతమాలిక)



రచయిత: కీ.శే.శ్రీ బాపట్ల హనుమంతరావు గారు

ప్రచురణకర్త: బాపట్ల వేంకట పార్థసారథి

శ్రీసాయీనిలయము, చెఱువు.(P.O.) : 522113

ఫోన్ : 08643 - 27565

2000

సర్వహక్కులు ప్రచురణకర్తవి
మూల్యము రు. 80/-

మొదటి కూర్పు : 1968 – 1000 కాపీలు
రెండవ కూర్పు : 2000 – 1250 కాపీలు

శాస్త్రగురు బోధలను మఱి, స్వానుభవము
కలిమి, నెద్దాని నరుడేడుగడగ నమ్మ
నదియె శ్రేష్ఠంబు, బరమౌనదియు, యదె జ
గంబున వాని కవలంబనంబు ; సాయి !

★-★-★-★-★-★

## ప్రార్థన

సాకారుండవో! లేక నిరాకారుడవో!
మఱేమి యగుదువో! యెఱుఁగన్
నాకగునె? శ్రితుఁడఁ గృపణుఁడ,
సాక వె! నీ కరుణఁ బఱపి, సాయీనాథా!

సందేహము లడపవె! నీ
యందున నేకాంతభక్తి నందింపవె! ని
న్నిందేమఱ నీకవె! యఘ
సందోహ మడంపఁగదవె! సాయీనాథా!

చేయఁదగని పనులఁ జేసితినెన్నియో,
చేయఁదగిన వానిఁజేయనైతిఁ,
గృపణుఁడైన వీని కిఁక వేఱు గతి లేదు ;
కరుణఁబఱపి, ప్రోవఁగదవె! సాయి !

## గోవిందం వల్లవీం వందే నిత్యరాసరసోత్సుకమ్
## రాధాంకృపా త్మికాం కృష్ణం రాధాత్మకమనుత్తమమ్



చిఱునవ్వుల్ కృపలీను నేత్రములహా! శ్రీ కృష్ణ సాయీ ముఖాం
బురుహంబున్ గనరండు! కన్నుల ఫలంబున్ గాంచుఁడీనాఁడ; ప్రే
మ రహస్యంబు సుబోధమౌ; నితఁడు దృఙ్మాత్రంబున మీహృదం
తర సర్వస్వము నాఁచు ప్రోడ; యికనేతజ్జాగృతిన్ బొందుఁడీ!

అహో : దేవర్షిర్ధన్యోయం యత్కీర్తిం శార్ఙ్గ ధన్వనః
గాయన్మాద్యన్నిదం తంత్యా రమయ త్యాతురంజగత్.



జయతి జగతి మాయాంయస్య కాయాధవస్తే
వచన రచనమేకం కేవలం చాకలయ్య
ధ్రువపదమపియాతో యత్కృపాతోధ్రువో యం
సకలకుశలపాత్రం బ్రహ్మపుత్త్రం నతోస్మి (విష్ణు పురాణము)

శ్రీశ్రీశ్రీ భగవాన్ సత్యసాయిబాబా
ప్రశాంతినిలయము



క్షీరవారాశియందు శ్రీ శేషశాయి!
ద్వారకామాయినిలయి శ్రీ బాబుసాయి!
సత్ప్రశాంతిధామమున శ్రీ సత్యసాయి!
బృందవనిని 'నాసాయి' శ్రీ కృష్ణసాయి!

ప్రథమముద్రణము

గ్రంథావిష్కరణ సమయమున తీయుబడిన ఛాయాచిత్రము



అనుసంధాత :

రచయిత. శ్రీశ్రీశ్రీ భగవాన్
సత్యసాయిబాబా.

ఆత్మీయసోదరులు :

చి॥ విశ్వనాథశర్మ
చి॥ సూర్యనారాయణమూర్తి.

శ్రీశ్రీశ్రీ భగవాన్ సత్యసాయిబాబా వారికి
ప్రేమామృతము ఆవిష్కరించు సమయమున సమర్పింపఁడిన

# జయనమోవాకములు

శ్రీనిత్త్యైక విభూతి ధామమునఁ బేర్మిన్ నిల్వఁగా లేక భ
క్తానూన ప్రణయానుకూల బహుధాకారుండవై, సత్యబో
ధానందామృత వాగ్విలాసముల భూతవ్రాతమున్ బ్రోచు నీ
దౌనిర్వ్యాజకృపన్ భజించెదను; బాబా ! సత్యసాయీ ప్రభూ !

చరియించు నెవ్వాని చరణాబ్జముల్ వేద వేదాంత సౌవర్ణ వీధులందు
ప్రసరించు నెవ్వాని వదనేందు చంద్రికల్ శ్రితచకోరక ముఖసీమలందు
రాణించు నెవ్వాని రమణీయ లీలావపువు ప్రసన్నజన హృత్పుటము లందు
వర్షించు నెవ్వాని వాత్సల్య వీక్షణల్ కరుణామృతము భక్త శిరములందు

అలరు నెవ్వాని దివ్య హస్తాంబుజములు
నతబహువరాభయ ప్రదానంబులందు
ఆపరుండిదె – సులభుఁడై యవతరించె
స్వాశ్రితశుభప్రదాయి – శ్రీసత్యసాయి.

ఇలఁ బ్రాప్యంబు నపేక్షణీయమదియున్నే ? నీకు, నీపాదస
జ్జల జాలన్ బరిచారికల్ బలె భజించన్ జేరు నీయెల్ల సి
ద్ధుల భక్తోద్ధరణైక కార్యములయందున్ దక్కఁ బాటింప వ
ర్మిలి, నీవృత్తమవేద్యమై పొసఁగుఁ ; దండ్రీ! సత్యసాయీ ప్రభూ!

భూరిభవాబ్ధిమున్గి, మఱవున్ వెఱవున్ గని కంది కుందుచున్
దీరముఁగానలేని కడుదీనులమే మవలంబనార్థమై
దారులఁజూడ నేఁడభయ దాన మొసంగి తరింపఁ జేయు నా
ధారము 'సత్యసాయి' పరతత్త్వముఁగంటి, మిదెట్టిభాగ్యమో!

ధర, వసు ధాన్య గేహ వనితాసుత బాంధవమిత్ర సంపదల్
స్థిరములు గాఁదలంచి పరితృప్తినిఁ గాంచక దేహి, యాతనా
భరమునఁ గ్రుంగు; స్వర్గమపవర్గము లేనియు సత్యసాయి! నీ
కరుణనఁ మించ నేర్చునె? జగంబుల; దాని ననుగ్రహింపవే!

ప్రతిపదంబును సంశయాస్పదము; మాదు
సందియంబులఁ దీర్పఁగాఁ జాలుదీవ;
విహితమార్గంబునను నడిపింపఁ గదవె!
శాశ్వత సుఖప్రదాయి! శ్రీసత్యసాయి!

హితమదేమొ మనుజుఁ డెఱుగక కోర్కులఁ
బ్రాకులాడి తుదకుఁ బతన మొందు;
హితముఁగూర్చు దాతవీవని కనఁడ ; య
క్షయ పదప్రదాయి ! సత్యసాయి !

ఎఱుఁగవని తెల్పుదుమె? వెత
లెఱిగింపమయేని పొదలు హృదయభరంబుల్
దఱుగవు కావున - విని, నీ
శరణం బిడఁగదవె! సత్యసాయీ! దేవా!

పరసచ్చిదానంద వార్థిరూపొంది పరమ భక్తానిల ప్రచలితంబంది,
సత్యసాయీ సుధాజలధరం బిదియ ప్రత్యక్షముగ సుధావర్షముల్ గురియ -
హృదయ చాతకమ! నిద్రితవ? లేలెమ్మ! ముదమారఁ దృష్ణఁదన్పుకొనఁబో! పొమ్మ!
జనన సార్థకతఁ గాంచగఁ జూచుకొనుము! అనుపమ సచ్చిత్సుఖానంది వగుము!
జయము! ప్రశాంతి సంస్థానికి - జయము! జయము! బాబా సత్యసాయికి - జయము!!

అప్ప! త్వత్కృపాఫలము 'ప్రేమామృతము'ను - వెలయఁ ద్వత్కరాబ్జముల నావిష్కరించి
త్రావఁ బెట్టి నీ బిడ్డలఁ దనుపఁ గదవె! - సాధుహృదయ సంస్థాయి! శ్రీ సత్యసాయి!

ప్రశాంతి నిలయము
ప్లవంగ మాఘ బ. త్రయోదశి
సోమవారము మహాశివరాత్రి 26 - 2 - '68.

ఇట్లు విన్నవించు,
శ్రీ సాయీ భక్తచరణ పరిచరణుఁడు
**రచయిత.**



భగవాన్ శ్రీసత్యసాయిబాబా
ప్రశాంతినిలయము, పుట్టపర్తి
మకాం - బృందావనము, 29-5- '63

## - తొలిపలుకు -

దివ్యాత్మస్వరూపులారా!

భగవంతుఁడు బంధరహితుఁడు. నిరంతర స్వతంత్రుఁడు. భక్తుల ప్రేమ రజ్జువుల చేత తప్ప అతఁడు మఱియొక శాసనమున బంధింపఁ బడఁడు. అట్టి ప్రేమకే లభించు చున్నాఁడు. స్వరూప స్వభావము లెట్టి సంబంధము గలిగి యున్నవో అటులనే పరమాత్మ, ప్రేమ లవినాభావసంబంధము కలిగియున్నవి. ప్రేమ స్వభావము పరమాత్మ స్వరూపముగా నున్నది. దీనిని పురస్కరించు కొనియే "ప్రేమే-దైవము; దైవమే-ప్రేమ" -అను సూక్తి ఆదర్శమైనది. కాని ఏతత్సత్యా నుభవమును పొందుట మిక్కిలి కష్టము. శుద్ధ సత్వహృదయుఁడు మాత్రమే దీనిని తెలిసికొని ఆనందింపఁగల అదృష్టశాలి. ఇది దివ్యమును పవిత్రము నగుటచే మనమున స్వార్థలేశమున్నంతదనుక దానినాసింపలేరు.

ఇట్టి ప్రేమ యుద్భవిల్లినపుడు మానవుఁడు ప్రాపంచక బంధములనుండి విడివడుచున్నాఁడు. ఎన్ని జన్మముల కైనను ఎట్టివానికైనను ఇట్టి ప్రేమ లభించియే తీరును. లేకున్న విముక్తుఁడగుటకు వీలులేదు-కాదు. ప్రేమానుభవములేని హృదయము మరుభూమి. ప్రేమమే ప్రాణము. ఇది యొక్కటియే ప్రపంచమునఁ గల సత్యవస్తువు. ఇట్టి సత్యమును పొందుటే సాయుజ్యము. భక్తుని హృదయము ప్రేమోద్భాసిత మగుట వలనను - సదా

ఈశ్వరాభిముఖమై యుండుట వలనను సాధకుల కిట్టిస్థితి దుస్సాధ్యము కాదు. పరమేశ్వరునం దమిత ప్రేమకలిగియున్నచో సకలమనస్తాపములనుండి విముక్తి కలుగును. కావున మానవులు ప్రేమాపుత విశాల హృదయులై యుండ వలెను. ప్రేమాశ్రు సేచనము వలననే భక్తిబీజము హృదయ భూమిని అంకురించును. ప్రేమ మానవుని జీవితమందను క్షణమును వాని ఆదర్శమునకుసన్నిహితుఁడై యుండఁగలుగు స్థితికిఁ గొనివచ్చును. అప్పుడు ప్రేమమయుఁడు తప్ప అన్యమేదియును గోచరించదు. ఇఁక ఆ ప్రేమమూర్తి యందే మానవుడు జీవింపఁగల శక్తి కలిగినపుడు వాని దుఃఖములన్ని మటుమాయమై పోవును. అపుడు వాని హృదయస్రవంతి పొంగి అతని పాద సాన్నిధ్యము ననే ప్రవహించును. ఇట్టి ప్రేమమే పరమాత్మను జేర్చునట్టి సూత్రము. వేయేల సమస్తము కడిగి కరిగించి వేయును. ఇఁక మిగిలినది ఆదర్శము మాత్రము. ఇది హృదయాకాశమున నుజ్జ్వలమై ప్రకాశించును. అప్పుడు ఇఁక ఉపాస్య ప్రేమమూర్తి దక్క తదన్యములు నిర్జీవములై విలుప్తములగుట వలన సకల ప్రాపంచక విషయములను పరిత్యజించుట అవలీల. ఈ ప్రేమదేవతయే నిత్యము. అతఁడే స్వయం ప్రకాశమగు ఆత్మ. అట్టి ఆత్మ స్వరూపమునుండి కరిగి వచ్చునదే ప్రేమామృతము. కావున ప్రేమకొఱకే ఆ ప్రేమస్వరూపుని ప్రేమించుఁడు. అదియే నిజభక్తి - జీవన్ముక్తి.

ఇట్లు

శ్రీ సత్యసాయిబాబా

# ఉపోద్ఘాతము - ఆశీస్సులు

శ్రియైనమః శ్రీ శ్రీనివాసాయనమః

భో! భో! మహాశయాః!

అథ భగవతా శ్రీమన్నారాయణేనోపదిష్టే విరించి కృత ప్రపంచైక ప్రమాణ భూతే వేదరాశౌ పూర్వభాగేన ప్రబోధితేషు ధర్మేషు విప్రతి పత్త్యాది దోషోద్ధిధీర్ష యా జైమినిర్మహర్షిః కర్మ మీమాంస రూపాణి ధర్మసూత్రాణి ప్రణినాయ! అథభగవాన్ బాదరాయణ స్తూత్తర భాగేన "పరంజ్యోతిః పరంతత్వం పరమాత్మా పరంబ్రహ్మ" ఇత్యాదిశబ్దైః ప్రతిపాదితస్య శ్రీమన్నారాయణస్య పూర్వ భాగోక్త ధర్మారాధ్యరూపతాం నిశ్చిత్య తత్త్వప్రబోధనాయ బ్రహ్మ మీమాంసా రూపాణి బ్రహ్మసూత్రాణి ప్రణినాయ!

అథ పరమ భక్తి నిష్ఠాగరిష్ఠః భగవాన్ నారదః భగవదుపదిష్టాని నిగమాగమ గీతాదిని సర్వాణి సమాలోడ్య భగవత్ప్రాప్తౌ భక్తే రారాధనరూపేతర ధర్మాంగ కత్వేన పరమ సాధనత్వే వా వినిగమనా విరహేణ పరమసాధన భూతారాధన రూపేతర ధర్మాంగత్వే ఉ పివా భగవత స్తత్రపరమరస్యతాయా అప్రహాణాత్ లోకానుగ్రహాయ తత్స్వరూప నిరూపణ పరాణి తన్మీమాంసరూపాణి భక్తి సూత్రాణి ప్రణినాయేతి మహతీ కింవదంతీ పండితానాం కర్ణపథ మలంకురుతే ! ఇతి ననూత్నోయం విషయః తత్ర తత్రేదంతా ప్రత్యభిజ్ఞా వైయ్యాకుల్యపి మహతీ చాఉ వగాహతే ఉనుపదమేవ తత్పృథ మిత్యపరోవిషయః!

విషయశ్చాయం పరిచుంబితశ్చానయ్యైవధి యాగ్రంథ కర్త్రాపి రూపాంత రేణ ! తథావ్యత్ర పూర్ణ విచారే నిర్మత్సరాః పండితాః పరిశోధక మహాభాగా స్తిష్ఠేయు రితివయం జోషమాస్మః ! పరిశిష్టోయముదంతః కృతిభిరను శిష్టః!

మధురానాథస్య విషయాః కేపిమధురతరాస్సంతః కల్పయంతః కామపి మధురతమాం భక్తిం కల్పయంత్యేవ క్రమేణ మధురమధురాం ముక్తిమితి మధు రాతి మధురా శ్శుకగిరః! అథగ్రంథేచాస్మిన్ ''సాత్వస్మిన్ పరమప్రేమ రూపా'' ఇతి సూత్రేణ భక్తిః పరమ ప్రేమరూపేతి నిశ్చిత్య తత్రవిశేషాః మతభేదాః నియమాః సంవాదపరాశ్చ విచారితాః!

శాండిల్యసు ''సాపరానురక్తి రీశ్వరే'' ఇతి భగవతి పరానురక్తి ర్భక్తి రిత్యభిధత్తే తతః పరానురక్తి పరమప్రేమ శబ్దయో రభిన్నార్థకత్వమేవ సిద్ధ్యతి నతు విభిన్నార్థకత్వం! అత్రకేచిత్తు ''పూజ్యేష్వనురాగో భక్తిః - సవయస్కేష్వను రాగ స్స్నేహః - పుత్త్రాదిష్వనురాగః వాత్సల్యం- స్త్రీష్వను రాగః కామః''- ఇత్యాదినా౭ నురాగస్యైక ఏవాలంబన భేదాదభిఖ్యాభేదమాప్నోతి శైలూష ఇవేతి వదంతి! భక్తి నిష్ఠా గరిష్ఠః ప్రహ్లాద ''యాప్రీతిరవివేకానాం విషయేష్వన పాయి నీత్వామనుస్మరతః సామే హృదయాన్నాపసర్పతు'' (విష్ణు పురాణే 1-20-19) ఇతి 'పామరాణాం విష యేషు యాదృశీ నివర్తయితు మశక్యా ప్రీతి ర్దృశ్యతే భగవాన్ తాదృశీప్రీతిస్త్వామ నుధ్యాయతో మేహృదయాన్నాప సర్పతు' - ఇత్య భిప్రైతి! అతః విలక్షణా ప్రీతిర్భక్తి రిత్యుక్తంభవతి! తద్వైలక్షణ్యమేవ పరమ-పరాది శబ్దై రభిధీయత ఇతి వక్తుం యుక్తం!

అత్ర శ్రీ భాష్యకారాస్తు -వివేకవిమోకాభ్యాస క్రియా కల్యాణా నవసాదా నుద్ధర్ష రూపసాధన సప్త కనిష్పాద్యాయమనియమాసనప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యానసమాధి రూపాష్టాంగాయుతా విజాతీయ ప్రత్యయా నంత రిత సజాతీయ ప్రత్యయ ప్రవాహరూపా తైలధారా వదవిచ్ఛిన్న స్మృతి సంతతిః వేదనధ్యానో పాసనాది శబ్దవాచ్యాదర్శన సమానాకార -ప్రీతి రూపతా ముప వన్నా భక్తి రిత్యభి ప్రయంతి అత్రాపి భక్తేః ప్రీతి రూపతాయాంబాధా భావాత్ తత్రవైలక్షణ్యమేవ కలయంతి తంత్రాణీతివి శేషః!

భక్తిర్నామసేవా - ఇతి, చిత్తవృత్తివిశేష ఇతి తదేకాయత్త చిత్త త్వమితి, శ్రవణంకీర్తనమిత్యాదినా నవవిధా భక్తిరితి, ''అర్చనంచజపోధ్యానాంతన్నా మస్మరణంతథా''-ఇత్యాదినా షోడశధా భక్తిరితి, ఏతత్సర్వమపి గౌణ

ముఖ్యప్రభేదేన నిర్వాహోదత్రైవ పర్యవస్యతీతి సంప్రదాయవిదః కథయంతిః అత్ర హనుమద్విభీషణాదయస్త్వేవం విధాంభక్తి మనుసరంత ఏవదయా పీయూష సాగరస్య శ్రియః పత్యుర్భగవతః ప్రీతిపాత్ర భూతాఅభూవన్ ! ఏతత్సర్వమప్యభిద ధతే సామాన్య విశేషరూపేణ భగవద్వచనాన్యేవ '' ప్రియోహిజ్ఞా నినో௨త్యర్థం అహంసచమమప్రియః (భగవద్గీతా 7-17) మమ ప్రాణాహిపాండవాః (భార- ఉద్యో - 91-27) ''యస్త్వాంద్వేష్టిస మాంద్వేష్టి యస్తాననుసమానను '' (భార- ఉద్యో 91-30) ఇత్యాదీని ॥

ఏవంచైవంవిధ భక్తి స్వరూపాదినిరూపణ పరాణ్యేతాని నారద భక్తి సూత్రాణి చతురశీతి సంఖ్యాకాని నిగమన గుంభితాని ఫలశ్రుతి భూషితానిచ దరీదృశ్యంతే ௨ త్ర ! యద్యప్యేతాని హిందీభాషయా ఇతర భాషాభిశ్చ వివృతాని ప్రకాశంతే తథాప్యాంధ్రాణాం నోపకృతిస్తతః తేభ్యశ్చ ! అతో௨త్రనప్రీతిరుదియాత్ ! యథాహినా௨ విజ్ఞాతు స్సుఖం దుఃఖమన్య ద్వాభవేత్ ! అతస్తేషాం తదర్థ విజ్ఞాపనాయ తత్రప్రీతి సంజననాయ చాతి సరలయా అతిమృదులయా௨ తిమధు రయా௨ంధ్ర భాషయా గ్రంథకర్తు రయం ప్రయత్న ఇత్యుత్ప్రేక్ష్యామః ! తథాచ నారదభక్తి సూత్రాణాం హనుమద్భక్తి వివరణం యుక్తమేవ ప్రకాశతే! కథ మన్యథాతీర లాభస్సంభవేద్భక్తి ప్రవాహపతితస్య అస్య హనుమంతరాయకవేః ! హేమ్నః పరమామోదస్సంవృత్త ఇత్యభివర్ణయంతభియుక్తాః ! వారాశిముత్ ప్లవతోన వాగ్రాశేః ప్రతి రోధో భవతీతి సుహృదస్సహృదయాస్సముల్లసంతి ! తథాచ శ్రియఃపతి ర్భగవాన్ కారుణ్య సాగర స్సప్తాచలవాసీ సర్వప్రభుః శ్రీనివాసః పరమ భక్తి ప్రమాపతితస్యాస్య గ్రంథకర్తుః అచంచలాంపరమ భక్తిం స్వచరణార విందయోః కలయతా మభీష్టానిచ ప్రదిశతామితి తమేవ పద్మావతీ సమాశ్లిష్ట భుజాంతరం భగవంతమనంత కల్యాణగుణ విలాసం శ్రీనివాసం ప్రార్థయామః !

బృందావనమ్, అప్పికట్ల — ఇతి మహావిద్వాన్

30-3-67 — **పండిత వేదాంతం జగన్నాథాచార్యః**

తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థానవిద్వాన్

**అభినందనములు** (ప్రథమ ముద్రణములోనిది)

శ్రీః

ఇది నారద భక్తిసూత్ర వివరణము–వీరు రచించిన గ్రంథములలో నిది యొక రత్నము. వీరు భగవద్గీతలు, ప్రబోధసుధాకరము, మున్నగు జ్ఞాన భక్తుల నుద్బోధించు గ్రంథములెన్నింటినో రచించి, యాంధ్రావళి మోదమునకుఁ గారణ భూతులైరి. శ్రీ శంకర భగవత్పాదులను హృదయమున నిడుకొని యీ కవి చంద్రుఁడు అద్వైతమున కభిన్నముగ భక్తిజ్ఞానములనేకముగ వర్ణించిన పరమప్రేమ రూపమును, నారద గ్రథితమగు దానిని విపులీకరించెను.

ఇట్టి గ్రంథము లన్ని భాషలలో నిపుడు దేశమంతట వెలువడు చుండుట భారతీయుల యదృష్టము. 'విశ్వశ్రేయః కావ్య'మ్మని నన్నయ భట్టారకుఁడు వర్ణించినట్లు దేశభాషలలో మానవ శ్రేయస్సును లక్ష్యముగాఁ బెట్టుకొని యిట్టి గ్రంథముల ననువదించుట విశేషించి కలియుగమున ముదావహము.

భక్తిని వ్యాఖ్యానమొనర్తునని ''సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా'' యని నారదుఁడు రెండవ సూత్రమున నుడువుటచే 'పరమ ప్రేమాస్పదంయతః' అని చెప్పఁబడిన ఆత్మయే హరి. ఆ హరియందుఁ బ్రేమనిడి మానవుఁడు సంచరించుట – అంతయు హరిమయమని ప్రహ్లాదునివలె నన్యమును గాంచకుండుట భక్తి యగును. ఈ భక్తియే బ్రహ్మాత్మభావ రూపమును జ్ఞానముచేఁ బొందును. కనుక మొదట సాధన భక్తిగ నుండి పిమ్మట ఫలరూప మగుటయే మోక్షము. పరమేశ్వరుని పొందుటయే ఫలభక్తియగును. ఈ నారద మహర్షియే ప్రహ్లాదునకు గురువు. గర్భస్థ ప్రహ్లాదునకు నారదోపదేశమే జ్ఞానజనకమయ్యెను. గురువును మించి ప్రహ్లాదుడు – ''ప్రహ్లాద నారద పరాశర'' అనునట్లు ప్రథమగణ్యుఁడయ్యెను. ప్రహ్లాదుఁడు మిన్నయగుట నారదునకు హర్షహేతువు. 'పుత్రాది చ్ఛేత్పరాజయమ్' అని కదా లోక న్యాయము. నారద శబ్దమే జ్ఞానము నిచ్చువాఁడని బోధించును.

కర్మ భక్తి జ్ఞానములు మోక్షసాధనములగును. భక్తి మధ్యలో నుండి కర్మజ్ఞానములకు భక్తి అవశ్యకమని బోధించుచు మోక్ష సాధన సామగ్రిలో భక్తి గొప్పదిగ వెలయుచున్నది. ''మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవగరీయసీ''. ఈ

భక్తినే కొందఱు ఉపాసనగాఁజెప్పుదురు. ఈశ్వరు నెల్లకాలముపాసించుటయే భక్తి యగును. ఆయుపాసనలో నుపాసకుఁడు-ఉపాస్యదైవము వేఱుగఁ జేయఁ గూడదు. ఉపాస్యదైవమును వేఱుగఁజూచిన వాఁడాదైవమునకు భోగ్యుఁడై పశుతుల్యుఁడగును. ఆదైవముతోఁదనకబేధము నుపాసించినపుఁడే ఆ దేవతా సాయుజ్యము - మోక్షము ప్రాప్తించును. కనుకనే ''యద్జ్ఞాత్వా ...... ఆత్మారామోభవతి '' అని చెప్పఁ బడినది. గోపికల భక్తియు క్షణమేని శ్రీ కృష్ణుని వియోగమును మనస్సున సహింప రానిది. వారు జారవాంఛచేఁ గాక యోగులవలె శ్రీకృష్ణ పరబ్రహ్మమును సర్వ వ్యాపకమగు వస్తువుగ నెంచి క్రీడించిరనుట పెద్దలకు సమ్మతము. అట్లే ఉద్ధవునితో వారు సెలవిచ్చిరి. శ్రీకృష్ణుఁడు లోకసామాన్యుఁడని తలచినవారు బాల్యమునందు యువతులతోఁ గ్రీడించుట నెట్లు సమర్థింతురు? ఆయన మహిమలు కలవాడగుట బాల్యముననే వారితోఁ గ్రీడలు సల్పెనందుమా యదియాయన యనంత మహిమార్ణవమునకుఁ దార్కాణమగును. ఆయనకుఁ దనవారలేగాని పెఱలెవరు? అందఱను భరించు వాఁడగుట సర్వ భర్తయగును.

''వేదానపి.......లభతే'' (సూ. 49) అని చెప్పినటుల వైదికకర్మములను సన్న్యసించి యెడతెగని ప్రేమ ఆత్మయందు - కామిని ప్రియునందువలె నెవఁడు పొందునో వాఁడు తరించి, లోకమునుఁ దరింపఁ జేయుననుటచే నెల్లవు డాత్మాను సంధానమే మోక్షమునకుఁ గారణమని చెప్పిన శ్రుతిహరిని ఆత్మగా ననుసంధించు టను గూర్చి చెప్పుచున్నది. కనుక భక్తి రెండువిధములు సాధనభక్తి-ఫలరూపభక్తి . ఈసాధన భక్తి నామస్మరణార్చనాదిరూపము ఫలరూపభక్తి అనన్యభక్తి-ఆ స్వామికంటెనితరము లేదు - అనుభక్తి . అపుడు తనకుఁగాని లోకమునకుఁ గాని యీశ్వరునికంటె భిన్నత లేదని జీవుఁడు బ్రహ్మమును బొందుటయే ఫలరూపభక్తి. ఇది యీ సూత్రముల స్పష్టము చేయఁబడినది. కర్మాద్యా చరణము సర్వులకుసాధ్యము కాదు. కాని పురాణాది శ్రవణమున నీభక్తి పామరులకు సులభసాధ్యమగును. కనుక శ్రీ నారదమహర్షి లోకమునకిట్టి సూత్రరచన చేసి మహోపకార మొనర్చెను. ఇది తేట తెనుఁగున చెప్పిన వీరాంధ్రలోకమున కుపకర్తలని వేఱుగఁ జెప్పనవసరములేదు.

**తమ్మవరపు వేంకటరంగయ్య శాస్త్రి**
సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ.

# అభినందనములు.

మహిత సాయీపయోధి నిర్మథన సుప్ర
సిద్ధహస్త ప్రసూతమై చెలఁగు కతన
అద్వయానంద భక్తి రసార్థ సిద్ధి
కాకరము నారదీయ ప్రేమామృతంబు. 1

ఆర్ష నారద భక్తి సూత్రార్థ వివర
మనమ హనుమ గీతాభాష్య యశము వోలె
అమృతకిరణార్కు లంతరిక్షమున వెలుఁగు
నంతదనుకను వెలయుఁ బ్రేమామృతంబు. 2

ప్రేమామృత రస రసికులు
సామాన్యులె ? సాధుభక్త జనసమ్మాన్యుల్
ధీమాన్యులు భూమాన్యులు
శ్రీమాన్యుల శేష శేముషీ మాన్యులిలన్ 3

సల్పిన సుకృత ఫలముగా
కల్పమె? వివరణము ఫణితి – హనుమత్కవితా
శిల్పము! కూరుచుఁ బఠనము
సల్పం గల్పకము వోలె సంకల్పములన్ 4

శివదంబౌ శుభకృత్తు భాద్రపద సుశ్రీవామన ద్వాదశిన్
శ్రవణాతారఁ దులన్ ధరిత్రిని జనించన్ గన్న నీపూర్వ పు
ణ్య విశేషంబులె యిట్టిసత్కృతులఁ జేయన్ బంచి శ్రీసాయికృ
ష్ణవిశిష్టా ఽద్వయభక్తిఁ గూర్చి, ఁబ్రియనే స్తంబా! హనూమత్కవీ 5

సంస్కృతాంధ్రాంగ్ల భాషాత్రివేణీ పుణ్యసంగమస్నానంబు సలిపినాఁడు
శిర్డీశ్వరాస్థాన సిద్ధ కవీంద్రుఁడై త్రిదశాధిక కృతులఁ దీర్చినాఁడు
తనకుఁదాఁగోరివచ్చిన సాయి పద పద్మ మకరంద పానంబు మరగినాఁడు
జననీ జనక భక్తి సత్య హోదర మైత్రి పౌత్రదౌహిత్రాప్తి వరలినాఁడు

చేసె శ్రీసాయిరాముని సేవకతన
సహజ హనుమంత నామము సార్థకముగ
ధన్యచరితుండు ప్రేమామృతమునఁ దనుపఁ
జాలె సకలాంధ్రజనుల, నస్మత్సఖుండు. 6

ప్రేమామృతంబు శ్రీరా
ధా మాధవభక్త నారద ప్రాప్తము, సా
యీ మహితకరా విఖ్యాత
భూమానందద మశేష పురుషార్థదమున్. 7

ప్రేష్టవస్తువు స్వయమ శ్రీకృష్ణసాయి
ప్రాప్తమగుచుండఁ బూరుషార్థములఁ గూర్చి
పలుకనేల? ప్రేమామృతాస్వదన ఫలము
సచ్చిదానందతుష్టి ప్రశాంతికరము

చీరాల, 15/9/67 బందా ఆదినారాయణ

---

## అభినందనలు

గట్లనుదాటు గంగ యనఁగా వెనఁబొంగెడు మేటిధార, యె
ప్పట్లను లోటులేని మృదుభావరసంబుల నొప్పుకైత మీ
పట్లను జేరె సాయిభగవానుని సత్కరుణాప్తి, నోఁయి! బా
పట్ల కులాబ్ధి చంద్ర! కవిబాంధవ! శ్రీహనుమంతరాట్కవీ!

ప్రస్తుత పాఠకాళి రుచివాక్సుధఁ జిల్కి రచించునట్టి మీ
యాస్తిక కావ్యరాజి యలరారెడు నాంధ్రులనోటిలో, ముఖ
ప్రస్తుతిఁ గాఁ దలంపకుము; పండిత పామర రంజకంబు, మీ
నిస్తుల సత్కవిత్వము – పునీతము; శ్రీహనుమంతరాట్కవీ!

మధురకవి

25/10/1966 మూలాపేరన్నశాస్త్రి

ఓమ్ నమః శ్రీకృష్ణాయ భగవతే శ్రీసాయీ సద్గురవేనమః

# విజ్ఞప్తి

(ప్రథమ ముద్రణములోనిది)

భక్తజనులారా!

శ్రీ నారదమహర్షిచేఁ బలుకఁబడిన భక్తిసూత్రములకు టీక-తెనుఁగు -వివరణ గీతమాలికలఁ గూర్చి ''ప్రేమామృతము'' అను పేర ప్రచురించి, ఆంధ్ర సరస్వతి పాదపద్మములకు సమర్పించు భాగ్యము నాకుఁగలిగినది. ఇది కేవలము పరమేశ్వర కృపాకటాక్ష ప్రసాదము। సాధుభక్త జనానుగ్రహముఁ గాని నా సామర్థ్య మిందేమియు లేదు. నారద భగవానుని భక్తిసూత్రములకుఁ దెనుఁగు వివరణము రచింపఁగల యోగ్యత నా కెందును లేదు. ఇది మిక్కిలి సాహసము. కాలము సద్వ్యయము చేసికొని యేదొక రూపమున భగవన్నామము స్మరించుచుఁ దరింపవలయునను సంకల్ప మీ కృతిరూపముఁ దాల్చినది. భగవదనుగ్రహఫల మిట్టి కృతుల రచింపఁ బంచును. భక్తుల చరిత్రలు పరిశీలించిన వారివారి జీవితము లలో నెన్నెన్ని యొడుదుడుకులుండినను, వారి జీవనగతులు తారు మారైనను వారున్నత స్థితి శాంతి సంతృప్తులొందఁ జాలిరనుట సత్సాంగత్య మూలముననే యని మనకు విశదమగుచున్నది.

''సంసృతిరేషామ భక్తిస్యాత్ నాఽజ్ఞానాత్ కారణాసిద్ధేః'' అని శాండిల్య సూౕతములు తెలుపునటుల ప్రపంచమున నీ సంసార బంధములఁ జిక్కువడి పలు సంకటములు మనము పొందుట భగవద్భక్తి లేని కారణముననే కాని, జ్ఞానము లేకపోవుట చేతఁగాదు. ఆ జ్ఞాన మహంకారమమకారములచేఁ గప్పువడుటచే మానవుఁడు భగవద్భక్తికి దూరుఁడగుచున్నాఁడు. ప్రతి మతము-ప్రతి మతాచార్యుఁడు భగవద్భక్తి సాధించి, తన్మూలమునఁ దరింపుఁడని మానవ సమాజమునకు బోధించినారు. ''భక్త్యావినా బ్రహ్మజ్ఞానం కదాఽపి నజాయతే; సర్వోపాయాన్ పరిత్యజ్య భక్తిమాశ్రయ; భక్తినిష్ఠోభవ - భక్తినిష్ఠోభవ; భక్త్యాసర్వే సిద్ధయః సిద్ధ్యంతి, భక్త్యా అసాధ్యం నకించిదస్తి'' - అని త్రిపాద్విభూతి నారాయణోప నిషత్తు శాసించు చున్నది. ఆ భగవద్భక్తి

సాధుసత్పురుష సాంగత్యము చేతనే కలుగుచున్నది. ఆ సాధు సత్పురుష సాంగత్యమే సంసార సాగర తరణము. భగవదనుగ్రహముననే సాధు సాంగత్యము లభ్యమగుచున్నది. కావున దేవమౌని నారదుఁడీసూత్రములందు ''తదేవ సాధ్యతామ్-తదేవ సాధ్యతామ్''-దానినే సాధింపుఁడు-ఆ సాధు సత్పురుష సాంగత్యమునే సాధింపుడు-అని యుద్ఘోషించి నాఁడు.

## ప్రేమామృతము :

ఈకృతికి, ''ప్రేమామృతము'' అను పేరు నేను కల్పించినది కాదు. అవ్యాజ కరుణాళువు - పతిత జనోద్ధరణైక తత్పరుఁడునగు నారద భగవానుఁడు పరమాత్మ ప్రాప్తికి సాధనములగు వివిధ యోగ తత్త్వముల, నట్టి వానను గలుగు సాధక బాధకముల వివరించి, ''అనింద్య యోని అధిక్రియతే పారంపర్యాత్ సామాన్య వత్'' (శాండిల్య సూత్రములు) అంత్యజాని వరకెల్లరీ భక్తి మార్గమున నధికారులు- భక్తు లెల్ల రంగీకరించిన విషయమిది -యని, శాండిల్య మహాముని తెలిపినట్లు సర్వజన సులభ సాధ్యమగునది 'భక్తి' యని, స్వానుభవమున నెఱిఁగిన వాఁడగుటచే భక్తితత్త్వమును విశదపఱుపనెంచి ''అథాఽతో భక్తిం వ్యాఖ్యా స్యామః''-కావుననిఁక భక్తినిఁ గూర్చి వివరింతుము ''సాత్వస్మిన్ పరమ ప్రేమ రూపా'' -అది ఉత్తమ ప్రేమరూప మైనది. ''అమృత స్వరూపాచ.'' అమృత స్వరూపమునై యున్నది, అని 'భక్తి' ప్రేమరూపము అమృత రూపమునై యున్నది యని నిర్దేశించుటచే నీ భక్తి శాస్త్రము ''**ప్రేమామృతము**''-అని సూత్రకారుఁడే నిర్ణయించెను. కావున నీకృతికి 'ప్రేమామృతము'-అను పేరెంతయుఁ దగి యున్నదని యట్లుకావించితిని.

**ప్రేమ** :- 'అనురక్తిః పరేతత్త్వే భక్తిరిత్యభిధీయతే' - పరతత్త్వమగు దైవమునందు ప్రేమ - 'భక్తి' యని చెప్పఁబడును. భగవానునందు గాఢమగు ప్రేమ భక్తియని భక్తిమతాచార్యులెల్ల రంగీకరించిన విషయము.

''అనన్య మమతావిష్టా - మమతా ప్రేమసంగతా
భక్తిరిత్యుచ్యతే బీష్మ ప్రహ్లాదోద్ధవ నారదైః (నారదపంచరాత్రము)

★ ★ ★

''భక్తి రస్య భజనం – ఏత దిహాముత్రోపాధినైరాశ్యే
నాముష్మిన్ మనః కల్పనమ్''.–(గోపాల పూర్వతాపోపనిషత్. 2.1)

★ ★ ★

''మనోగతి రవిచ్ఛిన్నా హారే ప్రేమ పరిప్లుతా
అభిసంధి వినిర్ముక్తా భక్తిర్విష్ణు వశంకరీ'' (నారద పంచరాత్రము)

★ ★ ★

యా ప్రీతిరస్తి విషయే ష్వవివేక భాజాం
సైవాఽచ్యుతే భవతి భక్తిపదాభిధేయా
భక్తిస్తుకామ ఇవ తత్కమనీయరూపే
తస్మాన్మునే రజని కాముక వాక్యభంగీ.

★ ★ ★

''అన్యాభిలషితా శూన్యంజ్ఞానకర్మాద్యనావృతమ్
అనుకూల్యేన కృష్ణాను శీలనా భక్తిరుత్తమా''

★ ★ ★

స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే
స్వాత్మతత్త్వాను సంధానం భక్తిరిత్యపరే జగుః (వివేక చూడామణి)

★ ★ ★

దర్శనం పరభక్తిస్యాత్ – పరజ్ఞానంతు సంగమః
పునర్విశ్లేషభీరుత్వం – పరమాభక్తి రుచ్యతే'' (యామునాచార్యః)

★ ★ ★

'పరానురక్తిరీశ్వరే–' (శాండిల్యః)

★ ★ ★

''స్నేహో భక్తినితిప్రోక్తః'' – (వల్లభాచార్యః)

★ ★ ★

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ (శ్రీమద్భాగవతము)

★ ★ ★

భక్తినిఁగూర్చిన వివరణము లిట్టివి పెక్కులు గలవు. ప్రాపంచక విషయ లంపటులగు జనులు కాంతా కాంచనాదుల నెట్టులభిలషించి, దివా రాత్రములు వానినే తలంచును, వానినిఁ బడయ నెన్నెన్ని పాట్లు పడుదురో అటుల భగవానుని కళ్యాణ గుణాదులఁ దలంచుచుఁ గీర్తించుచు, వినుచుఁ బలు వివిధ సాధనములచే దైవమును దర్శించి భగవానునియందు లీనమై భగవద్వి రహమునకుఁ బరమ వ్యాకులత నొందుట 'ప్రేమ'యని తలంచనగును. దానినే యీ సూత్రములందు వ్యాస, గర్గ, శాండిల్యాదుల యభిప్రాయములఁ దెలిపి "నారదస్తు తదర్పితాఖిలా చారితా తద్విస్మరణే పరమవ్యాకులతేతి" (సూ.19)-ఎల్ల లౌకిక వైదికకర్మము లీశ్వరార్పణ బుద్ధితోఁగావించుచు భగవానుని యెడ విస్మృతి గలిగినపుడు మిక్కిలి వ్యాకులపడుట 'ప్రేమ' యని దేవమౌని నిరూపించెను.

**అమృతము :** ప్రేమసాధనము - తత్సాధనమున భక్తుఁడు పడయునది అమృతము. అంతమాత్రమున నొకటి కారణము రెండవది కార్యము అనరాదు. ప్రేమ పరిపక్వస్థితియే అమృతము. నారద మహాముని ముక్తి - కైవల్యము- అపవర్గాది శబ్దముల విడిచి 'అమృత' శబ్దము గ్రహించుటలో నొక విశేషము గలదు. "మయి భక్తిర్హి భూతానా మమృతత్వాయ కల్పతే" అని శ్రీమద్భాగ వతమునఁ జెప్పఁబడి యున్నది. జనన మరణ రహితస్థితి స్వర్గ బ్రహ్మలోకాది సుఖము లెడతెగక అనుభవించుట కాదు. అమృతత్వ మొకసారి పడసిన నది నశించునది కాదు. ప్రతి మధురము నందును 'తిక్తము' కలదు. కాని బ్రహ్మానందమున నదిలేదు. బ్రహ్మానంద సుఖాబ్ధిలో మునిఁగిన మరణము లేదు. ఇతర రసముల వంటిది కాదు. పూర్ణత్వ మా పరబ్రహ్మము నందే కలదు.

మోక్షము-విముక్తి యనునది, న్యాయవైశేషిక సిద్ధాంతమున 'అపవర్గము' (దుఃఖరహితత్వము) బౌద్ధుల నిర్వాణమువంటిది. క్రైస్తవ, మహమ్మదీయులు జీవన్ముక్తి సిద్ధాంతము నంగీకరింపరు. ఈభక్తి సూత్రములందుఁ దెలుపఁ బడిన 'పరాభక్తి' శ్రీ శంకర భగవత్పాదుల

'జీవన్ముక్తి' యగును. నారద - శంకర దేశికులు 'అమృతత్వము' జీవించి యుండఁగనే పడయవచ్చు ననిరి. ఉపనిషత్తులు నిట్లు చెప్పుచున్నవి.

'అథమర్త్యోమృతో భవతి - అత్రబ్రహ్మసమశ్నుతే' (కఠో 6-14)

'తమేవంవిద్వానమృత ఇహభవతి' - (పురుషసూక్తము) (తైత్తరీయ)

**అమృతము** :- అయాచిత ముక్తి. ''ద్వేయాచితాఽ యాచిత యోర్యథాసంఖ్య మృతాఽమృతే'' భక్తుఁడు కోరకున్నను భగవదనుగ్రహము వలన ముక్తి లభించును. కల్ప వృక్షము కోరిన నిచ్చునది. భగవానుఁడు కోరకయే యిచ్చువాఁడు. అట్టి యమృతత్వస్థితి ''యమే వైషవృణుతే తేన లభ్యః'' (కఠో 2-22) ''జుష్టః తేనామృతత్వమేతి'' (శ్వేత 1-6) భగవదనుగ్రహమునఁ బ్రాప్తమగును. స్వయంకృషి ముఖ్యమనిన శ్రీ శంకర భగవత్పాదులు గూడ దైవానుగ్రహమునకే మొగ్గెను (బ్ర.సూ 3-41; III 2-5 శంకర భాష్యము) మనుష్యుని ప్రయత్నము ననుసరించి దైవానుగ్రహము ప్రాప్తించును. దైవకృప గాలివంటిది. భక్తుని ప్రయత్నము తెరచాప యెత్తుట వంటిది. జనన మరణ రహితత్వము- ఆనందము- ముక్తి - దైవానుగ్రహము - స్వప్రయత్నము - ఇన్ని భావములను 'అమృత' శబ్దమున నారద భగవానుఁడు కూర్చెను.

**జ్ఞాని**-ఏకాంత భక్తులకు భేదము లేదు. ''భక్తాః ఏకాంతినో ముఖ్యాః'' (నా. భ. సూ 67) జ్ఞానభక్తులు వేరు పఱుప రానివి. ఆది శంకర దేశికులు 'భక్తి - జ్ఞానసాధన మనుటయు' శ్రీమద్రామానుజులు 'జ్ఞానము - భక్తి సాధన మనుటయు' ప్రారంభ స్థితినిఁ గూర్చియే, శ్రీ మధుసూదన సరస్వతులు 'భక్తిరసాయనము'న భక్తి బ్రహ్మ విద్యా చర్చ లందు ''రెండు నొకే విధమా? అట్లయిన భక్తి సిద్ధాంతమును గూర్చి ప్రత్యేక శాస్త్రమేల?'' - యను శంకను వారింప నీరెంటికి 'స్వరూప-సాధన-ఫల- అధికారులు' అను నాలుగు విషయము లలో భేధము గలుగుటచేఁ బ్రత్యేకముగఁ జెప్పవలసివచ్చినది అని వచించిరి.

భక్తియందు ప్రేమచే హృదయము ద్రవించి భగవద్రూపమొందును - బ్రహ్మవిద్యయందు హృదయ ద్రావములేదు. మనస్సును అభేద బ్రహ్మము నందు లయింపఁ జేయుటయే. భక్తియందు మనస్సు సవికల్పము, బ్రహ్మవిద్య యందు నిర్వికల్పము. సాధనములలో భక్తి - భగవానుని కళ్యాణ గుణగణ కీర్తనాదులచే లభ్యము- బ్రహ్మవిద్య-ఉపనిషత్ప్రరన-తత్త్వమస్యాది మహావాక్య చోదితము. భక్తిచే సాధింపదగినది భగవత్ప్రేమ- బ్రహ్మవిద్యయం దజ్ఞాన రాహిత్యము. భక్తిసాధనమం దెల్లజీవులకు యోగ్యత కలదు; బ్రహ్మవిద్య నధికారి కాని వాఁడభ్యసింపరాదు. ఇందు దైవానుగ్రహ ప్రయత్నములు విఘ్నములఁ దొలగించు కొనుటకే. అవి తొలఁగిన స్వస్వరూపము బోధపడును.

**సూత్రవాఙ్మయము** :- భారతీయ ధర్మ సంస్కృతులకు ప్రామాణిక గ్రంథములు వేద వేదాంగములు, ఉపనిషత్తులు, తదితర శాస్త్రములు, వీనిలోని ముఖ్యవిషయముల సూత్రప్రాయముగఁ బూర్వ ఋషులు కూర్చిరి. కర్మ భక్తి జ్ఞానాది విషయములకు వేర్వేఱుగ సూత్ర గ్రంథములు వెలసినవి. సూత్రకల్పనలో భావములు నిగూఢములై ఝటితి స్ఫూర్తినిఁ గలిగించునవి కావు. అర్థగర్భితములైయుండును. ఆకారణముననే వివిధ వ్యాఖ్యల కవకాశము గలిగినది. పరస్పర భేదములను ద్యోతకము లగుచుండును.

భక్తి సిద్ధాంతమున శాండిల్యసూత్రములు-నారదభక్తి సూత్రములు ప్రామాణిక గ్రంథములు. నారద భక్తిసూత్రములు తదితర సూత్రగ్రంథముల వలెకాదు. ఇందలి భావములు విస్పష్టములు; భాష సర్వసాధారణమైనది. దీనికిఁగల కారణము నారదుఁడు తాను దెలిపిన విషయములు స్వానుభవము న సత్యములు యుక్తములునని గ్రహించినవే. కేవల భాషాపాండిత్య ప్రకటనార్థము రచించినవి కావు. సర్వోత్తమ భక్తివిషయము స్వానుభవ పూర్వకముగ వివరించినాఁడు. తనకుఁ బూర్వులగు ఆధ్యాత్మిక వేత్తల - మహాభక్తుల నెఱింగి, వారి బోధల నవగాహనము చేసుకొనినాఁడు. ఆ

కారణముననే పూర్వుల సమకాలికులఁ బేర్కొనినాఁడు. అట్లు పేర్కొనుట లోఁదన యనుభవములను సమర్థించు కొనుచు, వారి పద్ధతులలోఁ దనకు భిన్నములుగఁ దోఁచిన విషయము లను దెలిపెను; కాని, అన్యథా విమర్శ నముఁ గాని, నిరసనముఁగాని చేయలేదు. సాధకుఁడు తన అనుభవము ప్రకారము బోధనొందు నవకాశమీసూత్రములు కల్పించు చున్నవి. ప్రేమ భక్తి సిద్ధాంతమున నిదియొక క్రొత్తపోకడ.

**నారదుఁడు :** 'అహో! దేవర్షిర్ధన్యోఽయం యత్కీర్తిం శారధన్వనః గాయన్మాద్యన్ని దంతంత్యా రమయత్యాతురంజగత్ ' వీణాతంతుల మీఁటుచు శ్రీహరిగుణముల గానముచేయుచు నున్మత్తుఁడై యీ విషయా తుర ప్రపంచము నానందింపఁ జేయుచు సంచరించు దేవర్షియగు నారదుఁడు ఆహా! ధన్యుఁడు సుమా ! ఈ నారదుఁడు అను పేరుగలవారు పెక్కురు గలరందురు. 1. బ్రహ్మ మానస పుత్రుఁడు, 2. పర్వత ఋషికి మాతులుఁడు, 3. వసిష్ఠ పత్ని అరుంధతియొక్క భ్రాత లేక సత్యవతి యను సతికిఁబతి, 4. సర్వత్ర చరించుచుఁ బ్రజలలోఁ గలహములు పెట్టువాఁడు. 5. కుబేరుని సభాసదుఁడు, 6. శ్రీరాముని సభ యందలి ధర్మశాస్త్రజ్ఞులలో నొకఁడు, 7. జనమేజయుని సర్పయాగ మందొక సదస్యుఁడు. నారదుఁ డొకఁడా? పలువురా ? యను వివాదము మనకు వలదు. నిర్ణయించు యోగ్యత మనకు లేదు. యుగ యుగంబున భగవదాజ్ఞానుసారము పలువిధములగు కార్యములు జరుపువాఁడీ నారదుఁడని మనము గ్రహింపఁ దగును. అతని ప్రధానకార్యము జీవులను తరింపఁ జేయుట. భగవద్భక్తిని బోధించుట అగును, సకల శాస్త్రపారంగతుఁడు సర్వతత్త్వజ్ఞాత వ్యాఖ్యాత యయ్యుఁ దుదకు భగవద్భక్తియే తారకమని జీవకోటికి బోధించినాఁడు, ఉపదేశించి నాడు. వీణెఁ జేఁబూని సర్వ యుగముల సర్వ సంఘములందు భగవద్గుణ కీర్తనము సేయుచు స్త్రీ, పురుషులను బవిత్రులుఁగ భగవదభి ముఖులుఁగ గావించు వాఁడీ నారదుఁడు.

సాధుసంగమము సకలార్థ సాధనము గదా! తపస్స్వాధ్యాయ నిరతుఁడు, తపస్వియు వాగ్విదాంపరుండగు నారద మహర్షిని వాల్మీకి

పరిప్రశ్నసలిపి శ్రీరామ తత్త్వరహస్యముఁ దెలిసికొని ఆది కవియై శ్రీరామ చరితఁ బలికినాఁడు. అష్టాదశ పురాణములుఁ బంచమ వేదమైపఱఁగు భారత సంహితను బలికియు, మనశ్శాంతి నొందని వ్యాసుఁడు నారదభగవానుని బోధలచే శ్రీహరికళ్యాణ గుణగాధానిధానమును భాగవత ధర్మ ప్రతి పాదితముఁ బరమహంస సాధుభక్త ప్రియతమమునగు శ్రీమద్భాగవతముఁ బలికి ధన్యుఁడయ్యెను.

శ్రీ మద్భాగవతమున నారదుని పూర్వజన్మ వృత్తాంతము తెలుపఁ బడినది. అందు ''తొంటిజన్మమున నారదుఁడు దాసీపుత్రుఁడు. సాధు సేవాబోధలచే జ్ఞానసిద్ధినిఁ బడసి ధ్యానమున బాలకృష్ణ సాక్షాత్కారముం బొందెను. తిరిగి యట్టి రూపమును దర్శింపనిచ్చించి తపస్సుచేసెను. '' ఈజన్మమున నీకు భగవద్భక్తి ఁప్రేమలు దృఢముఁజేయు పొంటె నట్టిరూపము నీకు గోచరించెను. కాని యా రూపమును నీవీజన్మమునఁ జూడఁజాలవు. ఉత్తర జన్మమున నీవు పరమేశ్వర సాక్షాత్కారముఁ బడయఁ గలవు. కల్పాంతము వరకు పూర్వజన్మ స్మృతి నీకుఁ గలుగును.'' అని ఆకాశవాణి తెలియఁబలికెను. పెద్దకాలము తపస్సుచేసి, దేహపతనానంతరము పార్షదుఁడై, కల్పాంతమున మరీచి మొదలగు ఋషుల తోడ బ్రహ్మమానస పుత్రుఁడై ప్రభవించెను. అది మొదలు అఖండ బ్రహ్మచర్య వ్రతమూని, త్రిలోకముల విహరించు చుండెను. భగవత్కృపవలన నెట్టి యాటంకములు లేకుండెను. భగవద్దత్తమై స్వరమయ బ్రహ్మచే నలంకరింపఁబడిన వీణె (మహతి) మీఁటుచు శ్రీహరి కళ్యాణ గుణములఁగీర్తించుచు నెల్లెడల సంచరించు చుండెను. ఎందెందుఁబ్రేమతో గద్గదస్వరమున భగవల్లీలల గానము చేసిన నందందప్పటి కప్పుడ యెవరో పిలిచి నటుల భగవానుఁడు నారదుని మ్రోల సాక్షాత్కరించు ను'' – అని చెప్పఁబడినది.

లోకవిషయ భోగాసక్తులై సంసారసముద్రమున మునుఁగనున్న వారికిఁ గేవలము శ్రీహరి నామస్మరణమే తరుణోపాయము. ఆ కారణమున జగత్కల్యాణము కొఱకు శ్రీముకుందుని కళ్యాణగుణగాధల గానము సేయుచు నారదుఁడు చరించుచుండును. శ్రీహరిభజనచే విషయాసక్తుని

చిత్తము శాంతి నొందునటుల నేయోగాది సాధనల మూలమున నంత త్వరితముగ శాంతి నొందదు. మహాభారతమున శ్రీ కృష్ణుఁ డుగ్రసేనునకుఁ దెలిపిన నారదమహర్షి మహత్త్వమును బీష్ముఁడు ధర్మరాజున కెఱింగించెను నారదుఁడు సకలవేద తత్త్వజ్ఞుఁడు- దేవతా పూజ్యుఁడు - ఇతిహాస పురాణ విశేషజ్ఞుఁడు- గతకల్ప విషయమేది - ధర్మతత్త్వ జ్ఞాత - సంగీత విశారదుఁడు - సర్వ శాస్త్రములందు సంపూర్ణ పండితుఁడు-దైవోపదేశముఁ జేయఁగల వాఁడు-సకల సద్గుణా ధారుఁడు - అపారజ్ఞాన తేజస్వి - విద్యాభాండారము -ఆనంద సమూహము-సదాచారాధారము - సకల భూతముల యెడ నవ్యాజ ప్రేమ కలవాఁడు - విశ్వహితకారి - భక్తి మహత్స్వరూపుఁడు- ఆచార్యుఁడు'' అని తెలుపఁ బడెను. బ్రహ్మసూత్రము లందు (III-3-32) దెలుపఁబడిన అధికారి పురుషుఁడు - నారదుఁడు - అనుటకు సందియములేదు.

నారదుఁడు ముక్తుఁడయ్యు సంసారసాగరమగ్నులగు జీవుల నుద్ధరించుటకునై మార్గోపదేశముఁ జేయుచు సంచరించువాఁడు. ఈశ్వరాధీనుఁడై జనసేవకై తన జీవితము నంకితము చేసినాఁడు. దైవలీలల యందు నిమగ్నుఁడై యానందమున నోలలాడు వాఁడు. జ్ఞానయోగ భక్తుల కూడలి నారదమహర్షి సర్వసౌలభ్యభక్తినిఁ బ్రేమించువాఁడు. పరాకాష్ఠస్థితి యందు ''కర్మ భక్తి జ్ఞానములు'' సమ్మిళితములగును. ప్రాథమిక స్థితియందు భిన్నములుగ గోచరించును. గమ్యమొకటియే. అన్ని యోగములు చిత్తశుద్ధి కలిగించి, పరమాత్మ సాక్షాత్కారము నొందు యోగ్యత కలిగించునవి. ప్రత్యేకముగ నొక్కొక్కదానికై సాధనసలిపిన దానికంటె మూఁటి విధానము లను సమన్వయించు కొని ప్రవర్తించు సాధకుఁడు గమ్యస్థాన మతి శీఘ్రముగఁ జేరఁగలఁడు. ఏమార్గము నవలంభించి నను చిత్తశుద్ధి పొందుట అవశ్యకము. భక్తియోగమునకుఁ బ్రాధాన్యమిచ్చి బోధించినను తక్కిన వానిని నారదుఁడు విస్మరించలేదు. గమ్యస్థానము ఁజేరుట కవియు నవసరములేయని తెలిపెను. యోగేశ్వ రేశ్వరుఁడు భగవానుఁడగు శ్రీకృష్ణుఁడు గీతలలో ప్రవచించిన

విధమున నీ భక్తి సూత్రము లందును సర్వయోగములను దృష్టియందుంచు కొని భక్తి యోగమున సమన్వయ పఱచి చెప్పఁబడినవి.

నారదమహర్షి జీవితము బోధనలను బరిశీలించిన శ్రీమధుసూదన సరస్వతులు ''భక్తిరసాయనము'' అను గ్రంథమునఁ దెలిపిన ''భక్తి భూమికలు'' ఆచరణరూపమున మనకు బోధపడును.

''ప్రథమం మహతాం సేవా – తద్దయా పాత్రతా తతః
శ్రద్ధాఽథతేషాం ధర్మేషు తతోహరి గుణశ్రుతిః
తతో రత్యంకురోత్పత్తిః స్వరూపాది గతిస్తతః
ప్రేమవృద్ధిః పరానందే తస్యాదస్ఫురణం తతః
భగవద్ధర్మ నిష్ఠాఽతః స్వస్మింస్త ద్గుణశాలితా
ప్రేమ్ణో ఽదపరమాకాష్ఠేత్యుదితా భక్తిభూమికాః''

ఈ పదొకంటికిని శాస్త్రీయోపాయములనిపేరు.

తొలుత మహాపురుషుల సేవ, పిదప వారిదయకుఁ బాత్రుఁడగుట, దానిచే వారి ధర్మమునందు శ్రద్ధ, శ్రద్ధవలన శ్రీహరి గుణశ్రవణము, శ్రవణము చే ప్రేమాంకురోత్పత్తి, ఆ ప్రేమచే స్వరూపాప్తి, దాన పరానంద స్ఫురణము, దానిచే భగవద్ధర్మమునందు నిష్ఠ, దానిచే తనయందా గుణములు ప్రకటించుట, పిమ్మట ప్రేమపరాకాష్ఠస్థితి. ఇట్లు పదకొండు విధముల భక్తిభూమికలు తెలుపఁబడినవి. ఇవన్నియు నారదమహర్షి జీవితమున గోపికల భక్తియందుఁ గాననగును. తాను స్వయముగ నాచరించి, యనుభవించి యానందించిన వానినే యీ భక్తిసూత్రము లందు నారద భగవానుఁడు ప్రవచించినాఁడు.

శ్రీమద్భాగవతమునందు భగవంతుని అవతారములలో నారదుఁడు మూడవ యవతారముగఁ బేర్కొనఁ బడెను. పురాణములందు దేవదూతగఁ జెప్పఁబడెను. దేవతలకు రాక్షసులకు మిత్రుఁడై యుభయుల నోదార్చువాఁడు. దేవునకు సృష్టికి అనుసంధాత. 'నారద' శబ్దోత్పత్తి పరికించిన ''నారం –పరమాత్మ విషయక జ్ఞానం–దదాతి–ఇతి నారదః'' (శబ్దకల్ప ద్రుమము)

పరమాత్మ విషయకజ్ఞానమును ప్రసాదించువాఁడు కావున 'నారదుఁడు' అని పిలువఁబడు చున్నాఁడు. మఱియు ''నారం-జనసమూహం కలహేన-ద్యతి-ఖండయతీతి-నారదః'' కలహములఁ గల్పించి జన సమూహము ను నాశనముచేయువాఁడు-కలహ కారకుఁడు-నారదుఁడు అని అందురు. ఈ వ్యుత్పత్తి సమంజసమైనది కాదు. నారదుఁడు సర్వ జీవోద్ధరణైక దృష్టిఁగలవాఁడు కాని వేఱుకాదు.

శివుఁడొసంగిన వరమును శివునియెడఁ బరీక్షింపుమని అంధకునితోఁ జెప్పుటయు, రావణుని వాలి వాలబంధములఁ జిక్కఁ జేయుటయు, కంసుని తో దేవకిపుత్రులఁ జంపుమనుటయు, శ్రీ కృష్ణుని రాయబారిగా యింద్రుని దగ్గరకేగి స్పర్థ కల్పించి, శ్రీకృష్ణునిచే పారిజాతమును హరింపఁ జేయుటయు, మొదలగునవి స్వార్థ లాభములుకావు. పరార్థ ప్రయోజ నములు మాత్రమే యగుచున్నవి. ఇచట నొకవిషయము జ్ఞప్తి యందుంచు కొనఁదగును. భగవానుఁడు సర్వజీవముల యెడ సమ భావము గలవాఁడు. ''సమోఽహం సర్వ భూతేషు నమేద్వేష్యోఽస్తి నప్రియః''(భగవద్గీతలు) అందఱ ననుగ్రహించువాఁడే. దేవతలని రాక్షసులని భేదములేదు. కాని వారిని తరింపఁ జేయు విధానములు వేఱు.

''ఈశ్వరస్యాప్యభిమాన ద్వేషిత్వా ద్దైన్యప్రియత్వాచ్చ'' (నా-భ-సూ. 27) అనుటలో తామస ప్రవృత్తి గలవారిని శిక్షారూపమున ననుగ్రహించును. దీనుల యెడ ప్రేమఁ బఱపి యనుగ్రహించును. ఫలము రెంటను సమానమే.

''యథావైరానుబంధేన మర్త్యస్తన్మయ తామియాత్

నతథా భక్తి యోగేన ఇతిమే నిశ్చితా మతిః (భాగ 22-32)

వైరానుబంధమున భగవానునియెడ తన్మయత్వము గలిగినట్లు భక్తి యోగమునఁ గలుగఁజాలదు. అని శ్రీమద్భాగవతమునఁ దెలుపఁబడెను. అలుక -భయము-ద్వేషము మొదలగు వేని చేతనైన భగవంతుఁని బొంద వచ్చునని ''తస్మాత్కే నాప్యుపాయేనమనః కృష్ణేని వేశయేత్'' కావున నే యుపాయము చేతనైన శ్రీహరియందు మనస్సు నిల్పుట ముఖ్యమని,

తన్మూలమున జీవి భవబంధ విముక్తి నొందునని చెప్పఁబడెను. ద్వేషాదుల ప్రసావము భక్తి ప్రాశస్త్య ముగ్గడించు టయే యగును.

" ఉక్తం పురస్తాదేతత్తేచైద్యః సిద్ధింయథాగతః
ద్విషన్నపిహి గోవిందం-కిముతాऽధోక్షజప్రియాః॥

"ద్వేషించియు శిశుపాలుఁడు గోవిందునిఁ బొందిన విధము మున్నె తెలిపితిని. అట్టియెడ ప్రేమించు భక్తజనులఁ గూర్చిచెప్పనేల"? – అని శుకయోగి పరీక్షిత్తునకు బోధించెను. ఇట్టి ప్రమాణములు పెక్కులుగలవు.

శ్రీ శంకర భగవత్పాదప్రోక్తమగు 'ప్రబోధసుధాకరమున' 'అనుగ్రహ ప్రకరణము' నుండి గ్రహింపఁబడిన యీ క్రింది సూక్తులను గమనింపుఁడు.

" ఆశ్రితమాత్రం పురుషం స్వాభిముఖంకర్షతి శ్రీశః
లోహమపిచుంబకాశ్మా సమ్ముఖమాత్రం జడంయద్వత్"
అయము తమోऽయమధమోజాత్యారూపేణసంపదావయసా
శ్లాఘ్యోऽశ్లాఘ్యోవేత్థం నవేత్తి భగవానుగ్రహోవసరే.

అంతస్థభానభోక్తాతతోऽంతరాత్మా మహామేఘః
ఖదిరశ్చంపక ఇవవా ప్రవర్షణంకిం విచారయతి?
యద్యపిసర్వత్ర సమస్త థాऽపి నృహరిస్తథాప్యేతే
భక్తాః పరమానందే రమయంతి సదయావలోకేన "

"తనకభిముఖుఁడై శరణం
బును జేసినమాత్రఁ బురుషుఁ బురుషోత్తముఁ డ
త్యను రక్తిని నాకర్షిం
చును జడలోహమును దివియు చుంబకము క్రియన్

జాతిరూజవయోభాగ్య సంచయమున
నీతఁడుత్తముఁ డధముఁడౌనీతఁ డితఁడు
శ్లాఘనీయుండు నీతఁ డశ్లాఘ్యుఁడనుచు
నెంచఁబోఁడు కృష్ణుఁ డనుగ్రహించువేళ.

భూతకోట్యాంతరిక భావ భోక్తయై త
దంత రాత్మయౌ శ్రీకృష్ణుఁడంబుదంబు
ఖదిరమియ్యది - యిది చంపకం బటంచు
వృష్టి సమయంబులందు భావించునేమి?

అఖిలభూతముల మురారి సముండునై
పఱఁ గుచున్న ఁదత్కృపావలోక
నమున భక్తవరులు రమియింతురు పరమా
నందు ఁడైన యా ముకుందునందు.

(ప్రబోధ సుధాకరము - అనుగ్రహ ప్రకరణము)

నారదునిఁగూర్చి చెప్పఁబడిన కథలు ఎవరినెట్టెట్లుద్ధరించి భక్తిమార్గ తత్పరులఁ జేసి మోక్షప్రాప్తిఁగూర్చినది పురాణములందెల్లడ ఁగాననగును.

నారదప్రోక్తములని చెప్పఁబడినవి. 1. నారదభక్తి సూత్రములు, 2. నారదస్మృతి, 3. నారదీయ శిక్ష, 4. సంగీత మకరందము. ఇవికాక నారదునకు సంబంధమున్నట్లు తెలుపునవి 1. నారద పరివ్రాజకోపనిషత్తు, 2. నారదీయ పురాణము, 3.నారద పంచరాత్రము. ఇందు నారదుఁడు గ్రంథకర్త గాక ఉద్బోధకుఁ డు కుగఁ బేర్కొనఁబడెను.

**నారద భక్తిసూత్రములు :**- ఇందు ఎనుబదినాలుగు సూత్రములు గలవు. విషయ విభాగము ననుసరించి పాఠకులకు సుబోధమగునటుల పదునాలుగు భాగములుగ నీ ప్రేమామృత గ్రంథమునందు విభజింపఁబడినవి.

**1. ప్రేమ భక్తి - స్వరూపము: - (1-6సూత్రములు)**

జీవి సంసార సాగరముఁదరించి యీశ్వరుని జేరుటకు భక్తియోగము సర్వోత్తమము. భగవద్భక్తి ప్రేమస్వరూపము - అమృత స్వరూపమునగును. అట్టి ప్రేమామృత స్వరూప భక్తిని ఁ బడయువాఁడు కృతకృత్యు ఁడు నిర్వికల్పుఁడు తృప్తుండు నగును. వానికి కోరిక - చింత- ద్వేషము కలుగదు. ఇతర మేదియు నితని కానందముఁ గూర్పదు. ఏ యితరమునుత్సహింపఁడు -అట్టివాఁడు మత్తుఁడు స్తబ్ధుఁడు-ఆత్మారాము ఁడగుచున్నాడు - అను విషయము లిందుఁ దెలుపఁబడినవి.

**2. ప్రేమ భక్తి - అనన్యత:- ( 7-14 సూత్రములు)**

ప్రేమ భక్తి యెల్లకామితముల నిరోధించునది యగుటచే కామ కామి కాదు. ఎల్ల లౌకిక వైదిక కర్మఫలములను దైవమునకు సమర్పింపనగును. దైవమునం దనన్యత-ఇతరము నందుదాసీనత వహించుట 'నిరోధ'మనఁ బడును. ఇతరము నాశ్రయింపకుండుట 'అనన్యత'. భగవదనుకూల కర్మములా చరించుచు నితరములగు వాని యందుదాసీనత వహింపనగును. భగవద్భక్తి స్థిరమైన పిదప గూఁడ శాస్త్ర ధర్మపాలన మావశ్యకమగును. అట్లుకాని యెడఁ దమ్మను సరించు వారు భ్రష్టులగుదురు. బాహ్యవివేక ముడుగువరకు లౌకిక కర్మము లావశ్యకములగును; కాని భోజనాదిక్రియలు శరీర పతన పర్యంత మావశ్య కములు. - అను విషయము లీభాగమునఁ దెలుపఁ బడినవి.

**3. ప్రేమ భక్తిలక్షణము -ఉదాహరణము- (15-24సూత్రములు)**

వ్యాసగర్గ శాండిల్యాదులు 'భక్తి'నిఁ గూర్చి తెలిపిన అభిప్రాయముల ముందుగఁ దెలిపి నారదుఁడు తన నిశ్చితాభిప్రాయ మెఱిఁగించెను. వ్యాసుని మతమునయిన భగవత్పూ జాదికములం దనురాగము భక్తియని, గర్గుని మతమున భగవత్కథాదులం దాసక్తిభక్తి యని, అవిచ్ఛిన్నాత్మరతిశాండిల్యుని మతమనియుఁ బలికి, సర్వ కర్మఫల మీశ్వరార్పణముఁ గావించుచు, భగవద్విస్మరణమున మిక్కిలి వ్యాకులత నొందుట 'భక్తి'యని నారదుఁడు తన అభిప్రాయమును దృఢముగఁ దెలిపెను. స్వానుభవమున నది యథార్థమని యుద్ఘాటించి, ఉదాహరణమునకు వ్రజమునందలి గోపికలను పేర్కొనెను. కామోత్కంఠలయ్యు గోపికలు శ్రీకృష్ణుఁడు భగవానుఁడను జ్ఞానము గల వారనియు, ఆ యెఱుక లేదేని జారల సరణి యగు ననియు, అటుల కానియెడ శ్రీకృష్ణుఁ డానందించు టయే తమ ఆనందముగ భావింపరని యీ భాగమునఁ దెలుపఁ బడినది.

**4. ప్రేమ భక్తి – ఫలరూపము:– ( 25–33 సూత్రములు)**

ఈ ప్రేమ భక్తి స్వయముగ ఫలరూపమైన కారణమున కర్మ జ్ఞాన యోగాదుల కంటె నధిక ఫలప్రదము. భగవంతునకు స్వాభిమానము గల వారి యెడ ద్వేషము, దీనుల యెడ ననురాగము గలదు. అట్లనుటలో రాగ ద్వేషములు భగవానునకులేవు. ఇరువురును సములే. కాని వారి వారినిఁ జక్కపఱచు పద్ధతులు మాత్రము వేఱు. ఈ ప్రేమ భక్తిఁ బడయుటకు జ్ఞానము సాధనమని కొందఱు, జ్ఞానభక్తులన్యోన్యాశ్రయములని కొందరుఁ జెప్పుదురు. నారదుని యభిప్రాయ మీ ప్రేమభక్తి స్వయముగ ఫలరూపమైన దని, యుదాహరణార్థము కేవలము 'జ్ఞానము'–రాజగృహ భోజనాది వార్తలగు ననియు; రాజునుగూర్చి, రాజ మందిరమును గూర్చి, భోజనాదులఁగూర్చి తెలిసికొనినన మాత్రమున రాజాను గ్రహముఁ గాని, ఆకలి తీరుటగాని కలుగదనియు, ముముక్షువులగు వారికి ప్రేమభక్తియే గ్రాహ్యమను విషయము లీ భాగమున బోధింపఁబడెను.

**5. ప్రేమ భక్తి – సాధన–సత్సంగ మహిమ:– (34–42 సూత్రములు)**

భక్తి సంప్రదాయ గురువులు భక్తిఁ బడయు సాధనలు పెక్కు తెలిపిరి. లోకవిషయములను, వానియందు సంసక్తిని విడుచుట చేతను,. ఎడతెగని భగవద్భజనమున, విహిత కర్మములు నిష్కామ బుద్ధితో నొనర్చుటవలన, శ్రీహరి కళ్యాణ గుణ శ్రవణ కీర్తనాదుల వలనను, నీ ప్రేమ భక్తి ప్రాప్తించును. అన్నిటికంటె ముఖ్యముగ మహాత్ములగు సాధువుల కృపవలన – భగవత్కరుణా లేశమున నీ ప్రేమభక్తి లభ్యమగును. ఆ మహాత్ముల కృప దుర్లభము– అగమ్యము–అమోఘము. అట్టి సాధు సత్పురుషుల యనుగ్రహము గలుగుటయు సర్వేశ్వరుని కృపయే. ఏలయన భగవద్భావతులందు సుమంతయు భేదములేదు. దానినే–పరమ సాధువుల కృపనే– యెల్లవిధముల సాధింపఁ దగును. అను విషయము లీ భాగమున వచింపఁబడినవి.

**6. ప్రేమ భక్తి - ప్రధాన బాధ - కుసంగతి- (43-45 సూత్రములు)**

ప్రేమ భక్తిసాధనకు ప్రధాన విఘ్నము దుస్సాంగత్యము. దుర్జన సాంగత్యము సర్వవిధముల విడువఁదగును. కుజనుల కూటమి కామ క్రోధాదు ల విజృంభింపఁజేసి, తుదకు సర్వనాశనముఁ గూర్చును. తొలుత అలలవలె తోచునవియే క్రమ క్రమముగ మహాసముద్రములగును. ముముక్షువు దుష్ట సంగతి కేమాత్రము నెడమీయరాదు- అనువిషయము లిందుఁ బేర్కొనఁబడినవి.

**7. మాయను తరించువారెవరు? (46-50 సూత్రములు)**

ఏకాంత వాసియై, లోకబంధముల నిర్మూలించి త్రిగుణముల వర్జించి, యోగక్షేమముల నపేక్షింపక, సకల కర్మఫలములఁ ద్యజించి, సుఖదుఃఖాది ద్వంద్వముల కధీనుఁడుగాక తుదకు వైదిక కర్మములను (స్వార్థపరతఁ గూర్చు కర్మములను) విడిచి, నిర్మలముగు భగవత్ప్రేమఁబడయు వాఁడీమాయను దరింపఁ గలఁడు - అని, ఈభాగమునఁ బలుకఁబడినది.

**8. ప్రేమ భక్తి - గౌణ భక్తి - వాని స్వరూపములు (51-57 సూత్రములు)**

ప్రేమస్వరూపము- స్వాదురసమును గ్రోలిన మూఁగవానివలె, దాని యనుభవముఁ బలుకులఁదెలుప నలవి కానిది. తగిన పాత్ర మందది యెప్పుడుఁ బ్రకాశించును. త్రిగుణములను విడిచి, కోరికలు లేక ప్రతి క్షణము వృద్ధి నొందుచు నవిచ్ఛిన్నము, మిక్కిలి సూక్ష్మము, అనుభవైక వేద్యము నగును. దానిని పొందినవాఁడు దానినే కనును. దానినే వినును, దానినే భాషించును, దానినే తలంచును.

గౌణభక్తి- గుణభేదముల ననుసరించి, ఆర్తాది భేదముల ననుసరించి మూడు విధములు

| | |
|---|---|
| సాత్త్విక- రాజస- తామస భక్తి<br>ఆర్త - జిజ్ఞాస - అర్థార్థి భక్తి | వీని యందు పూర్వము లుత్తరములకంటె శ్రేష్ఠములు |

అనఁగా తామసముకంటె రాజసము- దానికంటె సాత్త్విక భక్తిశ్రేష్ఠము. అర్థార్థి భక్తికంటె జిజ్ఞాస భక్తి, దాని కంటె ఆర్త భక్తి శ్రేష్ఠము- అను విషయము లీభాగము నందు వివరింపఁబడినవి.

**9. భక్తిసౌలభ్యము - మహత్త్వము:- (58-60 సూత్రములు)**

ఇతర మార్గములకంటె భక్తి సులభసాధ్యము- ఇతర ప్రమాణములతో నిమిత్తము లేదు. ఇది శాంతి పరమానంద రూపమగుటచే నిదియే స్వయముగ ప్రమాణమగునను విషయములిందుఁ బలుకఁబడినవి.

**10. భక్తిసాధనము - అంతరాయము:- (61-65 సూత్రములు)**

ఎల్లలౌకిక వైదిక కర్మముల నీశ్వరార్పణము చేసియున్న కారణమున లోక వ్యసనములందు భక్తుఁడు తగులువడరాదు. భక్తివృద్ధి పడయువరకు (పడసినను) లోక ప్రవర్తనము విడువఁ దగదు. ఫలాపేక్ష త్యజించి లౌకిక కర్మము లొనర్చుచు భక్తిసాధనముఁ జేయనగును. ఇట్లు లౌకిక కర్మాచరణము కావించుచు భక్తిసాధన చేయుఁవాఁడు స్త్రీ ధన నాస్తిక వైరుల విషయముల వినరాదు. అభిమాన దంభాదికముల విడువ వలయును. సకల మీశ్వరున కర్పించువాఁడగుటచే కామ క్రోధాదులు పొడమెనేని వానిని భగవానునందే ప్రకటింపనగును- అను విషయము లిచటఁ దెలుపఁబడినవి.

**11. ప్రేమాత్మక భక్తుల మహిమలు:- (66-73 సూత్రములు)**

మున్ను దెలుపఁబడిన గుణాత్మక - ఆర్తాది భక్తిమార్గ మతిక్రమించి నిత్యదాసభావమునఁ గాని, నిత్య కాంతాభావమునఁగాని భగవత్ప్రేమఁ బెంపొందించుకొననగును. భక్తులందఱిలో నేకాంతభక్తులు శ్రేష్ఠులు. అట్టి భక్తులొండొరులు గలియునపుడు గద్గద స్వరముల నానందబాష్పములు స్రవింప భగవద్గుణాదికములఁ భాషించుకొనుచుఁ దన్మయులగుచుందురు. అట్టివారు తమ వంశములను, భూమినిఁ బావనము చేయుచుందురు. అనన్యభక్తులు తీర్థములకు తీర్థత్వము ప్రసాదింతురు. కర్మములను సత్కర్మములుగ, శాస్త్రములను ప్రామాణికములగు శాస్త్రములుగఁ జేయుదురు అట్టి పరమభక్తులఁగాంచి వారి పితరులు సంతోషింతురు. దేవతలు నాట్యము చేయుదురు, భూదేవి సనాథ యగును. అట్టి ఏకాంత భక్తులు పరమ భాగవతులగుటచే వారలందు జాతివిద్యా రూపకుల ధనక్రియాది భేదబుద్ధి లేదని ప్రేమాత్మక భక్తుల మహిమ యీ భాగమున శ్లాఘింపఁబడినది.

**12. వాదవివాదరూప విఘ్నము: - (74-75 సూత్రములు)**

భక్తి పథగాములకు వాగ్వివాదములు తగవు. హేతువాదరూపములగు అభిప్రాయములు సమగ్రములు కానికారణమున బహుళావకాశములు కలవు. కావున భక్తుఁడు వాదముల జోలికిఁ బోరాదు-అని యందు హెచ్చరిక చేయఁ బడినది.

**13. భక్తి ప్రధాన సహాయకములు - (76-79 సూత్రములు)**

భక్తి శాస్త్రములను మననము సేయుచు, భక్తిఁబెంపొందించు కర్మములా చరించుచు, సుఖదుఃఖములు కోరికలు మొదలగు వానినుండి విడివడు కాలము కొఱకెదురు చూచుచునూరకుండక-అర్ధక్షణమేని వ్యర్థముసేయక. అహింస సత్య శౌచ దయాస్తిక్యాది సత్ప్రవర్తనలు గలిగి, ఎల్లవిచారముల విడిచి సర్వ కాలముల సర్వవిధముల భగవానునే భజింపఁదగునని యందు బోధింప ఁబడినది.

**14. ప్రేమ భక్తి ఫలము-భక్తి సర్వశ్రేష్ఠత-(80-84 సూత్రములు)**

పైనఁ దెలుపఁబడిన విధమునఁ గీర్తింపఁబడిన భగవానుఁడు శీఘ్రముగ భక్తుని యెదుటఁ బొడమి, ప్రత్యక్షానుభవము పొందిన వానిఁగఁ జేయును. కావున త్రికాల సత్యస్వరూపుఁడగు భగవానునియందు భక్తియే సర్వశ్రేష్ఠమని నారదమహాముని యందు 'భక్తిభేరి' మ్రోగించెను. భక్తి ఏకమయ్యు గుణ మహాత్మ్యాసక్తి మొదలగు భేదములచే పదునొకండు విధముల భాసిల్లును. అందేయొకటి గాని యంత కెక్కుడు విధములఁగాని యభ్యసింపవగును. ఈ విధముగ లోకములోని జనుల ప్రలాపముల లెక్కసేయక భక్త్యాచార్యులగు సనత్కుమార వ్యాస శుక శాండిల్యాదులొకే యభిప్రాయము వెల్లడించిరి. ఈ నారద ప్రోక్తమును శుభప్రదమునగు బోధను విశ్వసించి, శ్రద్ధతో నాచరించు వాఁడు ప్రియతముఁడగు భగవానుని తప్పక పొందుచున్నాఁడు-అని దేవమౌని యందు విస్పష్టము చేసినాఁడు.

సంసార మహోబ్ధిమగ్నులై తరుణోపాయమెఱుంగని దీనజనసమూహా మందకారణ కరుణాకటాక్షము ప్రసరించుచు శ్రీహరి కళ్యాణ గుణ లీలల

గానము సేయుచుఁద్రిలోకముల సంచరించు దేవర్షినారద భగవత్పాదుల పాద కమల ములఁ వ్రాలి యా మహాత్ముని పరమప్రేమ భక్త్యుపదేశముల సావధాను లమై గ్రహించి తదనుసారముగ జీవయాత్ర సాగింతుము గాక! అట్టి బుద్ధి శక్తి సామర్థ్యముల శ్రీనారద మహర్షియు, తదుపాస్యదైవమగు శ్రీకృష్ణ భగవానుఁడు ను మనకెల్లరకుఁ బ్రసాదింతురు గాతమని సవినయముగఁ బ్రార్థించు చున్నాఁడను.

ఏదొక రూపమున దైవ చింతనము సలుపుచుఁ గాలము సద్వినియోగము చేసికొన వలయు ననియే నేనీకృతికిఁ బూనుకొంటిని. కాని, సమర్థత కలిగి కాదని మతి యొకమాఱు విన్నవించుకొను చున్నాఁడను. తెలివి లేమిచేఁ బొసఁగిన దొసఁగులను తద్విదులు తెలిపిన సవినయముగ సవరించు కొందును.

ఈనారదభక్తి సూత్రములకు హిందీ వ్యాఖ్య రచించిన శ్రీ హనుమ త్ప్రసాద పొద్దార్ - ఆంగ్ల వ్యాఖ్య రచించిన శ్రీస్వామిత్యాగానందులు నాకు వందనీయులు. వారి నాధారముగఁ జేసుకుని శ్రీకృష్ణ సాయీ భగవానుఁడు పలికించిన విధమున నిందుఁబలికితినని విన్నవించు కొనుచున్నాఁడను, సాధు జనోచ్ఛిష్టమునే తిరిగి చర్వణము గావించి, లభించిన రసమున స్వాత్మతృప్తిఁ బడయు కొన సంకల్పించితిని. దీనఁగల గుణలేశముల మాత్రము గ్రహించి దోషముల క్షమించి నన్ను కృతార్థునిఁ జేయ సకల భక్తజనులఁ బొరింబొరిఁ బ్రార్థించు వాఁడను.

## ప్రేమామృతము - గ్రంథ ముద్రణము :-

1944 సంవత్సరమున శ్రీసాయి ప్రభువీ స్వల్పునిఁదన ఆస్థానము నకుఁ జేరఁజీరి, యేవేవియో పలికించుచుఁ దన బిడ్డలనేరికోరి ప్రేరేచి, తనకృతులను బ్రచురించు కొనుచుఁ దనవారి కందింపఁ జేయు చున్నాఁడు. 1957న సాయీలీలా ప్రచురణములో ప్రథమ ప్రచురణము శ్రీసాయీబాబా పూజా స్తవములు-మొదటి కూర్పు వెలువడినది. ఆ గ్రంథమును జూచి యంతకు ముందెన్నఁడుఁ గనివిని యెఱుఁగని బిడ్డయయ్యు చి॥ శ్రీ పాదిల

విశ్వనాథశర్మ (సోమరాజు ఇల్లిందలపఱ్ఱు -ప.గో. జిల్లా) 6-1-1958న, ప్రప్రథమముగ లేఖవ్రాయుచు 'సోదరా!' అని సంబోధించుచు వ్రాసినాఁడు. ఇది యేనాటి సంబంధమో! సర్వ ఘటకుఁడు సర్వ నియంత యగు శ్రీసాయీనాథునకే యెఱుక. ఆ దినము మొదలు నేటివరకు సహజ సోదరుల కంటె నత్యధిక ప్రేమాదరణ గౌరవములఁ బ్రకటించుచు శ్రీసాయీ ప్రభుసేవ-సోదరీ సోదర భక్తుల సేవయందు దోడ్పడుచున్న వాఁడు. సర్వవిధముల నీ సోదరునితో సమాన ప్రేమాదరణ గౌరవములు గలిగి బాబా సేవలందుఁ జేయూఁత నిచ్చుచున్నవాఁడు. చి॥శ్రీవంచిరాజు సూర్య నారాయణమూర్తి. ఈ యిరువురు ఆత్మీయసోదరులకు వీఁడెంతయు ఋణపడియున్న వాఁడు. ఈవీనికి వీరిరువురు రెండుకనుల వలె-రెండు భుజముల వలె నిలిచి, ఆ తండ్రి సేవచేయించుచున్నవారు. ఈ 'ప్రేమామృతము' ప్రచురణ మగుటకు వీరిరువురు సోదరులే ముఖ్యకారకులని విన్నవించుకొనుచున్నాడను.

ఈకృతిని మన్మథ సంవత్సర మాఘ బ॥ త్రయోదశి, మహాశివరాత్రి స్థిరవారమున (10-3-1956) పూర్తికావించి మత్పితృపాదులగు వీరయామాత్యు నకుఁ బునరావృత్తిరహిత పరంధామమును ప్రసాదింపవే ! యని శ్రీకృష్ణసాయీ భగవానునిఁ బ్రార్థించుచు నీకృతి సమర్పణము ఁగావించు కొంటిని.

ఈజీవులు సర్వవ్యాపియగు భగవానుని గుర్తించి సేవింపఁజాలరనయే నిర్వ్యాజ కరుణా సింధువు సర్వేశ్వరుఁడు సర్వకాలముల సర్వత్ర నవతరించు చఁదనలీలలను ప్రదర్శించుచుఁ దన యునికినిఁ బ్రకటించుచునే యున్నాఁడు. సుకృత పరిపాకముగల జీవులట్లవతరించిన మహాప్రభువును గుర్తించి చేరి, ఆశ్రయించి, సేవించి తుదకా భగవానునిఁ బడయుచుందురు.

భగవానుఁడనువాఁడు ఉన్నాఁడా?-అని సందేహించు భౌతికవాదులకు 'ఉన్నాఁడు'-అని సమాధానమిచ్చుటకే ఆ దైవము అనంతపురము జిల్లా - పుట్టపర్తి - ప్రశాంతి నిలయమునందు శ్రీ సత్యసాయీ మహాప్రభువుగ అవతరించి, తన అద్భుత లీలలను ప్రదర్శించుచున్నాఁడు.

నేను. చి॥ సోదరుఁడు విశ్వనాథశర్మ కలిసి యీ ప్రేమామృతము - కృతికి శ్రీస్వామివారి ఆశీస్సులఁ బడయఁగోరి 27-5-1963న వారు వేంచేసియున్న బృందావనమునకు (White field - Bangalore) వెళ్ళి వారిని ది 28-5-63న సందర్శించితిమి, ఆయెడ పరమ ప్రేమ స్వరూపులరగు బాబా వారి దివ్యహస్తములందీ ''ప్రేమామృతము'' వ్రాతప్రతినుంచి స్వామివారి ఆశీస్సు లర్థించితిమి. వారు కరుణించి, 'నాయనా! నీ భక్తి మొదటినుండియు గమనించుచునే యున్నాఁడను, సంసార బంధముల జిక్కి యింతవరకుఁ బరిపక్వము కాలేదు. ఈ ప్రేమామృతము కృతితో నీవును, నీసోదరుఁడు శర్మయు కృతకృత్యులగుదురు.' అని ఆశీర్వదించి 29-5-63 న శ్రీస్వామి వారి ఆశీస్సులను, ఈ నా గురుదైవమగు శ్రీసాయిబాబా హృదయస్థుఁడగు శ్రీస్వామివారి ఛాయాచిత్రమును ప్రసాదించిరి. వానినిందుఁ బ్రచురించి, నా కృతజ్ఞతా పూర్వక నమోవాకములఁ దెలుపు కొంటిని.

పలువురు సోదరభక్తులు ''శిరిడియందవతరించిన శ్రీసాయిబాబా పుట్టపర్తిలో శ్రీభగవాన్ సత్యసాయిబాబాగా జన్మించినారని అనుచున్నారే ! మీ అభిప్రాయమేమి?'' యని ఉత్తరముల ద్వారా ప్రశ్నించియుండిరి. వారందర కుఁదెలిపిన సమాధాన మిందుఁ జేర్చుచున్నాఁడను.

''భగవానుఁడు' అని చెప్పఁబడు పరమాత్మ ఒక్కఁడేకాని పలువురు లేరు. భగవద్గీతలందు శ్రీకృష్ణ భగవానుఁడు ''అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః'' - అని తన విభూతినిఁ బ్రారంభించి.

'' యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేనవా
తత్త దేవాగచ్ఛత్వం మమతేజో ఽంశసంభవమ్'' యని

తన విభూతిని వివరించుటచే సకల భూతములందు ' ఆత్మ' తానై యున్న వాఁడనియు, నెందెందుఁదన ఐశ్వర్యాది సద్విభూతులు ప్రకటములగు చున్నవో అదితన దివ్య తేజో ఽంశసంభవము-తన అవతారమేయని విశదపఱచుటచే ఈయవతారము లకు సమర్థసద్గురువులకుఁ బ్రాకృత జనన మరణములు మనము కల్పించరాదు.

శ్రీ భగవానుఁడొక 'అమృతార్ణవము' అందుండి తీరమునకు జీవకోటినిఁ దరింపఁజేయుఁ దఱికిఁజేరు తరంగములే అవతారములు—ఈ అల యేదియైనను అమృతమయమే. ఏ అలయందుఁ దోఁగినను జీవి పాప తాపములఁ బాపి సుఖ శాంతులఁ బడయును. 'ఈ తరంగము మంచిదా! ఆ తరంగము మంచిదా?' యని శంకించి తర్కించుచుఁ దీరమునఁ గూర్చుండు వాఁడు మూర్ఖుఁడు. తనకుఁ బ్రాప్తించు తరఁగయందు స్నానపానములు గావించి విగత కల్మషుఁడై సుఖశాంతుల నొందు వాఁడు ధన్యుఁడు.

అవతారంబులు సాధుసద్గురులు ప్రత్యక్షంబునౌదైవ, మ
ట్లవుటన్ వారి కొలందులెన్నఁదగ; దవ్యాజానురాగాన నే
కవిధిన్ జీవుల నుద్ధరించుటకు లోకంబందు వర్తింత్రు; వా
రెవరేన్ సేవ్యులటంచు ఁ దెల్పనొకొ? ఏమీ నిన్నుపేక్షింతునా?

అని శ్రీసాయీబాబా ఒక సందర్భమున ఁదెలిపినాఁడు.

కావున శ్రీరాముఁడు శ్రీకృష్ణుఁడుగ జన్మించినాఁడని చెప్పఁదగదు. ఏ భగవానుఁడు శ్రీరామచంద్రుఁడుగ నవతరించెనో ఆదైవమే శ్రీకృష్ణుఁడుగ నవతరించినాఁడు. ఆ విధముగ శిరిడియందు నేపరతత్త్వము శ్రీసాయిబాబాగా నవతరించెనో, ఆ మహాప్రభువే పుట్టపర్తియందు ప్రశాంతినిలయమున శ్రీ భగవాన్ సత్యసాయిబాబాగా అవతరించి, తన బిడ్డలననుగ్రహించుచున్నాఁడు - అని సోదరీసోదరభక్తులు గ్రహింప బ్రారి ్ఁతులు. అవతారములు సమర్థ సద్గురువులు భౌతిక తనువులందున్నను, లేకున్నను వారు సర్వవ్యాప్తులై యున్నవారే. నామి మనదృష్టి పథమునుండి తొలఁగినను నామబలముచే నాకర్షింపఁబడి తన ఆశ్రితులగు భక్తుల ననుగ్రహించుట త్రిసత్యమని సాధకులు రూఢిగ విశ్వసింపఁ దగును. ఈప్రేమామృతమునకు పరమ కరుణతో ఆశీస్సులు ప్రసాదించిన శ్రీశ్రీశ్రీ భగవాన్ సత్యసాయి మహాప్రభువుల దివ్య పాదారవిందములకు కృతజ్ఞతాపూర్వక శతసహస్ర ప్రణామము లర్పించుచున్నాఁడను.

ఈ గ్రంథమును సావధానముగఁ బరిశీలించి దీనికి సంస్కృతమున ఉపోద్ఘాతము - ఆశీస్సులఁ బ్రసాదించిన పరమాప్తులు మహా విద్వాంసులు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన పండితులునగు శ్రీమాన్ పండిత వేదాంతం జగన్నాథాచార్యులు గారికి నావందన సహస్రము లర్పించుచున్నాఁడను. మిక్కిలి ప్రేమాదరణముతో ఈకృతికి ఆశీస్సులందించిన మిత్రులు శ్రీ బందా ఆదినారాయణ పంతులు గారికి - సాహిత్యవిద్యాప్రవీణ శ్రీ తమ్మవరపు వేంకట రంగయ్యగారికి నా వందనశతము లర్పించుచున్నాఁడను.

ఈప్రేమామృత పాఠక శ్రోతలకు నాకృతజ్ఞతా పూర్వక నమస్కృతు లర్పించుచు వీరినందఱను శ్రీ సాయికృష్ణ భగవానుఁడు సర్వదా అనుగ్రహించు గాత మని ప్రార్థించుచున్నాఁడను.

ఇందుగుణములు శ్రీసాయికృష్ణునివిగఁ
బొనరు దోషము లీ నికృష్టునివిఁగాఁగ
నెంచి, వీనిని ధన్యుఁగావించుఁడనుచు
సకలసుహృదుల కిదియె యంజలి ఘటింతు.

శ్రీసాయీ కుటీరము
చిన్నగంజాము
23-11-67

ఇట్లు విన్నవించు,
శ్రీసాయీ భక్త చరణ పరిచరణుఁడు
**బాపట్ల హనుమంతరావు**

శ్రీసాయీశరణ్

శ్రీసాయీ సమర్థ!

# పిలుపు

సీ॥వేద వేదాంత సద్వివిధ పురాణేతి హాస కావ్యార్థ విభాసితంబు, సకల
సమ్మతమత స్థాపనాచార్య వర్య ప్రబోధిత రహస్యాన్వితంబు,
కర్మ భక్తిజ్ఞాన కలిత యోగాఢ్యంబు, విశ్వాస్తిక జనాపేక్షితంబు,
నిర్వ్యాజ కరుణాంబు నిధి కల్ప వేది దేవర్షి నారద ప్రతిపాదితంబు,

గీ॥ సత్ప్రశాంతి ధామమున శ్రీ సత్యసాయి
విమల దివ్యకరాంబుజా విష్కృతంబు
చేరి సోదరీ సోదరులార! రండు!
అనరండు! భవ్యంబు – **ప్రేమామృతంబు.**

---

ఓమ్ శ్రీసాయీ ప్రసన్న!

# కృతి సమర్పణము

*ఈవు పలికించిన విధాన నేవియో వ*
*చించి "ప్రేమామృతంబు" ( బిత్పాణ మీ (గ*
*మన్మథాబ్దంబునందున మాఘ కృష్ణ*
*పక్షమున త్రయోదశి స్థిరవార సహిత*
*మౌ మహాశివరాత్రి పుణ్యాహ్నమందు(*
*బరమ పూజ్యులు మత్పితృపాదులైన*
*వీరయా మాత్యునకు( గృతి వినతి నిడితి;*
*దీని నందించి తండ్రికి ( దృప్తి( గూర్చి*
*చిరము నీ పరంధామము( జేర్చుకొనవె!*
*కేలు మోడ్పులు వేయి – శ్రీ కృష్ణసాయి!*

**రచయిత.**

శ్రీసాయీ సమర్థ!

ఓం, ద్రాం, హ్రీం, క్లీం, క్ష్మాం, హ్స్వాం, ఓం.



H.H.S.P.S స్వామి శ్రీనివాసానంద సరస్వతి
హృషీకేశ. హిమాలయ. అవతార్ శివానంద
భగవాన్ - కల్యాణ శ్రీనివాస్ కుంజ్ (ఆశ్రమం)
కరకవలస. (P.O.) [illegible] 4౨౮.

# స్వవివేచన

సూత్రములనుట తోడనే వేదవ్యాసమహర్షి ప్రణీత- బ్రహ్మ సూత్రములు పాతంజలి యోగసూత్రములు-పాణిని వ్యాకరణ సూత్రములు - వాత్స్యాయన కామ సూత్రములు - శాండిల్య భక్తి సూత్రములు - గృహ్య సూత్రములు - నారద భక్తి సూత్రము లెన్నెన్నియో విజ్ఞులకు జ్ఞప్తికి వచ్చుతీరును. వ్యావహారిక ముగ గణిత సూత్రములు-వైజ్ఞానిక సూత్రములు వగైరా మనోదర్పణమున నగపడితీరును. (వైదికముగ కూడను)

సూత్రమున మహాగంభీరసత్యముల యంతరార్థముల కతిమిక్కిలి సూక్ష్మాతి సూక్ష్మ పదజాలమును నిక్షిప్త మొనర్చబడినదియే. మండన మిశ్రుని కాలము-భోజుని కాలము పోయి; సంస్కృతము పట్ల తృణీకృతా భావము సర్వేసర్వత్ర సద్గురు శివానందుల కృపచే మాపనేరక ఉత్తరప్రదేశ్ - బీహారు - పశ్చిమబెంగాల్ - ఒరిస్సా - ఆంధ్రప్రదేశము - తమిళనాడు - కర్ణాటక - కేరళ - మహారాష్ట్ర - మధ్యప్రదేశ్ - గుజరాత్ - రాజస్థాన్ -హర్యానాల పర్యటనలలో దేశమంతటా సంస్కృత విశ్వవిద్యాలయము లున్నట్లు వ్యక్తమైనది. (తప్పనిసరిగ ప్రతిరాష్ట్రములో - కనీసము 2,3 విశ్వవిద్యాలయములు యుండదగినప్పటికి) సంస్కృతము దేశభాషయైనతటి దక్షిణ - ఉత్తర తరతమ భేదమునకు తావేయుండదు.

వైదిక, ఆధ్యాత్మిక సూత్రముల నవగాహన మొనర్చుకొనుటకు సంస్కృత జ్ఞానమవసరము లేదా విజ్ఞుల - పండితుల సహాయ సహకారము పొందవలెను. భక్తి సూత్రములలో పేరుపడినవి శాండిల్య భక్తి సూత్రములు. నారద భక్తి సూత్రములు మదీయ గురుదేవులు 'అవతార్ శ్రీ శివానంద భగవానులు' (హృషీకేశము) తమ "భక్తి సంకీర్తనము" గ్రంథము నంతను శాండిల్య భక్తి సూత్రములు పొందుపరచగ. ఆ గ్రంథమునంతను అస్మదీయాదులు - శాండిల్య భక్తి సూత్రములతో ఆంధ్రీకరించినది 1961 సంవత్సరములో ప్రచురితమైనది.

శాండిల్య భక్తి సూత్రముల కంటెను నెక్కువగ నారదభక్తి సూత్రములు నోట్లో నాలుకవలె ప్రాధాన్యత వహించినవి. భక్తి యోగమునకు సంబంధించిన యెన్నెన్నో గ్రంథములు చదివినను దాని సారమొక్కటే! నారద భక్తి సూత్రములు భగవద్గీత శ్లోకములు సుపరిచయమైన వారికి రెంటిలోను భావసారూప్యత యథాతథ పదజాలము సహితము నిట నట కాననగును.

ఇందు (నారద భక్తి సూత్రములలో) 84వ సూత్రతరంగములలో భక్తియోగ సంగ్రహమంతయు నిబద్ధీకరింపబడినది. ఈ సూత్రం చివర శివానుశాసీయ (ఆజ్ఞచే - ప్రేరణచే) నారద ప్రోక్తభక్తి సూత్రములనుటచే వాటియొక్క ప్రామాణికతను(Authenticity) ఆస్తికులెల్లరు విశ్వసించి, శ్రద్ధా భక్తులతో ఆచరణశీలురవశ్యము కాగలరు. 81వ సూత్రములో "త్రిసత్యస్య భక్తి రేవగరీయసీ", భక్తి రేవగరీయసీ అని వక్కాణించుటలో చతుర్యుగముల (త్రికాలముల) త్రికరణశుద్ధిగ (మనోవాక్కాయ కర్మలరీత్యా) ముమ్మాటికీ సత్యము - సత్యము - సత్యము. అని భక్తియే శ్రేష్ఠతమమని తాను 'శివస్ఫూర్తి" (Inspiration of siva) లో నుద్ఘోషించుటయే కాక, తనకు తాను తనవెనుక దన్నుగ సనత్కుమార -వేదవ్యాస-శుక-శాండిల్య-గర్గ-విష్ణు-కౌండిన్య-శేష-ఉద్ధవ-ఆరుణి

- బలి - హనుమాన్ - విభీషణాది భక్తి తత్త్వాచార్యుల పేర్లను సహితము వాక్రుచ్చెను. (81-82-83 సూత్రములు)

'గౌణీభక్తి'(Humary Preliminary) నుండి 'పరాభక్తి' (నిష్కామ్య-అవ్యభిచారి. అనన్యభక్తి అవినాభావ సంబంధముతో కూడినది) (Vrique - singular supreme Devotion) చేరువరకు గలుగునంత రాయముల నన్నిటిని త్రోసిపుచ్చి పరాభక్తి లేక సంపూర్ణ శరణాగతభక్తి తన్వర్ధజమగు జ్ఞానము-భక్తి-జ్ఞానసిద్ధి లేదా జీవన్ముక్తునికి లోకమునకు కల్గు ప్రయోజనములు (కులమును-వంశమును పృథ్విని పావనమొనర్చుట - యాతని పితృ గణములు ప్రముదితు లగుట. దేవతలానందాతి రేకముచే నాట్యమాడుట - తీర్థములకు తీర్థముగ-కర్మలకు సుకర్మగా, శాస్త్రములకు శాస్త్ర సారముగ-నోటితో తెలుపకనే తన జీవితమే లోక సందేశముగ సహజ సిద్ధముగ మలచబడుట. 69 - 70 - 71 ( తీర్థీకుర్వంతి .... భూర్భవతి)వ సూత్రము లలో గాంచబడును.

సద్గురు కృపచే కంసాలి భక్త నరసింహదాసుగారి తీవ్రార్తిని తీర్చుటకై లోకోద్ధరణకై చిలకలపూడి (మచిలీపట్నం) పండరీ పురపాండురంగడు శిలారూపమున స్వయం వ్యక్తమై స్వయం ప్రతిష్ఠితుడగుట (73 వ సూత్రము) యంతస్తదీయాః పరాభక్తుని త్రిగుణాతీత స్థితప్రజ్ఞుని మాయాముక్తుని కారణము. సతరతి - సతరతితో కాంస్తారయంతి (50వ సూత్రం) స్పష్టీకరింపబడినది.

భక్తి యోగములో సిద్ధత్వము పొందేవరకు అనగా భగవత్సాక్షాత్కారము పొందేవరకు (Perfection) లోకవ్యవహారముల (సాంసారిక) విడువక కర్మఫలత్యాగ మొనర్చుచు క్షణార్థమైనను వృథాపోనీయక మహాపురుషుల సాంగత్యము భక్తి ప్రవృద్ధికి సహకరించు సర్వేతర మార్గములను సాధింపనగును. అట్టి సచ్ఛీలుడు తన కులమును-పృథ్విని

పవిత్రీకరించును (కంఠావరోధ ........ వృధి వీంచ - 68 వసూత్రము గమనింపుడు)

వందలకొలది సదాత్రికాలముల విరాజిల్లు సంపూర్ణ శరణాగతి - భక్తులను మచ్చుగ. త్యాగరాజు-తులసీదాసు-ఏకనాథ్-తుకారామ్-మీరాబాయి - నరసీమెహతా - పోతనలను పేర్కొననగును. (73వ సూత్రం)

" యతస్త దీయా" తిలకింపుడు - ముగింపుగ "నాస్తితేషు" (72వ సూత్రం) జాతి -విద్యా-రూప-కుల - ధన క్రియాది భేదం (ముఖ్యాతి ముఖ్య) ద్వారా దేశ-కాల-జాతి -కుల-లింగ-వయో-దులు భక్తి సిద్ధి కడ్డురావని గ్రాహ్యము.

పూజ్యశ్రీ బాపట్ల హనుమంతరావు - వారి సతీమణి శ్రీ కామేశ్వరమ్మ గారల సుపుత్రులు చి॥ శ్రీ ॥వేంకట పార్థసారథి గారు, తండ్రిగారు రచించిన (నారద భక్తి సూత్రముటీక - వ్యాఖ్య - గీతమాలిక ద్వారా) ప్రేమామృతము పేరున విలసిల్లిన రచనా ఫక్కిని - భంగిమను గమనింప - 32 సంవత్సరముల క్రితము ప్రచురితమైన దానికి "మూడుముక్కలు" వ్రాయుమని కోరగ, అనుకూల పరిస్థితులలో - ప్రకాశకులు - ప్రచురణకర్తలు - నాత్మీయులు నగు పూజ్యశ్రీ పార్థసారథి గారిమాట కాదనలేక మాత్రమే యీ సమ్మాన రూప వివరణగ గ్రహించి ఆస్తికులెల్లరు ధన్యులు గాగలందులకు వినతి.

S.P.S స్వామి శ్రీనివాసానంద సరస్వతి

కరకవలస ఆశ్రమము. 15-03-2000. 1.55.p.m.



ఓమ్

శ్రీ సాయినాథాయనమః

# అభిప్రాయాంజలి

## నందనవనం వేంకట సుబ్బరాయశర్మ

"ప్రేమామృతము" పునర్ముద్రణ జరుగుతున్నది నీ అభిప్రాయము వ్రాసిపంపు.

ఇది అన్నగారి ఆజ్ఞ. అంతర్యామి రూపంలో అంతటా నిండియున్న సాయీశ్వరుని దివ్య సంకల్పము.

"నా ఆజ్ఞ లేక ఆకైనా కదలదు" ఇది బాబా శాసనం. ఏది ఎప్పుడు ఎక్కడ ఎలాజరగాలో ఆ ఎఱిగిన వాడికే ఎఱుక. ఈ ఎఱుగని వానికేమెఱుక.

"మూకం కరోతి వాచాలం"

"రామా! నీ దయలేక కపివారధి దాటునా?" త్యాగయ్య వేడికోలు. కానీ మనదేం పోయింది. అంతా వాడిదయ.

సూత్రధారి చేతికి లేని నొప్పి ఆడే తోలుబొమ్మ కెందుకు?

శ్రీ నారద మహర్షి భక్తిని సూత్రీకరిస్తూ "సాత్వస్మిన్ పరవు ప్రేమరూపా" అన్నారు.

పరమ ప్రేమరూపమే భక్తియని అభిప్రాయము. అందుకే నాన్నగారు దీనికి "ప్రేమామృతము" అని నామకరణము చేశారు. ప్రేమమూర్తి యగు భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబా వారు దానికి అభిప్రాయము వ్రాసి ఆశీస్సు లందించి యున్నారు. ఇంతకన్న దాని వైశిష్ట్యానికి మరో తార్కాణం దేనికి?

అమృతమంటే అమరమైనది. ఏది అమరమైనదో అది మధురమైనది గూడా! అందుకే అది ప్రేమామృతము. దేవతలు పానంచేసే అమృతము నిజమైన అమృతము కాదు. పుణ్యఫలము కాస్తా యిస్తే వారూ మనవద్దకే వస్తారట కాని యీ భక్తి రసామృత పానం చేస్తే పునరావృత్తి రహిత శాశ్వత సాయుజ్య సుఖ మబ్బుతుందని శాస్త్రములు పురాణములు చెప్తున్నాయి.

ఈ ప్రేమ పర అపర అనే రెండు రూపాలతో యీ సకల చరాచర జగత్తునూ విచ్ఛిన్నమై మహాశూన్యంలో కలిసిపోకుండా నిలిపి ఉంచుతుంది. ఇది ఆశ్చర్యము కల్గిస్తుంది. మనం ఎప్పుడూ దీన్ని గురించి ఆలోచించము.

పరమాణువులన్నీ పరస్పరము ఆకర్షించుకుంటూ అనేకానేక రూపాలను గుణాలను ధరించి యీ విశ్వవిరాట్స్వరూపంగా రూపొందినది. ఏమిటీ ఆకర్షణ ? దేనికీ రూపధారణ? ఇదే ఆ ప్రేమయొక్క విశ్వరూపము. అంతా ప్రేమ సూత్రమువల్ల నిబద్ధించ బడియున్నది. ఆప్రేమ తన సహజ స్వరూపము. తానున్నట్లు తనకు తెలియబడాలి. అందుకే రూపధారణ. ఆ ఎఱుకయే ప్రేమ.

ఒక్కటైన యీ ప్రేమ తన ఆనందానుభూతి కోసము అనేకంగా విస్తరిల్లింది. తనను అనేకంగా చూచుకొని భ్రాంతమైంది. ఆభ్రాంతిమయ స్థితిలో దేహాత్మ భావనకు గురై తన్నుతామరచి, పరిమితమైనట్లు అశక్తమైనట్లు తలపోస్తుంది. అన్యవిషయములయందు ఆనందానుభూతికై వెదుకుతుంది. ఆ ఆనందం తన సహజగుణమని గుర్తింపక చిక్కులు పడుతుంది. ఈ ప్రక్రియలన్నిటికి ప్రేమయే మూలకారణము. కామక్రోధాదులన్నీ యీ ప్రేమరూపాలే. ఆకర్షణ వికర్షణలు రెండూ ప్రేమ స్వరూపమే. వికర్షణ మరో బలమైన ఆకర్షణ కార్యమే. ఇలా అనుక్షణము వినూత్నమైన అనుభూతులతో విలసిల్లుతున్న యీ జగత్తంతా ప్రేమమయమే ప్రేమస్వరూపమే. క్రమ పరిణామములో ఒకానొకవేళ యీ భ్రాంతిమయ చిత్త వృత్తి నిత్యానందము కోసం అన్వేషించటము ఆరంభిస్తుంది. అప్పటినుండే వివేకము మేల్కొం టుంది. నిజానందము సహజానందము ఎక్కడ ఎక్కడ అని పరితపిస్తూ పరిశీలిస్తుంది. దీనినే సప్తజ్ఞాన భూమికలలో మొదటిదైన శుభేచ్ఛగా శాస్త్రాలు

వక్కాణించాయి. ఈ అణ్వేషణ ఫలితముగా సృష్టికి ఆద్యమైన వస్తువును తన అనుభవములోకి తెచ్చుకోవాలనే ప్రయత్నము మొదలౌతుంది. ఇందుకెన్నో మార్గాలు రూపుదాల్చుకున్నాయి. కర్మమార్గమని యోగమార్గమనీ జ్ఞానమార్గ మని భక్తి మార్గమని యిలా ఎన్నో మార్గాలు ఎన్నో ఉపాసనా రీతులు.

లౌకికాపేక్షలను తన స్వశక్తితో సాధించుకోవటము సాధ్యంకాదని భావించినప్పుడు యీ జగత్తుకూ తనకూ.ఉనికిని కల్పిస్తున్న ఏ దివ్యశక్తియో తనకు సాయపడి తన అభీష్టాన్ని నెరవేర్చి పెట్టగలదని భావించి; ఆ శక్తి తనకు పరోక్షముగా తెలియవచ్చిన అప్రత్యక్ష వస్తువు కావటము వల్ల దానికి తన మేధాశక్తి నుపయోగించి నామరూపాలను యేర్పరచుకోవటము దానిని నమ్మి ఆరాధించటము మొదలు పెట్టబడుతుంది. అందుకే " ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పతే" అంటుంది శాస్త్రము.

వాంఛితఫలసిద్ధికై మొదలుపెట్టబడ్డ యీ ఆరాధన క్రమముగా బలీయ మౌతూ వస్తూంది. ఇదీ ప్రేమ యొక్క మలిన రూపమే. ఇది స్వార్థపూరిత మైనది, నాకు అంటూ పెనగులాడుతుంటుంది. ఇంద్రియముల తృప్తి కోసం విషయాభిలాషతో తలమునకలైపోతుంది. తనకు తానే వినాశనాన్ని తెచ్చిపెట్టు కుంటుంది. జన్మ జన్మల అనుభవాలు నేర్పిన పాఠాలను వల్లెవేస్తూ చివరకు భౌతిక సుఖాభిలాషను విడిచి బాధామయమైన యీ జనన మరణ చక్ర భ్రమణమునుండి తొలగిపోయి నిర్వికల్పమైన శాంతిని ఆనందాన్ని పొందాలని కాంక్షిస్తూ ఎక్కడ ఎలా దాన్ని స్వాధీనము చేసుకోవటమా అని వెదుకు తుంటుంది. ఇంతవరకే జీవి స్వప్రయత్నము. ఇకపై దాని గమనము యీ సృష్టి కార్యనిర్వహణా దక్షుడైన ఆ ప్రేమమయుడగు దైవానిదే. తన అశక్తతను గుర్తించిన యీ జీవి తనకు ఆధారభూతమైన ఆదివ్య తేజోరాశికి దాసోహ మంటుంది. తనలో యిప్పటి వరకూ విలయ తాండవము చేసిన అహంకారం పూర్తిగా నశిస్తుంది. తాను నమ్మి ఆరాధిస్తున్న ఆ ప్రేమమూర్తికి తనను సంపూర్ణంగా సమర్పణ గావించుకుంటుంది. దీనినే శరణాగతియని, భరన్యాస మని శాస్త్రులు పలికాయి. అది ఆజీవికి

మరుజన్మలాంటిది. అతడిప్పటి వరకు జీవించిన భ్రమాత్మకమైన జీవితము ముగిసినది. సత్యాన్వేషణపథంలో క్రొత్త జన్మ ప్రాప్తించింది. అక్కడ అతడు అప్పుడే జన్మించిన శిశువు వంటి వాడు. శిశువు సర్వబాధ్యతలు తల్లివే గదా! అలాగే యిట్టి శరణాగతునికి మార్గ నిర్దేశకుడు పోషకుడు ఆ ప్రేమస్వరూపుడే.

అతడు కరుణామయుడు ధర్మస్వరూపుడు. అతని దృష్టికోణము నుండి అవగతంచేసుకోవాలని ప్రయత్నిస్తే అందరూ అతని సంతతికాబట్టి అందరూ ఆయనకు సములే. ఆయన సర్వసముడు.

''ఆర్తోశిజిజ్ఞాసురర్థార్థి జ్ఞానీచభరతర్షభ'' అని తననారాధించే వారిని నాల్గు వర్గాలుగా విభజించాడు. ప్రపంచంలో ప్రతివాడూ యీనలుగురిలో ఏ ఒక్కడో కాక తప్పదు. నాస్తికుడు సైతము తన కొరకై వెదుకుతున్నాడు కాబట్టి అతడూ తన భక్తుడేనని ఆయన అభిప్రాయము. తనకై అనేకరీతుల విలపించు యీ జీవుల మానసిక స్పందనల ప్రతి స్పందఫలమే భగవదవతారాలు. జడ ప్రకృతి తన సహజ ధర్మాన్ని ఉల్లంఘించి చరించలేదు. జీవ ప్రకృతియే భ్రాంతమై ధర్మోల్లంఘనము చేస్తుంది. అధర్మ పరిరక్షణకే దైవావతరణము. అట్టి అవతారమూర్తి ఎంతమేర ధర్మ పరిరక్షణ అవసరమో అంతమేర తన అలౌకిక శక్తి సామర్థ్యాల ద్వారా దానిని సంరక్షించటము చేస్తాడు. ఆ అతిమానుష క్రియా కలాపాల దర్శన, శ్రవణాల ఫలితముగా ఆ సర్వ శక్తిమంతుని ఆశ్రయిస్తే తానుద్ధరింప బడగలనని ఆశించి యీ జీవి ఆ అవతారమూర్తి సమాశ్రయనము అపేక్షిస్తాడు. ఆరాధన మానసిక వాచిక కాయికస్థాయిలలో పరిపుష్టమై పరిపూర్ణమౌతుంది. ఇదొక అనిర్వచనీయమైన విలక్షణ స్థితి. దీనిని భక్తియని పరప్రేమయని ఏ పేరుతో పిలిచినా ఒకటే. ఇదీ తీవ్రమైన ఉన్మాద స్థితి లాంటిది. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందు ఏకాకారంగా యీ భావన తైలధారలా ప్రవహిస్తుంటుంది. వారికి లౌకిక బంధనలన్నీ వాటంతటవే పండుటాకుల్లా రాలి పోతాయి. సర్వవాసనలు ఆవిరై పోతాయి. నిష్క్రియుడు, నిరపేక్షుడు నిర్భయుడు, నిర్లేపుడు నిర్మలుడు యిలా నిషేధబాషలో అతణ్ణి నిర్వచింప

వలసివస్తుంది.

శలభము దీపకాంతికి ఆకర్షింపబడి దానిచుట్టూ పరిభ్రమిస్తూ వెచ్చదనాన్ని రుచి చూస్తూనే, ప్రాణభీతిని మరచి దీపముపై పడి నశిస్తుంది.

భక్తుని స్థితి యిట్టిదే లీలగానైనా ఆ భగవదనుభవము బుద్ధికి లవమాత్రంగా నైనా, గోచరిస్తే చాలు తాను పిచ్చివాడై ఆ సంపూర్ణానుభూతికి పరితపిస్తూ సమస్తాన్నీ తృణీకరించి శారీరక మానసిక క్షోభలను లెక్కచెయ్యక ఆ ప్రాప్యవస్తు సమ్మేళనముకోసము నిరీక్షిస్తుంటాడు.

అనాదికాలంనుండీ యిప్పటికీ యింకేనాటికీ యీ పరమోన్నతము మమత్వపూర్ణమునైన యీ భక్తిని పొందిన మానసిక స్థాయి యిలాగే ఉంటుంది.

" ఏ భక్తుని చరిత్ర విన్నా, ఏమున్నది గర్వకారణం,
శలభంలా పరిభ్రమిస్తూ, అగ్నియెడికి ఆహుతియగుటే"

అదే ఆ జీవుని గమ్యము. నిర్మలమైన ఆ భక్తి భావాన్ని ఊహించటము కష్టసాధ్యము. పండితుడు కావచ్చుగాని కవికాలేడన్నట్లు, జ్ఞానికావచ్చునేమోగాని భక్తుడుగా పుట్టవలెనేగాని ప్రయత్నపరుడై కాలేడు. నిజమైన పరిపూర్ణమైన భక్తి లభించటము కోటానుకోట్ల జన్మలపుణ్యఫలము. ఇట్లాగని భక్తులు ప్రపంచములో లేరని చెప్పినట్లు కాదు. 'సాధన భక్తి సాధ్య భక్తి అన్న రెండింటిలో జగమంతా సాధనభక్తిలో నిండియున్నది. చుక్కల్లో చంద్రునిలా ఎక్కడో పూర్ణస్థితినందిన భక్తులు అగుపిస్తారు.

బాబావారి వద్దకు లౌకికాపేక్షలతో వచ్చేవారిని చూచి ఓ భక్తుడు "బాబా వారి వద్ద అలాంటి కోర్కెలు కోరకూడదు అని వారింప జూచాడట. అది చూచి బాబా ఆ భక్తుని మందలిస్తూ " అలా వారించవద్దు వారు కోరినవి నేను ప్రసాదిస్తే వారికి నాపై గురి కుదురుతుంది. క్రమంగా వారికేది మంచో అది నేను సమకూరుస్తా" నన్నారట. అలాగే చివరకు అందరూ ఆయన ప్రేమ పరిష్వంగంలో బిగింపబడి కృతార్థులు కాక తప్పదు.

ఎవరికి ఎప్పుడు ఎలా యీ భక్తి భావన స్థిరపడుతుందో తెలియదు. అది దైవేచ్ఛ. ఏ రూపనామాలా భక్తుని హృదయానికి హత్తుకపోతాయో

అతడికే తెలియదు. ఎందుకు మీకా పేరన్నా రూపమన్నా యిష్టము? అని ప్రశ్నించండి. ఏమో నాకే తెలియదు అనే సమాధానము వస్తుంది. అది సంస్కార రూపమని తృప్తి పడవలసిందే. ఈ భక్తికి జాతి, మత, వర్ణ, లింగ భేధములు లేవు. మానవులే కాక అల్పప్రాణులు జంతువులు పక్షులు వృక్షములు పర్వతములు నదులు సైతము భక్తి వలన ముక్తి పడసినవని పురాణములు ప్రవచించుచున్నవి గదా.

శరణాగతుడైన భక్తుని భావానికి అద్దంపట్టే ఓ రామాయణ కథను శ్రీశ్రీ సత్యసాయిబాబా వారు యిలా సెలవిచ్చారు.

రామవనవాస సమయములో లక్ష్మణునితో రాముడు ''తమ్ముడా! నీ మనస్సుకు నచ్చిన చోట పర్ణశాలని నిర్మించవయ్యా!'' అన్నారట. అదివిని సౌమిత్రి కంటనీరు పెట్టుకోవటము చూచి జానకి ''నాయనా! సౌమిత్రీ! ఎందుకా కంటినీరు మీ అన్నగారేమన్నా అన్నారా? అన్నదట. ''అమ్మా! యీాదినం అన్నగారు నీకు నచ్చినచోట పర్ణశాల నిర్మించమని శెలవిచ్చారు. అన్నా వదినల పాదసేవకన్న నాకు ప్రత్యేక అభీష్టము లేమియులేవని ఆయన ఎఱుగడా! నన్నిట్లేల ఆయన దూరస్తుని చేయుచున్నా''డని దుఃఖించగా; సీతమ్మ ఆయన ప్రపత్తి నిష్టకు మిక్కిలి సంతసించి ఆయనను బుజ్జగించవలసి వచ్చినదట. ఇంతకన్న శరణాగతికి ఉదాహరణ ఎక్కడతెద్దాం. ఇట్టి అనన్య శరణాగతియే ముక్తావస్థ అవధూతస్థితి సంపూర్ణ జ్ఞాని స్థితి.

ఈ భావన ఎంత మధురమైనది. తను తనకోసము కాక తనచే ప్రేమింప బడు ఓ విశిష్ట వ్యక్తి కోసము తన్ను తాను త్యాగబుద్ధితో సమర్పించుకొని జీవించటము లో ఎంత ఆనందము, ఎంత తృప్తి. అక్కడ భావ ప్రాధాన్యత విశేష ఫలితాన్ని సమకూరుస్తుంది.

సమిష్టి స్వరూపంగానున్న ఒక్క సృష్టితత్వాన్ని గుర్తిస్తే ఎవర్ని ద్వేషించటము ఎవర్ని ప్రేమించటము. అతనిలో నిర్మలమైన సరికొత్త ప్రేమ చివురిస్తుంది. అతని దృష్టి ప్రేమమయం, అతని వాక్కు ప్రేమమయము, అతని హృదయము ప్రేమ మయము. అతడన్నిటా అంతటా నిండియున్న తన ప్రియతముడైన దైవాన్నే దర్శిస్తాడు.

ఏవం సర్వేషుభూతేషు భక్తి రవ్యభిచారిణే

కర్తవ్యా పండితైర్జ్ఞాత్వా సర్వ భూతమయుం హరిః!

భగవంతుడు సర్వమయుడని తెలిసి సర్వజీవులను ప్రేమించుటయే తెలిసిన వారి కర్తవ్యము. ''పండితాస్సమదర్శనః''

ఇట్టి భక్తుని పరాకాష్టభావన కొంకమచ్చుతునక శ్రీకులశేఖరాళ్వారుల వారి యీక్రింది శ్లోకం.

''సాస్థాధర్మేనవసునిచయే దైవ కామోపభోగే

యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం

ఏ తత్ప్రార్థ్యం మమబహుమతం జన్మ జన్మాంతరేపి

త్వత్పాందాభోరుహయుగగతా నిశ్చలా భక్తిరస్తు.''

ఓ భగవానుడా! నాకు ధర్మము నందుగాని, అర్థమునందుగాని, కామమునందు గాని కోర్కెలేదు. అవి నా పూర్వ కర్మఫల విశేషములుగా లభించుచున్నవి. నా ప్రార్థన ఏమనగా నా జన్మజన్మలయుందును, నీ దివ్య పాదార విందములయందు నిశ్చలమైన భక్తిని ప్రసాదించిన చాలుననికోరెను.

భగవత్ప్రే మానుభవమునకన్న అన్యమైన ముక్తిని భక్తుడపేక్షించడు. జ్ఞాన పరిపూర్ణత నందిన పిదప తిరిగి భౌతిక స్థాయికి దిగివచ్చి అచ్చట జగద్రూపముగా నిండియున్న పరబ్రహ్మమును గుర్తించి సేవించు జ్ఞానియు భక్తుడును సమానులేగదా!

''భక్తి రేవపరమార్థ దాయినీ, భక్తిరేవ భవరోగనాశినీ

భక్తి రేవపరవేదన ప్రదా, భక్తిరేవ పరముక్తి కారిణీ''

భక్తియే పరమార్థమును సమకూర్చునది, భక్తియే భవరోగము నశింపజేయునది, భక్తియే పరతత్వజ్ఞానమిచ్చునది, భక్తియే ముక్తిని కలుగజేయునది యని పెద్దలు భక్తితత్వము నుగ్గడించి యున్నారు.

ఈ భక్తి ఎన్నోమార్గములుగా నిర్దేశింపబడియున్నది. మార్గము లెన్నియున్నను గమ్యమొక్కటియేగదా! ఎవరి శక్తినిబట్టి మానసిక స్థాయిని బట్టి వారామార్గమున పయనింతురు. ఇందు అందరి తృప్తి యొక్కటే.

భగవత్ప్రేమకు పాత్రులగుటయే సాఫల్యము.

జ్ఞాని సర్వమునూ తన ఆత్మయందు దర్శిస్తే, భక్తుడు తన దైవ స్వరూపాన్నే దర్శిస్తాడు. అన్ని రూపాలతో ఆయనే తనకన్ని య్యైనట్లు భావిస్తాడు. ''గతిర్భర్త ప్రభు సాక్షాత్ నివేశిం శరణం సుహృత్'' ఇదే అతడి భావన.

ఏ మూర్తియందు నామమునందు తన మనస్సు సంలగ్నము చెందు తుందో దాన్ని తప్ప తక్కిన వాటినపేక్షింపడు. ఇది అవ్యభిచార భక్తి తానే తన దైవానికన్నీయై సేవలుచేయాలి. ఇదీ భక్తుని తపన. ఇందుకేదైనా అడ్డుతగిలితే సహించలేడు. భగవద్విరహంతో కాలిపోతాడు. అన్నీదైవ విభూతులే అనేమాట తాత్కాలికంగా మరచిపోతాడు. దీనంగా తనకై వ్యధాభరితమైన ఆ హృదయాన్ని ఓదార్చను ఆకరుణామయుడు కదలిరాక తప్పదు. ఏ రూప నామాలా భక్తుని ఆకర్షిస్తున్నాయో ఆరూపంతో కదలివస్తాడు. ఒక రూపంలో తాను భక్తుడై భగవంతునికై విలపిస్తూ మరో రూపంలో భగవంతుడై దర్శనమిచ్చి అభీష్టాలను ప్రసాదిస్తుంటాడు.

ఈ అద్భుతమైన ఏకపాత్రాభినయన ప్రక్రియ యిలా నిరంతరము కొనసాగవలసిందే.

''అరుణాచలం'' యీ పేరు; భగవాన్ శ్రీరమణ మహర్షిగా, వెంకట రమణ అనే చిన్న కుఱ్ఱవానిని మార్చేసింది.

''సాయీ'' అన్న యీ నామం ఎన్ని హృదయాలకు హాయినిస్తున్నది. ఇలాగే ఎన్ని మనస్సులో అన్ని యిష్టాలు; ఎన్ని యిష్టాలో అన్ని నామరూప ధారణలు.

''నర్తకుని భంగి పెక్కగు''

''మూర్తులతో నెవ్వడాడు'' అట్టి వాని దివ్యలీలా విశేషాలకు ఆకర్షితులై ప్రపంచాన్ని మరచి, తమను మరచి అతడిదే లోకమై ''పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్'' యిలా నిరంతరం ప్రేమమయులై చరించు భక్తులు నిత్యముక్తులు. వీరు ప్రాతః స్మరణీయులు. భగవత్సేవకన్న భాగవతసేవ శీఘ్రఫలప్రదము.

భగవన్మయులైయున్న వారిసేవయే నిజమైన భగవత్సేవ. వారే భగవంతుని విశేషావతారములు.

నాన్న గారి కవిత్వంలోకి తొంగిచూస్తే యిలాంవారే పరమశ్రేష్టుడైన భక్తవర్యుడు దర్శనమిస్తాడు. త్రికరణములా వారి భక్తిమయ చిత్తవృత్తి ప్రస్ఫుటముగా గోచరిస్తుంది. వారుభక్తులు కాబట్టి వారే భక్తి సూత్రాలను తేటతెనుగు గీతాలతో అమృతతుల్యాలుగా మార్చి సకల జనావళికి ''ప్రేమామృతాన్ని'' త్రావబెట్టారు. ఆ అమృతపానము చేసిన వారెల్ల అమరులుకాక తప్పదు. హృదయం పలుకులో నినదిస్తుంది. నాన్నగారి నోటపలికే ప్రతిపదము ఆయన అంతరంగంనుండి జాలువారేదీ మధుర ప్రేమామృత రసఝరి ఉదాహరణలక్కరలేదు. రుచి చూచినవారికి తెలుస్తుంది.

నిన్న పోయి నేడు తెల్లవారింది. మళ్లీ ఆకలిదప్పిక వ్యవహారము. అందుకే ఆహారపానీయాల క్రొత్త తయారీ. ఇది సహజంగా జరుగుతున్న జరగాల్సిన ప్రక్రియ. అందుకే యీ పునర్ముద్రణ. ఈకార్య క్రమ రథసారథి పార్థసారథి. తండ్రికి తగిన తనయుడు. చెట్టొకటవుతే కాయ వేరొక్కటి యెలా అవుతుంది. ఇతడూ అతడి వంటివాడే. పరమార్థంలో అతడే. అందుకే తానప్పుడు మిగిల్చివెళ్లిన కార్యవిశేషాన్ని యిప్పుడిలా పూర్తిచేస్తున్నాడు. పాతతరమువారు నిన్న మొన్న త్రాగేసిన ఆ ''ప్రేమామృతాన్ని'' యీ దినము యీతరమువారి కొరకు తయారుచేస్తున్నారు. అందరూ యీ అమృతపానము జేసితరిద్దాము.

శ్రీసాయీ సద్గురుని కృపాశీస్సులతో యీలాటి సత్కార్య క్రమాలాచరిస్తూ సాయీ భక్తులకు మార్గదర్శకులై నాబోటి అల్పజ్ఞులకు గురుస్వరూపుడైన ప్రేమస్వరూపుడైన అన్నగారి ఆజ్ఞవల్ల యీకలము యిలాకదిలింది. అతడుపలికాడు. ఇక్కడ ప్రతిధ్వని వినిపించింది. అంతే మరేంలేదు.

ప్రమాది - హోళీ     ఇట్లు

శ్రీసాయీ ప్రేమాలయము     భక్తపాద సేవకుడు

నందనవనం     **నందనవనం వేంకట సుబ్బరాయశర్మ**

శ్రీసాయిరామ్

# భక్తి

శ్రీమతి ఇరుగంటి కమలమ్మ

''పరానం భక్తిరీశ్వరే'', ''సాత్వస్మిన్ పరమప్రేమరూపా'' యనునవి పూర్వులు భక్తి కొసంగిన నిర్వచనములలో కొన్ని.

భక్తులకు భగవంతునెడగల ప్రేమానురాగాది భావముల అతిశయమే భక్తియని తెలియుచున్నది. సామాన్యమానవులు తమ భార్యా, బిడ్డలు, తల్లిదండ్రులు, బంధుమిత్రులు మొదలగు వారిలో తమకు ప్రీతిపాత్రమైన వారి సంభాషణము, దర్శనము, స్పర్శనము, ఏదేని యిచ్చుట మొదలగు వానికై యెంత ఆతురత అంతకంటె మిక్కిలి తపన పడుచుందురో అట్టి తపన, ఆతురత, శ్రద్ధ, ప్రీతి మొదలగునవి తానర్పించు భగవంతుని పై కలిగిన వారెవరో వారే నిజమైన భక్తులని నా అభిప్రాయము. భగవంతుని సాకారుని గా దలచి యెక్కువ మంది సేవించుచుందురుగానపై అభిప్రాయము తగి యున్న దేమో!

భగవంతుని గుణరూపాది వర్ణనములను వినుటచే, తెలిసికొనుటచే కామ, క్రోధాదులణగి భక్తుల చిత్తములో ద్రవత్వమాపాదించును. అట్లు కరిగినదై అవిచ్ఛిన్నముగా సర్వేశ్వరుని యందు వర్తించు మనస్సు యొక్క వృత్తియే 'భక్తి' యని 'మధుసూదన సరస్వతి' 'భక్తి రసాయన' మను గ్రంథమున అభిప్రాయపడి యున్నారు.

''భజ సేవాయాం'' - భగవంతుని సేవించుటే భక్తి. భక్తి సేయు విధానములు తొమ్మిదని యీ క్రింది శ్లోకము తెలియజేయుచున్నది.

''శ్రవణం, కీర్తనం, విష్ణోః, స్మరణమ్, పాదసేవనమ్
అర్చనమ్, వందనమ్, దాస్యమ్, సఖ్యమ్, ఆత్మనివేదనమ్....''

( 0- మ్ మీరూ గమనించగలరు)

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము,

వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అనునవి. ( ఉదాహరణలు విస్తరణ భావము)

కలియుగానికి కీర్తనభక్తి శ్రేష్ఠమని చెప్పియున్నారు. పండితులనక, పామరులనక, స్త్రీలనక, పురుషులనక, వృద్ధులనక, బాలురనక యెల్లరకు అందుబాటులో నుండి అనుసరణ యోగ్యమైనదీ భక్తి మార్గమొక్కటేయని పెద్దలు నుడువుచున్నారు.

భక్తి మెండుగా కలవారు భక్తులు. భగవంతుని నేదోయొక విధమున సేవించుట భక్తియన్నారు. భక్తులు దేవాలయము దర్శించి, పుణ్య నదులలో స్నానమాడి దైవసాన్నిధ్యము కల్పించుకొని భక్తి సేయుదురు. నిర్గుణోపాసన చేయలేనివారు, దేవునిపై మనస్సు నిలకడలేని వారు పైవిధమైన భక్తి చేయ వచ్చునని భగవద్గీత చెప్పుచున్నది. కొందరు శివ, రామ, కృష్ణ, సద్గురు మొదలైనవారి నామ మంత్రము లను జపింతురు, కీర్తింతురు. ధ్యానము చేయుదురు.

మరికొందరు దేవతామూర్తులను, సద్గురు మూర్తులను మనసున దర్శించుచూ, ధ్యానము చేయుచూ, జపము చేయుచూ తరింతురు. ఇదీ భక్తే.

భక్తులను, భక్తుల చరిత్రలను, భక్తుల మహిమలను కొనియాడు చుండుట యింకొక రకము భక్తి.

తనకు మేలు చేయు ప్రకృతిని, వృక్ష జాతిని ధ్యానించుచు సమీపస్థు లగుచు భక్తి సేయుదురు.

తమదేదియులేదు; అంతా ఆ భగవంతునిదే. ఆయన యిచ్చచే జరుప బడుచున్నది - అని నమ్మి తదనుగుణంగా నిర్వికారులై జీవనము గడుపు వారును భక్తులే.

జీవకోటి యంతటను ఒకే ఆత్మప్రజ్వరిల్లుచున్నదని తెలిసికొని 'ఆత్మవత్సర్వభూతాని' 'సర్వభూత హితేరతా' 'అద్వేష్టా సర్వభూతానామ్' అని మనగలిగే వారు భగవత్తత్వ మెరిగి మసలగలుగుచున్నారు. కనుక భగవంతునికి ప్రీతిపాత్రులైన భక్తులనడబడుచున్నారు.

సమభావముకలిగి హృదయ శుద్ధి, ఇంద్రియ నిగ్రహము, సర్వ

ప్రాణుల యందు ప్రేమ, దయ, ఉపకార బుద్ధి కలవారు భగవంతునికి నిజమైన ప్రియభక్తులు.

తమకు రాగల కష్టములనెరిగి విజ్ఞతతో భగవంతుని భక్తిపూర్వకముగా, శ్రద్ధతో సేవించువారే భక్తులు. వారి కర్మయే భక్తి.

ఈశ్వరార్పణ బుద్ధితో యెవరు నిష్కామకర్మచేయుదురో, ప్రీతితో భగవంతునర్చింతురో వారినాతడు కరుణించును.

దైవ విషయమున యెల్లప్పుడు సంతుష్టులై యుండి, దృఢ నిశ్చయము కలిగియుండు వారు భక్తులు.

తమవలన ప్రపంచమునకు భయములేకుండుట, లోకము వలన భయము పొందకుండుట, సంతోషము, భయము, క్రోధము, మనో వ్యాకులత లేకుండుట మొదలగు గుణములు కలవారు భగవంతుని కిష్టులు. కనుక తదనుగుణంగా మానవులు మసలుటే భక్తి.

సాధకులీ క్రింది శ్లోకమును పదేపదే అనన్య భక్తితో స్మరించుచు, భక్త్యాది గుణములు కల్గి చరించినచో ఆదిశంకరుల వారు నుడివినట్లు పరమాత్మ సాయుజ్యము నీజన్మయందే పొందగలరనుట నిస్సంశయము.

''మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ.''

పూజ్యులు శ్రీ పార్థసారథిగారి ''ప్రేమామృతము'' పునర్ముద్రణ గావించుట భక్త జనావళికెంతయో లాభదాయకము. వారి కృషికృతార్థ మగునట్లు శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురుడగు శ్రీ సాయినాథుడు వారిని ఆశీర్వదించాలని ఆశిస్తున్నాను.

ప్రమాధిపాల్గుణ పూర్ణిమ
15/967, వేంకట్రామపురం,
ట్రంకురోడ్డు, నెల్లూరు.

ఇట్లు
**భక్తజన పాదసేవనాసక్త**
**ఇరంగంటి కమలమ్మ**



ఓమ్ శ్రీ సాయినాథాయ నమః

# ఒక్కమాట

**శ్రీ తాడూరి దేశికులు**

పూజ్యగురుదేవులు శ్రీ బాపట్ల వేంకట పార్థసారథిగారి పాద పద్మములకు ప్రణామములు. శ్రీ షిర్డీ ఆస్థాన పండితులు అమర కవి, భగవత్ సాక్షాత్కారము పొందిన మహనీయులు కీ॥శే॥ శ్రీ బాపట్ల హనుమంతరావు గారు రచించిన ''ప్రేమామృతము'' పునర్ముద్రణ సంధర్భములో ''నీ వెతికిన - భక్తి-ప్రేమ -ఆచరణ'' ఆధారముగా '' ఒక్కమాట'' వ్రాయుమని శ్రీ వేంకట పార్థసారథి గారు ప్రేమతో నన్ను కోరినారు.

''ఒక్కమాటనే కదా వ్రాయాలి'' అని సాహసించాను. కాని వ్రాయలేక పోయాను. శ్రీ సాయినాథునిపై భారమువేసి వ్రాయడము ప్రారంభించాను.

కోరుట్ల పట్టణములో పనిచేయుచున్న రోజులలో, నేను నా మిత్రులతో కలసి శ్రీ సాయిబాబా గుడికి వెళ్ళి సత్‌సంగ్ భజనలో, పల్లకిసేవలో గ్రుడ్డిగా పాల్గొనే వాడిని ''శ్రీ షిర్డి సాయిబాబా''ను గురించి తెలుసుకోవాలనే ప్రగాఢమైన కోరిక ఉండేది. కాని శ్రీ సాయిబాబా గ్రంథములు లభ్యమయ్యేడివి కావు. ఒక రోజు ఈనాడు దినపత్రికలో శ్రీ సాయినిలయము ప్రచురణల చిరునామా చూసి, 1996 సంవత్సరములో ముక్కోటి ఏకాదశి రోజున జీవిత సభ్యునిగా చేరిన వెంటనే శ్రీ సాయినిలయం ప్రచురణలకు సంబంధించిన అన్ని గ్రంథములు నాకు ప్రసాదింపబడినవి. పూజ్యగురుదేవులు శ్రీ వేంకట పార్థసారథిగారి అనుగ్రహము వలన ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా నాలో కొంత ''భక్తి'' అనే మొలకకు అంకురార్పణ జరిగినది.

''ఏమి నిన్నుపేక్షింతునా?''(శ్రీ సాయిబాబా చరిత్రము-భక్తుల వృత్తాంతములు) శ్రీ సాయినాథ బోధామృతము, శ్రీ సాయిబాబా పూజా స్తవములు నన్ను భక్తి మార్గములో ముందుకు పయనించుటకు దోహద

పడుచున్నవి. భగవంతుడు సర్వాంతర్యామి. ప్రేమ స్వరూపుడు. దైవమే ప్రేమ, సేవయే దైవము. అందరిని ప్రేమించాలి, అందరికి సేవ చేయాలి, అందరికి సహాయ మందించాలి, కీడు మాత్రము చేయరాదు అని మహనీయులు శ్రీ సాయిబాబా ప్రబోధించుచున్నారు.

శ్రీ సాయినిలయం ప్రచురణలు పారాయణము చేయుడము నాకు అనివార్యమైనది. పూజ్యులు శ్రీ వేంకట సార్థసారథి గారి అనుగ్రహము వలన శ్రీ సాయినాథుని పూజ, నా దిన చర్యలలో ప్రథమమైనది. "శ్రీ షిర్డీ సాయిబాబా గారి ఏకాదశ అభయ ప్రధానములో "నాయందెవరికి దృష్టి కలదో వారియందే నా కటాక్షము గలదు" అని నుడివిన అభయప్రధానమును నేను త్రికరణ శుద్ధిగా విశ్వసించుచున్నాను.

మహనీయులు తమ బోధనలో ఇలా ప్రవచించారు

"విశ్వాసమున్న చోట భక్తి ఉంటుంది.
భక్తి ఉన్నచోట పవిత్రత ఉంటుంది.
పవిత్రత ఉన్నచోట దేవుడు ఉంటాడు
దేవుడు ఉన్న చోట పరమానందం ఉంటుంది"

ఆ పరమానందము అనుభవించాలంటే ప్రగాఢమైన విశ్వాసము, ధైర్యముతో కూడిన ఓర్పు అనే రెండు దక్షిణలు శ్రీ సాయికి సమర్పించి సాధనచేయాలి.

అందరిని రక్షించేవాడు, శిక్షించేవాడు సర్వాంతర్యామియైన ఆ సర్వేశ్వరు డొక్కటే! నరసింహ శతకములోని ఈదిగువ పద్యమును ప్రతిరోజూ మనసారా భక్తితో పాడుతూ ఆనందిస్తూ ఉంటాను.

"స్థంభమందు నిలచి దానవేంద్రు నిద్రుంచి – దుష్టసంహార! నరసింహ! దురితదూర!"

ఓతండ్రీ నరసింహస్వామీ ! ప్రహ్లాదుని, గజేంద్రుని, విబీషణుని, కుచేలుని ఆపద సమయములో రక్షించావు. నన్నురక్షించడానికి నీకు సాధ్యము కాదా? ఇంత పక్షపాతమైతే నేను బ్రతుకలేను, తండ్రీ. నేను దీనుడను, నీవాడను కాపాడు తండ్రి అని మొరపెట్టుకుంటాను.

కర్మ - భక్తి - జ్ఞానము అనే సముచ్ఛయముతో జీవుడు పరమావధి చేరాలని మహనీయులు ప్రబోధిస్తుంటారు.

భక్తి గొప్పదా? దైవము గొప్పదా? అంటే దైవము కన్నా భక్తి గొప్పదని మన పురాణగాధల ద్వారా తెలుస్తుంది. దైవము గొప్పదా? దైవనామము గొప్పదా? అంటే దైవనామము గొప్పదని కొన్ని సంహితలు ప్రవచించుచున్నవి.

నిజమే! భక్తుడైన నారద మహర్షి, త్రిలోక సంచారి, సర్వదేవతా కాల క్షేపకరుడు నిత్యం హరినామస్మరణ చేస్తూనే వుంటాడు.

ప్రాణావసానవేళ గజేంద్రుడు, మానభంగ సమయమున ద్రౌపది రక్షణ కొరకు చేసింది నామస్మరణమే. శాపగ్రస్తుడైన పరీక్షిత్తు మహారాజు చివరి దినములలో మోక్షమును కోరి చేసిన భాగవతా శ్రవణము కూడ హరినామ స్మరణమే.

ఏ దేవుని యొక్క రూపాన్ని గాని, వారి మహా అద్భుత శక్తి మహిమల గురించి నామయుతంగా స్మరించనిదే భక్తులు కాలేరు కదా! భక్తులు ఏ దేవుని ఆరాధించిన, స్మరించిన, గానం చేసిన అవి అన్నియు సర్వేశ్వరునికి చేరుతా యంటారు మహనీయులు. మన సమర్థసద్గురు శ్రీ సాయిబాబా ''సబ్ కా మాలిక్ ఏక్ హై'' అని ప్రబోధించారు.

శ్రీసాయినిలయం ప్రచురణలు ఆధ్యాత్మిక, భక్తి, జ్ఞాన వైరాగ్యము లను అందిస్తూ సాధకులకు మనశ్శాంతిని కలిగిస్తూ, భక్తి మార్గములో నడచుటకు దోహదపడుచున్న వనుటలో ఏలాంటి సందేహములేదు.

నాకీమాట వ్రాయనవకాశమిచ్చిన పూజ్యగురువులు '' శ్రీ బాపట్ల వేంకట పార్థసారథిగారికి మరొక సారి కృతజ్ఞతాభివందనములు సమర్పించు చున్నాను. మరియు వారు పెక్కు గ్రంథములు ముద్రణ జరిపించి భక్త కోటికి ప్రసాదించాలని శ్రీసాయినాథున్ని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

4-3-2000 శ్రీసాయి శరణాగతుడు

మోహనరావు పేట **తాడూరి దేశికులు**



ఓం శ్రీసాయినాథాయనమః

ఓం నమో భగవతే వాసుదేవాయ

# ప్రేమామృతము - ప్రశంస

న.చ. మురళీధర్

పరమపూజ్యులు ''శ్రీహనుమసుకవి'' కృత ''ప్రేమామృతము.'' అది దాని పేరులోనే ఉన్నట్లు - దివ్యామృతము. తనదగ్గర వున్న ఒకే ఒక ప్రతిని శ్రీ పార్థసారధి అన్నగారు పంపగా చదువుభాగ్యము నాకు కలగినది. ఇంతకు మునుపు ఒకటిరెండు మారులు శ్రీ నారద భక్తి సూత్రములు ఆంగ్లములో, తెలుగులో చదివినా - ప్రేమామృతము చదివిన తరువాత కలిగిన ఆనందము పలుకుల కందనిది. దానికి గల కారణాలు అనేకము నాకు తెలిసినంత వరకు ఈకృతి ''సాయీవాచస్పతి' గారి పూర్ణ భక్తి సుధ. వారికి శ్రీకృష్ణ భగవానుని పట్ల నిండు భకి. ఆ అనుభవసారముతో శ్రీనారద భక్తి సూత్రములను ప్రేమామృతముగా మలిచారు.

భక్తకోటికి ప్రథమగురువు శ్రీ నారదమహర్షి. ఆయనవలన ఉద్ధరింపబడిన భక్తులు కోకొల్లలు. పురాణ పురుషులు, ప్రాతః స్మరణీయులు ధ్రువుడు, ప్రహ్లాద కుమారుడు మొదలగు వారు ''చదువులలో మర్మమెల్ల నెరిగితి తండ్రీ'' అంటూ ప్రహ్లాదుడు నిజమైన చదువు యొుక్క విశిష్టతను విడమర్చి చెప్పిన పరమభక్తుడు. సాక్షాత్తు శ్రీవేదవ్యాసుల వారిని ప్రభోదించి శ్రీమద్భాగతా విర్భావానికే అంకురార్పణ చేసిన మహనీయుడు శ్రీ నారద మహర్షి - ''సతరతి, సతరతి - లోకాంస్తార యతి'' అన్న సూక్తిని సార్థకం చేస్తూ - నాదోపాసన ద్వారా త్యాగరాజస్వామి జీవితోద్ధరణకు మార్గము సుగమము చేసిన మహనీయు డాయన. సహజము గానే భక్తులపట్ల ఉండే అపారకృప వలన భక్తిని (పరమాత్మ యందు జీవునికి

గల (ప్రేమ) సూత్రీకరించి అదిపెంపు జేసుకుని పరమాత్మను చేరు పద్ధతులను ఎరుకపరచినారు. ఏమికోరి ఆ మహర్షి పుంగవుడు యీపని చేసినట్లు? చెట్లు తమ ఫలాలను తాము తినవు, నదులు తమనీటిన తాము త్రాగవు.

శ్రీసాయినాథ భగవానుడే కృతికర్త యోగ్యతలు గుర్తించగా - యితరులు వారిని గూర్చి చెప్పేందుకు కూడా వీలుపడదు. నాలాంటి అజ్ఞుడికి అది దుస్సాహసము. శ్రీ సత్య సాయిబాబావారే స్వయంగా యీకృతిని అందుకోవడముకన్న వేరే సన్మానం అనవసరము అని యీ సాయిభక్త పరమాణువు సవినయ విజ్ఞాపనము. శ్రీసత్యసాయిబాబా 1958 మహాశివరాత్రి నాడు ''సనాతన సారధి''ని స్థాపిస్తూ తెలిపిన అమృత వాక్కులు- ''ఈదినమున సనాతన సారధి - అనాధి రథచోదకుడు - అసత్యము, అధర్మము, అన్యాయము, క్రౌర్యము, దుష్టత్వము అను మోహ వికారముల పైకి దండయాత్ర సాగించుటకై ప్రయాణ మగు చున్నాడు. ఈతని పరివారము వేదములు, ఉపనిషత్తులు, శాస్త్రములు. విశ్వశ్రేయమే వీని విజయఫలము. విజయానంద సూచకమగు విజయభేరి మ్రోయించి నప్పుడు విశ్వమానవులు ప్రశాంతి, క్షేమము, ఆనందము పొంద గలరు''. ఈ ధ్యేయానికనుగుణంగానే శ్రీవారు శ్రీ హనుమంతరావు గారిని ప్రేరేపించి ''ప్రేమామృతాన్ని'' మన కందరికీ పంచి పెట్టమని ఆదేశించినట్టుంది. సాధకులమైన మనపని ప్రేమామృతములో పాలుపంచుకోవడమే, దానిని తనివార గ్రోలడమే.

''సంపూర్ణ శరణాగతి జేసిన జీవిని దైవము రక్షించి తీరును. అట్టి ప్రసన్నుని ఎన్ని జన్మములకైనా చక్కదిద్ది సాయుజ్యమిచ్చి తీరును'' - ఈమాటలు శ్రీ పంతులుగారు దయా శతకమును ఆంధ్రీకరిస్తూ - ''అవతరణ విశేషైరాత్మలీలాపదేశైః, అవమతి మనుకంపే! మంద చిత్తేషు నిఘ్నన్'' - శ్లోకానికి యిచ్చిన వివరణ అది వారి విశ్వాసముకూడా అట్లేవారు తరించారు. ''సతరతి - సతరతి - లోకాన్స్తారయతి''.

పంతులుగారు (పేరా 1, పేజి 12) సెలవిచ్చినట్లు "నాసాయి" రచనలో తన జీవయాత్ర సాగించుకొనుటకు తగిన అవలంబనం - తోడు నిర్ణయించు కొనవలయును. ఈ నిర్ణయము గైకొనుటకు ఇంకా "ప్రేమామృతము" కంటె మించిన తోడు ఉండగలదా?

"రవియు, చంద్రుడు మరియు
తారకలు గూడ నిలుచునందాక
ఈకృతి నిలుచు నిలను".

"పలుకుల కందని వాడు - సాయికరుణ భావము తలచే వాడు, పరమ సమాధి నిలయంబున పలుమారు తోచేవాడైన (శ్రీ పుట్టపర్తి వారి మాటల్లో) శ్రీ షిరిడీ సాయి తద భిన్నులగు శ్రీ సత్యసాయివారి పాదపద్మములకు, వారి అంకిత భక్తులైన పంతులుగారు - ఇంకను "ఎందరో మహానుభావులకు" - ప్రణతి శతములు.

"జలనిధి జలములగొని, యాజలనిధికిన్ దర్పణంబొసగునటుల, నీ పలికించిన పలుకుల బలికిన"

17.5.2000 — నీ పాదదాసుడు

ప్లాట్‌నెం 16 "వైజయంతి"

శ్రీపురి, మౌలాలి, హైదరాబాదు - 500 040

**న.చ. మురళీధర్**



ఓం శ్రీ సాయిరాం

# ప్రశంస

**యస్. బి. చౌదరి,**

అధ్యక్షులు ఓం శ్రీ సాయిరామ్

ఆధ్యాత్మిక చైతన్య సత్సంగ్, బూరుగుపూడి. (తూ.గో)

ప్రేమ, భక్తి అనేవి మాటల్లో రెండైనా వాని భావం మాత్రం ఒక్కటే. భక్తి పరిపూర్ణతే ప్రేమ. ప్రేమ భగవంతునికి నిజమైన పూజ. సకల కర్మకాండలు తపస్సులు, ఇతర బాహ్యమైన ఆచరణలు ప్రేమలేనిదే శూన్యములే! ప్రేమ రహితుడయిన భక్తుడు పరమాత్ముని కనుగొనలేడు. కారణము అతనికి నిజభక్తి లేకపోవడమే. ఋషులూ, ప్రవక్తలు, మహాత్ములు వీరందరూ ప్రేమమయులే.

గురుగోవింద్ సింగ్ ఇలా అన్నారు.–''ప్రేమమార్గాన్ని అనుసరించిన వారు మాత్రమే పరమాత్ముని పొందగలిగారు''.

కబీరుగూడ–''యోగి, సన్యాసి, బైరాగి. ముని వీరిలో ఎవరూ ప్రేమ లేనిదే మహాత్ముల స్థాయికి చేరలేరు'' అన్నారు. ప్రేమను అనుభవించాల్సిందే కాని, మాటల్లో వర్ణించలేము. మిఠాయి తింటున్న మూగవాడిని, రుచిఎలా వుందని అడిగితే అతడేమని చెప్పగలడు ? చిరునవ్వు నవ్వి వూరుకుంటాడు.

స్వలాభము, అహంభావము విడిచి తుడిచివేసినప్పుడే నిజమైన ప్రేమ వెలువడుతుంది. ప్రేమలేనిదే పూజ వ్యర్థము.

ఆధ్యాత్మిక మార్గాన్ని అనుసరించుటకు మనలో దృష్టిని మేల్కొల్పే ప్రకాశమే ప్రేమ. ఎవరైతే పరమాత్మకొరకు గాఢమైన వాంఛకలిగియుంటారో, వారు ప్రప్రథమంగా తమమనస్సులోని కల్మషాలను ప్రేమజలంతో కడిగి వేయాలి.

భక్తిమార్గము సులభమైనదేకాక ఇతర మార్గాలన్నిటికన్నా ఉన్నతమైనది కూడా. భక్తిమార్గములో నమ్రత, వినయము, సేవ అనేవి మూల లక్షణాలు.

నమ్రత, విధేయత కలిగిన భక్తుడు ప్రతిదీ దైవనిర్ణయానికి వదలి భక్తితో ఆరాధిస్తాడు. నిజమైన నమ్రత, వ్యక్తి హృదయంలో మాధుర్యాన్ని నింపు తుంది. విధేయతతో పొందగలిగినదేదీ అహంకారంతో పొందలేము.

అగ్నికి కాల్చడం సహజలక్షణము. కాని వినయము ద్వారా అది బూడిద రూపం దాల్చినపుడు, దాన్ని పవిత్ర పదార్థముగా తీసుకుని నుదుట అలంకరించు కోవటానికి అర్హమవుతుంది.

బాగుగాపండిన పండ్లను, తియ్యని దుంపలను శబరి స్వయముగ తిని రుచినిజూచి మాధుర్యమును పరిశీలించి పిమ్మట రామ, లక్ష్మణులకు సమర్పించెను. పరమభక్తితో, మాతృప్రేమతో యిచ్చిన యా ఫలములను రాముడు ఆప్యాయతతో ఆరగించెను. ఆమె భక్తి, ప్రేమలు కలిసిన ఆ పండ్లు అమృతతుల్యములయినవి.

శ్రీ కృష్ణస్మరణ, సంకీర్తన, దర్శనము, స్పర్శనభాగ్యము తప్ప నన్యమెరుగని గోపికలు మధురభక్తితో భగవానుని హృదయములో విశిష్ఠ స్థానము నాక్రమించుకొనినారు. మనమంతటి ప్రేమానుభావము పొందలేక పోయినను దాని వైభవాన్ని వింటే మనలో కూడా పొందాలనే ఆర్తి కలుగు తుంది. అట్టి గోపికలకు గల భక్తి స్వరూప, స్వభావములను లోక హితమునకై ''నారద భక్తి సూత్రములు'' అని చెప్పబడిన భక్తి సూత్రాలను అనుగ్రహించి నారు నారద మహర్షి. అట్టి మహత్తరమైన భక్తి సూత్రాలను తెలుగులో మనకందరకు అందించిన పూజ్యులు శ్రీ సాయినాథ మహారాజు ఆస్థాన కవి శ్రీ బాపట్ల హనుమంతరావు గార్కి నా సాష్టాంగ ప్రణామములు. ప్రతి కాలములోనూ, దేశములోనూ జీవులను జనన మరణాల చక్రబంధము నుంచి తప్పించుట కొఱకై, వారిని అనేక ప్రబోధముల ద్వారా, భక్తి రచనల ద్వారా ప్రభావితము చేసి, మానవుణ్ణి తిరిగి పరమాత్ముని దరికి తీసుకొని

పోవడానికి మహాత్ములు మానవరూపములో వస్తుంటారు. సద్గురువుల హృదయాల్లో పరమేశ్వరుని ప్రేమ కాపురముంటుంది. వారిని మనము ప్రేమిస్తే మనలోనూ ప్రేమ ఆవిర్భవిస్తుంది.

సాయీనాధుని స్వప్న సాక్షాత్కారము నొంది, వారి ఆదేశానుసారముగ అనేక జ్ఞాన ప్రభోదక రచనలందించిన మహానుభావుడు కీ॥శే॥ శ్రీ బాపట్ల హనుమంతరావు గారి పాదపద్మములకు మరొక్కమారు సాష్టాంగ ప్రణామము లు సమర్పించు కుంటున్నాను.

పూజ్యులు, ప్రేమమూర్తులైన శ్రీ బాపట్ల వేంకట పార్థసారధిగారు నాపై ఎంతో ప్రేమానురాగములతో 'ప్రశంస' వ్రాయుమని ఆదేశించి, ఆశీస్సులు అందించినందున, నాకు అర్హతలేక పోయినను, మహత్సంగము వలనను, సద్గ్రంథ పఠన ప్రభావము వలన యీ నాలుగు మాటలు వ్రాసే భాగ్యము కలుగ జేసినందుకు వారికి నా హృదయపూర్వక పాదాభి వందనములు.

---

# ప్రశంస

చ ॥ వయసొనరించు బాధలని వార్యములైనను, భీతివీడి – చి
న్మయుడయి యేలు సాయిసుగుణాంబుధి అమృతభాండ భాగమున్
నయముగ భక్త సంతతికి న్యాయవిధంబుల నందజేయు సం
జయులగు మీకు సాయియిడు సర్వవిధాల జయప్రకాశముల్

ప్రతాప వేంకట బాలదుర్గాప్రసాదశాస్త్రి
విజయవాడ.



# అభినందనము

శ్రీ దాలిపర్తి నారాయణరావు
అడ్వకేటు 13-108,
దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్.

పూజ్యశ్రీ బాపట్ల హనుమంతరావుగారు రచించిన 'ప్రేమామృతము' (నారద భక్తి సూత్రములు-వ్యాఖ్య) భగవాన్ సత్యసాయిబాబావారు. పుట్టపర్తిలో ఆవిష్కరించి-ఆశీర్వదించిరి. ఇప్పుడు శ్రీ షిర్డి సాయీ ప్రభువులు దీనిని పునర్ముద్రణముగావించుటకు వలయు ద్రవ్యమును సేకరించి పెట్టిరి. శ్రీ వేంకటపార్థసాధిగారు యీ అభినందనము వ్రాసి పంపుటకు అవకాశము కల్గించిరి. – సుమతీ శతకములోని పద్యమునకు సైతము సరియైన భావము చెప్పలేని నేను ఏమి వ్రాయగలను? అని సిగ్గు-భయము జనించినను – శ్రీసాయీ ప్రభువునకు శతవందనములు సమర్పించి, స్వామి ఆజ్ఞగ అభినందన రచనకుపక్రమించితిని.

బ్రహ్మ మానసపుత్రులు నారదమహర్షి త్రిలోక సంచారి. యుగ యుగాలుగ అపరబ్రహ్మ శ్రీమహావిష్ణువు – వారి అవతారములను గురించి గీతికలు పాడి, భక్తియోగ ప్రభావము ముప్పిరిగొల్పి జనావళికి ముక్తి పొందుటకు వీలు కల్పించెను.

వ్యాసభగవానుడు బ్రహ్మసూత్రములు – అష్టాదశపురాణములు, భగవద్గీత-మహాభారత-శ్రీ భాగవతాదులు-శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రాదులు రచించి తానే కృష్ణభగవానుడుగ వ్యవహరించి – మహోన్నతుడై – తన తండ్రి – తాతల పేర్లు నిలబెట్టి ప్రజాకోటికి భక్తి – ప్రేమామృతములు కురిపించి ముక్తి మార్గము రూపొందించిరి.

ముస్లిము దంపతులచే పెంచబడి – హిందువుడైన శ్రీ గోపాలరావు – వేంకుశుని వద్ద శుశ్రూష చేసి, గురుబోధనలనాలించి, ఆచరించి, కర్మ, భక్తి యోగములను పెంపొందించి– గురువాజ్ఞతో మృతిజెందిన నొక శిష్యుని బ్రతికించి– గురువు– దైవము అభిన్నులని నిరూపించిరి శ్రీ సాయీ ప్రభువులు.

శ్రీ సాయీ నాథుని మహత్త్వమును చిన్న కథల రూపములో బోధించి, దేశ విదేశములలో శ్రీ సాయిబాబా అవతార పురుషుడు – దైవము అని చాటిన శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులు గారు బాపట్ల వాస్తవ్యులు – ఆరువేల నియోగులు – వీరయ్య చిన పున్నమ్మల జ్యేష్ఠ పుత్రులు – ఉభయ భాషా ప్రవీణులు. చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రి యాది మహనీయుల ప్రశంసలు పొందిన పండిత కవులు. యీ కృతి రచయిత.

శ్రీ సాయీ ప్రభువు దివ్యసాక్షాత్కారము పొంది, వారి ఆస్థాన పండితుల పదవిలో నియమింప బడి, భక్తుల వృత్తాంతములు (ఏమీ! నిన్ను పేక్షింతునా!) బాబా చరిత్రముగ సంపూర్ణముగ రచించి, బాబా వారి ముఖోద్గత వాక్కులు 'శ్రీసాయీనాథ బోధామృతము'గ, యింకా పలు పుస్తకములతో పాటు శ్రీ సాయీ ప్రభువు యొక్క ప్రేమామృతమును భక్తులచే త్రాగించి ప్రజాకోటికి యెనలేని సేవచేసిన మహాభక్తాగ్రణి శ్రీ హనుమంతరావు గారిని గురించి నేనేమి గీతికలు పాడగలను ? యేరీతిగ వర్ణించగలను? (నారద మహర్షివలె).

"సాకారుండవో! నిరాకారుండవో"! "చేయదగని పనులు చేసితి చేయదగిన వాని జేయనైతి" "ఇచట నేనుండనిక భయమేల? విడుము నీ బరువుల నాపైన. నేనిర్వహింతు" "నన్నుగను–వే కన్నుల నిన్నుగందు!" ఇట్టి సహజమధురపదజాలములతో, గంభీరముగ – భావగర్భితము – ఆశ్రయము – అనుగ్రహము. వివరించి రచించిన పంతులు గారిని గురించి నేనే గీతికలు పాడగలను? యే రీతిని వర్ణించగలను?

పండితుల సమక్షములో - సాహిత్యగోష్టిలో శ్రీ సత్యసాయీ ప్రభువులు యోగమననేమి?'' అని ప్రశ్నింప ''యోగము - యోగమంచన .... నీ పదయుగ్మమునందు భక్తి సంయోగము నొంది - చిత్తము .... రాజయోగ మని'' ఆ స్వామి తొడపై కూర్చొని ఆశువుగ పల్కియందరను మెప్పించిన హనుమంతరావు గారిని గురించి ''నేనే గీతికల పాడగలను? యే రీతిని వర్ణించ గలను?''

వ్యాపారము - వ్యవహారముగ మారి -పూర్తిగ నష్టపోయి - తమకులదైవ మైన శ్రీరామునిపై '' రామా! ఆపదుద్ధారకా'' శతకమును వ్రాసి బ్రోవుమని ''గురుడున్ నాల్గవ యింట నీచ బడె నాకున్ శుక్రాంతంబరగన్ చిక్కులు కష్టముల్ పొసగె షష్ఠాష్టక స్థితిన్'' అని పలికి తనుకుగల జ్యోతిషశాస్త్ర వైదుష్యమును - ప్రతిభను చూపించిన శ్రీ హనుమంతరావుగారిని గురించి నేనే గీతికలను పాడగలను? యే రీతిని వర్ణించగలను?

సర్వమతముల సారమొకటేనని, మతము మార్చుకొనుట నేరమనీ, అందరు దేవుళ్ళు సములేనని-మార్తాండునకు ఖండోబాగా-డాక్టరుకు రామునిగ -మేఘునకు శివునిగ - బల్వంతునకు దత్తునిగ - దర్శన మిచ్చి, మసీదును 'ద్వారకమాయి' గ మార్చి - తీర్చి దిద్ది - భక్తి లేనివాడు - బరువులు మోయుగాడిద కంటె హీనుడని, అశ్వాంగన లద్ధి వేసిన కథను చెప్పి - అనంతరావు పాంటకర్‌ను కాపాడిన - సర్వవేళల భక్తులను రక్షించుటకు ' ఓ' యన ' ఓహో' యని పలికి నానా దాహము తీర్చిన - అహంకార, మాత్సర్యములు మాపి మంచి మార్గములోనికి తెచ్చి హాజీని - హరిని - సోమ దేవుని కాపాడిన శ్రీ సాయీ ప్రభువుల చరిత్రము వెలుగునకు తెచ్చిన శ్రీ హనుమంతరావుగారిని గురించి యేగీతిక పాడగలను? యేరీతి వర్ణించ గలను?

'' నవ్విన-దూషించిన-కొట్టిన వారితో పోట్లాడకుము-పరుల సంపదల గురించి యీర్ష్య పడకు-నీవును సంపన్నుడవగుటకు ప్రయత్నించుము

- ఇతరుల కష్టము - ధనము నుచితముగ గ్రహించకుము - కలిగిన కలిమితో సంతృప్తి చెందుము - ఇతరులతో తగవులాడకుము - నిందలు పలుకకుము- కోరికలాధీనములో నుంచుకొనుము- గురుదైవమునందు భక్తి విశ్వాసములతో నిరంతరము ప్రార్థన చేయుము''. అని పలుసూక్తులు పలికి - కర్మ భక్తి యోగములు బాబా సూచనలుగ పలు గ్రంధములలో ప్రవచించిన. ప్రచారము చేసిన శ్రీ హనుమంతరావు గారిని గుఱించి యేగీతికలను పాడగలను? యే రీతిగ వర్ణన చేయగలను?

వ్యాస మహర్షి కుమారుడు శుక్ర మహర్షి - తన తండ్రి వలె - తన తండ్రి తాతల పేరు ప్రతిష్టలు నిలబెట్టినటుల శ్రీ వేంకట పార్థసారధిగారు - తన తాత గారు బాపట్ల వీరయ్య పంతులుగారు చెరువు గ్రామ కరణముగ 45 సంవత్సరములు పనిచేసి ప్రఖ్యాతి గాంచినట్లుగ. చెరువు గ్రామ కరణముగ నలుబదేండ్లు తానును పనిచేసి - భారత రాష్ట్రపతినుంచి స్వర్ణపతకమును -బిరుదును సంపాదించి- తండ్రిగారైన పూజ్య శ్రీ హనుమంతరావు పంతులుగారి అడుగుజాడలలో నడుస్తూ శ్రీ సాయి బాబా ప్రేమను - తత్త్వమును, తండ్రిగారి రచనల ద్వారా, స్వంతముగ కొన్ని, వ్రాయుట ద్వారా - పూర్వ కృతులను పునర్ముద్రణ గావించుచు - భక్తులకు పంచు చు - తండ్రిగారి కీర్తిని దేశ, విదేశములలో విస్తరింప జేయుచు - భక్త జనకోటికనేక విధముల సహకరించుచు. తండ్రిగారికి తీసిపోనని నిరూపించుకొనుచు - బహుళార్థ సాధకముగ ''సాయి తత్త్వ ప్రచారక'' ''శ్రీ సాయి బంధు'' అని గుంటూరు జిల్లాలో భక్తమండలి వారిచే బిరుదులు గడించిన శ్రీ వేంకట పార్థసారథి గారికి-వారి ధర్మపత్ని గారికి వారి సంతతికి-వారి వారి కుటుంబముల నెల్లరకు ఆయురారోగ్య ఐశ్వర్యములు యెల్లవేళల - ఆచంద్రార్కముగ పొంద గలందుకు శ్రీ సాయీ ప్రభువును త్రికరణ శుద్ధిగ అర్థించి - ప్రార్థించు చున్నాను. ఇంతకు మించి నేనేమి గీతికలను పాడగలను? యేరీతిగ వర్ణించ గలను?

సర్వేజనాస్సుఖినోభవంతు



ఓమ్ సాయి - శ్రీసాయి - జయ జయ సాయి

# భక్తి- ప్రేమ- అమృతాస్వాదనము

**డా. మాధవపెద్దినిర్మలా రాంగోపాల్**
శ్రీ సాయి పుణ్యనిలయమ్
పాతపట్టాభిపురం. గుంటూరు -6.

మన భారతదేశము రత్నగర్భయే కాదు - ఆధ్యాత్మిక గర్భకూడ. మన పురాణములన్నిటి యందు అలౌకిక భావమే ద్యోతక మౌతుంది. మన సంస్కృతి యెంత గొప్పదంటే యిక్కడ మాతృమూర్తులు తమ పసి కూనలను భవిష్యత్తు లో భక్తులుగ తీర్చిదిద్దుటకు వుగ్గుపాలతోనే నిగ్గు తేలుస్తున్నారు. జోలపాటలు భక్తి పునీతములే.''జో అచ్యుతానంద-జోజో ముకుందా- లాలి పరమానంద రామ గోవిందా! రామలాలీ-మేఘశ్యామ లాలీ- తామరసర నయన ధశరధ తనయాలాలీ ''!

భక్తి- ప్రేమ- అమృతాస్వాదనము- యీ వరుస సోపానములు ఆధ్యాత్మిక చింతనకు సంబంధించినవి. ధ్యాసే ధ్యానం - ఇది శ్రద్ధతో కూడి నప్పుడు 'భక్తి' జనించును. 'భక్తి' అనే పదం 'భజ' అనే ధాతువునుంచి ఉద్భవించినది. 'భజ' అనగాఈశ్వరుని ఐశ్వర్యములో పాల్గొనుట, స్మరణము - 'కీర్తనము - సేవనము- నమస్కారముల ద్వారా భగవంతుని భజించుట.

'భక్తి' పలురూపములుగ - రకములుగ విభజింపబడినది. సగుణ భక్తి (ఈశ్వరవాదము) నిర్గుణభక్తి (నిరీశ్వరవాదం)., భాగవతము సప్తమ స్కంధము లో శ్రవణం ---- ఆత్మ నివేదనమ్ ) అను నవవిధ భక్తులు వర్ణింపబడినవి. దాస్య - సఖ్య - మధుర అను త్రివిధ భక్తులును

మార్గదర్శకులుగ వుండిరి. ప్రాతఃస్మరణీయుడు - శ్రీ హనుమంతుడు - విభీషణాదులు దాస్యభక్తికి ప్రతీకలు. శ్రీ రామచరితమానస్ రచయిత మహాకవి శ్రీ తులసీదాస్ దాస్య భక్తికి అంకిత మౌతాడు. 'సూరదాస్' సఖ్య భక్తిలో అగ్రగణ్యుడే శ్రీ కృష్ణ భక్తురాలు 'మీరాబాయి' మధురభక్తికి పరాకాష్ఠ.

ఆది శంకరులు ముక్తిని కోరు మానవునకు "మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసే.- స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యాభి దీయతే" అని బోధించిరి.

అంతరాత్మ రూపంలో ప్రాణియందు భగవంతుడు విరాజిల్లును - ఆత్మయందు రమించుట యన భగవంతుని యెడల భక్తి భావము వుండుట ఈ విధమగు భక్తునికి ముక్తి సహజముగ ప్రాప్తించును. ఇదే భావమును మహాకవి 'కబీర్' తత్కాల సమాజమునకు "భగవంతుడు నీలోనే యున్నాడు. ఎక్కడెక్కడో వెదుకుట వృధా" అని నొక్కి చెప్పెను. అయితే ఆత్మ సాక్షాత్కారము కానిచో భగవత్తత్త్వము బోధపడదు. కనుకనే శ్రీ సాయి నాథుడు ఆత్మసాక్షాత్కారానికి ఎంతో ప్రాముఖ్యతను ప్రసాదించెను.

భక్తి యొక్క పరాకాష్ఠయే ప్రేమ. అనన్యభక్తి ద్వారా ప్రేమతత్త్వము పొందవచ్చును. అనగా ప్రేమయే దైవము. ఈరెండు అభిన్నములు. ఆత్మను పరమాత్మకు సన్నిహితముచేయుటయే అమృతాస్వాదనము. భక్తికి నిర్వచనము వున్నది కాని ప్రేమకు ఒక నిర్వచనము-విధానము- విభేదము , హద్దుగాని లేదు నారదమహర్షి "అనిర్వచనీయం ప్రేమస్వరూపం" అని నుడివిరి.

ప్రేమ అనగా త్యాగము అనే నిస్వార్థత. ఇచ్చుట తప్ప తీసుకొనుట నెఱుగని అమాయకతయే ప్రేమ. ప్రేమ అనుభవించునదియే కాని వర్ణింపనలవి కానిది. లౌకిక ప్రేమను జయించనిదే అలౌకిక ప్రేమ అలవడదు. లౌకిక

వాసన మృత్యువు. అలౌకిక ప్రేమయే అమృతాస్వాదనము.

భగవంతుని యెడల అనన్యప్రేమయే అమృతస్వరూపము. అత్యంత మధురాతి మధురము. అది ప్రాప్తించిన జీవి ఆస్వాదించి తీరును. తదుపరి అన్యములపై ఆకర్షణ - శ్రద్ధ వుండదు. చాతక పక్షి తనకాధారమైన మేఘముపైనే దృష్టిసారిస్తుంది. ప్రేమికుడైన తులసీదాసు ఘనశ్యాముడైన శ్రీరాముని యందే చిత్తమును లగ్నమొనర్చెను. శ్రీ సూరదాస్ గోపికలకు శ్రీకృష్ణుని యెడగల ప్రేమతత్త్వమును వర్ణించిన తీరు పరికించిన గోపికల అనన్య ప్రేమ ద్యోతక మౌతుంది. పవిత్ర ప్రేమను గురించి గోపికల వలన తెలుసుకొనిన "ఉద్ధవునకు" జ్ఞానోదయమగును.

కర్మ-జ్ఞాన-యోగములకన్న ప్రేమ రూపక భక్తియే శ్రేష్ఠమని భాగవతము బోధిస్తుంది. భగవత్ప్రేమ లభించిన విషయవాసనలు తొలగి పోవును. మనసు మరొక విషయముపైకి మళ్ళదు. ప్రహ్లాదుడు తన తండ్రికి తెలిపిన దిదియే. మూగవాడు బెల్లము తిని నా రుచిని బహిర్గతము చేయలేడు. ప్రేమానుభవము ద్వారా అమృతమున మునక వేయును కాని వ్యక్తపరచలేడు భక్తుడు. అమృత స్వరూపుడగు భగవంతుని కథలే కళ్యాణ మయములు. దైవీ సంపదకు చెందిన గుణములు ప్రాప్తింపచేసుకొనినచో ప్రేమామృతాస్వాదన కరతలామలక మగును. సర్వవ్యాప్తియగు భగవానుని ఉనికిని గుర్తించిన - సకల చరాచర సృష్టి అంతయు ప్రేమమయముగా గుర్తింపబడును. ఇట్టి భగవత్స్వరూపమును పొందినవారు మోక్షమును ప్రాప్తింప చేసుకొనెదరు. ఇదియే జీవన సార్థకత. పవిత్ర ప్రేమాశ్రువులతో భగవంతుని అభిషేకించి - ఊపిరితో ధూపమిచ్చి - హృదయనివేదన చేసి పంచప్రాణముల 'హారతి' సమర్పిస్తే ........... ఈ ఊహే అమృత రసాస్వాదనము. అది ఎక్కడోకాదు. ఇక్కడనేవుంది.



# ప్రశంస

**మంచికంటి వెంకట శివరామయ్య**
జ్యోతిష - వాస్తుశాస్త్ర సిద్ధాంతి- బాపట్ల

ఐహిక సుఖలంపటులై సంసార సముద్రమున జిక్కి వెతలనొందు మానవులయందు అపారమగు కరుణతో వారిని ఉద్ధరించుటకే దేవర్షి నారదుడు భక్తి సూత్రములను ప్రవచించినాడు.

వాసుదేవునందు అనన్య ప్రేమయే భక్తియనియు దీనికి కులమత వయోలింగ భేదము లేక సర్వమానవులు యర్హులేనని వివరించినారు.

నారదభక్తి సూత్రములను తెనుగున అనువదించుటయే కాకవానికి విపులమగు వివరణములను ఇచ్చి భక్తులకు మార్గదర్శకులైనారు శ్రీ హనుమంత రావు గారు.

ఒంటిమిట్ట శ్రీ రామచంద్రుని చరణారవింద ధ్యానమగ్నుడగు శ్రీ బాపట్ల వీరయా మాత్యుల జ్యేష్ఠపుత్రుడు శ్రీ హనుమంతరావుగారు వీరికి బాల్యమునుండియే కృష్ణభక్తి యలవడినది. ''దేవకీ నందను''ని కళ్యాణ గుణ విశేషములను దెలుపు కథలను చదువుట, వినుట, కీర్తించుటల వలన గాఢమగు కృష్ణప్రేమయందు తన్మయులగు చుండెడివారు.

మానవసహజమగు ఐహికసంపాదనాభిలాషవలన వ్యాపారమును సాగించి, నష్టముల పాలై, పిత్రార్జిత మగు యావదాస్తిని పోగొట్టుకొనిరి. భగవంతుని విస్మరణకు పశ్చాత్తప్తుడై పరితపించిరి. ''ఇక భావున్ నీవుగా నమ్మి నీమఱుగున్ జేరితి బ్రోవగా గదవె ! రామా ! ఆపదుద్ధారకా'' యని మొఱ పెట్టు కొనిరి.

శ్రీ సాయినాథ ప్రభువు వారికి స్వప్నమున సాక్షాత్కరించి, తమ ఆస్థాన పండితులుగ నియమించుచు, తామనుగ్రహించిన కవితాశక్తులను తమసేవకై వినియోగించవలసినదిగా ఆదేశించిరి.

శ్రీ సాయీశుని కరుణాకటాక్ష వీక్షణముల వలన మనసు స్వస్థత నొందిన హనుమంతరావుగారు భగవంతునకు సంపూర్ణ శరణాగతి గావించి ప్రసన్నులై, సర్వకర్మములను ఫలాపేక్షరహితులై భగవదర్పణ బుద్ధితో నాచరించుచు భగవంతుని చేతియుపకరణముగ మారినారు.

శ్రీ సాయినాథుని ఆదేశముననుసరించి భక్తులకు తరించు మార్గములను దెలుపు పెక్కు గ్రంథములను వెలువరించినారు. అంతేగాక తమ్ము దర్శించ వచ్చిన భక్తులకు భగవంతుని జేరు ఉపాయములను సుబోధ మొనర్చి సద్గురు దేవులయినారు.

శ్రీ హనుమంతరావుగారి జ్యేష్ఠ పుత్రుడు శ్రీ వేంకట పార్థసారథి గారు తమతండ్రి గారి రచనలనన్నింటిని ప్రచురించుచు తమతండ్రి గారి ఆశయసిద్ధి కై పాటుపడుచున్నారు. తమతండ్రిగారి వలనే తమనుజేరు భక్తులకు దివ్యోపదేశముల నొసగుచు శ్రీ సాయినాథుని సేవలో తమ జీవితమును ధన్యమొనరించు కొనుచున్నారు.

శ్రీ సాయినాథుడు తన సేవలను సమర్థవంతముగ జరిపించు కొనుటకు శ్రీ పార్థసారథిగారికి పూర్ణాయువును, సంపూర్ణ ఆరోగ్యమును, కొదువలేని ఐశ్వర్యాది సమస్త శుభములను ప్రసాదించగలందులకు ప్రార్థించు చున్నాను.



ఓమ్ శ్రీ సాయీ నాథాయ నమః

# విజ్ఞప్తి

శ్రీ సోదరీ సోదరభక్తులారా!

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు దేవుడు శ్రీ కృష్ణ సాయీ ప్రభువుల అవ్యాజకరుణ - భగవాన్ శ్రీ సత్యసాయీ ప్రభువుల అదృశ్య అభయ హస్తచాలన మహిమమున - శ్రీ షిర్డీ ఆస్థాన ఆంధ్ర పండిత కవులు 'శ్రీ సాయి ప్రసన్న' బిరుదాంకితులు, తండ్రి, గురువు, దైవముగ నన్ను అనుక్షణము కంటికిరెప్పగ రక్షణమొసంగుచు, కర్తవ్యబోధన, నిర్వహణ సామర్థ్యముల పరోక్షముగ నిచ్చి పాలించుచున్న కీ.శే. శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులు గారు 10-3-1956 మహాశివరాత్రి పర్వదినమున రచన పూర్తిగావించి, మత్పితామహులగు కీ.శే. శ్రీ బాపట్ల వీరయ్య పంతులుగార్కి (చెరువు గ్రామకరణం - 1902-1947) అంకితము గావించిన ప్రేమామృతము (నారదభక్తి సూత్రములు - టీక - సూత్రపద్యము- వివరణ గీతమాలిక) అను నీ పవిత్ర గ్రంథరాజమును ప్రశాంతనిలయం ప్రభువులు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు (బృందావనము -మకాంలో) 29-5-1963న తొలి పలుకు వ్రాసి వారి పవిత్ర హస్తములతో 26-2-1968న మహాశివరాత్రినాడు ప్రశాంతనిలయమున ఆవిష్కరించి ఆశీర్వదించియుండి 8.32 సంవత్సరముల పిదపనైనను మీ అందర సహాయ-సహకార సంపత్తుల ద్వారా పునర్ముద్రణము గావించి మీకందించు భాగ్యము నాకు సంప్రాప్తమైనందుకు ప్రేమస్వరూపులైన భక్తకోటికి ప్రణామములు సమర్పించుకొనుచున్నాను.

సమస్త జీవులయందు సమదృష్టిని పెంపొందించు 'ప్రేమ'ను విశదపరచు 51 ప్రచురణలు మీ అందరి అదరణలవల్లనే ప్రకటించగల్గితిని. కాని వ్యాధి బాధలవ్యధ – వృద్ధాప్యము కారణముగ నీ కృతి నే స్వచ్ఛంద సంస్థ కై నా పునరుమ్ద్రణాధికారము వప్పగించి బాధ్యతలనుండి తప్పించుకొన ప్రయత్నించి, భాగ్యనగరమందొక భక్తునకు నాభావమును వివరించి లేఖ వ్రాసితిని. కాని మనమున నేదో నేరము చేసితినని ఆవేదన కలిగెను. శ్రీ సాయీ ప్రభువలు అంతరాత్మ ప్రబోధముగ.

శా॥ "భిక్షం బెత్తుచు – కుక్షినింపుకొన సంవీక్షించు సన్యాసి యే
దక్షుండాయని – నాదురక్షణ సమర్థత్వంబు శంకింతువా ?
దీక్షన్ సద్గురు పాదముల్ కొలువ సిద్ధించున్ గదా యోగముల్
అక్షీణంబగు నిష్ట కామ్యములు – నీ కారోగ్యమున్ గూర్చలే
దే ? క్షోభన్ గననేల ముద్రణమునన్- యేమీ ! నిన్నుపేక్షింతునా ?"

మ॥ సమకూర్తున్ గృతులచ్చుగాగ తుదిపైసాదాక ద్రవ్యంబు; స
క్రమ రీతిన్ ననుగొల్వ – త్రోయుదును వార్ధక్యంపు ప్రాబల్యమున్
నిము సంబేమఅకన్ కనుంగొనెద నే నీవారి బాగోగులో
ర్మి మెలంగన్‌దగు – నీకు క్షేమమగు నేమీ ! నిన్నుపేక్షింతునా ?"

అని ఆదేశించిరి..మరుదినమే ఆభాగ్య పురవాసి – భక్తశిరోమణి – గుప్తదాత లేఖ వ్రాసెను.

గీ॥ శ్రీ షిరిడి సాయివిభుని యాశీస్సు బడసి
శ్రీ ప్రశాంతి నిలయవాసి ప్రేరణమున
అన్వశింపహు నా కృతిని ప్రేమామృతంబు
తిరిగి ముద్రింపుడనుచు సందేశమిచ్చి
ఐదువేల నూటపదారులర్థమిడిన
గుప్తదాతను సాయిసద్గురుడు ప్రోచు !

ఇది స్వామి ఆజ్ఞగాగొని మా తండ్రిగారు భద్రపరచిన స్వంతప్రతి ప్రేమామృతమునకు 13-9-1999న వినాయక చతుర్ధి నాడు పూజచేసి పునర్ముద్రణ చేయు బాధ్యతను స్వీకరించి కరపత్రములను పోషకులకు పంపితిని.

28 సంవత్సరముల క్రితము- అఖిల భారత సాయి సంఘాధ్యక్షులు పూజ్యశ్రీ సాయిపాదానంద రాధాకృష్ణ స్వామీజీ వారు - శ్రీకొప్పరపు రామారావు పంతులు గారు, శ్రీ మంచిరాజు సూర్య నారాయణ మూర్తి - శ్రీ పాదిల విశ్వనాథ శర్మగారు - శ్రీ చోడవరపు సాంబమూర్తిగారు (చిక్కడపల్లి బాబా) శ్రీ శ్యామచరణ్ బాబా, (నంద్యాల) ప్రభృతులు శ్రీ సాయినిలయ ప్రచురణ ప్రక్రియ నాచే ప్రారంభంచేయించిన పుణ్యులు. వీరు నిత్య స్మరణీయులు

హైదరాబాదు వాస్తవ్యులు - సర్వశ్రీ యన్. సి. మురళీధర్ - డా॥ వై. విశ్వనాథం- ఐ. ప్రభాకర రావు ఎ.ఇ. -డి. యస్. రాజు ఎ. ఇ. (శ్రీకాకుళం) శ్రీ మంచికంటి వెంకట శివరామయ్య గారు (బాపట్ల) మరియు పలువురు పోషకమహాశయులు ఈ కృతికి పునర్ముద్రణా వశ్యకతను నొక్కి వక్కాణించిరి.

''ప్రేమ'' అనుశబ్దము మనస్సున పొడమగనే ప్రథమముగ శ్రీ శ్యామ్‌చరణ్ బాబా, నంద్యాల వారు గుర్తుకు వస్తారు. మొదట వుత్తర ప్రత్యుత్తరముల ద్వారా పరిచయమైనను, తదుపరి మా పుణ్యవశమున శ్రీ సాయినిలయము విచ్చేసి, శ్రీ చోడవరపు సాంబమూర్తిగారు- శ్రీ ఎక్కిరాల భరద్వాజగారు - యింకా ఎందరో భగవద్భక్తులతో మాషష్ఠి పూర్తి మహోత్సవమున (1984) పాల్గొని దిగ్విజయ మొనరించిరి. శ్రీ శ్యామ్‌చరణ్ బాబాగారిద్వారా వారి సంభాషణలు - రచనలు కీర్తనల ద్వారా 'ప్రేమ' శబ్దము యొక్క యదార్థస్థితి అవగాహనమైనది. అంతః శత్రువులను జయించనిదే కేవలము భక్తి పూజలద్వారా గ్రంథపఠన, రచనల ద్వారా

ప్రేమహృదయులు కాలేరని గ్రహింపచేసిరి. అట్లు నా హృదయమున ప్రేమతత్త్వమునంకురింప చేసి - లోకవ్యవహారముల దృష్టిని దూరము గావించి, బాబాపదభక్తి - నాన్నగారి రచనల ప్రచురణ ప్రక్రియలో మనస్సు నిమగ్నమగుటకు దోహదపడినది శ్యామ్‌చరణ్ బాబాయే!

శ్యామ్‌చరణ్ బాబాను గురించి వర్ణించి వ్రాయుట అసాధ్యమయిన విషయము. వారు వయసున చిన్నవారైనను - ఆధ్యాత్మిక రంగంలో అంతింతై వటుడింతయై ...." అన్నట్టు హిమాలయ శిఖరాలయంతటి యెత్తునకు ఎదిగినారు.

"అవసరమున్నప్పుడు కాని - లేనప్పుడుకాని సకలవిశ్వము భగవదాధీనంలో వున్నదని ఎఱుక నిరంతరము కలిగి తదనుగుణంగ వర్తించువారికి జీవితాన్ని సత్యమగు మార్గంలో త్రిప్పే అనుభవం లభిస్తుంది".

"అవిశ్రాంత కృషితో - ఏకధ్యేయంతో భగవన్నామస్మరణ శ్వాసకు అనుసంధించి లోకవ్యవహారాలలో మూడవవ్యక్తిగ - సాక్షీభూతునిగా- ఆయన కార్యక్రమము" అనే తలంపుతో-త్రికరణ శుద్ధిగ-పర్యవసానం ఆలోచించక-అడుగులు ముందుకు సాగించు-నమ్మకమే నడిపించు- విశ్వాసము తీరానికి చేర్చి - వివేకము ఉద్ధరింపచేస్తుంది. శ్రీ గురుకృపయే సకలార్థసాధకము (16-2-1993).

"మహర్షులు రచించిన సూత్రములు-స్తోత్రములు అత్యంత శక్తివంతములు సులభ ఫల ప్రదములు. ఇష్ట కామ్యసిద్ధి దాయకములు. శాంతికి సోపానములు. "శరణు" అన్నవారిని రక్షిస్తానని శ్రీరామచంద్రుడు - ఇతరచింతలనన్ని వదిలి తననే చింతించేవారి యోగక్షేమములు తానే చూచుకొంటానని శ్రీ కృష్ణ భగవానుడు పలికి "భక్తి" యొక్క ప్రాధాన్యాన్ని ప్రవచించినారు. అదే మహర్షులు వివరించారు."( సాయిసుధ 8/87)

శ్రీ శ్యామ్‌చరణ్‌బాబా గారికి శ్రీ సాయిబాబా, శ్రీ రమణ మహర్షి - శ్రీ రామకృష్ణ పరమహంసాది మహాత్ముల యందుగల అపారభక్తి పరాకాష్ఠ

చెంది ప్రేమగ మారింది. అ ప్రేమామృతాస్వాదనమే శ్రీ సాయిబాబాపై అనురాగము-స్వాతంత్ర్యము-సంపాదించి పెట్టినది. ఆస్థితిలో ప్రేమ యొక్క ప్రభావము భగవానుని కూడ బంధించి తీరునని చెప్పుటకు వారు రచించిన వందలాది కీర్తనల్లో మచ్చుగ అఖిలభారత సాయీ సంఘం-మద్రాసువారు సాయిసుధలో జనవరి 1987 మాసపత్రికలో ప్రకటించినది యిక్కడ తెలియపరుస్తున్నాను.

వదలను – నినువదలను
నే వదలను – వదలను – వదలను– వదలను – వదలను– వదలను సాయీ
వదలక – ననువదలకచే
వదలక – వదలక – వదలక – వదలక చేకొను మయ్యా శ్రితజనమాయీ!
సాయీరామ్ – సాయీరామ్ – సాయీరామ్ – సాయీరామ్

మానవజన్మము నొసగితివయ్యా
మనసునొకటి కల్పించితివయ్యా
మాయలో నను ముంచితివయ్యా
మహాచిత్రముల జేయుదువయ్యా
॥వదలను॥

సంసారమొకటి కల్పించితివి
సంఘములో బడద్రోసితివి
సమస్యలెన్నో సృష్టించితివి
సతమతమగునటు చేసితివి
॥వదలను॥

బాధ్యతలను భరియించెదనంటివి
నిను శరణన్నచో గాచెదనంటివి
ఎప్పుడు భరింతువో – ఎపుడు గాచెదవో
శ్యామాదులకు శాంతినొసగెదవో
॥వదలను॥

ఇలావారు కీర్తనల నాలాపించుచో శ్రీ ద్వారకామాయి మూలస్తంభములే కదలి – శ్రీ సాయీ ప్రభువు ప్రసన్నుడగుట జరుగుచునేయున్నది. అట్టి శ్రీ సాయి కరుణాలయ ప్రభువుకు ప్రణామములు సమర్పించుచున్నాను.

వారి చిరునామా:– శ్రీ శ్యామ్ శ్రీ చరణ్‌బాబాజీ
జయసాయి కరుణాలయం
25-461/11, నంద్యాల.



శ్యామచరణము కర్మసాక్షీమహత్తు
శ్యామచరణము చల్లని చాయపట్టు
శ్యామచరణము మానినీ ధీమతమ్ము
శ్యామచరణము మిత్ర సంచార గోష్ఠి

'ప్రేమ' అను శబ్దమును నిర్వచించుట అసాధ్యము. ప్రేమ దైవము. దైవమే ప్రేమ. ఆకారములేదు. అక్షరముల కందనిది. అంతటను వ్యాపించి యున్నది. అనుభవైకవేద్యము ఇచ్చువారికి పుచ్చుకొనువారికి మాత్రమే ఎఱుక గల నిగూఢ రహస్యము. ''నీవు ఏదైనా పొందాలనుకుంటే – ముందు యివ్వడం నేర్చుకో'' అన్నారు వివేకానందస్వామి. అది అవిచ్ఛిన్నమైనది – సత్యమైనది నిత్యమైనది మహాత్ములు – గురువులు – పెద్దలు – అవధూతలు – ప్రేమదృక్ప్రసారమున దీర్ఘాయుష్మంతుడుగ, ఆరోగ్యవంతుడుగ,

ధనికుడుగ, విజ్ఞాన సంపన్నుడుగ – సంతానవంతుడుగ ఆశ్రితుడు పరివర్తన చెంది పరమానందము పడయుట శ్రీ సాయిబాబావారి జీవితచరిత్రము – భక్తుల అనుభవముల ద్వార కోకొల్లలు వుదాహరణలు మనము తెలుసుకొన్నాము. ప్రేమహృదయములకసాధ్యమైనదిలేదు. అది హృదయములో అంకురించి, దినదిన ప్రవర్ధమానమై చిరస్థాయిగ నిలచి అమృతమయమై అనందాన్ని అవిర్భ చేస్తుంది. అమృతాన్నే పంచుతుంది.

భగవానుడు నిరాకారుడుగ యుగయుగాలుగ తననుతాను సృష్టించు కొనుట ప్రేమకార్యమే. దుష్టశిక్షణ – శిష్టరక్షణ ప్రేమకారణమే. శ్రీ సాయిబాబాగా భగవానుడు షిర్డీ యందవతరించుట – ప్రపంచమున ప్రజలను అరిషడ్వర్గములకు దూరము గావించి. అహంకార – మమ కారముల నడంచి జాతి మత కుల వర్గాతీతమైన యేకైక ప్రేమ సామ్రాజ్యము ను స్థాపించి శాంతిని సర్వత్రా నెలకొల్పుటకు 'ప్రేమ' యే ఆధారమని ఆచరణ రూపంలో నిరూపించిరి.

శ్రీ సాయిబాబా సన్యాసిగా , భిక్షువుగ అవతరించినా, ఆశ్రితులు – భక్తులకు తనయందు. గల గాఢప్రేమను నిరాకరించలేక గంధ, తిలకములు దిద్దినా – వస్త్రాదులు సమర్పించినా, కిరీటాది అభరణములు పెట్టినా పాద పూజలు చేసినను (సాయినాథ బోధామృతము 551) అనుమతించినది ప్రేమకారణముననే. మొదట మహల్సాపతికి – తదుపరి చందోర్కరు కుమారుడు 'బాపు'కు ( సా.బో. 552) ఆవల గురుపూర్ణిమ నాడు భక్తులకు తనను పూజించుటకు అనుమతించెను.

నీకేమి కావలయునని బాబా ప్రశ్నించగ 'ప్రేమ' తప్ప మరేమియు నక్కరలేదని 'గాల్వంకర్' కోరుట, తదుపరి గాల్వంకర్ హృదయము ప్రేమ తరంగములుప్పొంగదొడగుట జరిగెను. (సా. బో. 313 ఎ.) ప్రారంభము లో మనమేదొక అభీష్ట సిద్ధికై శ్రీ సాయీబాబాను ఆశ్రయించి అనుగ్రహించ

బడినను, క్రమముగ ఆ ప్రభువు యొక్క ప్రేమను సంపాదించుట వల్ల సమస్తము సమకూర్చునని గ్రహించి, వస్తు విషయవాంఛలను మానుట భక్తాగ్రేసరు లెల్లరకు అనుభవమే!

అపరిచితులైన పూజ్యశ్రీ బీ.వి. నరసింహస్వామిగారు మా తండ్రి గారిని శిష్యునిగా చేసికొని కర్తవ్యబోధనము చేయుట, అట్లే పూజ్య శ్రీసాయీ పాదానందస్వామి చినగంజాము విచ్చేసి, శ్రీ సాయీనిలయ ప్రచురణములు కొనసాగించుమని ఆదేశించుట - పోషక మహాశయు లెల్లరు 28 సంవత్సరముల నుండి 51 ప్రచురణములు వెలువడతోడ్పడుట - వారికి గల సహజ ప్రేమయే కారణము. శ్రీ సాయీ ప్రభువుల ద్వారా, వారి బోధనల ద్వారా, మా తండ్రి గారి రచనలలోని భక్తి యోగములు వారి హృదయాలలో ప్రేమామృతమును పంచి,. పెంచి యిట్టి సత్కార్యములను జరిపించుచున్నదని నా దృఢ నమ్మకము. ఇది త్రికాల సత్యము. ఇందెవ్వరును స్వార్థపరులు లేరు. ప్రాపంచిక దృష్టిలో యేదొక కారణము బాహ్యమముగ కన్పించినను, శ్రీ సాయీ ప్రభువుయొక్క అవతార ఆ వశ్యకతను ప్రేమ సర్వత్రా వ్యాపింప చేయుటలో భాగస్వాములు కావలెననే తపనయే త్యాగధనులను గావించు చున్నది.

ప్రథమములో పంపిన పుస్తకములు పఠించుచూ తదుపరి వెలువడే పుస్తకములకొరకు ఎదురుచూస్తూ ఆనందిస్తూ ప్రేమామృతాస్వాదనలో లీనమై యింకను సంతృప్తి చెందక "మీరు ....ఫలానా పుస్తకం ముద్రించండి" అని ఆదేశించే స్థితికి పోషకులు చేరుట నాకు గర్వకారణ మైనది. ఇది ఎంత ఆనందకరము ? ఆశించిన ఫలితాలు పాఠక, పోషక మహాశయుల హృదయా లలో చోటు చేసుకొనుటకంటె ఆహ్లాదకరమైనది మరొండేమి కలదు ?

"ప్రేమామృతము" గ్రంథము ముద్రణము పూర్తిగానున్న

సమయములో భాగ్యపురమున నొక భక్తురాలు - విజయువాడ యందొక భక్తాగ్రగణ్యుడు ''శ్రీ భగవద్గీతామృతమును ముద్రింపుడని'' ఆదేశించిరి. విరాళము పంపిరి. అట్లే మహా రాజపోషకులుగ చేరుచునే యున్నారు మహోదారులు. ఈ కార్యకలాపమంతయు ప్రేమ కారణమని, ప్రేమామృతము ఆస్వాదించిన వారు చేయు కర్మములు ఒక పిచ్చివాని చేష్టలుగ కనిపించునని అట్టివారు పొందే ఆనందము మాత్రము యితరులకు అవగతం కాదని నా అనుభవము. ఇంతకంటె ఈ గ్రంథమును వివరింపనేనశక్తుడను.

భగవాన్ శ్రీ సత్యసాయీ ప్రభువుల తొలిపలుకు-'వేదాంతం' వారు ''తమ్మవరపు'' వారు, 'బందా' వారు శ్రీ మూలా పేరన్నశాస్త్రి గారి ప్రశంసలు మా తండ్రిగారి విజ్ఞప్తి ప్రథమముద్రణములోనివి యధాతథంగా యందును ప్రకటించితిని. వీరెల్లరు 'ప్రేమ' యొక్క వివరణ చక్కగా నుడివిరి.

అవతార్ శివానంద భగవాన్ ( ఋషీకేశం) వారి ప్రియశిష్యులు ''పూజ్యశ్రీ శ్రీనివాసానంద సరస్వతీ స్వాముల'' వారు నాయంద భిమానముతో ఆశీఃపూర్వకముగ పంపిన ''స్వవివేచన'',

అమృతముకంటే అమరమైనది - మధురమైనది . అదే ప్రేమామృత మని శ్రీ సాయి ప్రేమాలయ సంస్థాపకులు - ప్రేమతో సాయిని తన వొడిలో వుంచుకొని పోషించుతూ తన్మయత్వము చెందే**నందనవనం** వారు,

శ్రీ సాయిస్మరణం - సర్వపాపహరణం.......
హనుమంతు రచనల అలరించు చరణం........ ( శ్రీ సాయిసుధ 5-82)
పలకండి - పలకండి సాయినామము .......
అనరండి - అనరండి - అమృతనామము ..... ( శ్రీ సాయి సుధ 9-82)
చరణకమలముల్వీడనీయకు తండ్రీ - తండ్రీ !
చరణరేణువు-కమలకోరిక వినుము-వినుమాసాంఖ!(శ్రీ సాయిసుధ 12-82)

అని కీర్తించి సాయీ ప్రభువును తన చేదోడుగ నిలబెట్టుకోగలిగిన తెలుగు భాషా ప్రవీణ విరామములో ఉన్న ఉపన్యాసకురాలు అందరిలోనూ భగవంతుని చూచుటే 'భక్తి' అని "ఇరుగంటి కమలమ్మగారు"; విశ్వాసము వున్నచోట భక్తి పవిత్రత - పరమానందం వుంటాయని శ్రీ తాడూరి దేశికులు గారు - భక్తకోటికి ప్రథమ గురువు శ్రీ నారదమహర్షి అని, విశ్వమానవ క్షేమానందములకే ప్రేమామృతం ఆవిర్భవించినదని "నల్లాన్ చక్రవర్తి మురళీధర్ గారు", ప్రేమను అనుభవించాలి గాని వర్ణింపలేమని "శ్రీ యస్. టి. చౌదరి గారు", "ఏగీతికలను పాడ గలను ? యే రీతిగ వర్ణించగలను ? అంటూ మా జనకుల రచనలనన్నిటిని పారాయణచేసి అందలి ప్రేమతత్త్వాన్ని సమంజసముగ , నిండుగ అభినందనలో నివేదించిన "శ్రీ దాలిపర్తి నారాయణరావు గారిని", అనన్య భక్తి ద్వారా ప్రేమతత్త్వము పొందవచ్చునని ప్రేమయే దైవమని-నిర్వచించిన డాక్టరేటు (ఉపన్యాసకు రాలు) బిరుదు గడించిన "శ్రీమతి మాధవపెద్ది నిర్మలా రాంగోపాల్ గారిని", బావగారైన (మా తండ్రి గారు) రచయిత యందు భక్తి - ప్రేమ - వినయ విధేయతలతో పలికిన అమృతవాక్కులు పంపిన "శ్రీ మంచికంటి వేంకట శివరామయ్య" గారిని, వారి మనోభావములు వెల్లడించినందుకు కృతజ్ఞతాపూర్వకముగ అభినందించు చున్నాను. శ్రీ శ్రీనివాసానంద సరస్వతీ స్వాముల వారికి హృదయ పూర్వక ప్రణామములు సమర్పించుకొనుచున్నాను. వీరందరు నాయందు గల సహజ ప్రేమకారణము ననే ప్రశంసలు పలికి యున్నారు. వారందరు ప్రేమామృతమును పాఠకులకు ద్రావ పెట్టుచుండ నేనేమి స్వయముగ వ్రాయగలను ?

మహారాజపోషకులుగ, రాజపోషకులుగ, జీవితసభ్యులుగ నా సంకల్పము సిద్ధింపచేసిన యుదారులకు - ప్రశంసలు పలికిన మహనీయులకు పాఠకజనులకు శ్రీ సాయీకృష్ణ భగవానుడు

ఆయురారోగ్య ఐశ్వర్యములు యిష్టకామ్యములు కృపతో ప్రసాదించి, వర్థిల్ల చేయుగాత అని నా ప్రార్థన. పెద్దలెల్లరకు నమస్కృతులు సమర్పించుచున్నాను.

అవకాశమున్న మేరకు పోషకుల చిత్తరువులు-మహారాజ పోషకులను గురించి అభినందన పూర్వక ఆశీస్సులు -శుభాకాంక్షలు యిందు విడిగ ప్రకటించితిని.

నా జనన కాలమున (1924) రచించి, 1929లో ప్రథమ ముద్రణము , 1978లో ద్వితీయ ముద్రణము గావించబడిన మాతండ్రిగారు రచించిన శ్రీ భగవద్గీతామృతము ( శ్లోకము - పద్యానువాదము) తృతీయ ముద్రణము సంకల్పించితిని. పోషక మహాశయులు యథోచితముగ సాయమందించి నన్ను కృతకృత్యుని చేయగోరెదను.

గీ॥ 'హనుమ' తెలియ బలికిన వ్యాఖ్యాద్భుతంబు!
హాయి సంతుష్టలొసగు మహౌషధంబు!
సకల జనులకు మధుర రసాయనంబు!
అనువు వడె గ్రోలరండు! "ప్రేమామృతంబు"!

శ్రీ సాయీ నిలయము, చెరువు — ఇట్లు శ్రీసాయిసేవలో

ఆషాఢ శుద్ధపూర్ణిమ

16-7-2000

బాపట్ల వేంకట పార్థసారథి

# ఆశీస్సులు

## మహారాజపోషకులు

చి. శ్రీ మంచికంటి వేంకట శివరామయ్య గారు యమ్.ఎ., బియిడి.
(సిద్ధాంతి)

చి. సౌ. వరలక్ష్మి దంపతులు రు. 1120/-

చిరునామా :- శ్రీ సాయీ హనుమనిలయమ్

12 - 5 - 21, చదలవాడవారి వీధి, బాపట్ల - 522 101

మంచికంటివారు కాశ్యపసగోత్ర సంభవులు. కీ.శే. రామకృష్ణయ్య గారి జ్యేష్ఠ పుత్రులు చి॥ శ్రీ॥ వేంకట శివరామయ్యగారు మానాల్గవ మేనత్త గారికి భర్త . వీరు దైవభక్తి , పెద్దలయందు వినయ విధేయతలతో ఉన్నత విద్యను పూర్తిచేసి మా పితామహుని కోరికపై, తల్లిదండ్రుల ఆమోదముతో మా మేనత్తను వివాహ మాడెను. స్వల్పాదాయముతో కుటుంబ సంరక్షణ భారము వహించి సెకండరీ ట్రైనింగు - ఇంటరు - బీ.ఎ., యం.ఎ., బియిడి. పూర్తిచేసి క్రమేణా డిగ్రీలు సంపాదించుచూ జిల్లాపరిషత్తులో ఉపాధ్యాయుడై మెల్ల మెల్లగా ఉన్న త జిల్లా పరిషత్తు ప్రధానోపాధ్యాయుడుగ పలు ప్రాంతము లలో పనిచేసి, పలువురు ప్రశంసలు బహుళంగ సంపాదించి, తగిన వయస్సున పదవీ విరమణ చేసి బాపట్లలో స్థిరనివాసమేర్పరుచుకుని జ్యోతిషశాస్త్రము - వాస్తు శాస్త్రములందు నిష్ణాతులై బాపట్లలో ప్రఖ్యాత 'సిద్ధాంతి' గ విరాజిల్లు చున్నారు.

బంధువైనను యీ దంపతులకు మా తండ్రిగారి యందు ప్రథమము నుండి భక్తిభావమే ప్రధానముగా వారి నిత్యకార్యక్రమములలో ప్రతిబింబిస్తూ హృదయకుహరంలో స్థిరపడియుండెను. ఆ కారణముననే వారి స్వగృహమున కారీతిగ నామకరణము గావించిరి. మా జనకుల

రచనలు- బోధనలు -పూజా విధానములు వారినుండి సంక్రమింప చేసుకుని అనుసరణ లో పెట్టి ఆనందించుచుదురు. వారు నాయందును వినయ విధేయతలను ప్రదర్శించుచూ ప్రవర్తిల్లుట శ్రీ సాయి భగవానుని ప్రేమ తత్త్వము వీరు గ్రహించుటయే కారణము. వీరికి యురువురు తనయులు. ముప్పురు తనయులను భగవానుడు ప్రసాదించెను.

వీరి ప్రథమ కుమార్తెను మా పినతండ్రి చి॥శ్రీ బాపట్ల సూర్య భగవానులు (బి.యి.ఇంజనీయరు-హైదరాబాదు)కు యిచ్చి వివాహము గావించిరి.

వీరి జ్యేష్ఠ కుమారుడు చి॥ శ్రీ. మంచికంటి వెంకటరామకృష్ణ రావు (టెలిఫోన్ ఇంజనీయరు) హైదరాబాదు మా పెద్ద మేనత్త దౌహిత్రి కుమార్తెను (ముని మనుమరాలు ) వివాహమాడెను. శ్రీ రామకృష్ణారావు తపమో, వ్రతమో, దీక్షయో, నియమమో, మరేమో గాని గతరెండు దశాబ్దములనుండి శ్రీ సాయీనిలయ ప్రచురణలకు సహాయపడుచున్న మహారాజపోషకుడు.

ఇప్పుడు చి॥ రామకృష్ణారావు కుమార్తె చి. డా॥ రాధాలక్ష్మి- అల్లుడు చి॥ ఆలూరు హేమచంద్రలు అమెరికాలో పదవులు సంపాదించి యీ కృతికి రు. 4116/- లు విరాళము పంపిరి.

అట్లే చి॥ రామకృష్ణారావు కుమారుడు చి॥ వెంకట సాయిరామ గోపాల్ (ఇంజనీరు) అమెరికా నుండి రు. 4116/- యీ కృతికి సమర్పించిరి. మరియు చి॥ శ్రీ. వెంకట శివరామయ్య గారి ద్వితీయపుత్రుడు చి॥ వేంకట రఘురామసాయి (యమ్.ఎ. యమ్ ఫిల్) సంస్కృతోపన్యాసకులు మహారాజపోషకులుగ యిదివరకే చేరిరి.

చి. శ్రీ. మంచికంటి వేంకటశివరామయ్య సౌ॥ వరలక్ష్మి దంపతులు సైతము యీ కృతికి రు.1120/-లు సమర్పించుట విశేషము. వీరికి వీరి కుటుంబ సభ్యులెల్లరకు మా తండ్రి, పితామహుడాదిగాగల యందర యందు గల భక్తికి - ప్రేమకు గాఢవిశ్వాసమునకు ప్రబల నిదర్శన

మీ త్యాగమే సనివిదిత మగుచున్నది.

వీరలను వీరి బిడ్డలను - బిడ్డల బిడ్డలను వంశపారంపర్యంతము సర్వధా సర్వదా శ్రీ సాయికృష్ణ భగవానుడు సంరక్షించుగాక అనినా ప్రార్థన.

<u>పాఠకులు జ్యోతిష - వాస్తు విషయములు సంప్రతించుట కనువుగ వారి చిరునామా ప్రకటించితిని.</u>

చ॥ అతులిత దైవభక్తి యు రసాంచిత కావ్యకళానురక్తియున్
చతుర వచో విలాసరతి - సత్య నిరూఢియు - సాధు సజ్జన
స్తుతిహిత పాత్రవర్తనము. జ్యోతిష శాస్త్ర విశిష్ట దృష్టి - యా
త్రత మిళితంబులయ్యె <u>"శివరామయుమావు"</u>గ రూపమందెబో!

ఉ॥ నాయన గారి దివ్యరచనామృతముల్ - గరుదేవు బోధలై
సాయిపదాబ్జ సేవలు త్రిసంధ్యల సల్పుననన్యభక్తి - నా
రాయణ దేవుభార్యరమయట్లుగ మా<u>"వరలక్ష్మి యత్త"</u>ని
త్యాయత వేడ్క భర్తకు ప్రియంబుగ సేవలు చేయు నోరిమిన్

చ॥ పటిమ ౘగుటుంబ భారములు బాల్యము నందె వహించె - నెల్లసం
కటములడంచె - సంతతి సుఖంబుగ వర్ధిలజేసినారు - హృ
త్పుటమున నమ్మి షిర్డి విభు పూజల జేతురు -<u>మంచికంటి వేం
కు శివరామయున్</u>- సతిని - కౌతుక మొప్పగ సాయి బ్రోచుతన్

గీ॥ ప్రథమ పుత్రుడు వేంకట రామకృష్ణ- యవల రఘురామసాయి రెండవసుతుండు
జనకునికి మేన యల్లుండ్రు- యనుదినంబు- సాయినాథుని పూజలు సలుపుచుండ్రు
సతులు - బిడ్డల గూడి సద్వృతమురీతి - హనుమతండ్రి రచనలకు హర్షపడుచు
సాయ పడు మహారాజపోషకులు వీరు - సాయిబాబ వీరలకు రక్షణము గూర్చు!

**చి॥ ఆలూరు హేమచంద్ర చి.సౌ. రాధాలక్ష్మి దంపతులు రు. 4116/-**

గీ॥ భావపురవాసి "ఆలూరు" వంశరత్న
మనగ "రామమోహనరావు" ఘనతఁగాంచె
సతి "సరోజినీ" సద్గుణ వతియనంగ
పుణ్యదంపతుల్ వీరికి పుట్టినాడు
హేమచంద్రా "హ్వయుండు - సాయీ శుకృపను!

కం॥ చదువులలో ప్రథముండయి
పదవిని పరదేశమందు ప్రజ్ఞఁగడించెన్
చదివించిన తల్లిదండ్రులు
హృదయములుప్పొంగె వారి కృషి ఫలియింపన్

కం॥ మామేనత్తకు పౌత్రిని -
సామర్థ్యము "డాక్టరేటు" సంపాదించన్
ప్రేమను బెండ్లాడెను శ్రీ
రాముని కృప హేమచంద్ర - రాధాలక్ష్మిన్

ఉ॥ ఎందరు లేరు లక్షలు గడించిన వారలు గాని యీ గతిన్
బొందుగ "నూరుడాలరులు" ముందుగ దంపలు లిచ్చి యుండిరా
నందము తోడ ముద్రణ మొనర్చెడి నీ కృతి వెల్వడంగ నా
బందువులైన వీరలను వర్ధిల జేయుము సాయి సద్గురూ!

**చి. శ్రీ. మంచికంటి వెంకట సాయిరామగోపాల్ రు. 4116/-**

మ॥ మును మీ నాన్నయు - తాతయున్ మిగుల సమ్మోదించి- బాపట్ల శ్రీ
హనుమంతార్యుని సత్కృతుల్ వెలియ ద్రవ్యంబిచ్చి పోషించుచొ
ప్పున డాలర్లను నూరు పంపవనిచెన్ ప్రోత్సాహమున్ సాయిబా
బ నినున్ - వేంకట సాయిరామ యుత గోపాలా! ప్రశంసించెదన్
అనయంబున్ నిను బ్రోచు సాయి విభుడి ష్టార్థంబులన్ గూర్చుచున్

**చి. శ్రీ బి. గంగాధరరావు, విశాఖపట్టణం రు. 3651/-**

అమృత స్వాంతుండుదార మానవుడు - భక్త్యావేశుడు దృఢ్గుణుం
డమరన్ తాతకు - తల్లి తల్లికిని స్మృత్యర్థంబుగా భూరియ
ర్థము ప్రేమామృతమచ్చు గూర్చనిడె. జీతంబందు భాగంబు స
క్రమ రీతిన్; ప్రభు ! సాయినాథ! కృప "బి గంగాధరాఖ్యున్" భ
వ్యమతిన్ పత్నిని బిడ్డలిద్దరను నిత్యశ్రీల బ్రోవంగదే!

**చి. శ్రీమతి కె. మంగసాయి, హైదరాబాదు. రు. 2000/-**

ఈయమ **మంగసాయి** తగనిచ్చె నుదారత రెండువేల రూ
పాయలనుద్యమించి కడుభక్తిని నారదభక్తి సూత్రముల్
నాయనగారి సద్వివరణంబును ముద్రణ జేయగోరుచున్
సాయికృతుల్ పఠించెను ప్రశంసల పొందెను భర్తతోడుగన్
శ్రీయుతుడుం బరాత్పరుడు జిన్మయరూపుడు. షిర్డి వాసుడా
సాయివిభుండు సత్కరుణ సంతతమున్ ప్రసరింపజేసి, దీ
ర్ఘాయువు. బుత్ర పౌత్ర నికరంబు, సుఖప్రకరంబు నిచ్చి యా
ప్యాయత దత్కుటుంబమును పాలనజేయును గాతనెల్లడన్!

తల్లి "**జయలక్ష్మి**" యు "**మధుసూధనుడు**" తండ్రి
వారి గృహమున కుక్కటపల్లి లోన
నీకు పూజలుచేయించి నియతితోడ
సత్కరించిరి నన్ను, నాసతిని గూడ
సతము సాకుము వీరల సాయినాథ!

## కీ. శే. రావూరు నరసింహయ్య – సరస్వతమ్మలుంస్మరణార్థం

## కుమారుడు శ్రీ రావూరు జయచంద్రయ్య–తిరుత్తని రు. 1116/-

గీ॥ సహజ సౌజన్య – గాంభీర్యసత్యశౌచ
సరళవాత్సల్య సౌశీల్య శాంతి దాంతి
భూరివైరాగ్య సన్నుతాచారధీర
సార సద్గుణ నిధులు ''రావూరు'' వారు!
ప్రథిత కౌండిన్య గోత్ర సంభవులు వారు
అట్టి వంశంబున '**నరసింహయ్య**' పుట్టె,
నతడు '**సరస్వతమ్మ**' నర్థాంగిగఁ గొనె,
పుణ్య దంపతులగు వార్కి పుట్టెసుతులు
వరుస ''**జయచంద్రయ**'' యు ''**శ్రీనివాసులు**'' – మరి
'**మూర్తి**' – '**సుందరం**' – '**గోపి**'; కుమార్తెలు – '**జయ
లక్ష్మి**' – '**విజయలీల**' లను పేర్లను చెలంగి
భువి కుటుంబ బాధ్యతలను పూర్తిచేసి,
పితరు లవని సుఖించి తృప్తిని గడించి,
వృద్ధదశయందు నెల్లర వీడి వారు
కాలధర్మముఁ జెంది స్వర్గంబుఁ జేరె!

కం॥ జననీ జనకుల యెడఁ బ్రే
మను 'ప్రేమామృతము' కృతికి మన్నన నర్పిం
చెను ''**జయచంద్రయ**'' ధన, మీ
తని కృతకృత్యునిగఁ జేసి, దయగను బాబా!

మ॥ కుతుకంబొప్పగ నే ముహూర్తమున నీకున్నాకు సన్మైత్రి సం
స్థితి చేకూరెనొ! నాటినుండియు నవిచ్ఛిన్నంబుగా సాగుచున్
ప్రతి కావ్యంబున కెంతొకొంత విధిగా ద్రవ్యంబు పంపించుటే
వ్రతమయ్యెన్, జయచంద్రయాహ్వయ! సఖా! రావూరువంశోన్నతా!

## శ్రీ బరాటం కామరాజు - శ్రీమతి మహాలక్ష్మి దంపతులు -

## శ్రీకాకుళం రు. 1116/-

కం॥ ''సంశట్ల'' గోత్రనామము
వంశంబు ''బరాటము'' భువి వాసిని గాంచన్
వంశోద్ధారకుడై శ్రీ
తాంశువులను నింప నొక మహాత్ముఁడు పుట్టెన్

గీ॥ అవని ''సూర్యనారాయ'' ణాహ్వాయుడనంగ
నతడు ''నారాయణమ్మ'' నర్ధాంగి గఁగొని
ప్రథితు పుత్రరత్నము ''కామరాజు'' ఁగనియె
సత్కులాభరణుడనుచు – జనము పొగడ!

తరుణమున 'కామరాజు సంతసము గనుచు
సరసగతి మహాలక్ష్మిని సతి ఁగగొనియె
వీరి కిం గల్గి వారు వివేకధనులు
కొమరులైదు గురాపయిఁ గూతురొకతె!

''**రామశేషయ్య**'' వారల ప్రథమసుతుడు
పరగ సతిగాగ''**జయలక్ష్మి**'' పాణిఁ గొనియె;
అవల **వేంకటకృష్ణ**రెండవ సుతుండు
మించువేడ్కగైకొనియె ప్రమీలకేలు ;
సరవి మూడవసుతు ''**ఉమాశంకరు**''ండు
వలచి పడతి '**సంధ్యారాణి**' పాణిఁగొనియె ;
నవల **చంద్రశేఖరుడు**నాల్గవసుతుండు
ప్రీతి '**శ్రీలక్ష్మి**' యను కన్యఁబెండ్లియాడె!
తనివి, ''**మోహనరావు**'' య్యైదవ సుతుండు
'**కవిత**' యనెడి సుగుణరాసి, కరముఁ బట్టె

కూతురగు శారదాంబ యుకూర్మిమీఱ
పతిగ 'మోహనరావ్' ను పెండ్లిమాడె ;

సుతయు – సుతులైదు గురునాసంతతినిఁగనిరి
కామరాజు – మహాలక్ష్మి కాంతదేఁర
మనుమలు – మనుమరాండ్రంకమునఁజెలంగ
సతియు – సుతులును కోడండ్రు సలుప సేవ
డెబ్బదైదేండ్ల వయసున నబ్బురముగ
సాయిబాబాకు నిత్యపూజలను భక్తి
జేయుచుండెను మనమున హాయిగనుచు !

ఉ॥ బట్టలకొట్టుపెట్టి – పలుబాధలు సైచి కుటుంబ భారముల్
గుట్టుగ నిర్వహించెఁగడు కూరిమి నిన్మనంబునందునన్
గట్టిగనమ్మి – నీ మహిమ గ్రంథములందు పఠించి మెచ్చి, యి
ప్పుట్టిన నీకృతిన్ వెలయఁబంపెను ద్రవ్యము 'కామరాజు' కున్
పట్టిన దెల్లబంగరగు భంగిని కోరిక లెల్లఁ దీర్చిచే
పట్టి కుటుంబ సభ్యులను వర్ధిల్లఁజేయుము సాయిసద్గురూ !

## మహారాజపోషకులు

## అప్పల వెంకట శేష శ్యామసుందర్ – కుమారి లలితాకుమారి.తుని

'తుని' టెలిఫోనుద్యోగిని
యన ''మాణిక్యమ్మ'' – పతియు – ''అప్పల'' వంశం
బున ఘనతవహించిరి. సా
యిని నిండుగ నమ్మిరితమ యేఁడుగడయనన్

పిల్లల యభివృద్ధికినై
చెల్లెలు ''మాణిక్యము'' తగఁ జేసెను బాసల్
చెల్లించె ముడుపు – బాబా
చల్లని సత్కృపఁ ఫలించె, చక్కబడెఁబనుల్

తిరమగు భక్తితో నినుహృదిన్ పదిలమ్ముగ నమ్మినిల్పి నీ
స్మరణమె నర్పుగా గలిగె సత్ఫలితమ్ములు - బిడ్డలిద్దరున్
అరుదగు వృత్తి విద్యలను "**అప్పల వేంకట శేష శ్యాముం**
**దర** సుతుడున్" **కుమారియగౌ లలిత** దర్ప మెసంగ గడించి, నిష్ఠగా
నిరువురు గ్రంథ ముద్రణకు నిచ్చిరి వేయుపదారు రూకలన్
కరుణనుజూపి, వీరిఁగుతు కమ్మన బ్రోవుము సాయిసత్ప్రభూ !

**శ్రీ బి.వి. రమణమూర్తి- పాలకొండ**

దివ్యమూర్తి సాయి దీర్ఘాయురారోగ్య
వైభవముల నీదువారి కొసగి
విమలకీర్తి దిశల వెలయ జేయునుగాక
ప్రముఖ భక్త !**బి.వి. రమణమూర్తి**!

**చి. శ్రీ. మల్లాజోశ్యుల దుర్గా మోహనమూర్తి- హైదరాబాదు**

శా॥ ముల్లోకంబులనేలు స్వామివని నిన్మున్నే సమీపించి తాఁ
జెల్లించెన్ దగు కాన్క ; నాజనకునాశీర్వాదమున్ పొందెగా !
యేళ్లెన్నో గడిచెన్ ; విపత్తు గలుగన్ యీనాడు నిన్ గొల్వగా
కల్లోలంబులడంచి వేధన పరిష్కారంబు సూచించి, ని
న్నుల్లాసంబుగఁగొల్వ , నీచరిత - నీయుక్తుల్ పఠించంగ నీ
వల్లన్ బాధ్యతలన్ని దీరుపగిదిన్ వాత్సల్యమున్ జూపితే !
కల్లల్ వల్కవు నీవు నొక్కపరి కాన్కన్ భక్తుడర్పించినన్
కాళ్ళున్ దారము గట్టి పిట్ట గతిలాగన్ నీకె చెల్లెన్ సుమా !
"**మల్లాజోశ్యుల**" వంశ భూషణుడు సన్మానంబు. సద్భక్తి శో
భిల్లన్ యర్పణజేసె ద్రవ్యమును శ్రీ ప్రేమామృతంబచ్చుకై
యల్లున్ యోగ్యుని, జూపి నా సఖుని "**మోహన్ మూర్తి**" బ్రోవంగదే!
వల్లింతున్ భవదీయ నామమును బాబా సాయినాథ ప్రభూ !

## మహారాజపోషకులు

### శ్రీ. పి. హరినాథ్ బాబు - హైదరాబాదు

మ॥ తనుజాంబించి యుదాత్తచిత్తమున గ్రంథంబచ్చుగూర్పంగ - హై
దరబాద్ పట్టణమందు వేయిపదియుగా ద్రవ్యంబు నర్పించె - శ్రీ
హరినాథ్ బాబును దత్కుటుంబమును సమ్యక్ప్రేమ రక్షించి నీ
చరణంబుల్ సతతంబు గొల్చు గతి శ్రీసాయీశ! పాలింపుమా!

### శ్రీ. యస్. వి. మల్లేశ్వర శాస్త్రిగారు, హైదరాబాదు

శా॥ స్వామీ! నీభక్తుని ప్రేమ పొందగలుగన్ స్వాంతంబునన్ గోరి, నే
ప్రేమన్ బంపితిఁ దండ్రిగారి రచనల్ - ప్రీతిన్ వరింపంగ; య
స్వీ.మల్లేశ్వర శాస్త్రి పోషకుఁడునై జేరెన్ మహారాజుగా!
క్షేమ స్థైర్యములిచ్చి బ్రోవు మనురక్తిన్ వీని సాయీశ్వరా!

### చి. శ్రీ. పిల్లలమఱ్ఱి రామశేషు, హైదరాబాదు

ఉ॥ ఉల్లమునందు బాధఁబడనొల్లక నీకెఱిగించి - మ్రొక్కి - నీ
చల్లని సత్కృపన్ బడసి - చక్కగ కార్యము నిర్వహించి - సం
ధిల్లిన వేడ్కకాన్కనుకృతిన్ ప్రచురించగ -**రామశేషు** శ్రీ
"**పిల్లలమఱ్ఱి**" వంశమణి ప్రీతినిడెన్ ప్రభు! వీని, ఁబత్నినిన్
పిల్లల బంధుసంతతిని పెల్లగు భక్తియు - భోగభాగ్యముల్
కొల్లలు గానొసంగి బలు కూరిమి నేలుము - సాయి సద్గురూ!

### శ్రీ సి. యల్. యన్. గాంధి, హైదరాబాదు

కం॥ శ్రీరాముని ప్రేరణో! సా
యీ రాముని సత్కరుణ మహిమ యో! బాబా!
కోరి **సి.యల్. యన్. గాంధి**- మ
హారాజగ కృతికి ధనసహాయము గూర్చెన్

## శ్రీ చదలపాక సింహాచలము, నెల్లూరు

కం॥ ఇది ముద్రణ జేయుటెఱిగి
పదివందలిడితివి బాబా పాదములదటిన్
పదిలంబుగ నినుగనఁగొ
ల్పెదసాయినిచదలపాక సింహాచలమా!

**కీ.శే. శ్రీ కుర్రా సుబ్బారావుగారు, జమ్ములపాలెం వీరిస్మృతి చిహ్నముగ**

**కుమారుడు చి. శ్రీ. ప్రభాకరరావు గారు**

**రు 1000/- లు సమర్పించిరి**

ఉ॥ 'కమ్మ' కులంబు ''కుర్ర'' యను ఖ్యాతిగడించిన వంశమందు –''అం
కమ్మ'' కు పుత్ర రత్నముగ కల్గిన ధన్యుడు ''సుబ్బరావు'' గ్రా
మమ్మున ''సాహుకార'' న సమంజస రీతిని రైతు బిడ్డగా
''జమ్ములపాలె'' మందున ప్రజల్ వినుతింపగ పెంపు చెందుచున్

గీ॥ మాత **''మాణిక్యమాంబ''** సమ్మతిని ధర్మ
పత్నిగ **''శివరామాయమ్మ''**ఁ బడసెనతడు.
వారలకు **ప్రభాకరరావు**– ప్రథమ పుత్రుఁ
డవల **నాగేశ్వరుండు**రెండవ సుతుండు –
మఱి, **రమేషబాబు**న్నకుమార వరుడుఁ
దుదకు **కృష్ణకుమారు** చతుర్థ సుతుడు
మఱి సుతలు**చంద్రలీల** – **హైమవతి** యనగ
ఒరగువారు – సద్గుణుల దంపతులుకనిరి.

చ॥ సరియగు విద్యలున్ – వయసు – సంపద చేకుఱినంత, బిడ్డలం
దరకు వివాహముల్ జరిగె ; ధర్మయుతంబుగ కాపు రంబులున్
సరవిని జేయుచున్ తగిన సంతతి పొందిరి, భక్తి యుక్తులై
నిరతము నీదుపాద నలినీ దళయుగ్మము గొల్తు సత్ప్రభూ!

మ॥ అతి సద్భావముఁ జూపి నేనడుగ ద్రవ్యంబున్ సహస్రంబు నీ
కృతి ముద్రింప ప్రభాకరుండొసగె భక్తిన్ నీపయిన్ గల్గి న
మ్రత;స్వర్గంబున యున్న తండ్రియగుకుర్రా సుబ్బరాయాఖ్య సం
స్మృతి చిహ్నంబు గ కూడతోడ్పడెను ; సుశ్రేయంబులున్, క్షేమ సౌ
ఖ్యతతుల్ కూర్చుము వీరలెల్లరకు బాబా ! సత్కృపాసాగరా !

శ్రీ కె. ఓబయ్య I.A.S.(Retd), హైదరాబాదు

కం॥ నాబాధ్యత గుర్తించెను
బాబా ప్రేరణను పొందిపైకము పంపెన్
"సేబా" సనగ భక్తుడుకే
ఓబయ్యను సాయిబాబ ఓమును సతమున్

చి. శ్రీ తాడూరి దేశికులు యమ్. ఎ. యమ్ యి డి., మోహనరావుపేట

సీ॥ "ద్విజధర్మ"మనియెడి విఖ్యాత గోత్రమం
దున భువి సంభవించిన ఘనుండు!
'తాడూరి' వంశముద్ధారణమును జేయ
నడుము గట్టినయట్టి బుడుత డితడు!
తల్లి "నరసమాంబ" తండ్రి "వేంకట రామ"
యాఖ్యులు కనిన పుణ్యముల పంట!
పట్టభద్రుండు నుపాధ్యాయ వృత్తి యం
దార్జన నెగడు గృహస్థుడితడు

"దేశికుల" ను విదిత నామధేయుడితఁడు
సహచరణి 'పద్మ' కడు ప్రీతి సహకరింప
సాయి పదసేవ నిత్యంబు సలుపువాడు !
బాబ కృపఁ గూర్చెనీతని పరిచయంబు !

మ॥ నిను సేవించుచు నిన్ స్మరించుచును నిన్నే దిక్కుగా నెంచుచున్
నినుగీర్తించుచు నీపదాంబుజములన్ నిత్యమ్ము పూజించుచున్
నను నాప్యాయత గౌరవించి కడు నానందింపఁ జేయూతగా
ననఘుం డీతడు దేశికుండొసగె మహారాజుగా 'సామ్ము' – ప్రే
మను వీరందరిఁ బ్రోవగాగదవె! సంప్రార్థింతు! సాయీశ్వరా!

## శ్రీ ఇ. ప్రభాకరరావు – కనకదుర్గదంపతులు, రామగుండం

మ॥ ఘనతన్ భక్తుల సంఘమేర్పరచి నీకై ''రామగుండంబు'' నన్
ధనమున్ గూర్చి ఫెర్టిలైజరు సిటీ ధన్యత్వమున్ గాంచ, చ
క్కని ''షిర్డీశ్వర సాయిమందిరము వీఁ కన్ గట్టి నిత్యంబు. హా
యిని జేయున్ తగు పూజ లెల్లరును, – సాయీ శ్రీనివాసున్ – ఉషన్
కన నీదాసు **ప్రభాకరున్ – కనకదుర్గన్** ప్రేమఁ బ్రోవంగదే
అనఘుల్ నారద భక్తి సూత్రములకున్ యర్థంబు నర్పించె; నీ
యను రాగంబును, సత్కృపన్ బడయు బాబా! సాయినాథ ప్రభూ!

## శ్రీ. కనుమూరి సాంబశివరావు – హైదరాబాదు

కం॥ అనుదినము సాయి నామం
బును స్మరియించు – కడుభక్తిఁ బూజలు చేయున్
**కనుమూరి సాంబశివరా**
వును వరమిడి బ్రోవగ ప్రభువును ప్రార్థింతున్

కం॥ మహరాజ పోషకునిగా
సహస్రముల ధనమునిచ్చె – సత్కృతులకునై
యిహధర్మమెనయ – బ్రోవుము
సహధర్మిణిఁ జూపి బాబా! సాంబశివాఖ్యున్

## చి. శ్రీ. పూజారి రామకృష్ణారెడ్డి – అంబికపల్లె

శా ॥ ఆసక్తిన్ పలుమార్లొ సంగితివి మహారాజుగా ద్రవ్యమున్
వాసిన్ గాంచవె సాయి పూజలను నీవంశంబె "**పూజారి**" గా
దాసోహమ్మని సాయినాథుపదముల్ ధ్యానించు సద్భక్తుడా!
వాసోగ్రాసము భూహిరణ్యములు సంప్రాప్తింపగా ( బ్రోచు– షి
ర్డీ సాయీశుడు నీ కుటుంబమును **రెడ్డీ**! **రామకృష్ణాభిదా**!

## శ్రీ దాకోజు మోహన దుర్గారావు – గుంటూరు

ఆ.వె. ॥ ధర్మ వర్తనుండు "**దాకోజు మోహన
దుర్గరావు**" నాకు తోడు నిలచి
ప్రీతి ద్రవ్యమొసఁ గె "ప్రేమామృతము" నకు
కరుణ బ్రోవుమితని – షిరిడిసాయి!

## చి. శ్రీ. యన్. సి. మురళీధర్ – హైదరాబాదు

మ. గతమందున్ మహరాజ పోషకుడు – సఖ్యంబొప్ప రాజిల్లుచున్
అతడీ నారదభక్తి సూత్రముల వ్యాఖ్యన్ జూచి యుప్పొంగె ; చె
ప్పితి నా కోర్కెయు – వాని సూచనలు వెన్వెంటన్ ప్రమోదించి, వాం
ఛిత మీడేరగ ప్రోగు చేసితివివాసిన్ గాంచు సద్భక్తులం
దతడున్ క్రన్నన రాజపోషకుడుగా ద్రవ్యంబు నిచ్చెన్ ప్రఫు
ల్లత సేవల్ యొనరించు నీశ్రితుడు. **నల్లాన్ చక్రవర్తి** కులున్
శ్రితముఖ్యున్ **మురళీధరా**హ్వాయుని శ్రీ 'శ్రీవత్స' గోత్రోద్భవున్
ధృతి గావంగదె తత్కు కుటుంబమును సాయీకృష్ణ! సద్బాంధవా!

## చి. శ్రీ. పసుపులేటి రామారావు
## శ్రీమతి సూర్యకుమారి దంపతులు – హైదరాబాదు

ఆ। పసుపులేటి వారు విసువుబాటును లేక
మసలు చంద్రు– ద్రవ్యమొసగు చంద్రు
హనుమజనకు రచనలన్నియు బఠియించు
సుతలు ముప్వురు ; మరి సుతుని ( గూడి

మ।ధరణిన్ దాతలు 'పైడిపాల' శుభ గోత్రంబందు జన్మించి ధ
ర్మరహిన్'**సూర్యకుమారి**' యున్ మగడు'**రామారావు**' పుత్రుండు, ము
వ్వురు కూతుళ్లను నిన్ స్మరింత్రు శరణంబున్ గోరి నీదివ్య స
చ్చరితన్ దీక్ష పఠించుచున్ కృతులకై సాయంబుగా ద్రవ్యమున్
నిరతంబున్ మహరాజపోషకులుగా నెమ్మిన్ సమర్పింత్రు, న
న్గురు భావంబున గౌరవించెదరు. సంకోచింపకే వీరిపై
కరుణన్ జూపి నెల్ల కార్యములు చక్కన్ దిద్ది దీవించి, త
ద్భరముల్ దీరిచి వారి బ్రోవగదె బాబా! సాయినాథ ప్రభూ!

## స్వర్గీయ వెంకట సూర్యప్రకాష్(రాజా) జ్ఞాపకార్థము తల్లిదండ్రులుచి.
## శ్రీ. ఒమ్మిడిశెట్టి ప్రభాకరరావు శ్రీమతి బాలవిజయకుమారి

మ. అలవున్ జెందక వృత్తిబాధ్యతలు సాయంకాల మౌదాక , నా
వల సాయీప్రభు సూక్తులెంచురచనా వ్యాసంగమున్ జేయు ; భ
క్తుల సత్సంగములందు పాల్గొనును ; నాకున్దోడుగా నిల్చుచున్
మెలగున్ శిష్యుని రీతి నీతనిని నెమ్మిన్ నే( బ్రశంసించెదన్

మ. కలరెందెందఱో భక్తులీ జగతిలో ( గానీ, మహాదాతలై
విలసత్ ఖ్యాతి గడించు దంపతులనన్ వీరేసుమా ! నా యెడన్
చెలిమిన్ పంపిరి ద్రవ్యమున్ మరల శ్రీ షిర్డీశ్వరా ! వీరికో
ర్కెలు దీరంగను, కార్యముల్ నెఱవు శక్తిన్ గూర్చి దీవింపుమా !

**చి. శ్రీ. పాతపల్లె వెంకటరమణ- మడూరు**

గీ॥ ఎన్ని జన్మములను జేసియున్న సుకృత
మీ కృతికి పెద్దగ ధనంబు నిచ్చినావు !
**పాతపల్లె వెంకట రమణా!** తపస్వి !
ధన్యుడవు నీవు శ్రీ సాయి దయను బ్రోచు !

**డా॥ శ్రీ యద్రా విశ్వనాథం –**
**శ్రీమతి వెంకట సుబ్బమ్మ దంపతులు – హైదరాబాదు**

శా॥ శ్రీ యద్రాన్వయ **విశ్వనాథ** సఖునిన్ శ్రీ యుక్త చిత్తున్ – బుధ
శ్రేయున్ – **వేంకట సుబ్బమాంబ** సతినిన్ క్షేమంబు – నారోగ్యమున్
నీ యౌన్నత్య మెఱుంగు భక్తి నిడుమా ! నీ పాద సంసేవలన్
జేయన్ దీవనలిమ్ము దంపతులకు శ్రీ షిర్డీశ్వరా ! సద్గురూ !

శా॥ అమిత వాత్సల్యముననను '' ప్రేమామృతంబు''
తిరిగి ముద్రింతునను జాడ నెఱిగి, మరల
నైదువందలపైన రూప్యములు పంపె
దంపతులు వీరు ! శ్రీ సాయి దయను బ్రోచు !

**చి. శ్రీ. జానపాటి సుబ్రహ్మణ్యశర్మ** D.A.O. (Works) – పరవాడ

మ. శరణంచున్ గురుసాయి నాథయనుచున్ సర్వేశ్వరా యంచు, నీ
చరణంబుల్ మదినిల్పి నాకు ప్రతి మా సంబందు నీయర్చనల్
గుఱుతున్ జేయును – కాన్కపంపు దగన్‌గోత్రంబు – నామంబుతో
వరుసన్ పూజల జేయగోరుట స్వభావంబయ్యె'', నాకోరికల్
కరపత్రంబుల జూసి ద్రవ్యమిడి సత్కావ్యంబులచ్చొత్తి, సో
దరభావంబున నండగానిలచె నీ దాతన్, కుటుంబీకులన్
పరమాప్తుండగు '**జానపాటి**' కులు '**సుబ్రహ్మణ్య శర్మన్**' నిరం
**తరమున్ వేంకట సుబ్బలక్ష్మి** సతినిన్ ! తండ్రీ ! కృపన్ జూడుమా !

## చి. డా॥ శ్రీ గోటేటి వెంకట చలపతిరావు శ్రీమతి కమలాదేవి

### దంపతులు - కాకినాడ

కం॥ కమలాదేవియు - మీరును
ప్రముఖుడు జనకుడు పలికిన గ్రంథములెల్లన్
క్రమముగ పఠియించుచు కడు
ప్రముదంబును బొంది - పాలు పంచిరినాకున్

కం॥ '**గోటేటి**' కులసుధీ! నీ
బోఁటి రసజ్ఞులు పొగడగ పొంగితి, నేనే
లోటును మదిఁ గొన; బడనా
రాటము; **వేంకట చలపతి రాయాచార్యా!**

గీ॥ సాయినిలయ ప్రక్రియల పోషకులు మీరు!
స్వామి సత్కృపను మరల సాయపడుచు
సామ్మొసగిరి నారద భక్తి సూత్రములకు
శ్రీ షిరిడి సాయి కరుణ రక్షించుమిమ్ము!

### శ్రీ పి.వి. రావు రిటైర్డు ఇంజనీరు- విజయవాడ

శా॥ ఎంచ సామాన్య భక్తుడవీవుగావు!
ప్రచురణలకు తోడ్పడు మహారాజువీవు!
సాయినాథుడు నిన్ కృప సాకుగాక!
ప్రీతి నుతియింతు సోదరా! **పి.వి. రావు!**

### శ్రీ కె. శ్రీ రాములు గారు యమ్. ఎ. - హైదరాబాదు

కం॥ నా మిత్రుడు - భక్తుడు - ప్రే
మామృత పోషకులఁ జేర్చెనను వగు నటు - సా
యముతాఁనుఁ జేసెకే. **శ్రీ**
**రాములు** సంతతిని సాయి రాముడు బ్రోచున్

శ్రీ పి. మాలెకొండయ్యగారు (రిటైర్డు పోస్టుమాస్టర్) - నెల్లూరు

గీ॥ తండ్రి హనుమకు శిష్యుడు - దాత - సఖుడు
'పోలిశెట్టి' కులోదధి పూర్ణశశిక -
మాలెకొండ యాఖ్యుని కి క్షేమమ్ములొసగి
ప్రీతిఁ గాపాడ గదవె! షిర్డీశ! సాయి!

## రాజపోషకులు

### చి॥ కుమారి డి. శైలశ్రీ - హైదరాబాదు

''తమ్మినేని'' ప్రసిద్ధ గోత్రంబువారు
పరగ 'రాజ్యలక్ష్మి' - 'శివశంకరు'ల తనయ
సత్కృతికి డి. శైలశ్రీ యొసంగె ధనము
తగిన బర్తను - పదవిని - దయను జూపి
శ్రేయముల గూర్చు - ద్వారకామాయి సాయి!

### శ్రీ మాలెపాటి సుబ్రహ్మణ్యంగారు - ప్రొద్దుటూరు

పరఁ గన్ శ్రీయుతమాలెపాటి కుల సుబ్రహ్మణ్య విద్వత్కవీ
శ్వరుడిచ్చెన్ దగ తల్లిదండ్రుల కభీష్టావాప్తి యౌనట్లు - సం
స్మరణార్థంబుగ - ద్రవ్యమీ కృతికి నుత్సాహంబుతో - వీని శ్రీ
షిరిడీ సాయి సమస్త సౌఖ్యములు ను శ్రీలిచ్చి రక్షించుతన్

### శ్రీ గన్నవరపు వీరవెంకట లింగమూర్తి - రాజమండ్రి

తండ్రి హనుమరచనలు ముద్రణము గూర్చ
ప్రోత్సహంబునిచ్చిన రాజపోషకుడవు!
కరుణనిను బ్రోచు శ్రీసాయి - గన్నవరపు
వీరవేంకట లింగమూర్తి! రసజ్ఞ!

**శ్రీ ఆర్. సి. మహాపాత్రో; జి.వి. కృష్ణారావు, జి. మోహనరావు**

**(శ్రీకాకుళం) మరియు శ్రీ జె. గోపాలరావు (విజయనగరం)**

సీ॥ ప్రముఖ "ఏ.యూ" గ విరామంబు గైకొన్న
"ఆర్సీ మహాపాత్రో" ఆదుకొనియె!
"గన్నవరపు" వంశఘనుడు "వేంకట కృష్ణ
రావు" సద్భక్తి విరాళమొసగె!
సాయి ప్రేరణజేయ "ఏ.యు" "జీ. మోహన
రావు" యుదారుడై ద్రవ్యమిచ్చె
సాధ్వి "కామేశ్వరీ సతి" కోరిక ధనము
పంపె "**జయంతి గోపాలరావు**"!

గీ॥ తండ్రిగారి రచనలు ముద్రణముఁ జేయ
నుల్లసిల్లును నాకు చేయూత నిచ్చు
పాలకొండ వాస్తవ్యుడు బావ వరుస
నాకు **దేవరకొండ సన్యాసి రాజు.**
రాజపోషకులనగ వీరలనుఁ జేర్చె;
వరములొసగి వీరల బ్రోచు షిరిడి సాయి!

**శ్రీ. చివుకుల – చిరంజీవి అనంత రామలింగ ప్రసాద్ – ఒంగోలు**

సాయినిలయ ప్రచురణల సభ్యుడితడు
పొందె బిరుదు భౌతికశాస్త్ర బోధకునిగ
"**చివుకుల**" కుల మణి **చిరంజీవనంత**
**రామలింగ ప్రసాద్** – చేరె రాజపోష
కునిగ – ప్రేమామృత కృతికి. తనకు తానె;
కృపను బ్రోచుత వీని శ్రీ కృష్ణసాయి!

**శ్రీ పి. బి. వెంకటరెడ్డి – హైదరాబాదు**

ఆబాల్యంబుగ దాతగ
ప్రాబల్యంబు గనె; సాయపడె నీ కృతికిన్
**పీ. బీ. వేంకటరెడ్డిని**
బాబా సాయీ! కృపగని పాలింపగదే!

**చి. శ్రీ. ప్రతాప వెంకట బాలదుర్గా ప్రసాద్ శాస్త్రి – విజయవాడ**

శ్రీ "ప్రతాప" సద్వంశ సుశిక్షితుండు –
దానధర్మాది సత్క్రియా ధ్యానరతుడు –
నిత్య సత్యవ్రతాచార నిపుణుడితడు–
సఖుఁడు – **శ్రీ బాలదుర్గా ప్రసాదశాస్త్రిఁ**
నేలుగావుత! షిరిడి సాయీశ్వరుండు!

**చి. శ్రీ. సీతంరాజు ప్రభాకరరావు సౌ॥ జానకి దంపతులు – హైదరాబాదు**

**"సీతంరాజు ప్రభాకరు"**
డీతని సతి "**జానకి**" ధనమిచ్చిరి "ప్రేమా
మృతమచ్చువేయ – సాయీ!
కృత కృత్యులగునటు వీరిఁ గృపజూడగదే!

# శ్రీ సాయీ ప్రభుమ్మలకు ప్రత్యేక ప్రార్థన

అరుదౌ నారద భక్తి సూత్రముల వ్యాఖ్యన్ బ్రీతి ముద్రింప జే
రి రసంఖ్యాకులు గ్రంధపోషకులుగా ప్రేమావృతంబున్ నిరం
తరమున్ పాఠకులెల్లఁ గ్రోలుగతి – దాతల్ వీరు – సామాన్యులా!
ధరలోఁ దావక పాదదాసులెద శ్రద్ధా భక్తులన్ నీకలం
కరణార్థముగ నిట్టి కార్యములు వేడ్కన్ గూర్తు రెల్లప్పుడున్
పరమానందము తోడ – నెల్లెడల నాపై ప్రేమ జూపించుచున్
తరమే యెంతటి వారికైన ధనముల్ త్యాగంబు గావించుటల్!
పరిపూర్ణంబగు నాయురున్నతులో! సౌభాగ్యంబులో, విద్యలో,
కరులో – కాంచనమో – కుమారకులో – సౌఖ్యశ్రేణులో – భూములో
సిరులో – సంపదలో – విదేశములలో శ్రేష్ఠాధి కారంబులో
కరుణన్ వీరలు కోరురీతిగను వేగన్ గూర్చి పాలింపు మే
యెరుసున్ గన్పడకుండగా సతము సాయీ కృష్ణ! సద్బాంధవా!
కరుణన్ గంటికి టెప్పపోలిక ననున్ గాపాడు చున్నావు సం
బరమొప్పారగ నాదు ప్రార్థన సదా మన్నించు మా సద్గురూ!

శ్రీ సాయీనిలయమ్
చెరువు (గురుపూర్ణిమ)
522 113.

**ప్రచురణకర్త**

# ఈకృతి ముద్రణమునకు ద్రవ్యము సమర్పించిన మహారాజ పోషకులు

★ఒక సాయిభక్తుడు - హైదరాబాదు. రు. 5116/-
★చి. శ్రీ మంచికంటి వేంకట శివరామయ్య,
★చి.సౌ. మంచికంటి వరలక్ష్మి దంపతులు, బాపట్ల రు. 1120/-
★చి. శ్రీ ఆలూరుహేమచంద్, చి.సౌ. రాధాలక్ష్మి దంపతులు,
బాపట్ల (ప్రస్తుతం అమెరికా) రు 4116/-
★చి.శ్రీ మంచికంటి వేంకట సాయిరామ్ గోపాల్,
బాపట్ల (ప్రస్తుతం అమెరికా) రు. 4116/-
★కీ. శే.. బడేటి వేంకటరత్నం, నాగభూషణమ్మగార్ల
సంస్మరణార్థం వారల దేహిత్రుడుచి. శ్రీ బి. గంగాధరరావు,
విశాఖపట్టణము రు. 3651/-
★శ్రీమతి కె. మంగసాయి, హైదరాబాదు రు. 2000/-
★కీ.శే శ్రీ రావూరు నరసింహయ్య, సరస్వతమ్మల
సంస్మరణార్థం కుమారుడు శ్రీ ఆర్. జయచంద్రయ్య,
తిరుత్తని రు. 1116/-
★శ్రీ బరాటం కామరాజు, శ్రీమతి మహాలక్ష్మి దంపతులు,
శ్రీకాకుళం రు. 1016/-
★చి.శ్రీఅప్పల వెంకట శేష శ్యామసుందర్, తుని రు. 1016/-
★చి. కుమారి అప్పల లలితాకుమారి, తుని రు. 1016/-
★శ్రీ. బి.వి. రమణమూర్తి, పాలకొండ రు. 1016/-
★శ్రీ యం.డి. మోహనమూర్తి, హైదరాబాదు రు. 1016/-
★శ్రీ పి. హరినాథ్‌బాబు, హైదరాబాదు రు. 1016/-
★శ్రీ యస్.వి. మల్లేశ్వర శాస్త్రి, హైదరాబాదు రు. 1016/-
★శ్రీ పిల్లల మర్రి రామశేషు, హైదరాబాదు రు. 1016/-
★శ్రీ సి. ఎల్. ఎన్. గాంధి, హైదరాబాదు రు. 1016/-
★శ్రీ చదలపాక సింహాచలం, నెల్లూరు రు. 1016/-
★శ్రీ కుర్రా ప్రభాకరరావు, (తండ్రి కీ.శే. సుబ్బారావుగారి
సంస్మరణార్థం) బాపట్ల రు. 1000/-

## ఇదివరలో జీవిత సభ్యులు - ఇప్పుడు మహారాజపోషకులు

★శ్రీ కె. ఓబయ్య, ఐ. ఎ. ఎస్. (రిటైర్డ్), హైదరాబాదు రు. 666/-
★శ్రీ తాడూరి దేశికులు, మోహనరావుపేట రు. 627/-
★శ్రీ ఇ. ప్రభాకరరావు, శ్రీమతి కనకదుర్గ దంపతులు రు. 503/-
ఫెర్టిలైజర్ సిటీ

## ఇది వరకే మహారాజ పోషకులుగా వుండి తిరిగి ఈ కృతికి సహాయపడిన దాతలు

శ్రీ కనుమూరి సాంబశివరావు, హైదరాబాదు రు. 867/-
శ్రీ పూజారి రామకృష్ణారెడ్డి, శ్రీమతి వెంకటలక్ష్మమ్మ దంపతులు,
అంబకపల్లె రు. 701/-
శ్రీ డి. ఎమ్. దుర్గారావు, గుంటూరు రు. 533/-
శ్రీ ఎస్.సి. మురళీధర్, హైదరాబాదు రు. 503/-
శ్రీ పసుపులేటి రామారావు, శ్రీమతి సూర్యకుమారి దంపతులు,
హైదరాబాదు రు. 503/-
శ్రీ ఇమ్మిడిశెట్టి ప్రభాకరరావు,
శ్రీమతి బాల విజయకుమారి దంపతులు, హైదరాబాదు రు. 503/-
శ్రీ పాతపల్లె వెంకటరమణయ్య, ఇ.వి.పల్లి రు. 503/-
శ్రీ యర్రా విశ్వనాథం, శ్రీమతి వెంకట సుబ్బమ్మ దంపతులు,
హైదరాబాదు రు. 503/-
శ్రీ జానపాటి సుబ్రహ్మణ్యశర్మ, పర్చూరు రు. 366/-
శ్రీ గోటేటి వెంకట చలపతిరావు, శ్రీమతి కమలాదేవి దంపతులు,
కాకినాడ రు. 350/-
శ్రీ పి.వి. రావు, విజయవాడ రు. 300/-
శ్రీ కె. శ్రీరాములు, ఎమ్. ఎ., హైదరాబాదు రు. 206/-

| | |
|---|---|
| శ్రీ బాపట్ల వెంకట నాగేశ్వరరావు, రేపల్లె | రూ. 101/- |
| శ్రీ పి. మాలె కొండయ్యగారు, నెల్లూరు | రూ. 100/- |

**ఈకృతికి రూ. 503/- ద్రవ్యము సమర్పించిన రాజపోషకులు**

చి. కుమారి డి. శైలశ్రీ, హైదరాబాదు

శ్రీ మాలెపాటి సుబ్రహ్మణ్యం, ప్రొద్దుటూరు

శ్రీ జి.వి.వి. లింగమూర్తి, రాజమండ్రి

శ్రీ ఆర్. సిహెచ్. మహాపాత్రో, శ్రీకాకుళం

శ్రీ జి. మోహనరావు, శ్రీకాకుళం

శ్రీ జి.వి. కృష్ణారావు, శ్రీకాకుళం

శ్రీ జయంతి గోపాలరావు, విజయనగరం

**ఇది వరలో జీవితసభ్యులుగ వుండి, తిరిగి ఈకృతికి ద్రవ్యమును సమర్పించిన రాజపోషకులు**

| | |
|---|---|
| శ్రీ సి.హెచ్. సి. ఎ. ఆర్. ప్రసాద్, ఒంగోలు | రూ. 503/- |
| శ్రీ పి.బి. వెంకటరెడ్డి, హైదరాబాదు | రూ. 503/- |
| శ్రీ సీతంరాజు ప్రభాకరరావు, శ్రీమతి జానకి దంపతులు, హైదరాబాద్ | రూ. 350/- |
| శ్రీ ప్రతాప వెంకటబాల దుర్గాప్రసాదశాస్త్రి, విజయవాడ | రూ. 316/- |

**ఇదివరకు జీవితసభ్యులు తిరిగి ఈకృతికి సహాయపడిన దాతలు**

| | |
|---|---|
| శ్రీ బి. అదృష్టరావు, హైదరాబాదు | రూ. 272/- |
| శ్రీ ఆర్. వెంకటేశ్వర్లు, ఉప్పల్, హైదరాబాదు | రూ. 232/- |
| శ్రీమతి కె. శ్రీతులసి, హైదరాబాదు | రూ. 201/- |
| శ్రీ ఎమ్. వెంకటరెడ్డి, తణుకు | రూ. 200/- |

| | |
|---|---|
| శ్రీ డి.వి. ఎల్. నరసింహారావు, గుంటూరు | రు. 200/- |
| శ్రీ శనగపల్లి వెంకటేశ్వర్లు, విజయవాడ | రు. 141/- |
| శ్రీ శేషగిరి వీర రాఘవులు, హైదరాబాదు | రు. 126/- |
| శ్రీమతి జె. లక్ష్మీప్రసన్న, హైదరాబాదు | రు. 117/- |
| శ్రీ ఎస్. సుబ్బ నరసింహులు, తిరుపతి | రు. 116/- |
| శ్రీ సి. విఠల్, తండూరు | రు. 116/- |
| శ్రీమతి మాధవపెద్ది నిర్మలా రాంగోపాల్, గుంటూరు | రు. 116/- |
| శ్రీ డి. ఎన్. ఎస్. ఎస్. శ్రీనివాసరావు, సికిందరాబాదు | రు. 116/- |
| శ్రీ చల్లా వెంకట సుబ్రహ్మణ్యం, హైదరాబాదు | రు. 111/- |
| శ్రీ ఎమ్. లక్ష్మీనారాయణ, హైదరాబాదు | రు. 100/- |
| శ్రీమతి ఎస్. సత్యవతి, విశాఖపట్టణం | రు. 116/- |
| శ్రీమతి జి. రాధాభువనేశ్వరి, తిరుపతి | రు. 100/- |

**ఈ కృతికి రు. 350/- ద్రవ్యము సమర్పించిన జీవితసభ్యులు**

శ్రీమతి ఉపాధ్యాయుల రాజేశ్వరి, హైదరాబాదు

శ్రీ ధర్మబొట్ల లక్ష్మీకాంతం, హైదరాబాదు

శ్రీ ఎమ్. నరసింహులు, హైదరాబాదు

శ్రీ వి. అనిల్‌కుమార్, హైదరాబాదు

శ్రీ ఎమ్.వి. భాస్కరరావు, హైదరాబాదు

శ్రీ ఇ.వి.పి. ఎస్. కృష్ణ, హైదరాబాదు

శ్రీ సంగాపు దర్మారావు, గుంటూరు

శ్రీ జె. హనుమంతరావు, గుంటూరు

శ్రీ కొర్రపాటి శివసత్యనారాయణ, తెనాలి

శ్రీ పి.సి. వెంకటరెడ్డి, రాజమండ్రి

శ్రీ పి. సుబ్బరాజు, షిర్డి

శ్రీ గుంటుపల్లి శివశంకరరావు, నల్లపాడు

శ్రీ వై. గురుస్వామి, దూబగుంట

యస్. ఇస్మాయిల్, తాడిపత్రి

శ్రీ ఆకుల సూర్యనారాయణ. బి ఎబి ఇడి, ఎస అన్నవరం

శ్రీ పి. పురందర్ రెడ్డి, మహబూబ్‌నగర్

శ్రీ వి. పేరయ్య శాస్త్రి, కావలి

శ్రీ ఎమ్.టి. మూర్తి, రాజుపాలెం

శ్రీ హరి పద్మనాభన్, చెన్నై

## సాధారణ పోషకులు

| | |
|---|---|
| శ్రీ మదమంచి రాఘవరావు, శ్రీమతి హేమలత దంపతులు, అబ్బినేని గుంటపాలెం | రు. 120/- |
| శ్రీ పతానేని రామచంద్రరావు, శ్రీమతి సుబ్బలక్ష్మి దంపతులు, హైదరాబాదు | రు. 116/- |
| శ్రీ జొన్నలగడ్డ కోటయ్య, చెరువు | రు. 100/- |
| శ్రీ యం. కృష్ణమూర్తి, నర్సిపట్నం | రు. 58/- |
| శ్రీ యం. కృష్ణానందం, గుండవోలు | రు. 50/- |



# విషయసూచిక

## మహారాజపోషకులు

చి.శ్రీ. మంచికంటి వెంకట శివరామయ్య, వీరి ధర్మపత్ని చి.సౌ వరలక్ష్మి



శ్రీ బరాటం కామరాజు, శ్రీమతి మహాలక్ష్మి దంపతులు - శ్రీకాకుళం



చి.శ్రీ. పూజారి రామకృష్ణారెడ్డి, శ్రీమతి వెంకటలక్ష్మమ్మ దంపతులు - అంబకపల్లె

కీ.శే. శ్రీ రావూరు నరసింహయ్య, కీ.శే. సరస్వతమ్మ దంపతులు





కీ.శే. బడేటి వెంకటరత్నం, కీ.శే. నాగభూషణమ్మ దంపతులు



కీ.శే. శ్రీ కుర్రా సుబ్బారావుగారు - జమ్ములపాలెం



స్వర్గీయ యిమ్మిడిశెట్టి వెంకట సూర్యప్రకాష్ (రాజా)



Dr. శ్రీ యర్రా విశ్వనాథం,
శ్రీమతి వెంకట సుబ్బమ్మ దంపతులు - హైదరాబాదు




చి.శ్రీ.P.హరినాథ్ - హైదరాబాదు



శ్రీ K.ఓబయ్య,I.A.S.(Retd) హైదరాబాదు



ఓమ్

నమః శ్రీ కృష్ణాయ భగవతే.

శ్రీ సాయీ సద్గురవేనమః

# ప్రేమామృతము

(నారద భక్తి సూత్రములు.)

## 1. ప్రేమ భక్తి స్వరూపము

సూత్ర : అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః 1

టీక : అథ = ఇపుడు ; అతః = కావున ; భక్తిం = భక్తినిఁగూర్చి వ్యాఖ్యాస్యామః = వివరించుదుము :

తెనుఁగు గీతము. శ్రీదమగుట భక్తినిఁ బ్రవచింతు మిపుడు !

వివరణ గీతమాలిక :-

పరమభక్త శిరోమణి, భక్తిమార్గ
దర్శకుఁడు, సర్వభూత హితంకరుం, డ
పారకరుణాబ్ధి, దేవర్షి నారదుండు
వివిధ సిద్ధాంతముల నెల్ల విశద పఱచి,
జ్ఞానకర్మంబులును స్వతంత్రముగ ముక్తి
దాయకంబులు గామి, నాదర్శఫణితిఁ
బ్రాణి హితబుద్ధిఁ బరమ కల్యాణమూల
మైన భక్తి స్వరూప, మద్దానిఁబడయ
గలుగు సాధనముల నిందుఁ బలుకఁ దొడఁగె.
జాతికుల విచక్షణ లేక సర్వ సులభ

మగుచుఁ బరమేశ్వరానుగ్రహంబుఁగూర్చి.
భవభయముఁ బాపఁ గలది యీ భక్తి యొకటె.
అంత్యజులు నేని, ఘోర పాపాత్ములేనిఁ
జదువరులు గాని వారేని, జడులు నేని,
వనిత లేని లేకెట్టి జీవంబు లేని
భక్తి నెఱప యోగ్యతలను బడయుచుంద్రు.

★ ★ ★

అమరమౌని యియ్యెడఁ దన స్వానుభవముఁ
గూర్చి వ్యాఖ్యాన మొనరింపఁ గోరె; నిదియు
నూహ కందని భావ సందోహములను
బ్రవచనము సేయు తత్త్వ శాస్త్రమును, హేతు
వాద రూపమౌ వేదాంత ఫణితి కాదు.
పండితుల వద్ద విని నట్టి పలుకుఁ గాదు.
నారదుఁడు స్వానుభవమున సారసాక్షు
భజనమునఁగన్న యానంద భాగ్యమునకు
నందఱధికారులని, జనులందరను ద
రింపఁజేయఁగ నిట్లు వచింపఁ దొడఁగె.

సూ :– **సా త్వస్మిన్ పరమ ప్రేమరూపా.** 2

టీక : సాతు:= ఆభక్తి యనిననో; అస్మిన్ = భగవంతునందు; పరమ ప్రేమరూపా = ఉత్తమ మగు ప్రేమరూపమైయున్నది.

తె.గీ. **అదియొ–హరియెడఁ బరమ ప్రేమాత్మకంబు.**

వివ : జంతు కోటికిఁ బ్రేమంబు సహజమగును
వాసుదేవుపైఁ బ్రేమనే భక్తి యంద్రు ;
భక్తి పలు విధంబుల మున్ను బలుకఁ బడియె.
దేవమౌని వచింపఁగాఁ బోవు నట్టి ,
భక్తిఁ బ్రేమ రూపంబని ప్రస్తుతించె.

★ ★ ★

వరదు నందనన్య ప్రేమ భక్తి యగును.
జ్ఞానకర్మాది సాధనాశ్రయము వదలి,
యఖిలవిషయ స్పృహాశూన్యుఁడై, యనన్య
భావమునఁ జిత్తవృత్తి కేవలము నీశు
నందు లగ్నము సేసి, సమస్తమైన
యైహిక పదార్థ సంగ్రహ మన్యలోక
సౌఖ్యసాధనల్ తుదకు మోక్షప్రసక్తి
యేని లేక, చిత్తమునడ్డి, యేక సరణిఁ
బఱపి, ప్రేమాస్పదుఁడగు దైవంబునందు
నునిచి, మమతను సంసక్తి నణఁచి, కల ప
దార్థములనుండి తొలఁగి, నిరంతరంబు
నేకగతిఁ బ్రియతముఁడౌ పరేశు నందు
నలరు స్థితిఁ ''బరమప్రేమ '' యనివచింత్రు.

**సూ :- అమృత స్వరూపాచ.** 3

టీక : (సా భక్తి = ఆ దైవభక్తి) అమృతస్వరూపాచ = అమృత స్వరూపమును. (భవతిః = అగుచున్నది.)

**తె.గీ. మఱియు నమృతస్వరూపయై పఱఁగుచుండు.**

వివ: అమృతమే యగు భగవంతు నందనన్య
మైనప్రేమ, మన్నిట నది యధిక మధుర,
మిట్టిప్రేమామృతం బుపార్జించు భాగ్య
తముఁడు దాని నాస్వాదించి యమృతుఁడగును.
అట్టి ప్రేమియౌ భక్తుని స్వాంతమున న
వీనమును శాశ్వతంబుఁ బవిత్రమైన
వాసుదేవ పదప్రేమ వాసనాతి
రేకమౌ లోకవాసన సోకఁబోదు.

పరమ దుర్లభమౌ నిట్టి వాసనకు ను
గారణము మౌనిజన మనోహారకమగు
నీశ్వ రైక విలాసంబు; యిట్టి సాధ
నంపుఁ గలిమినిఁ గర్మ బంధన సమేత
జనన మరణ చక్రము నుండి సర్వగతుల
జీవి విడివడి యీశ్వరుఁ జేరుచుండు;
వాఁడు భగవంతునకు సమీపముననుండు
వాసుదేవుఁడాతని సమీపంబు నొందు.
ప్రేమి యగు భక్తవరునకుఁ బ్రేమమూల
మైన భగవంతునకును నిత్యమును సుస్థి
రమగు సంయోగమే ''యమరత్వ'' మగును.
కాన భక్తజనుం డెప్పుడేనిఁ గాని
ముక్తిఁ గోరఁడై కాంతిక భక్తిఁ గోరు.

**సూ :** **యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవతి,**
**అమృతో భవతి, తృప్తో భవతి.** 4

**టీక :** యత్ = దేనిని; లబ్ధ్వా = పొంది; పుమాన్ = మనుష్యుడు; సిద్ధః = సంపూర్ణుఁడు; భవతి = అగుచున్నాడో; అమృతః భవతి = దివ్యుఁడగుచున్నాఁడో ; తృప్తః భవతి = తృప్తిగల వాఁడగుచున్నాఁడో.

**తె. గీ.** **దేనిఁబడసిన నరుఁడు సిద్ధిని గడించి**
**అమృతుఁడై సర్వ సంతృప్తి నందుచుండు.**

**వివ :** సుమతి యీశ్వర ప్రేమామృతమును గ్రోలి
సిద్ధుఁడగు ; నిట, నణిమాది సిద్ధులనుచుఁ
దలవఁగారాదు ; భక్తి తత్పరుఁడు మోక్ష
సిద్ధినేనియు లో నపేక్షింపఁడనిన
స్వల్ప సిద్ధుల మాటలు పలుక వలెనె ?

సిద్ధులన్నియు సద్భక్తు సేవఁగోరి
యదనునకు వేచియుండు ; నేకాంత భక్తుఁ
డిట్టి వానిఁ దుచ్ఛములంచు నెంచి, కొనఁడు ;
భాగవత మిట్లు వచియించు భగవదుక్తి :-
''నావయినిఁజిత్త మెపుడు లగ్నంబుసేసి
నన్నె ప్రేమించుభక్తుఁడు నన్ను వదలి
నలువ పదమేని నింద్రాస నంబునేని
నన్యలోకమేఁ విపుల రాజ్యముల నేని
యోగసిద్ధుల నేని సాయుజ్యమోక్ష
ములవియేని నపేక్షింపఁ బోఁడెందు''.

★ ★ ★

ప్రేమపాత్రుఁడౌ రాధికా కృష్ణ పూజ
సలుపు వేళలఁదను వెల్లఁబులకరింప
స్వాంతముప్పొంగ, విమల హర్షాశ్రుసహిత
నయనములు మోముదమ్మి కందంబుఁగూర్ప
గద్గదస్వరమున నిజ కంఠ మలర
నమిత శాశ్వతా నందా మృతమును గ్రోలి
మత్తుఁడగువాని కన్యంబు హత్తఁగలదె ?
వీనిఁజూచుటకును క్షణమేని విరతి
గలదె ? సాయుజ్యముఖ్య మోక్షములు నైదు
నిట్టివాని వాకిట నిరీక్షించుచుండు.
భుక్తిముక్తులందేదేని భక్తుఁడాద
రింప ''ధన్యోఽస్మి'' యనుచు హర్షించునవియు;
కాని, భక్తుఁడవ్వానిపైఁగాంక్ష గనఁడు.

★ ★ ★

''మోక్షముఖ్యసిద్ధులు సర్వభోగములును
ప్రణతలయి పరిచారికల్ బలె సతంబు
వెంటఁబఱ తెంచు బత్తి దేవేరిఁగొలువ ''
నంచు ''పాంచరాత్రంబు'' వచించుఁగాదె ?
''సిద్ధి'' – యనఁగృతకృత్యతా స్థితియు–యగును.

★ ★ ★

భక్తుఁడాసింపఁబోఁడన్య వస్తువులను
ప్రియత మంబైన యీశ్వర ప్రేమఁగ్రోలి
సర్వథా పూర్ణకాముఁడై సంతసించు ;
అట్టిపూర్ణ కామత్వమే ''యమర తాప్తి.''
మనుజుఁడీ కృతకృత్యతఁ గనక యున్నఁ
గామకామియై రాఁకపోఁకలనుగను ; న
వాప్త కాముండు సృష్టి సంహారములను
స్వానుభవమున రెంటి నీశ్వరునిలీల
లనుచుఁదలపోసి మృత్యుఖేలనము నెఱుఁగు.
ఇట్టివాఁడు మృత్యువునకు మృత్యువగును.

★ ★ ★

ప్రభువులీలయ కాకెట్టి పట్టునందు
మృత్యువను భయవస్తువ దెద్దియేని
నితని మతికిఁదోఁపదు; దానఁదృప్తినొందు.
అఖిలజగములఁగ ల్గు పదార్థ వితతి
నీశ్వరునిలీలగాకేదో యితర మొకటి
తనరు ననుబుద్ధి కలిగిన దనుక, జనుఁడు
'' ఇద్దిసౌఖ్యంబు–దుఃఖమౌనిద్ది'' యనుచు
నన్య నవసుఖ దుఃఖంబు లాసఁజేసి
యట్టివానినొందుచుఁదృప్తినందఁబోఁడు.
సకలమూలకారణు మఱి సకలవస్తు

పూర్ణ దివ్యస్వరూపునిఁబొందె నేని
పురుషుఁడిట్టి స్వల్పంబు నపూర్ణమగుచుఁ
దనరువస్తువులఁ బుద్ధిఁజొనుపఁబోక
పూర్ణతనుగాంచి ''సంతృప్తి''ఁ బొందుచుండు.

**సూ: యత్ప్రాప్య న కించిద్వాంఛతి, న శోచతి,**
**న ద్వేష్టి, న రమతే, నోత్సాహీ భవతి. 5**

టీక: యత్ప్రాప్య = దేనినిఁబొంది; (పుమాన్ = మనుష్యుఁడు); కించిత్ న వాంఛతి = దేనినేనియుఁగోరఁడో; నశోచతి = దుఃఖింపఁడో; నద్వేష్టి = ద్వేషింపఁడో; నరమతి = ఆనందింపఁడో; ఉత్సాహీ న భవతి (స్వలాభమపేక్షించి) ఉత్సహింపఁడో.

**తె.గీ. దేనిఁబొందెనే నితర మర్థింపఁబోఁడు**
**వనటఁగుందఁడు, ద్వేషభావంబుఁ గనఁడు**
**తా, రమింపఁ డెందేని నుత్సాహిగాఁడు.**

వివ:– ఇట్టి ప్రేమ భక్తిని సమార్జించు వాఁడు
పరమ శ్రేయమౌ వస్తువుఁ బడయు కతన
నితర విషయ మేదేని నాసింపఁబోఁడు
జగతిని వెలుంగు ప్రేమ మైశ్వర్యమర్థ
మందము బలంబు జ్ఞానంబు యశము విరతి
మొదలు గాఁగలవానిలో భోగ్యములుగ
త్యాజ్యములుగ నాయా రుచు లనుసరించి
వారి వారి నయ్యవి లోభ పఱచుచుండు.
ఈశ్వర ప్రేమ రూపమౌ నిట్టి దుర్ల
భైక వస్తువు కడ నివియెల్ల తుచ్ఛ
ములగు ; జగముల నన్నిటఁగల పదార్థ
ములను గొనివచ్చి యొకచోటఁ బ్రోవుసేయ

నీశ్వరప్రేమ జలధియందేక బిందు
వగునా ! – కాదా !; ఈశ్వరుఁడు స్వయంబ ప్రేమ
బలము కతన నాకర్షింపఁ బడుచు నుండ
నస్థిర పదార్థముల నెవ్వఁడాస సేయు ?
'' పరమ కల్యాణ గుణ గణా కరమునైన
హరి పదాంభోజ సేవామృతాబ్ధి యందు
నోలలాడు భక్తుండది మేల నాక
క్షుద్ర ఖాతకోదకములఁ గోరఁ'' డనుచు
భాగవతమున శుకయోగి పలుకకున్నె ?

★ ★ ★

అట్టి యీశ్వర ప్రేమామృతాబ్ధియందు
మునుఁగువాఁడు బాహ్యాంతర పూర్ణుఁడగుచు
నన్య తుచ్ఛ పదార్థంబు లాస గొనఁడు ;
భోగ భాగ్యాదులను గోరఁ బోవఁ, డవియు
నాశ మొందిన మది వ్యసనంబుఁ గనఁడు ;
భోగ నాశముల్ హరిలీలఁగా గణించు.
నటులన్నిట భక్తుండు హర్ష మొందు.
ఒక్కొకపుడు భక్తుండు సాయుజ్య మోక్ష
సాధనన్ న్యూనతను గన్న బాధఁ గనఁడు
కాని, యెన్ని జన్మంబుల కేని నతఁడ
నన్య మౌనీశ్వర ప్రేమ నాస సేయు.
ఇట్టి భక్త వరుండెప్పుడేని జీవ
దృష్టి నేనియు లౌకిక దృష్టినేనిఁ
బ్రాప్తమౌ ప్రతికూల పదార్థములను
గాని, యవ్వాని యునికినిఁగాని, ద్వేష
బుద్ధి నరయఁబో ఁడఖిల జీవుల నుపాస్య

దైవముంగాంచు ; సర్వ పదార్థములును
వాని స్థితియు నీశ్వరలీలఁగా నెఱింగి
క్షణము క్షణము హర్షాంబుధి మనుఁగు నతఁడు.

★ ★ ★

ఇట్లు భక్తిమైఁ జిత్తము నెల్ల కాల
మీశ్వరప్రేమ తత్త్వ మందేలయించు
నాతఁడర్ధ క్షణంబేని నన్యవస్తు
వెట్టిదైనను దాన రమింపఁబోఁడు.
వ్రజసుదతు లుద్ధవునితోడఁబలికినటుల
వారిమతులు వారలకెప్డు వశము కావ;
ఇంక నన్య మెవ్విధిని రమింపఁగలరు ?
కాన, వాసుదేవుండు జగాన భక్త
చిత్త చోరుండటంచుఁ బ్రసిద్ధి కెక్కె.
ప్రేమియగు నిజభక్తుని హృదయ మిట్లు
నేర్పుమీఱ హరించుచు నిజవిభూతి
నాతనికి హత్తఁజేసి, యన్యంబు లోన
నెప్పుడేనియుఁ జేరఁగ నీక మనుచు.

★ ★ ★

హృదిని సంకల్పమున కేని నెడము లేద!
యింక నాసక్తి వహియించు టేటి మాట ?
ప్రేమమయు గోపికాంగనా విధముఁగనుఁడి;
ప్రియతముండు కృష్ణుఁడు గాక వేఱయొకటి
స్వాంత మందుఁ బ్రవేశింపఁజాల కున్న
నన్యవిషయాప్తి కుత్సాహ మందఁగలరె ?

★ ★ ★

ఎవ్వఁడెద్దానినేని వీక్షించు చున్న
నాలకించిన నద్దాని కై మనంబు
నందుఁ గోర్కెఁ జనించు; దత్ప్రాప్తి కొఱకు
యత్నము లొనర్పకుండునే ? – స్వాంతమందె
దోరమించు చుండిన దీని నొందనుత్స
హింపఁగాఁబోఁడు చిత్తంబదెందొమున్నె
యైక్యమును బొంది తదధీన మైనకతన ;
మనసుపై నధికారంబుఁ జొనుపు నదియ;
యెల్ల వేళల నదియ వసింపఁగోరు.
నన్యమునుడాయ నీయక యడ్డుచుండు ;
అట్లుగాక – యన్యంబదే దైనఁగాని
లోనఁజొచ్చిన నిల నీడ యైన లేక
యరుగుదెంచిన దారినే వరుగువాఱు

★ ★ ★

మనసు ననుమతిలేక యాకనులు వేఱ
విషయమును గాంచఁగలుగునే ? వీక్షణంబు
పొసఁగ దేని నవ్వానినిఁబొంద నుత్స
హించునని చెప్పఁదొడఁగుట యేటిమాట ?
సౌఖ్యమందిచ్చఁజేసి యుత్సాహమొకటి
యెట్టిమనుజాన కేని జనింపవచ్చు ;
అఖిల సౌఖ్యాకరము తనయంద యున్న
క్షుద్ర సుఖముల నొంద నుత్సుకతఁగనునె ?
కాన, మిగులప్రేమోత్సాహ కలితుఁడైన.
యీశ్వర ప్రేమియగు నరుండెట్టి లౌకి
కమగు కార్యంబులను విషయములయందు
నించు కేని నుత్సుకత వహింపఁబోఁడు.

★ ★ ★

ఎవఁడుమోదింపఁడెవఁడు ద్వేషింపఁబోఁడొ
యెవఁడు దుఃఖవశుండు గాఁడెవఁడు గోరఁ
డనఘ! యెవఁడు శుభాశుభత్యాగి యగునొ
యట్టి భక్తుఁడే ప్రియతముఁడగును నాక
టంచు గీతల శ్రీకృష్ణుఁ డనఁగలేదె ?

సూ : **యత్ జ్ఞాత్వా మత్తో భవతి, స్తబ్ధో భవతి,**
**ఆత్మారామో భవతి.** 6

టీక : యత్ = దేనిని; జ్ఞాత్వా = తెలిసికొని; (పుమాన్ = మనుష్యుఁడు); మత్తః (ఇవ) భవతి = పిచ్చివానివలె నగుచున్నాఁ డో; స్తబ్ధః (ఇవ) భవతి= చలింపని వాఁడగుచున్నాఁడో; (యతః= ఏలయన); ఆత్మారామః- భవతి =-ఎల్లప్పు డాత్మ యందు రమించు వాఁడగుచున్నాఁడో.

తె. గీ. **మఱియు దేని నెఱింగిన మత్తుఁడగుచు**
**నమిత శాంతుఁడాత్మారాముఁడై తనర్చు.**

వివ : ఈశ్వరప్రేమ సతతాభివృద్ధి నొంది
పైకి వెడలి యున్మత్తతావస్థఁగూర్చు.
భక్తునకు భక్తి మాత్రమే ఫలముగాని
యట్టి యున్మత్తతాస్థితి యనఁగ రాదు.
కాని, యీస్థితి తనయంతఁ గలుగుచుండు ;
అంతమాత్ర కొక్కటి హేతువనుచు మఱియు
నొకటి పర్యవసాన మంచూహసేయఁ
దగదు ; పుష్పము వికసింప దాని పరిమ
ళంబుకతన నరులకు మోదంబెసంగు ;
ముదము జనులకొసంగెడి బుద్ధిమై సు
మంబు విరియ దయ్యది సహజంబు సుమ్మి.
భక్తుఁడెల్లపు డీశ్వర పాదసేవ
నామృతంబును గ్రోలి యున్మత్తుఁడగును.

ప్రభుగుణములు రేయింబవల్ పాడుచుండుఁ
బ్రీతి వినుచుండు, మఱియు స్మరించుచుండు.
బాహ్యమౌ నన్య విషయిక వార్త లతని
స్మృతికిఁ దోఁపవు ; పిచ్చి వాఁడేమియేమొ
పలికి, యేమేమొ చేసెడి పగిది—నతఁడు
సంతతంబీశ్వర ప్రేమ చర్చయందు
మునుఁగ నద్దానికై వాని మనసు పఱచు
భాగవత మిట్టు లీ స్థితిఁ బలుకఁగాదె !
"అఖిలలోక ప్రసిద్ధ కళ్యాణ కరము
లైన శ్రీకృష్ణ జన్మ కర్మాదులెల్ల
వినుచు భక్తుఁడు సంసక్తి విడిచి, పరవ
శాత్ముఁడై లజ్జవిడి, పరమాత్మ దివ్య
నామ గీతార్థములను గానంబు సేయు ;
ప్రాణవిభు నామకీర్తన వ్రతపరుండు
నై, చిరాసక్తి ద్రుతచిత్తుఁడగుచునాతఁ
డిట్టు లొక్కట నవ్వు, దుఃఖించు నొకట,
నొకట రోదించుఁ గీర్తించు నొకట వేఁదు
అటుల లోక బాహ్యుండయి యాడు " — ననుచు
మఱియు – ప్రేమ భరంబున మౌనమూను
శాంతుఁడగుచుఁ గూర్చుండి విశ్రాంతినొందు.
సతము స్తబ్ధతఁ బూర్ణ కామత నొసంగు
ప్రభుని రూపము మనమునఁ బ్రకట మగుడు
దివ్యరూప మాధురిలోనఁ దేలియాడి
మత్తుఁడై మోదమున ధ్యాన మగ్నుఁడగును.
మహిత యోగ నిష్ఠను ప్రభు మయమునొంది;
భక్తుఁడున్మత్తతావస్థఁ బడయుచుండు.
స్వాంతము శరీరమును స్తబ్ధ శాంతి నొంది,

యనవరతము నాత్మానందమొందు, నట్టి
యమల భక్తుఁ డాత్మారాముఁడనఁగ ఁబఱఁగు
ప్రముద రసపాన మత్తుఁడౌ భక్తుఁ డెపుడు
శాంత చిత్తుఁడై యానంద జలధి మునుఁగు ;
ఏమి యొనరించినను భక్తుఁ డెఱుఁగ బోఁడు ;
ఈశ్వరుఁడె వానిచేతఁ జేయించునెల్ల
ప్రేమ కరుణలు జగమున వెలికిఁ బఱపి
లోక వర్తనలందుఁ బాల్గొనుచు నున్నఁ
జలన మొందఁడు లోనెప్డు శాంతుఁడగును.
పఱఁగనిట్టి యాత్మారామ పదమునొందు
వాని విషయ తృష్ణలు లోభ పఱుపలేవు ;
అన్య విషయిక జ్ఞానంబు హత్త దతని,
నరయనిడె 'రసాద్వయము' – 'ప్రేమాద్వయంబు',



# 2. ప్రేమ భక్తి - అనన్యత

సూ : సా న కామయ మానా నిరోధ రూపత్వాత్. 7

టీక : సా = ఆ పరమ ప్రేమరూప భక్తి; కామయమానా = కోరికల గోరునది; నభవతి = కాదు ; నిరోధరూపత్వాత్ = (ఇతరమును సమస్తము) నిరోధించునదియగుటచే.

తె. గీ. కామ సంకల్పకాఁబోదు ప్రేమ భక్తి
ఎల్లకామితముల నిరోధించుకతన.

వివ :- అఖిలవిధముల నీభక్తి త్యాగరూప
మగును ; ధనసుతకీర్తి నాకాదులేమి
లెక్క ? - మోక్షసక్తియె తలఁపెక్కదనిన ;
ఎట్టిభక్తి బలమున నొక్కింతయేని
నన్యసంకల్ప మొదవిన, నన్యములను
బడయఁగోరి నది కామ భక్తి యగును.
స్వార్థవిషయిక వ్యాపార మనఁగఁదగును.

★ ★ ★

ప్రేమభక్తి సేయునతండు ప్రియతముఁడగు
శ్రీనివాసునికంటెఁ-దత్సేవకంటె-
నన్యమేమియు గోరఁడు స్వార్థపరత.

★ ★ ★

భాగవతమునఁ గపిలుఁడు వలుకలేదె !
''నన్ను సేవించు భక్తుఁడు నాదుసేవ
మిగిలి, సాలోక్యసార్ష్టి సామీప్యములను
బొసఁగ సారూప్య సాయుజ్య మోక్షముల నొ
సంగినను గైకొనండు లేశంబు'' ననుచు.

★ ★ ★

సత్యమగు ప్రేమభక్తి పొసంగెనేని
నెల్ల కామితములును నశించి పోవు.
తలఁప 'సద్భక్తి' యన నిరోధస్వరూప
మగుచుఁ ద్యాగమయంబయి యలరుఁగాన
దీని నేవస్తువేఁ నిరోధింపలేదు.

**సూ :– నిరోధస్తు లోకవేద వ్యాపార (స్య) న్యాసః 8**

టీక : నిరోధః–తు= నిరోధమనునది; లోక–వేద – వ్యాపార న్యాసః = లౌకికవైదిక కర్మఫలత్యాగము; (భవతి=అగుచున్నది.)

**తె. గీ. కలుగు లౌకిక వైదిక కర్మఫల స**
**మర్పణంబె నిరోధ మంచనఁగఁబడును.**

వివ : ఇట్టి కర్మఫలత్యాగ మెలమి, ఁఓ ప్రేమ
భక్తునందుఁ తనంతన ప్రభవ మొందు.
ప్రేమియగు భక్తవర్యుండు ప్రియతముఁడగు
నీశ్వరు నిరాకరించి మఱెట్టి వార్త
నేనిఁ దలపెట్టఁ డవ్వాని మానసంబు
నెపుడు శ్రీ కృష్ణరూపుఁ జింతించుచుండు.
ఇతని కన్నుల ముంగల నెల్లవేళ
లందు నెల్లెడ హరియ వెల్గొందు చుండు;
అన్యముల యందు మనము లయంబుఁ గనదు,

★ ★ ★

కృష్ణతో గోపికాంగన లిట్టులనరె!
"ప్రాణవల్లభ! గేహకార్యముల మునుఁగు
చిత్తమును దొంగిలించితి; చేతు లింటఁ
బనులుసేయ వివశములై వణఁకు,– నీదు
పాదమూలము విడి యొక్క వదమునేనిఁ

గదల నోవవుగద మాదు పదము లింక
నింటి కెటులేగు వారల, మేగి యేమి
సేయువారము ? – నాథ ! వచింపు'' మనుచు.
జగతి హరిలీల వీక్షించు సాధు భక్తుఁ
డెట్టి లౌకిక వైదిక కృత్యములను
సలిపిన నిమిత్త మాత్రుఁడై సలుపు నతఁడు
కర్మఫలమును సంసక్తిఁ గడఁకఁద్రోఁచి.

★ ★ ★

అమల సచ్చిదానందామృతాబ్ధి మునిఁగి
నిర్వికల్ప సమాధిని నెగడుబాఁడొ
నర్పుఁదగిన కర్మంబు నుంతయును లేదు.

★ ★ ★

భక్తుఁడేమేమి యొనరించు వాని నెల్ల
నీశ్వరాధనముగఁ గావించుచుండు
కర్మ ఫలసక్తి, స్వార్థతఁ గాంచఁబోఁడు.
భక్తుఁడు త్యజించునది కర్మఫలము, మఱి, య
హంకృతినిఁగాని, కర్మములతఁడు విడఁడు.
కర్మ ఫలసక్తి మఱి, యహంకార ముండు
దనుక సత్కృతులేఁ బవిత్రములు కావు.

★ ★ ★

కృష్ణసూక్తుల నరయుఁడి గీతలందు.
''సలుపుమీవు నియత కర్మములను విజయ !
కర్మములఁ జేయకుండుట కంటెఁ గర్మ
మాచరించుట మేల్, దేహ యాత్ర నీకు
సిద్ధి పొందదు కర్మముల్ చేయకున్న.

★ ★ ★

యజ్ఞ హేతువునకుఁగాని యన్యకృతులు
కర్మ బంధ మీజగమునఁ గలుగఁ జేయుఁ
గాన, కౌంతేయ! యజ్ఞార్థమైన కృతులఁ
గడఁగి చేయుము తత్ఫలా కాంక్ష వదలి.
అఖిల కర్మముల్ భక్తినా యందు నిలిపి
జ్ఞాన చిత్తంబునను ఫలాసక్తి వదలి
మమతఁ బోనాడి, హృదయ తాపమును విడిచి,
శ్వేతవాహన! యుద్ధంబుఁ జేయుమిపుడు.
దేనిఁ జేసెదవో నీవు దేనిఁడినెదొ
దేని వేల్తువో, దానంబు దేని నిడెదొ,
యెట్టి దానినిఁ దపమొనరింతొ, వాని
నంతయుఁ గిరీటి ! యిడుమి మదర్పణముగ.
యజ్ఞదాన తపో రూపమైన కర్మ
ముడుగఁగారాదు; చేయుచు నుండవలయు;
యజ్ఞదాన తపఃకృతు లనఘ చరిత!
పావనులఁ జేయుచుండును పండితులను.
ఇట్టి నియమిత కర్మంబు లేని నీవు
కర్మ ఫలములయందునఁ గాంక్ష వదలి
నెఱీ, నొనర్పఁగా నగునిది నిశ్చితంబు
నుత్తమంబైన నా తలంపౌ కిరీటి!
వివిధ నియత కర్మంబుల విడఁగ నాడ
నవని నెవ్వానికేని సాధ్యంబుగాదు
మోహకలిత బుద్ధినిఁ గర్మములను విడుట
తామసప్ర చోదిత మైన త్యాగమగును.
కవ్వడీ ! యెవ్వఁడు శరీర కష్ట భీతిఁ

గర్మ మెద్ది విడుచు దుఃఖ కరమటంచు
నతఁడు రాజస త్యాగము నాచరించుఁ
దానఁద్యాగ ఫలంబును గానలేఁడు.
సకల నియత కర్మముల నంసక్తి, మఱియు
ఫలము నందునఁ గాంక్షను వదలి, '' యిద్ది
చేయఁదగినది'' – యనుబుద్ధిఁ జేయఁబడిన
నదియె సాత్విక రూపమౌ త్యాగమగును.
త్యాగియును సాత్విక గుణ సమావృతుండు
నైన మేధావి గత సంశయాత్ముఁడగుట
నశుభమిడు కర్మముల ద్వేష మందఁబోఁడు;
కాంచఁడాసక్తి శుభమిడు కర్మములను
దేహధారులౌ మనుజ సందోహమునకుఁ
గర్మముల నెందు విడువ దుర్ఘటము; కానఁ
గర్మ ఫలములయందునఁ గాంక్ష విడెడు
వాఁడెపో ''త్యాగి'' యను పేరఁ బలుకఁబడును.
సర్వ కర్మముల్ నాయందు సన్న్యసింపు,
పొసఁగ మత్పరతను గని బుద్ధి యోగ
మాశ్రయింపుమి, యర్జున ! యనవరతము
మనసు స్థిరముగ నాయందు నునుపుమీవు''.

సూ : తస్మిన్ననన్యతా తద్విరోధిషూదాసీనతా చ. 9

టీక : తస్మిన్ = ఆ భగవంతునందు (సకల కర్మ ఫల సమర్పణ రూపమైన వ్యాన మందు); అనన్యతా = సంపూర్ణమగు ఐక్యము; తత్- విరోధిషు = ఈశ్వరునకు (దానికి) విరుద్ధములైన వానియందు; ఉదాసీనతా–చ= ఔదాసీన్యమును; (జాయతే= కలుగుచున్నది లేకఁ ఏర్పడుచున్నది).

తె. గీ దైవమందనన్యత్వంబుఁ దద్విరోధు

లందుదాసీనతయు నిరోధాఖ్యఁబొలుచు.

వివ: ప్రేమి యగు భక్తవర్యుఁడు ప్రియతముఁడగు
దైవమందనన్యతయును దదితరమున
నెపు డుదాసీనతయును వహించుచుండు ;
ఇట్టి సావధానస్థితి నెసఁగు చిత్త
గతి యది ''నిరోధ'' మనుచుఁ బల్కంగఁబడును.

★ ★ ★

ప్రేమ భరిత భక్తుండు గావించు సకల
కృతులుఁ దదనుకూలములగు ; నీ శునంద
నన్యబుద్ధి నొనర్చుట నవ్వియెల్ల
కృష్ణ విషయిక సేవలై యెసఁగుచుండు.

★ ★ ★

భక్తుఁడేమి గావించిన వానియంద
హంకృతినిఁబాసి దైవమే యట్లు పనిచె
నని, నిమిత్త మాత్రుండయి యాచరించు.
ఈశ్వర ప్రీతికొఱకె కావించు నతఁడు ;
కాని, స్వార్థ లాభం బెందుఁ గానఁబోఁడు
భగవ దర్థంబునకుఁగాని పనుల యెడల
నతనిమతి ప్రవర్తింపఁబో దట్టి స్థితిని
నరయఁదగు 'నుదాసీనత' యనెడిపేర.

★ ★ ★

భానుకతనఁ జీఁకటులు చొప్పడని రీతి,
అమృతమున మృతి కలుగని యట్టి భాతి
భక్తుచేఁదదన్యములు సల్పంగఁ బడవు.

సూ : అన్యాశ్రయాణాం త్యాగో ఽ నన్యతా. 10

టీక : అన్య- ఆశ్రయాణాం = ఇతరములగు ఆశ్రయముల యొక్క; త్యాగః = త్యాగము (విడుచుట); అనన్యతా = ఐక్యము; (భవతి = అగుచున్నది).

**తె. గీ. ఆశ్రయాంతర త్యాగం బనన్యత యగు.**

వివ : పరమ భక్తుఁడౌ వానికి స్వాంతమందు
నీశ్వరుఁడు దక్క నన్యమౌ నేవికల్ప
నము జనింపద; ఇంక నన్యంబు నెట్లు
సలుపు?– ఈ చరాచర మగు జగము నిష్ట
దైవ పరశరీరంబుగఁ దలఁచి యాతఁ
డన్యమగువస్తు వెందునే నరయఁబోఁడు.
కనులు దెఱచిన మూసినఁగాని రాధి
కామనోహరుఁడొక్కఁడే క్రాలుచుండు.
కృష్ణదివ్యతేజంబె నేత్రేంద్రియాధ్వ
మునను వెలుఁగొంది యీ సర్వమును దదీయ
తేజముగఁబొల్చు, సత్ప్రేమ భాజనలగు
గోపికల యెడఁగానమే? యీ పథంబు !

★ ★ ★

''తరువులను జంతువులను వత్సంబులందు
నాత్మసుతులఁబతుల, నన్యమౌ పదార్థ
ములను, యామునీయ తరంగములను, వనినిఁ
బఱఁగ నెల్లెడ శ్యామ సుందరునిఁదక్క
నన్యమును గాంచనోవరం'' చనదె భాగ
వతము ; – ఎవ్వరేదైనను బలుకుచున్న
వినఁగ నోపఁ–డన్యంబులు వినఁగఁబడవు.
చేరి, దేనికేనియు బలాత్కార గతిని
నతని మతి సమాకర్షింప నలవికాదు.

★ ★ ★

కనుఁడి– శివునిఁ బ్రాణేశ్వరుఁగా వరించి
పరమభక్తిఁ దపశ్చర్యఁ బఱపు హైమ
వతినిఁజేరి సప్తర్షులు మతినిఁ గలఁచ
భవుని యెడ దోషముల పెక్కువలికి, యతని
విడిచి కల్యాణ నిలయుఁడౌ విష్ణునందు
మనసు వర్తింపగాఁ జేయు మనిన – యపుడు.

★ ★ ★

''అవగుణ భవనుఁడు మహేశుఁడవును గాక,
అఖిల సుగుణాకరుఁడు విష్ణు వగును పొమ్మ –
ఎవరి హృదయంబు లెందెందుఁ దవులఁగలవొ
అదియ వలయును వారి, కన్యంబు లేల ?
ఈ భవంబు శంకరున కర్పించి యుంటి
భవుని గుణదోషచర్చల వని య దేమి?
కోటి జన్మల కేని నేఁ గోరినటుల
హరునిఁ జేపట్టుటొండె– కన్యకగ నుంట
యొండె– నిశ్చయించితి; నారదోక్తి నేను
దిగవిడువ; హరు వేమాఱు దెగడి కొనుఁడు
హితమతి క్షమింపుఁ డివియ వే నతులు! మీకు''
అనుచుఁ బ్రత్యుత్తరంబిడె నచల తనయ.

★ ★ ★

అంబువులు మాత్రమే యాశ్రయంబుఁ గాగఁ
దా యథేచ్ఛను మెలఁగు మత్స్యముల కరణి
సర్వ మీశ్వరుఁ గా నెంచి సాధువర్యుఁ
డెల్లఁ దత్ప్రీతికై పనులెలమిఁజేయు.
అంబుదము గోరకున్నఁ దనంతఁ గురియు
ననెడి సుదృఢ విశ్వాసంబు నాసఁబూని
యెదురుఁజూచు చాతకమట్టు లీశ్వరుండు

తన్ను రక్షించు నని నమ్మి, తనువుఁదాల్చి
వెలయు భక్తవర్యుండెల్ల వేళలందు,
తినుచునుండిన, జలములఁ గొనుచునున్నఁ
బండి యుండినఁ గూర్చున్నఁ బరుగువాఱు
చున్న, దానధర్మము లిచ్చు చున్న, సర్వ
మీశ్వరప్రీతి కొఱకె కావించు, దానఁ
బరమ భక్తుఁడై కల్యాణ భాజనుఁడగు.

**సూ: లోకే వేదేషు త దనుకూలా చరణం**
**తద్విరోధిషూదాసీనతా. 11**

టీక : లో(క) కేవేదేషు = లౌకిక వైదిక కర్మములందు ; తత్ అనుకూల-ఆచరణం=దైవమున కనుకూలమైన వానిని ఆచరించుట; తత్–విరోధిషు = దైవమునకు – విరుద్ధములైన వానియందు; ఉదాసీనతా = ఔదాసీన్యము ; (ఏవ = వహించుటయే అగుచున్నది).

**తె.గీ. కలుగు లౌకిక వైదిక కర్మసమితి**
**నీశ్వ రాను కూలా చారనే తదన్య**
**కర్మముల ను దాసీనతగాఁబొసంగు.**

వివ : భగవదర్థ కర్మ మనన్య భావమునను
సలుపు నెడలఁ దత్ప్రతి కూలములు తమంత
విలయమొందు; సద్భక్తి వివృద్ధికరము
గాని యీశ్వర ప్రతికూల కర్మచయము
లౌకికములు వైదికములెల్లను వివర్జ
నీయములు ప్రేమభక్తి సన్నిష్ఠునకును.

★ ★ ★

తల్లిదండ్రుల యానతిఁ దనయుఁ డాత్మ
వరుని వచనంబు సుదతియు, గురువునాజ్ఞ
శిష్యుఁడాదరించుట శ్రుతిస్మృతి విహితము

లగుటఁ గర్తవ్యమగు; ఁగాని, యట్టి యాజ్ఞ
లైన నీశ్వరభక్తికి నంతరాయ
మేని, భక్తుఁడిడుమల సహించి, యట్టి
కర్మముల ధిక్కరించును గాని, తనకుఁ
ప్రేమ భాజనమౌ భక్తి విడఁగ బోఁడు.

★ ★ ★

జనకు నీశ్వర ప్రతికూలుఁ డనుచు విడిచె
భక్తవరుఁడు ప్రహ్లాదుఁడు ; బంధువులఁ ద్య
జించెను విభీషణుండు ; వర్జించెఁగన్న
తల్లినేన్ మున్ను భరతుండు; దాన వేశ్వ
రుండు బలి – గురుఁడైన శుక్రుని నిరాక
రించెఁ, బతుల వాక్యంబు లాలించరైరి
వ్రజకులాంగనలెల్ల ; వీరలు ధరిత్రి
సకల కల్యాణ కరులై ప్రశస్తిఁ గనిరి.

★ ★ ★

తలఁపఁగర్మముల్ నాల్గు విధములు – నిత్య
మనియు, నైమిత్తికము, లౌక్యమనియు, మఱి, ని
షిద్ధమని ; – మధుమాంస నిషేవణంబు,
జార చోరాది కర్మముల్ సర్వదా ని
షిద్ధములు; కామ్మములగు శాస్త్రీయ కర్మ
చయము బంధకారకమును, జనన మరణ
హేతుకంబును గానఁ ద్యజింప నగును–
భగవదాజ్ఞ యే యగుట ; నావయిని మిగులు
నిత్యనైమిత్తికంబు లన్నిటను లౌకి
కంబులేనియు మఱి, వైదికంబులేని
ప్రతిఫలాపేక్ష వదలి, యీశ్వర సమర్ప
ణైక బుద్ధిని భక్తుఁడొనర్ప నగును.

సూ : **భవతు నిశ్చయ దార్ఢ్యా దూర్ధ్వం శాస్త్ర రక్షణమ్.** 12

టీక : నిశ్చయ దార్ఢ్యాత్- ఊర్ధ్వం- (అపి) = ఆ అనన్య భక్తిస్థిరీ భూతమైన పిదపఁగూడ; శాస్త్ర రక్షణం = శాస్త్ర ధర్మపాలనము; భవతు = తగును.

**తె. గీ.** **నిశ్చయాత్మక ప్రేమ పొందిన యనంత**
**రమును గర్తవ్యమగు శాస్త్రరక్షణంబు.**

వివ : విధినిషేధముల్- బాహ్యావివేకముడుగు
భక్తవరునకు లౌకిక వైదికంబు
లైన కర్మముల్ తమయంత నడఁగి పోవుఁ ;
గాని, యాతఁడు విడువగఁ గాంక్షఁగనఁడు.
కాన నున్మత్తతాస్థితి కలుగు దనుక
ప్రేమియౌ భక్తుఁడును శాస్త్ర విహితకృతులు
వదలఁగా రాదు ; సలువనౌ, భగవదర్ప
ణైక బుద్ధిని సర్వేశ్వరానుకూల
నిత్యనైమిత్తి కంబులౌ నిఖిల కర్మ
ములును, శ్రవణకీర్తన నుతిపూజనములు
చేయు కొలఁది పరాప్రేమ శ్రీనివాసు
నందుఁజెలువొందు; సంసిద్ధి నొందు దాన.

★ ★ ★

పరమ భక్తులు జ్ఞానులౌ వారె జనుల
కందఱకు మార్గ దర్శకు లగుచు శాస్త్ర
విహిత మార్గంబు నందు జీవితము నెఱపి,
ప్రజలనెల్లర నుద్ధరింపంగ వలయు,
కృష్ణ సూక్తుల నరయుడి గీతలందు –
''శ్రేష్ఠుఁడౌ వాఁడు దేనినిఁజేయు దాని
నితర జనములు చేయుదు రింద్ర తనయ!
జ్ఞాని యెట్టిదానినిఁ బ్రమాణముగఁ గొనునో
యట్టి దానినే లోకము ననుసరించు.

★ ★ ★

కర్మ మజ్ఞాను లెటు ఫలకాంక్ష తోడ
సలుపుచుందురో యటు లోకసంగ్రహంబు
సలుపఁ గోరియుఁ దత్ఫలాసక్తి వదలి
ప్రాజ్ఞుఁడు స్వకర్మముల సలు పంగ వలయు,
అట్టులగుటఁ గార్యము న కార్యఁబు ఁదెలియ
శాస్త్రమె ప్రమాణమగుసుమ్మి ; శాస్త్రవిధినిఁ
బలుకఁ బడినట్టి కర్మముల్ దెలిసి వాని
సలువ నెంతయుఁ దగు నీకు శక్రతనయ!''

★ ★ ★

కానఁ బరమ భక్తులును విజ్ఞానులైన
వారు విధిహితాచరణకు దూఱులైన,
శాస్త్రము లనాథములయి నాశనము పొందు.
తత్త్వ విదులు శాస్త్రోక్త పద్ధతుల నాద
రింపరేని నితరు లాదరింపఁబోక
వీనియం దపార్థములఁ గల్పించు చుంద్రు.
కలపురాతన గ్రంథని కాయమెల్ల
శాస్త్రములుగ నెల్లెడల నెంచఁగరాదు.
కాలభేదముల్ నాగరకతల నెఱిఁగి
సాధు పుంగవు లౌవారు స్వానుభవము
కలిమి యుక్తము ధర్మముగాఁ దలంచు
వాని సలుపుచు నాచరింపంగ ఁజేయ
వలయు; సుస్థిర ప్రజ్ఞులౌ వారె నిర్ణ
యింపఁగలరు ధర్మాఽధర్మ కృతుల నెల్ల.
సాధు వర్యులె శాస్త్ర రక్షణము నెఱపి
వారి దైనిక జీవన పద్ధతులను
వారి యనుభవోపేత సుభాషితములఁ

ప్రజలకును వానిని సుబోధ పఱుపనగును.

**సూ : అన్యథా పాతిత్యా శంకయా. 13**

టీక : అన్యథా= (అట్లుగానియెడల) మఱియొక విధమైన; పాతిత్యా–అశంకయా =పతన భయము (చే); (భవితవ్యం = కలుగఁగలదు.).

**తె.గీ. అటులఁ గానిచోఁ బతన భయంబు గలుగు.**

వివ: నిశ్చయంబైన ప్రేమను నెగడు సుప్ర
తిష్ఠి తాత్మని స్థితియందుఁ దెలుపఁబడియె
అతని కెపుడెందుఁ బతన భయంబు లేదు.
ఆ స్థిత ప్రజ్ఞుఁడౌ వాని స్వానుభూతి
యెట్టి తరుణంబునందు నశింపఁ బోదు.
భక్తున కహంత మమతలుఁ బాయునపుడ
నైతిక విరుద్ధమౌ నర్తనంబు సమయు,
సాధుశీలుఁడౌ వాని యాచరణ మొకటె
ధర్మ సిద్ధాంత రక్షణా ధారమగును.
అతని నెల్లవేళల యందు ననుసరించు
వార లెయ్యెడ నెద్దానఁ బతన మొందు
వారలో యని యాతఁడు భయమునొందు,
దాన, జాగరూకుఁడయి తత్తత్క్రియాక
లాపములను వర్తించుఁ బూర్వాపరముల
నరయుచును; వాని దృష్టి యెల్లప్పుడితర
జీవ సంచయ క్షేమ మాసించుచుండు.

★ ★ ★

ఎట్టి మనుజుఁడు లెస్సఁగ నెఱిఁగి యుండి
శాస్త్ర నియమాను కూలుఁడై సంచరింప
కే, యశాస్త్రీయ విపరీత కృతుల నాచ

రించి ప్రేమ నెపంబున స్వీయ దోష
వితతిఁ బాపఁ జూచెడి వాఁడు పతితుఁడగుట
నిశ్చయంబగు; గీతల నృహరి యనఁడె ?
'' శక్రనందన! యెవ్వండు శాస్త్రవిధుల
విడఁగనాడి, యథేచ్ఛగా నడుచుచుండు –
నానరుఁడు సిద్ధిఁగనజాలఁ డమలసుఖముఁ
బొంద నేరఁడవ్యయ పదమొందఁ '' డనుచు,
ఎఱిఁగి యుండియు శాస్త్రీయ కృతుల నెల్ల
వదలివేయుట ప్రేమ తత్త్వంబుగాదు.
జ్ఞానశూన్యత – స్వైర సంచార మగును
కాన, నటు సల్పుచోఁ గ్రమక్రమత మనుజుఁ
డసుర యోనులఁబుట్టువులంది మిగుల
వ్యసనరూపక నరకంబుఁ బడయుచుండు.

**సూ : లోకోఽపి తావదేవ; కింతు భోజనాది**
**వ్యాపారస్త్వా శరీర ధారణావధి. 14**

టీక : లోకః – అపి = లౌకిక కర్మములును; తావత్– ఏవ = ( ఎంత వరకో) అంత వరకు మాత్రమే; కింతు = కాని; భోజన – ఆది – వ్యాపారః‌తు= భోజనాదిక కార్యము ( లనినవో) లు; అశరీరధారణ–అవధి = దేహపతనంబు వరకు – దేహ పోషణ కొఱకు. ( భవతు=తగును).

**తె. గీ. లౌకిక ప్రవృత్తి బాహ్య వివేక మెనఁగు**
**దనుకె, కాని, యీ దేహ ధారణము వరకు**
**భోజనాదికార్యంబుల పొసఁగుచుండు.**

వివ : వైదికక్రియల్ లౌకిక వర్తనములు
సకల గార్హస్థ్య ధర్మముల్ సలుపవలయు
భగవదర్పణ బుద్ధి తత్పరత నరుఁడు.

ఇవ్విధమునఁగర్మము లాచరించువాని
కెపుడొ వైదిక లౌకిక కృతులు తామె
యప్రయత్నంబుగా సర్వ మడఁగి పోవు
గతియొకండు ప్రాప్తించును; కాని, యంత
దనుక ద్వివిధ కృతుల వీడఁదగదు; చేయ
వలయుఁ దమయంత నవి పాయువఱకు; భోజ
నాది కర్మంబు లీస్థితి యందునేనిఁ
బొసఁగు – దేహ ధారణ కవిముఖ్యమగుట.
తనువు మనమును ప్రభు సమర్పణము సేయు
పరమభక్తుఁడు వానిపై వాంఛఁగనఁడు
దైవధనముగ వాని భద్రముగఁ గనుచు
ప్రభువు సేవకై తద్రూప ప్రాణిసేవ
కొఱకు వానిని నుపయోగ పఱచుచుండు

★ ★ ★

పరమమౌ ప్రేమమత్తతఁ బరవశుఁడగు
భక్తుఁడాహార మునకుఁదా వాంఛఁగనఁడు
అప్రయత్నంబు గానది ప్రాప్తమయ్యె
నేని నభ్యాస వశమున దానిఁగొనును.
ఇదియు నెల్ల సర్వేశ్వరకృపను జరుగు.

★ ★ ★

# 3. ప్రేమ భక్తి లక్షణము

సూత్ర: తల్లక్షణాని వాచ్యంతే నానా మతభేదాత్. 15

టీక: తత్+ లక్షణాని = ఆ ప్రేమ భక్తి లక్షణములు ; మతభేదాత్ = అభిప్రాయ భేదముల వలన ; నానా = పలువిధములుగ ; వాచ్యంతే = పలుకఁబడినవి.

**తే.గీ.** **కల యభిప్రాయ భేదంపుఁగారణమున**
**భక్తి లక్షణాల్ వేర్వేఱఁబలుకఁబడియె.**

వివ:- వివిధ దేశిక వరులు వేర్వేఱుసరణిఁ
బలికి యుండిరి భక్తి రూపములఁ దొలుత
వాని వివరించి, పిదప, దేవర్షి తన మ
తంబు విశదీకరింపఁగదలఁపుఁగనియె.

★ ★ ★

వాఙ్మనంబులకెందు లభ్యంబుఁగాని
దైవ తత్త్వానుభూతి యథార్థ రీతిఁ
బలుక నెవ్వారి కేనియు వలను పడద
టంచు నీసూత్రమునను గ్రహించనగును.
పరమ భక్త్యనుభవ మెంత వారలేనిఁ
బలుకలే, రైన, నేదొకభంగి భక్తి
సాధకుల బోధనార్థమాచార్య వరులు
పలికినా, దిందుఁ బూర్ణత కలుగఁ బోదు.
కాని, యానిజస్థితిని సూక్ష్మముగఁ దెలుపు
స్వానుభవ బాహ్యవర్ణనల్ – పలుకులెల్ల
వారి వారి ప్రజ్ఞానుభావముల కొలఁదిఁ
దనరు; నరుల మానసిక తత్త్వములు వేఱు.
పలుకులఁగల్గు భేదముల్ దలఁచి వారి
యనుభవములు వేర్వేఱని యనఁగరాదు.

అరయ మైత్రేయ కపిల ప్రహ్లాదులేని
ఆది శంకర రామాను జాదులేని
భక్తిఁగూర్చి పల్కిన పలుప్రవచనముల
స్వానుభవ భేదములుఁగాగ నరయరాదు.
పలుకుభేదమ ; సత్యానుభవము సమమ.

**సూ : పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః** 16

టీక : పూజ– ఆదిషు = భగవత్పూజ మొదలగువానియందు ; అనురాగ = ప్రేమ (ఆసక్తి); ఇతి = అని; పారాశర్యః=పరాశరుని పుత్రుఁడగు వ్యాసుఁడు; (అన్యతే = అభిప్రాయపడుచున్నాఁడు.)

**తె.గీ. ఈశ్వరార్చనాదికముల నిచ్చఁగనుట**
**వ్యాసుమ్మతమున భక్తిరూప మయి పొలుచు.**

వివ : వ్యాస గర్గ శాండిల్యులు వరుసఁగాయి
కంబు వాచక మానసికంబులకుఁ బ్ర
ధానత నొసంగుటఁజేసి, తన్మతముల
సూత్రకారుఁడు పేర్కొనెఁ; జూడనివి– వి
భిన్నముల్ విరుద్ధములుగా నెన్నఁదగదు.
ఇవి పరస్పరాధారక వృద్ధి కరము
లగును; పల్కఁగాఁబడెఁదొల్త వ్యాసమతము

★ ★ ★

పలు పురాణంబులందున, భారతమున
వ్యాసుఁడు వచించె బహువిధ భక్తిరూప
ములను ; కాని, యిచ్చోటను దెలుపఁబడిన
డరయు, వానిలో నొకటియౌ; వ్యాసమౌని
నారదునిఁగాంచు పూర్వపుతీరొ ! యేమొ !
కనిన, భారతమందు నిష్కామకర్మ

వరత వలుచోట్ల బోధించె వ్యాసమౌని.
భాగవతమునఁ బేర్కొనబడిన భక్త
చరితలందేని – సత్క్రియాచరణ నెఱపి
వాసుదేవుఁడద్రూపమౌ ప్రాణికోటి
సేవలొనరించి సిద్ధి నార్జించి నటులఁ
బలుకఁ బడియె; నుపాశ్యదైవ ప్రభావ
మెఱుక పడునప్పుడనురాగ మొసఁగుచుండు.
'పూజ' యన నీశ్వరార్పణబుద్ధి భక్తుఁ
డాచరించు నీయెల్ల కార్యంబు లగును.
ఈశ్వరప్రభావాదుల నెఱుఁగునపుడె
ప్రభువు పూజాదులం దనురాగ మొదవు.
కడకఁ ద్రోసియహంత నిష్కామబుద్ధిఁ
జేయు పూజాదికములు సంసిద్ధిఁ గూర్చు.

★ ★ ★

స్వీయతనువును మనమును విత్త మీశ్వ
రార్చనా వరికరములంచరయుట యును,
శ్రద్ధదయివారఁ ద్రికరణ శుద్ధిగలిగి
విశ్వరూపుఁడౌ నీశ్వర విగ్రహాదు
లెల్ల వేళలఁ బ్రేమ నర్చింప నగును.
అనవరతమును భగవదర్చనము నందు
హృదయ మదిలగ్నమైన నీయెల్ల లోక
విషయ బంధముల్ తమయంతఁ బ్రిదిలిపోవు.
బాహ్యమానసికముల నీశ్వరుని పూజ
సలువుచుండుట మేలు; పూజనమువలన
వరమ పదము ప్రాప్తించుఁ దద్భక్తులకును.

★ ★ ★

''విష్ణు పాదార్చనంబతి ప్రేమ మీఱ
సలుపు భక్తజనమునకు శాశ్వతంబు
పరమ మగువైష్ణవానంద పదము గలుగు
నని వచించెడి ''విష్ణు రహస్య'' సూక్తి.

**సూ : కథాదిష్వితి గర్గః 17**

టీక : కథ- ఆదిషు = (కల్యాణ ప్రదములైన) ఈశ్వరకథలు మొదలగు వానియందు; (అనురాగః=ఆసక్తి (ప్రేమ); ఇతి-అని; గర్గః=గర్గ మహాముని; (మన్యతే = భావించు చున్నాఁడు)

**తె. గీ: ఈశ్వర కథాదికములందు నిచ్చఁగనుట
గర్గమతమున భక్తి లక్షణము తనరు.**

వివ : దేవ దేవుని మహిమలు దివ్యలీల
లావరాత్మకల్యా గుణాభినుతులు.
శ్రవణ మననముల్ జగతి నిస్సంశయముగ
భక్తికిఁబ్రధాన లక్షణ పథములగును.
ప్రాయికముగ జనంబు లీశ్వరునియందుఁ
దత్కథా విధానములందు ఁదలఁపు గనరు.
దినములును రేలు విషయ వాసనల మునిఁగి
జీవితములెల్ల వ్యర్థముల్ చేయుచుందు
రీశ్వరప్రశంసలఁజెవి నిడఁగఁబోరు;
అట్టులగుట, - శ్రీకృష్ణ కథాదికముల
నాలకింపఁగఁ బలుకఁగ నాసగొనెడి
వాఁడె నిశ్చయభక్తుఁడై పఱగు; సూత్ర
కారుఁడును దేవమౌని యౌ నారదుండె
బాదరాయణుతో నిట్లు పలికెమున్ను.
''తపములాగమాధ్యయనముల్ దానమంత్ర

యజ్ఞ కర్మాదులొసంగు నవ్యయఫలంబ
యీశ్వరగుణానుకీర్తన; మిదిసమస్త
సాధుసమ్మత" మంచు; – నీశ్వరకథావి
తానకీర్తన సంశ్రవణానురాగ
భాగ్యభాజనుఁడే భక్తవర్యుఁ ; డట్టి
భక్తిచే నిక్క మీశ్వర ప్రాప్తిఁగాంచు.

★ ★ ★

కృష్ణ సూక్తిని నరయుఁడి ! గీత లందు
"ప్రాణచిత్తముల్ నాకు నర్పణముసేసి
యొకరికొకరు బోధించుచు సకల కాల
ములను నన్నుగీర్తింపుచు ముదముఁజెందు
చున్నవారలై క్రీడింపు చుందు రనఘ!"

★ ★ ★

భాగవతమున శుకయోగి పలుకకున్నె?
"భక్తులును నిరపేక్షులౌ వారలెందుఁ
గృష్ణ కల్యాణ గుణగణ కీర్తనముల
సలుపఁ బలుమాఱు వినఁబోని జనుఁడు జగతిఁ
గలుగు నొక్కొ? పశుఘ్నుఁడొక్కండు దక్క!

★ ★ ★

వ్యాస వాల్మీకి తులసి దాసాది కవులు
భక్తి పారవశ్యమునఁ గావ్యములఁ బలికి,
రటుల భక్తాళి గేయ కావ్యములఁబాడి.
రల పరీక్షిత్తు విష్ణు కల్యాణ కథల
నాలకించి తృప్తాత్ముఁడై యుండెఁ బరము.

★ ★ ★

భాగవతమున శుకయోగి పలికినటుల
''వాసుదేవ కల్యాణ పావన కథావి
ధాన సంప్రశ్నములు పవిత్రతను గూర్చు
వక్తృ పృచ్ఛక శ్రోతలౌ వారికెపుడు

★ ★ ★

ధర్మముల '' సంస్తుతియె'' మేటి ధర్మమనఁడె!
విష్ణునామముల్ ప్రవచించి భీష్మయోగి.

★ ★ ★

వేదములు నుగ్గడించు స్తోత్రాదికముల.

★ ★ ★

యజ్ఞముల ''జపయజ్ఞమే '' ననఁడె! హరియు.

సూ: **ఆత్మరత్యవిరోధే నేతి శాండిల్యః** 18

టీక : ఆత్మరతి– అవిరోధేన= ఆత్మానందమునకు విరోధము ( ప్రతికూలము) గాని విధమున; ఇతి = అని ; శాండిల్యః = శాండిల్యమహాముని; ( మన్యతే = భావించుచున్నాడు)

తె. గీ: **ఆత్మరతికెందుఁ బ్రాతికూల్యంబుఁగాని**
**దాని భక్తిఁగా శాండిల్య మౌనిపలికె.**

వివ : తైలధారనా నెడపకాత్మస్వరూప
మందుఁగ్రీడించు చుంటయే యాత్మరతి య
నంఁబడు; నిట్టిరతిని సంతతముఁగనుటఁ
దనరు నిర్గుణోపాసనాత్మక మహాను
భావభక్తినా; స్వస్వరూపానులగ్న
మరయ భక్తిఁగా నాది శంకరుఁడు పలికె;
మఱియు, మోక్షసంఘటన సామగ్రి నిట్టి
భక్తి శ్రేష్ఠంబటంచుఁ దాఁబ్రస్తుతించె.

★ ★ ★

ప్రాణులన్నిట నాత్మరూపమున వెలయు
వాసుదేవుండు; కాన, సర్వాత్మరతినిఁ
బడయుటే యథార్థ భగవద్భక్తి యగును.
ఇట్టి భక్తి సంతతముపార్జించువాఁడు
పరముఁగాంచు, సందియమిందుఁ బడయరాదు.

సూ: **నారదస్తు తదర్పితాఖిలా చారితా**
**తద్విస్మరణే పరమ వ్యాకుల తేతి.** 19

టీక : నారదఃతు=నారదుఁడు మాత్రము; తత్–అర్పిత–అఖిల– ఆచారితా= (తస్మిన్ అర్పితః ఆచారః యేననః–తన్యభావః) ఆత్మార్పణబుద్ధితో సర్వకర్మములీశ్వరు సందర్పింబఁబడిన స్థితియు; తత్–విస్మరణే = భగవానుని మఱచునెడ; పరమ వ్యాకులతా = మిక్కిలి వ్యాకులము పొందుట; (చ = యు) (పరమ భక్తిః =శ్రేష్ఠమంగు భక్తి); ఇతి =అని; (మన్యతే =భావించుచున్నాఁడు).

తె.గీ. : **కాని నారదు మతమునఁ గర్మచయము**
**హరికి నర్పించి, తచ్చింతనాంతరాయ**
**మునకు నతి విషాదంబును గనుట యగును.**

వివ: వ్యాసగర్గ శాండిల్యులు పలికినట్టి
భక్తిలక్షణములకు దేవర్షి భిన్న
సరణి వచియింపఁ; డీశ్వరార్చనముఁదద్గు
ణానుకీర్తనములును, సర్వాత్మరూపుఁ
డైన భగవంతుఁబ్రేమించు టభిమతంబ ;
నారదుఁడు వీనికంటె భిన్నమని కాని
యధికమని కాని తనమతం బనఁగబోఁడు.
కాని, వీనికిఁ బుష్టినిఁ గలుగఁ జేయఁ
జాలు సర్వాంగ పూర్ణ లక్షణ మొకండు

పలికె; లౌకిక వైదికంబులగు కృతుల
నెల్ల నీశ్వరార్పణఁజేసి, హృదినిఁ బ్రియత
ముండునౌ భగవంతు. నే ప్రొద్దు సంస్మ
రించు చున్ తత్ స్మరణ లవమేని భంగ
మైన మిక్కిలి వ్యాకులమందుటయు – స
మస్త లక్షణ సంపన్నమైన భక్తి.

★ ★ ★

ఇందుఁ బూజాకథాదులందిచ్ఛ, మఱియు,
విశ్వమయుఁడీశ్వరునిపైనఁ బ్రీతిఁవఱఁగు;
యోగులందిట్టి లక్షణ యుక్తుఁడైన
భక్తి యోగిని మిన్నఁగాఁ బలుకనెంచి
గీతలందు వచించె శ్రీ కృష్ణుఁడిటుల

★ ★ ★

''పార్థ! యోగియౌవాఁడు తపసుల కంటె
జ్ఞానవంతుల కంటెను గర్మములను
జేయువారల కంటెను శ్రేష్ఠుఁడగును
గాన–నిప్పుడు యోగివి గమ్ము నీవు.

★ ★ ★

అఖిలయోగుల యందున ననవరతము
స్వాంతమును నావయిని నిల్పి శ్రద్ధఁగలిగి,
భక్తి సేవించు వాఁడె పో యుక్తతముఁడ
టంచు నేను దలంచెద, నమల హృదయ!

★ ★ ★

కాన, శ్వేతవాహన సర్వ కాలములను
స్మరణ చేయుమి నన్ను, సంగరముఁజేయు
మయ్య! మనసును బుద్ధి నా యందు నీవు
నిలిపి తేని నన్నే పొందఁగలవు – నిజము.''

★ ★ ★

మాన మవమానముల, లాభహానులను, జ
యాపజయములు, సౌఖ్య దుఃఖాదులైన
ద్వంద్వముల సైచి సంసక్తి ఫలము లుడిగి
కర్మముల సల్పుచును–నిజకాయమంద
హంత, జగతిని మమతయు నడఁచి, సతత
మేక సరణిఁ బ్రియతముఁడౌ కృష్ణుఁడొకఁడె
పరమ శరణంబు – గతియును – బరమ సుహృదుఁ
డనుచు లెస్సనెఱింగి, యనన్యమతి, ని
తాంతరక్తిమై ప్రీతి నిరంతరంబు
తైలధారగాఁ దన్నామ లీలలను, గు
ణ ప్రభావముల్ రూపచింతనలఁ దవిలి,
యీశ్వరప్రీతికొఱకు ఁ దదీయదాస్య
మతిని దైహిక వాచక మానసికము
లైన కర్మముల్ సలువుచు శ్రీనివాసు
చింతనము క్షణంబేఁ గారణాంతరమున
మఱచుచో నీరు వదలిన మత్స్యమటుల
వ్యాకులంబొందు టుత్తమమమైన భక్తి
గాదె? – పూర్ణ సమర్పణకారియగుచు
ప్రేమమయ భక్తుఁడవునరా వృత్తియైన,
మోక్షపదమైనఁ బుండరీకాక్ష చింత
నాంతరాయమే నద్దాని పొంతఁజేరఁ
డనిన ఁ ద్రైలోక్య రాజ్య సౌఖ్యముల మాట
వేఱఁబలుకగనేల? – గోవిందుఁడనఁడె!
" ఉద్ధవా ! ధాతృశివహలా యుధులు నేని
అనుఁగు రుక్మిణియేని నా యాత్మయేని
నీకుఁబలెఁ బ్రియాధికులు గా నేరరెందు;

శమితకాముఁడు, మునియును శాంతగుణుఁడు
వైరశూన్యుఁడు సమదృష్టి భాజనుఁడగు
భక్త జనుని వెన్నంటి నేఁ బరుగుదెంతుఁ
దచ్చరణ రేణువులఁ బవిత్రతను గనఁగ.
అనిశ మనురక్తి మతిని నాయందు నునిచి
సకలమును నాకొసఁగి, యకించనుఁడు నగుచు,ఁ
బరమశాంతుఁ డఖిల జీవ వత్సలుండు
నౌ మహాత్ముని పరమ సుఖానుభూతి
నన్యులెంతటి వారలే నరయలేరు.
ఆచరణలెల్లఁ గృష్ణున కర్పణంబు
సేసి, తద్స్మరణంబవిచ్ఛిన్న సరణి
సలుపుచున్ దానికెడమెందుఁ గలిగెనేనిఁ
బెన్నిధినిఁ బాసినటుల నిర్వేదపడుట
'భక్తి' – యని నారదుండిందుఁ బ్రస్తుతించె.

సూ : **అస్త్యేవ మేవమ్ .** 20

టీక : ఏవమ్ – ఏవమ్ = ఇదియే – ఇదియే; ( భక్తిస్వరూపమ్) అస్తి=వాస్తవమగు భక్తియై యున్నది.

తె. గీ : **అగును సుమి యిదే వాస్తవంబైన భక్తి.**

వివ : తాపచించిన భక్తి సిద్ధాంతమును దృ
ఢీకరించెడుపొంటె, నస్తోకఫణితి
రూఢిగానిదె భక్తిస్వరూపమనుచుఁ
బలికి, యివ్విధియెందునేఁ గలదొ యనెడి
సందియము పో నుదాహరింపందొడంగె.

సూ : **యథా వ్రజ గోపికానామ్.** 21

టీక: యథా = ఉదాహరణార్థము; వ్రజగోపికానామ్ (భక్తిః) = గోకులమునందలి గోపికలయొక్క భక్తి.

**తె.గీ.: వ్రజమునన్ గోపవనితల భక్తియటుల.**

వివ: భక్తిలక్షణ మెలమి దేవర్షి పలికి,
యట్టి భక్తిసాధకుల నుదాహరింప
నిరతమును ప్రభాత స్మరణీయ చరిత
లమల భక్త శిరోమణులైన గోప
వనితలన్ నిదర్శనముగఁ బ్రస్తుతించె.
వ్రజపురంధ్రుల భక్తి తత్త్వంబెఱుంగు–
జనములు గలారె? – తనువును మనము ధనము
లోక పరలోకములనెల్ల నేకమతినిఁ
గృష్ణునకె సమర్పించి రేయింబవళ్ళుఁ
దత్స్మరణము సేయుచు గద్గద స్వరమునఁ
గృష్ణ కీర్తనల్ సల్పుచు నెల్లయెడలఁ
గృష్ణునవరతంబు నీక్షింపఁబోరె!
భక్తికుప్పొంగి కృష్ణుఁడు వారితోడ
'' కఠినగార్హస్థ్యబంధముల్ కరముసైచి
వ్రేతలార ! నన్గూర్చి కావించు సేవ
లెల్ల నిర్దోషములు, జన్మలెన్నిటేనిఁ
బ్రత్యుపకృతి సేయఁగ లేని వాని నన్నుఁ
గరుణసైరించి ఋణముక్తిఁబఱపు'' డనఁడె!

★ ★ ★

నిజప్రియాంగనా తతికి సందేశ మంపు
నెడల నుద్ధవుగాంచి వచించె శౌరి.
''వ్రేతలాత్మల నాక యర్పించి, నేను
వారలకుఁ బ్రాణమగుదును; – వారునాకుఁ

బ్రాణమగుదురు; నాకు నైయఖిలముడిగి
కొలుచు శ్రితుని యోగక్షేమములను గూర్చు
భారమెల్ల నేన వహింతు; వ్రజసుదతులు
ప్రియతముడ నంచు నన్ను భావింత్రు; సంత
తంబు నన్నుస్మరింత్రు; నేదవులనుంట
విరహ వేదన కోర్వక పరితపింత్రు;
తనువులనుమఱచెదరు; నన్గనక మిగుల
వ్యాకులాత్మలై యెట్టులో ప్రాణములను
నిలుపుకొని యుంద్రు క్రమ్మఱ నేనువారి
దఱికివత్తునన బాస నా ధారమూని''

★ ★ ★

అనుచు, దగునట్లు సందేశ మనిపె; ననుప
నుద్ధవుఁడు గోకులముఁజేరి, యోగివరుల
కేనిఁబడయఁగ దుర్లభంబైన భక్తిఁ
బఱవుచున వెలి లోపల వాసుదేవుఁ
గనుచుఁ దద్గుణగణముఁ గీర్తనముసేయు
నాలగాపఱి పడుచుల లీలఁ గాంచి
యూరడింపఁగ నెంచి యా యుద్ధవుండు
''కృష్ణు నెడఁబాసి వ్యాకుల హృదయలైన
మిమ్ముఁబ్రోచు వెన్నుఁడు, దర్శనమ్ముసంగు
నచిరముగ,'' – నన, గోపికలనఁగలేదె ?

★ ★ ★

'' ఉద్ధవా! యోగవార్త వియోగ మొందు
వారికడ కేగి పలుకుము; వ్రజమునందు
సరసిజాక్షసంయోగ మేమఱక గలుగు;
శ్యామ సుందరుఁడెపుడు మాయంద యుండు''.

★ ★ ★

ననిన, ప్రేతల పలుకుల నాలకించి,
హర్ష బాష్పంబు మిళితాక్షుఁడై, తదీయ
మహిత భక్తి ప్రవాహ నిమగ్నుఁడగుచు
వారి నుద్ధవుఁడివ్విధిఁ బ్రస్తుతించె;–

★ ★ ★

" భవ భయమున మాదృశులును, వివిధ మౌని
వరులు సతతముఁగాంక్షించు వాసుదేవు
నందు నిజచిత్తములను లయంబు నొంద
నోచికొనిన గోకుల వాసినీ చయంబు
జన్మములె సార్థకంబులు; సరసిజాక్ష
సత్కథారసలాలస స్వాంతులైన
జనులకే వని బ్రాహ్మణజన్మములను?

★ ★ ★

రాసముల హరిబాహు విలాసగతులఁ
గంఠహారముల్గాఁ బూర్ణకాములైన
వ్రజసతీజనసుకృతి, నిరంతరంబు
నెడఁద యందు నిల్చెడి లచ్చియేని, నలిన
గంధరుచితనులగు సుర కాంతలేనిఁ
బడయ రన–నిఁక నన్యులఁబలుక నేల?
పాయ మతిసమ్మతింపని బంధుజనుల,
నార్య ధర్మముల్ విడి, నిగమాగమముల
కందరాని ముకుంద పాదాంబుజంబు
లనుసరింతు రదేమి భాగ్యంబొ! అహహ!

★ ★ ★

బృంద గుల్మ లతౌషధు లందు నొకటి
యై జనించుచో వీరి పదాంబు జముల
దాఁకు భాగ్యంబు నాకుఁబ్రాప్తమగు" – ననుచు

★ ★ ★

గొల్లపడుచుల సుకృతము లెల్లఁదలఁచి
మదుల మెచ్చిరి మధురలో మగువలిటుల.
''అలఁబితుకుచు సుతులకు లాలిపోసి
జోలఁబాడుచు నూఁపుచు లాలనంబు
సేయుచును, ధాన్యముల దంచి చెఱుగుచును, జ
లమ్ముఁలాడుచు, నలఁదుచు, సొమ్ములను ధ
రించుచును, గట్టుచును, భుజియించుచును గృ
హంబులందెల్ల కార్యంబు లాచరించు
నెడల ముదితాశ్రు పూరిత వీక్షణములు
పఱఁగ, ఁదనువులు పులకరింపంగ, నెలుఁగుఁ
గంపమొంద, మాధవగుణ గానమునను
గృష్ణనంద చిత్తములు లయించు భాగ్య
భాజనలగు వీరేపాటి వారో ? – యనుచు.

★ ★ ★

ప్రభువుచైతన్యదేవాది పరమభక్తు
లును, మహాత్యాగులౌ వారలనుసరించి
రీ పవిత్ర వ్రజాంగనా ప్రేమపథము.
సాధకుండు సద్వైరాగ్య సంపదఁగని
ప్రేమపథమునఁగొంత దవ్వేగెనేని
గోపికా భక్తి విధమెఱుంగును నొకింత.

**సూ : తత్రాపి న మాహాత్మ్య జ్ఞాన విస్మృ త్యపవాదః 22**

టీక : తత్ర = అందు. (ఆగోపికల భక్తియందు); అపి = అయినను; మాహాత్మ్యజ్ఞాన–విస్మృతి–అపవాదః = (మాహాత్మ్యస్యజ్ఞానం – తస్యవిస్మృతి –సైవ– అపవాదః) = ప్రభువుయొక్క మహత్త్వ ప్రభావజ్ఞానము యొక్క మఱపు అనెడి దోషము; (న+అస్తి) = లేదు.

తే.గీ.: అట్టి గోపకాంతా భక్తి యందునేని
హరిమహత్త్వప్రభావంపు టెఱుక యెడల
మఱపనెడి దోసము లవంబుఁబఱఁగఁబోదు.

వివ: వ్రజయువతులు శ్రీకృష్ణప్రభావమును, ర
హస్యములను గల్యాణ గుణాదికముఁ గ
రంబెఱింగిన వార; ''ప్రేమంబునన్ మ
హత్త్వమెఱుఁగదుర్లభము – మహత్త్వ మెఱిఁగి
యున్నఁ బ్రేమంబునకు స్థాన మొనర,. దంద్రు;
కాని, వ్రేతలయెడ నట్లుగాదు; కృష్ణుఁ
డాది పురుషుఁడు భగ వానుఁడని యెఱింగి
ప్రియతమునిఁగాఁగ భావించి ప్రేమ నెఱపి
రీశ్వర ప్రేమ లౌకిక ప్రేమ లందు
హస్తి మశకాంతరము పొల్చు; – నావ్రజాంగ
నాచయము కృష్ణుతో నిట్లనంగ లేదె?
''ఈశ ! యిట్టి కటువుల వచింపరాకు
మెల్లవిషయములను దృజియించి మేము
నీపదాంభోరు హంబుల ప్రాపుఁగంటి
మనఘ! యాదిపురుషుఁడు నారాయణుండు
పరమ కృప ముముక్షువులఁ జేపట్టు నటుల
మమ్ముఁబ్రోవవె! – విడుట ధర్మమ్ము గాదు.
నీవు ధర్మజ్ఞుఁడవుగావె? దేవ! యిటుల
నాశ్రితల మమ్ముఁద్రోయుట న్యాయమయ్య?
నిన్ను శరణంబు నొందియునెన్నఁడేని
విఫల మతులయి యెవరేని వెడలి నారె?
వరద! నీపల్కు, పతిపుత్రబంధుసేవ

లతివలగు మాకు ధర్మంబులంటి; — సరియ—
ఇట్టిధర్మోపదిష్టవు నీశ్వరుఁడవు
నఖిల దేహధారులకునే నాత్మబాంధ
వుఁడవు గాన, నీపై ప్రేమ పొసఁగ నిమ్మ.

★ ★ ★

సిరికిఁదానకమౌ పద సరసిజముల
నెట్ట కేలకుఁజేరితి మింక వీని
విడిచి యెటకును నడుగేని నిడఁగలేము
మునిజనప్రియుండవు మమ్ముఁదనిపితీవు.

★ ★ ★

సవతు లేకయె నీదు వత్సమునఁ బొలుచు
కలుముల వెలందియేనియుఁ దులసిఁగూడి
భక్తజన సేవ్యమౌనీదు పదసరోజ
రజముఁ గోరునుగాదె? నిరంతరంబు
దేనికై నిర్జరులు ప్రయత్నించు చుందు
రట్టి నీపద కమల పరాగ మేము
దృఢమనంబున నిదే యాశ్రయించి నాము.

★ ★ ★

నిజముగ యశోద సుతుఁడవె? నీవు కృష్ణ!
యబ్జగర్భుని ప్రార్థనం బాదరించి
జంతుకోటి నియంత—యనంతుఁ డాది
పురుషుఁడవు భూవలయమును బ్రోవ మాదు
పున్నెములప్రోవు గానిట్లు పుట్టినాఁడ''
వంచనరె?— ఇట్టుల నుదాహరించఁ గలవు
పెక్కులు ప్రమాణములు; గొల్ల వెలఁదు లెల్ల
నంద నందను సచ్చిదా నంద ఘనుఁడు
పరమ పురుషుఁగా నెఱిఁగియే శరణుఁ గనిరి.

★ ★ ★

వ్రజ సుదతులు కామోత్కంఠ భావమునను
కృష్ణ సౌందర్య రస మాధురీ సుధాబ్ధి
మునిఁగి, ప్రియువల్లభుండను బుద్ధిఁదొలుత
హరినిఁ జేరిన్ బరమాత్మయైన కృష్ణ
సత్సమాగమంబునఁ గల్మషములఁ బాసి
యుదధిఁజేరి తన్మయమొందు నదుల కరణిఁ
గృష్ణ మయులై వరంబు నార్జింపఁగనిరి.

★ ★ ★

పరమ భక్తితత్త్వ మెఱుంగ వలచువారు
బృంద వని కేగుఁడని మున్ను గృష్ణుఁ డనఁడె!
అల పరీక్షిన్మహీపతి యంత వాఁడు
మోహితలు వ్రేతలనెడి సందేహ మొంది
''వలపు కాఁడని తప్ప దైవం బటంచు
నెఱుఁగ జాలని యా గొల్ల గరిత లందు
గుణ సహిత చిత్త మెట్లు నిర్గుణత నొందె?''
ననిన, నృపతికి శుక యోగి యనఁడె యిటుల –

★ ★ ★

''మనసు హరి యందు లీనంబు గనినఁ జాలు;
బంధు భావము చేఁగాని, పగను గాని.
ప్రీతిమైఁగాని మఱి, ప్రాణభీతిఁగాని
భక్తిమైఁగాని కృష్ణ సంసక్తిగనెడి
జనులు మోక్షపదంబును గనఁ గలారు;
అతుల యోగేశ్వరేశ్వరుండైన హరి ప
దంబు సోకు జడంబు ముక్తంబనంగ –
వలచి చేరు వ్రేతలఁ గూర్చి పలుక నేల ?
ప్రాకృతంపు దృష్టికిఁ గనరాదు దీని.''

**సూ : తద్విహీనం జారాణా మివ.** 23

టీక : తత్ (మహాత్మ్యజ్ఞానమ్ ) విహీనం = ఈశ్వరమాహత్మ్యజ్ఞానము లేని; (ప్రేమ-ప్రేమము) జారాణామ్ - ఇవ = జారకాంతుల యొక్క విధము వలెనగును.

**తె. గీ. : ఎఱుక లేదేని జారల సరణి యగును.**

వివ: ఈశ్వరునిఁగాక యితరంబు నెడలఁబ్రేమఁ
బఱపుట యధర్మమౌ ; యుక్తసరణిఁగనిన
ప్రాణిఁ బ్రాణిఁగా బ్రేమించు భావమెల్ల
ధర్మబద్ధంబు గాని ; దధర్మ సరణిఁ
బ్రాణులందుఁ జూపెడి ప్రేమ బంధకరము.

★ ★ ★

మిత్రు నీశ్వర బుద్ధిఁ బ్రేమింపనగును.
ఇతర మేదేని నటులఁ బ్రేమింపఁజెల్లు.
ఈశ్వరార్థంబుఁ గాని స్నేహితముఁ గనిన
నస్థిరంబును బలహీనమై తనర్చు''
దైవబద్ధంబుఁగాని నేస్తమును - బ్రేమ
వాస్తవము గాదు-కాదది పావనంబు.

★ ★ ★

ఇట్టి దనుచుఁ దన్మాహాత్మ్య మెఱుఁగ లేక
పరమ పురుషుపైఁ గాంతలు పఱపు ప్రేమ
జారిణీ ప్రేమ యనఁదగు ; సర్వమును స
మర్పణము సేసి, లౌకిక స్వార్థ విషయ
వాసనలు లేని ప్రేమ కేవలము నీశు
నందు గాక వేఱొండెడ హత్తఁ బోదు.

★ ★ ★

ఎఱిఁగిన నెఱుంగ కున్న సర్వేశు మీదఁ
బఱపు ప్రేమ యెందేని నిష్ఫలము గాదు.

★ ★ ★

ఎఱిఁగి సలుపు ప్రేమ ఫలంబు హెచ్చు పొసఁగు.
ఆదిపురుషుఁడు ప్రియతముఁ డనుదలంపె
యద్భుతానంద దాయకంబనిన, – నీశుఁ
బొందు భక్త జనముల యానంద మునకుఁ
బారమున్నె ? – గోపికలిట్టి పరమసౌఖ్య
భాగ్యభాజనలైరి ; యవ్యయ పదంబు
నొసఁగు నీ చరిత్రమును బ్రాయోపవిష్టుఁ
డౌ పరీక్షిన్న రేంద్రున కమల మునిజ
నార్చితుండు–జీవన్ముక్తుఁడౌ శుకుండు
వే విధంబులఁ గొనియాడి విశదపఱచె.

★ ★ ★

ఇటుల నీశ్వరమాహాత్మ్య మెఱిఁగి సలుపు
ప్రేమ మన్నిటఁ బరమ పవిత్ర మగును.

**సూ : నాస్త్యేవ తస్మిం స్తత్సుఖ సుఖిత్వమ్.** 24

టీక: తస్మిన్ = అట్టి జారిణీ ప్రేమయందు; తత్ – సుఖసుఖిత్వమ్ = ( తస్యసుఖం –తత్సుఖం– తస్మిన్ సుఖం యస్యస – తత్సుఖసుఖీ తస్యభావం) = ప్రభు సుఖస్థితినిఁగని సుఖించుట ; న – అస్తి– ఏవ = లేనేలేదు.

**తె. గీ : అట్టిదానఁదత్సుఖ సుఖిత్వాప్తిలేదు.**

వివ : వ్యభిచరణశీలి కామవివశతఁగేవ
లేంద్రియసుఖంబు, మఱియుఁ దత్తృప్తిఁగోరి
యతఁడు ప్రేమించు చుండు; ప్రేమాస్పదమగు
వస్తు సుఖమున సౌఖ్యంబుఁ బడయఁ బోఁడు.
వల్ల వీ ప్రేమను స్వసౌఖ్యభావమెందుఁ

గానరాదు; జగంబునఁ గామజనిత
మైన ప్రేమంబు నందుఁ బ్రేమాస్పదుఁడగు
పురుషుఁడరయఁగ జారుఁడౌ; మఱియు వాని
కంగ సంగేచ్ఛ పాడము; — ప్రేమాస్పదుఁడగు
నాతఁ డియ్యెడ జగదంతరాత్మ — పరుఁడు
సచ్చిదానంద మయుఁడు—సాక్షాత్పరాత్ప
రుండు — భగవానుఁడైన కృష్ణుండు సుమ్ము!

★ ★ ★

తుచ్ఛమగు నంగసంగేచ్ఛ తోషదీ వ్ర
జాంగనా హృదయముల; నిరంతరంబుఁ
దనువు రూప యౌవనములు, ధనము మనము,
ప్రాణములును సైతము ప్రియ వస్తువైన
మాధవుని సమర్చించు సామగ్రి గాగఁ
జేసి, కృష్ణ సుఖాభి లాషిణులై యెరి.
వ్రజసతులు తమకుఁగల సర్వస్వ మొసఁగి
కృష్ణచంద్రు సౌఖ్యంబె స్వకీయ సౌఖ్య
మంచు నెఱనమ్మి, రాధికా శ్యామ సుంద
రునిఁ బ్రసన్నునిఁ గావించు పనుల నెల్లఁ
దగ నొనర్చుట విధ్యుక్త ధర్మ మనుచు
నరసి, హరియందుఁ బరమ సుఖానుభూతి
నందఁ గలిగిరి; యిద్దాని కన్యమైన
కాంక్షయేనియుఁ దుదకు సంకల్పమేని
లేదు; ''ప్రేమ—కామము''లకు భేద మొదవు.

★ ★ ★

ఇతరు వలన ఁదాసుఖమొంద నిచ్ఛఁ గనుట
''కామ''మగును; తన వలన సౌఖ్యంబుఁ బ్రియత
మునకు సమకూర్చి, తత్సుఖమునకు మురిసి,
సౌఖ్యమును వహించుట ''ప్రేమ''- సరణియగును.

★ ★ ★

ఇచట భగవానుఁడైన శ్రీకృష్ణు నకును
సకలమును సమర్పించుట, క్షణమ యేనిఁ
గృష్ణు మఱువ. వ్యాకులత వహించుటయును,
కృష్ణ మాహాత్మ్యమును లెస్స యెఱిఁగి యుంట
కృష్ణుఁడు సుఖింప సుఖ మొంది తృప్తిఁ గనుట,
యనెడి యా నాల్గు గోపికాఉత్కృష్టభక్తి
తత్త్వమందు ముఖ్యాంశముల్ ; తత్పృథంబు,
పరమపావనం, బనువ. మప్రాకృతంబు

★ ★ ★

ఇది యఘంబని వ్యభిచార దృష్టి నరయు
పామరులకు శ్రీకృష్ణుఁ డపార కరుణఁ
బూని, చక్కని యూహను బోడమఁ. జేసి,
మనుచుఁ గావుత భక్తులఁ గ నెడి సరణి.



# 4. ప్రేమ భక్తి - ఫలరూపము

సూత్ర : సాతు కర్మ జ్ఞానయోగేభ్యోఽప్యధిక తరా. 25

టీక : సాతు= అపరాభక్తియనినన్; కర్మజ్ఞానయోగేభ్యః+ అపి= కర్మజ్ఞాన యోగముల కంటెను; అధికతరా = మిక్కిలి అధిక మైనది.

తె. గీ. జ్ఞానకర్మయోగముల కెచ్చైన దిదియు.

వివ :- కర్మమును జ్ఞానము మఱి, యోగమను మూఁడు
జగతి నీశ్వర ప్రాప్తికి సాధనములు;
కాని, భక్తియీ మూఁడింటి కంటె మిన్న.
అరయ వర్ణాశ్రమాధికారాదులౌ వి
చారములు తత్పృథత్రయిఁ జాల కలవు.
అట్టి వానిలోఁ బతన భయంబుఁ గలదు,
పరమ భక్తి యందనిన నీశ్వర కరావ
లంబనము కల్మిఁ బతన భయంబు లేదు.
అతివలుఁ బురుషులు ద్విజ శూద్రాదులంద
ఱిందు నధికారులే ; లేదు – సందియంబు.

★ ★ ★

ఆత్మ సంయమ యోగంబు నందు మున్ను
వాసుదేవుఁడు పలికిన వాక్కు వినుఁడు
''పార్థ ! యోగియౌ వాఁడు తపసుల కంటె
జ్ఞాన వంతుల కంటెను గర్మములను
జేయు వారల కంటెను శ్రేష్ఠుఁ డగును;
గాన, నిప్పుడు యోగివి కమ్ము నీవు.

★ ★ ★

అఖిల యోగుల యందు నిరంతరంబు
శ్రద్ధను వహించి నా యందు స్వాంత ముంచి
తగ భజించు వాఁడే యుక్త తముఁడటంచుఁ
దలఁతునే'' - నసె; - భాగవతంబుఁ బలుకుఁ
గృష్ణుఁడుద్ధవుతో వచి యించు సరణి;-

★ ★ ★

'' ఉద్ధవా ! జ్ఞాన కర్మముల్ యోగమేనిఁ
బడయ నేరవు నర్ దృఢ భక్తి యటుల ;
ఆత్మనై సజ్జన ప్రియుఁడైన నేను
బట్టు వడదుఁ గేవల శుద్ధ భక్తి యంద.
ఇట్టి మద్భక్తి శ్వపచుల నేని నతి ప
విత్ర హృదయులజేసి కల్పించు సుగతి.

★ ★ ★

గీతలఁ బల్కె మఱియు శ్రీకృష్ణుఁ ''డనఘ!
దాన యజ్ఞ తపముల స్వాధ్యాయ మునను
పేరు గడియించు నిపుణులౌ వార లేని
నిపుడు నీవు వీక్షించు నా యిట్టి విశ్వ
రూప మెప్పుడుఁ జూడఁగ నోపరెందు.

★ ★ ★

అన్య చింతన లేని నిత్యైక భక్తి
నరయఁ దెలియఁగఁ బ్రాసింప నగును నన్ను
గాని, వేఱు సాధనమునఁగాన '' రనుచు.

★ ★ ★

ముక్తి సాధన సామగ్రి 'భక్తి' మిన్న
గా వచింపఁడె యాది శంకరుఁడు నేని.

సూ : ఫలరూపత్వాత్ . 26

టీక : ఫలరూపత్వాత్ = (మున్నుదెలుపఁబడిన మార్గములవలెఁ గాక) ఫలరూపమైన కారణమున.

తె.గీ.: **అరయు నీ 'ప్రేమ' ఫలరూపమైన కతన.**

వివ: ప్రేమ భక్తికి సాధనా పేక్ష లేదు.
అది యథార్థము ఫల రూపమై పొసంగు.
జ్ఞాన సిద్ధికి సాధనమైన భక్తి
''గౌణ భక్తి '' యౌ, -నది, ప్రాయి కంబుగా ను
పాసనంబగు ; - అది ప్రేమ భక్తి గాదు
ప్రేమరూపమౌ భక్తి నా-వివిధ సాధ
నముల ఫలమగు ; నితర యోగముల యందు
వెలయు నొక్కక ప్రతిఫలాపేక్ష ; తత్ప్ర
థాను వర్తనుల్ సంకుచి తాత్ములగుచు
నీశ్వరునకు దూరమునఁ జరించుచుండి
శాశ్వతంబగు శాంతిఁగాంచంగ లేరు.
ప్రేమ భక్తి ప్రతిఫలము ప్రేమ మగుట
యోగముల యందు నిది యుత్తమోత్తమంబు.

సూ : **ఈశ్వరస్యా ప్యభిమానద్వేషిత్వా**
**ద్దై న్యప్రియత్వా చ్చ.** 27

టీక: ఈశ్వరస్య-అపి = ఈశ్వరు నకును ; అభిమాన ద్వేషిత్వాత్ = అభిమానుల యెడల ద్వేషమువలనను; దైన్య- ప్రియత్వాత్-చ = దీనుల యెడప్రియము వహించుట వలనను; (హేతోః = కారణమున, భక్తి రేవ = భక్తియే, అధికతరా = మిక్కిలి శ్రేష్ఠమైనది.)

తె.గీ.: **ద్వేష మభిమానులన్, బ్రీతి దీనులందు**
**నా పరాత్పరునకు నేని నమరు కతన.**

వివ : జగతి యోగ కర్మ జ్ఞాన సాధకులన –
సాధనాభిమానముఁగాంత్రు స్వబలమును స
మాశ్రయించి; ఈశుఁడు దర్ప హరణుఁడనఁగఁ
బఱగు; ద్వేషరాగంబు లెవ్వాని యందు
నేనిఁగలుగ వెల్లరును సమానులగుదు
రీశ్వరున; కెల్లర సముద్ధరించు నతఁడు ;
★సాధనములు మాత్రము భిన్న సరణినొప్పు.
దండనమున గర్విని సముద్ధరణఁజేయుఁ,
బ్రేమమున దీను నాశ్రితు నోము; నీశ్వ
రాగ్రహానుగ్రహములుఁ దుల్యములు సుమ్మి.

★ ★ ★

గీతలందున నరయుఁడు కృష్ణసూక్తి.
''సర్వభూతములందున సముఁడ ; లేఁడు
ప్రియుఁడు గానియు నాకు నప్రియుఁడుఁ గాని ;
యెవరు భక్తితో నను భజియింతు రుంద్రు
వారు నాయందు నేనుందు వారియందు''.

★ ★ ★

అతఁడభిమానియెడ ద్వేషియై చరించు,
దీనుఁడగు వానియెడలఁ బ్రీతిని ఘటించుఁ.
గాన,–'దిక్కులులకు దిక్కు,' 'దీనబంధుఁ'
'డార్తరక్షణుఁ' డను గీర్తి నందె ప్రభువు,
ఈశ్వరునకా దురభిమాని యెడలనేనిఁ
బ్రేమపానఁగు;ఁ గావునఁ జక్కఁబెట్టు నతని,

★ ★ ★

★ వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్ తథాహి దర్శయతి. (బ్రహ్మ సూత్రములు 2–1–34)

భక్తజనుఁడొ-తఁ గింకరు వగిది నెంచి,
''దీనుఁ బాపపీనునిఁ బరాధీను, సర్వ
సాధన విహీను నఁ గావు సామి! వేఱు
గతి నెఱుఁగఁ గృష్ణ!'' యంచుఁ బల్గతుల మ్రొక్కు.
విత్తమాన వైభవ భోగ వితతి కై కృ
శించి దీనత్వమును బ్రకటించు మాన
వుల యభావస్థితిఁగ దీనిఁ దలఁప రాదు,
నిరభి మానతఁగని, యహంకరణ శూన్య
మైన వానిని దీనుఁ డంచనఁగ జెల్లు.

★ ★ ★

'నేను' – 'నాది' – యఁ భావంబుఁ గానఁ బోక
యే, లవముఁ బొల్చునది యెల్ల నీశ్వరుండె,
ఇదియు నీశ్వరునిద – యని యెఱిఁగి, సర్వ
మతని బలమునఁ బ్రేరణ కతనఁ గలుగు,
నతఁడె చేయును, జేయించునది యతండె ;–
యనుచు నిశ్చయుఁడై దీనుఁడలరుచుండు.

★ ★ ★

పక్షపాత కోపములు దైవమునఁ గలుగ
వెందు; జీవుల సుకృత దుష్కృతుల ననుస
రించి యుక్తమార్గము నిర్ణయించు ప్రభువు.
ఈశ్వరునకుఁ బ్రియంబైన యిట్టి దీన
తాస్థితి లభింపఁబోదు సాధారణముగఁ ;
బూర్ణముగ నభి మానత పొలియ కుండ
దీన భావమెవ్వరికిఁ బ్రాప్తింపఁబోదు.
జాతి మత వర్ణ సాధన స్వాభిమాన
మాన విద్యార్థ గర్విత మానసులగు
మానవుల కిట్టి దీనత మందు కేనిఁ

గలుగఁబోవ ; దైహిక భోగములను దవుల
కే నిరంతరమును దీనుఁడైన వాఁడు
దైవమును మించి వేఱొండుఁ దలఁపఁ బోఁడు.

★ ★ ★

ఈశ్వరుం డట్టి దీను నెన్నేని గతుల
భక్తి నెల్లఁబరీక్షించి పరమ కృపను
శాశ్వత స్తితిఁగల్పించు ; సత్యమైన
భక్తి నెఱపు దీనుండు నేపట్టునందు
నఖిల పురుషార్థముల సాధనాదికముల
స్వాభిమానముఁగానఁ; డట్లగుటఁ జేసి,
శంకరుఁడు పల్కినటు మోక్షసాధనముల
భక్తి మార్గంబ మిన్నయై పఱగు చుండు.

**సూ: తస్యాః జ్ఞాన మేవ సాధన మిత్యేకే. 28**

టీక: తస్యాః= అపరమ భక్తికి, జ్ఞానం – ఏవ = జ్ఞానమే; సాధనం– ఇతి= సాధనమని; ఏకే =కొందఱు ( ఆచార్యాః మన్యంతే = ఆ చార్యులు భావించు చున్నారు)

**తె. గీ. దీని సాధన కొందఱు జ్ఞానమనిరి.**

వివ: అరయ భక్తునకీ జ్ఞాన మవసరంబు;
భక్తుఁ డెపుడుఁదాఁగొల్చు దైవమును గూర్చి
స్పష్టముగ విశ్వసించి, తత్ప్రభువె సకల
భువనభర్తయు, నాధారభూతుఁడనియు
జగముల మహేశ్వరుండని, సకలభూత
సృజన పాలన సంహార శీలుఁడనుచు
మాయకు నధీశుఁ డజుఁ డనపాయుఁ డనుచు,
అమలుఁ డఖిలజ్ఞుఁ డఖిలాత్ముఁ డవ్యయుండు

నిర్గుణుఁడు నిరాకారుఁడు నిర్వికారుఁ
డయ్యు, సగుణుఁడు సాకారుఁ డనుచు, నతని
కంటె శ్రేష్ఠులు తుల్యులు గాని లేర
టంచు భగవాను దివ్య మాహాత్మ్యమెల్ల
నెఱుఁగ నగు ; ఈ వివేకంబు కరము వలయు.
ఇట్టి జ్ఞానంబుపార్జింపఁడేని తగిన
శ్రద్ధ యుదయింపఁగాఁబోదు ; శ్రద్ధ లేక
ప్రీతి జనియింప దెవుడుఁ, దత్ప్రీతి హృదిని
నొనర దేని భక్తి దృఢత్వ మొంద లేదు.
కాన, దీన నద్వైత విజ్ఞానసాధ
నావసరము గల్గఁగఁబోదు; కేవలంబు
శ్రద్ధ కతన నీశ్వర భక్తి ప్రాప్తమగును.

★ ★ ★

ధ్రువుఁడును గజేంద్రుఁడును జటాయువును శబరి
పరమమౌనిట్టి భక్తి నీశ్వరునిఁ గనిరి.

**సూ : అన్యోన్యాశ్రయత్వమిత్యన్యే** 29

టీక: అన్యోన్య– ఆశ్రయత్వమ్– ఇతి = ఒక దానినొకటి ఆశ్రయించి యుండునని; (పరస్పరాశ్రయము కలవని) అన్యే = కొందఱు; ( మన్యంతే = తలంతురు).

**తె. గీ : కొందఱు పరస్పరాధార మొందుననిరి.**

వివ : జ్ఞాన భక్తి కర్మములు భిన్న గతిఁగనవు.
అవి పరస్పరాధారక మగుచు నుండు.
ఎఱుక లేకున్న సద్భక్తి పఱఁగ. బోదు.
కర్మము లొనర్చు నెడల నిష్కామపరత
కలుగఁబోదు భక్తిజ్ఞానము లవిలేక;

కర్మ భక్తి శూన్యంబైన జ్ఞాన మరయ
'మెట్టవేదాంత'– మనఁబడు; నిట్టు లీత్ర
యంబును బరస్పరాధారకంబ యగును.

★ ★ ★

జ్ఞాన కర్మంబులకు స్వీయ శక్తి లేదు
బత్తి సాయంబు లేనిచో వ్యర్థమగును.
ప్రభువు నంతఃపురంబున, భక్తియటుల
జ్ఞాన కర్మంబులకుఁ బ్రవేశంబు లేదు.

★ ★ ★

గౌణభక్తిచే నీశ్వరానూన తత్త్వ
మెఱుఁగ నగు ; దానికతన నీశ్వరుని యందుఁ
బరమ మగు ప్రేమ వైళ ముత్పన్న మగును.
కాని, కేవలభక్తి సంకలితుఁడైన
మనుజునకు నీమతంబు వేఱనఁగరాదు
నిర్మల '' ప్రేమ భక్తి '' జనించునేని
నతనికింక జ్ఞానంబు వేఱైన దున్నె?
ప్రేమి ప్రేమాస్పదులు నెందువేఱుగాక
యిరువు రేకత్వమును గాంచునెడల, నింక
జ్ఞానమననేది? యెవరికిఁ గలుగవలయు?
జ్ఞానమును– జ్ఞాని– జ్ఞేయ మేకత్వ మొందు.

**సూ: స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారః** 30

టీక: స్వయం ఫలరూపతా = భక్తి తనకుఁదానే ఫలరూపమైనది; ఇతి = అని; బ్రహ్మకుమారః = నారదుఁడు; (మన్యతే = తలంచుచున్నాఁడు).

**తె. గీ. : అదియె ఫలరూపమనుట నారదు మతంబు.**

వివ: సాధనము భక్తి – భక్తియే సాధ్యమగును
భక్తియే మూలము ఫలంబు భక్తి యగును
భక్తికై భక్తి సలుపును భక్తగణము
తనకుఁదా ఫలరూపమై తనరు కతన.

★ ★ ★

అన్యమగు సాధనమున నయ్యది లభింప
దింక శ్రేష్ఠవస్తువు భక్తి కెందులేదు.
భక్తిఁ బడయఁగ సాధన భక్తి సుమ్మి.
అది స్వతంత్ర ; యన్యాధార మరయఁ బోదు.
జ్ఞాన విజ్ఞానముల్ తద ధీన మగును.

**సూ : రాజగృహ భోజనాదిషు తథైవ దృష్టత్వాత్** 31

టీక : రాజగృహ–భోజన– ఆదిషు= రాజా–గృహము–భోజనము మొదలైనవాని యందు; తథా – ఏవ = అవిధముగనే; దృష్టత్వాత్ = ఎఱుఁగఁబడు చున్న కారణమున.

**తె. గీ : రాజగృహ భోజనాది వార్తలగుఁదెలియు.**

వివ : అనుభవము లేక రాజగృహముల తీరు,
నారగింపక షడ్రసాహారరుచులు
మనుజుఁడెఱుఁగఁ, డయ్యవి కలవనెడిమాట
లాలకించినమాత్ర; నట్లగుటఁజేసి
జ్ఞానముఁ గడించినను బ్రేమానుభవము
నొందని నరుఁడు సంతృప్తిఁ బొందలేఁడు.

**సూ: నతేన రాజపరితోషః, క్షుచ్ఛాంతిర్వా.** 32.

టీక: తేన = ఆవార్త లెఱుఁగుటచేత; రాజపరితోషః = రాజసంతోషము; క్షుత్–శాంతిః –వా = ఆకలితీరుట గాని; న–(దృష్టః)= లేదు.

తె.గీ: దాన నృపుప్రీతి కుచ్ఛాంతి యేని లేదు.

వివ: రాజ వర్య ప్రాసాద వర్ణనల వినుచు
దానియునికి గ్రహించు మాత్రన నిజప్ర
యోజనము సమకూరదు; రాజా మిగుల
ధార్మికుండును, స్వజన హితంకరుండు
శక్తి శాలియు గుణరూప సంపదలకు
నిక్కయగు—నను మాటల నెఱుఁగుమాత్ర
నరున కేమి యొదవు? నృప వరుఁడు దీన
వీనిపయిఁ బ్రీతినొందునే? —పెక్కుగతుల
భోజనము వార్త లాలించు పూరుషునకు
నాకలి శమించు నొక్కొ? భక్ష్యాదికంబు
లందు నెయ్యేవి యెన్ని పాళ్లైన నేమి ?
యెటులఁ జేసిన నేమి ? యొకించు కేనిఁ
జవిఁగొని యెఱుంగఁడేఁ బ్రయోజనము గలదె ?

★ ★ ★

కేవలంబు శబ్ద జ్ఞాన మా విధమున
నీశ్వరుని సుప్రసన్నుఁ గావింపలేదు ;
జీవికిని శాంతి నేఁ గనఁ జేయలేదు.
కాని, యెల్ల రీశునకు సమాను లౌదు ;
రైనఁ దత్ప్రసన్నత భక్తియందుఁ దవులు.

★ ★ ★

''సర్వభూతములందు నే సముఁడ, లేఁడు
ప్రియుఁడుఁగాని నాకొండు నప్రియుఁడు గాని;
ఎవరు భక్తితో నను భజియింతు, రుంద్రు

వారు నా యందు – నే నుందు వారి యందు''
ననుచుఁ గృష్ణుఁడు గీతల ననఁగ లేదె!

సూ: **తస్మాత్సైవ గ్రాహ్యా ముముక్షుభిః** 33

టీక: తస్మాత్ = కావున; ముముక్షుభిః = మోక్షాపేక్షకలవారిచేత; సా– ఏవ = ఆపరమభక్తి యొక్కటియే; గ్రాహ్యా = (గమ్యమని) గ్రహింపఁ దగినది.

తె.గీ: **కావున ముముక్షువులకిదె గ్రాహ్యమగును.**

వివ: భక్తిచే నలతిగ భవబంధచయము
సమసిపోవును; భక్తుపై విమలప్రేమఁ
బఱపి, యాత్మలీలల భగవానుఁడతని
చెంతఁజూపు; పరస్పర శ్రేష్ఠములగు
సాధనల నలభ్యమగు మోక్షంబు మిగుల
సులభమయి భక్తు శరణంబుఁ జొచ్చుచుండు;
కాని, భక్తుఁడు కనువిచ్చి దాని వంక
నరయఁబోఁ, డిట్టు సుళువుగఁ బ్రాప్తమగుచు
సకల మార్గంబులందు లెస్సయనఁ బఱఁగు
దీనినిఁ ద్యజించి, యెవఁడన్యమైన దాని
కాసవడు?; సుబుద్ధియును శ్రద్ధాళుఁడైన
జనుఁడు దృఢమగు భక్తి నే సలువ వలయు.

★ ★ ★

ప్రేమ భక్తిని మించిన కామితంబు
లేదు–లేదీ జగంబున లేదు సుమ్ము.
మోక్షకామియౌ వాని కపేక్షణీయ
మీ పరమభక్తి యొక్కటే యిందునందు.
భక్తుఁడౌ వాఁడు స్వర్గాప వర్గముఖ్య
పదవు లాసింపఁడీ పరాభక్తిఁ దప్ప.

★ ★ ★

''భక్త జనులు నారాయణ పరులు శాంతు
లరయు స్వర్గాపవర్గ దుర్నరకములను
దుల్యముగఁ గాంచు వార లెందునను వారు
భయమెఱుంగరం''చని, పల్కు భాగవతము.

''కడఁక, ధర్మార్థ కామ మోక్షములనేని
నాససేయ నించుక–శ్రీనివాస! సతము
నీదుపాదాంబుజామృతా స్వాద భవ్య
జీవితంబు మాత్రంబ యాచింతు'' – ననుచుఁ
దమిని 'నారద పంచ రాత్రము' వచించు.

★ ★ ★



# 5. ప్రేమభక్తిసాధన-సత్సంగమహిమ

సూత్ర : తస్యాః సాధనాని గాయంత్యాచార్యాః 34

టీక : తస్యాః=అపరమభక్తియొక్క; సాధనాని = సాధనములను; ఆచార్యాః= ఆచార్యులు; గాయంతి = కీర్తించుచున్నారు.

**తె.గీ. భక్తి సాధనల్ తద్విదుల్ పలికినారు.**

వివ :- జ్ఞాన కర్మంబులకు మిన్న యైన దనుచు
ప్రేమభక్తినిఁ దెలిపి, కోవిదుఁడు, మౌని
వరుఁడు, నిర్మలతత్త్వాను భావ్యుఁడతుల
భక్తి శాస్త్రప్రధాన ప్రవర్త కుండు
నారద మహర్షి యిట సవిస్తారముగను
బరమభక్తులచే మున్ను బలుకఁ బడిన
భక్తి సాధనముల వచింపఁగఁ దొడఁగె.

**సూ : తత్తు విషయ త్యాగాత్ సంగ త్యాగాచ్చ. 35**

టీక: తత్ = ఆ ప్రేమశక్తి; తు= ఇట; (ఆనినవో) విషయత్యాగాత్ = (అజ్ఞానావృత బుద్ధికిఁ దోఁచు ప్రాపంచక సత్యత్వమును) విషయములను దృజించుటవలన; సంగత్యాగాత్= అవిషయసంసక్తి విడుచుటచేత; చ =ను ; (సంభవతి =లభ్యమగుచున్నది).

**తె. గీ: అదియొ - విషయముల్ తత్సక్తి వదలఁబొదలు.**

వివ: పరుఁడు. ప్రేమధాముఁడు భగవంతుఁడమల
సచ్చిదానందుఁడైన యీశ్వరు సనాత
నాంచిత చిదంశమీ జీవుఁ డైన కతన
జీవి హృదయంబు నందు స్వాభావికమగు
ప్రేమవాహిని సతము స్రవించుఁ, గాని

యిది, విషయపాళిపైఁ బ్రవహించుచుండుఁ
గాన, నితని ప్రేమాపగ కలుష మొంది
వ్యసన కరమగు కామ రూపము వహించుఁ;
గలుగు హరి దివ్య రూప ప్రకాశ మెఱుఁగ, —
దట్టి ప్రేమ ప్రకాశ దివ్య స్వరూప
మెఱుఁగ — విషయ మార్గమును దప్పించి, దాని
గతిని సర్వేశ్వరాభి ముఖంబుఁజేయ
నగును; దీనికిఁ దగు నుపాయములు రెండు.
అఖిల విషయ స్వరూప సన్న్యసన మొండు ;
వివిధ విషయ ప్రసక్తిని విడుట రెండు.

★ ★ ★

''విషయ సంగ్రహ భోగముల్ విడువనేల?
భక్తిమార్గమందివి ప్రతి బంధకములు
గా'' వనుచు వానిని యథేచ్ఛగా భుజించు
మానవుఁడు భక్తిహీనుఁ డజ్ఞాని యగును.
అరయ భక్తి పద్ధతిని భోగ్యమగు నట్టి
వస్తు వెట్టి దేనియును గన్పట్టఁబోదు.
భోక్తయే లేనిచో నింక భోగ్యవస్తు
వెందునుండి జనించు? — నిందేకమాత్రుఁ
డరయ భూత జీవాధార పురుషుఁడొకఁడె
సర్వభోక్తయౌ; నిట్టి విశ్వమునఁ గలుగు
సకలమౌ వస్తు సర్వాంగ సహితముగను
బఱఁగి, యుపభోగ్యమైనదీ ప్రకృతి—నిజము.
అట్టియెడ భక్తునకును భోగ్యమగు విషయ
మేమిగలదు? — విషయ బద్ధ మౌ మనంబు
అన్యనవ విషయంబుల నాసఁగొనుచు

దేననేఁ దృష్టిఁగనక యద్దాని కంటె
భిన్నమై శ్రేష్ఠమగు దాని నెన్నికొనుచు
వివిధ బాధల నొందుచు విఫలమొందు.

★ ★ ★

కాయమును విషయోప భోగములఁ జిక్కి
మనసు విషయసక్తినిఁ దగు ల్కొనెన యేని
నే తనూమనంబుల నీతఁ డూఁతగొనుచుఁ
బ్రియ తముఁడగు నీశ్వరుని సేవింపఁగలఁడు?
కాన–విషయ నిగ్రహము ముఖ్యమగు కృతియు.

★ ★ ★

బాహ్యవిషయంబులననేల ? – స్వాంతమందు
విషయ చింతన మేనియు విడువ వలయు
''విషయ చింతనచే నుద్భవించు చుండు
దాని యందున నాసక్తి మానవునకుఁ
గామ మాసక్తి చేతను గలుగు చుండు ;
కామముననె క్రోధంబు నాకారమొందు
పుట్టు క్రోధమూలమ్మున మోహ మట్టి
మోహమున స్మృతిభ్రంశము పొసఁగు, స్మృతివి
నాశనంబున బుద్ధియు నాశమగును,
బుద్ధి నాశనమునఁ జెడి పోవునరుఁ''డ
టంచు గీతలఁ హరి ప్రవచించ లేదె !

★ ★ ★

''విషయముల యందుఁ జిక్కిన విషయములనె
ధ్యానమును జేయు మనసు; నాయందలీన
మంద నన్గొల్చు చిత్తమం'' చనఁడె ? హరియు.

★ ★ ★

ఇంద్రియముల మార్గమున నెందెందో వెలికిఁ
బఱగు వాఱుట హృదయ స్వభావ మగును.
కనెడి వస్తువులఁ మఱి, వినెడి వానిఁ
దినెడి వానిని మఱియు వాసనను గొనెడి
వాని,ఁ దాఁకెడి వానిని మానసంబు
ధ్యానమును జేయుచుండు; నెద్దాని యందు
నధికముగఁ దవుల్కొను దాని నాస చేయు.
నాటకమును వీక్షించిన నాట వెలఁది
పాట విను చున్న హృదయ మచ్చోటఁ జిక్కు;
భక్తి నృత్యముల్ గాంచిన భజన వినిన
సక్తి యుదయ.మొందును మానసమున కందు.
ఎల్ల భక్త్యభిలాషలు నీశ్వరాను
కూలములుగాని విషయముల్ గొనఁగరాదు–
పనివడుచు వానిఁ ద్యజియింప వలయు నెపుడు
వాసుదేవుని మఱపించు ప్రాకృతంపు
సంకెలలఁ జిక్కఁబెట్టు విషయము లెల్ల
భక్తఁడెప్పుడే నాదరింపంగరాదు.

★ ★ ★

హరి భజన చింత నాంచిత ధ్యానములును
సాధు సత్కార వందనార్చనము లీశ్వ
రాను కూల కర్మంబు–లివ్వాని యందుఁ
జిత్త మాసక్తిఁ గను నట్లు చేయువలయు.
అవని, శారీర సంసార యాత్రలకుఁద్య
జించ రాని వానిని సంగ్రహించుటయును,
అట్టి విషయముల్ సేవించు టవసరములు
గానెగడునేని, నవియు శాస్త్రానుకూల

మంది, యీశ్వరాజ్ఞా బద్ధమైన యెడల
వాని సేవింపనగు; నన్యమైన వాని
కెందుఁ దావొసంగకయు త్యజింప నగును.
ఈ విధంబైన విషయ నిషేవణంబు
విషయసంత్యజనంబునా వెలయుచుండు.

★ ★ ★

వెలికి విషయ పరిత్యాగి వలె నటించి
మదిని వానిని స్మరియించు మానవుండు
త్యాగి కానేరఁడెపుడు; సూత్రంబు నందు
విషయముల వీడుటయు కాక–విషయసక్తి
నేనిఁ ద్యజియింపుఁ డనుచు బోధించఁ బడియె.
"విషయ విషయ సంసక్తిని విడుట యెల్ల
త్యాగ"–మని పల్కఁబడె భారతంబు నందు.
విషయముల్ విడి, మనసు తద్విషయరాగ
శూన్యమై యీశ్వరప్రేమఁ జూఱఁగొనిన
దివ్యధామంబుఁగూర్చు తత్ప్రేమ కతన
నఖిల విషయ వాసన తన యంత నడఁగు.
అమృతమును జవిఁజూచి యా యమృతగుణము
నెఱుఁగుచో నితరమునందు దృష్టి చొఱదు.
కాని, యద్దానిఁ బడయఁ దద్గతి నెఱుంగ
విషయ విషమును దొలుదొల్త విడువ వలయు;
విషయ సంసక్తి విడిచి గోవిందు నందు
సక్తిని గడించుటే మేటి సౌఖ్యమగును.

★ ★ ★

"అనవరతమును నావయి స్వాంతముంచి
వివిధ విషయంబులందు నపేక్షలేని
భక్తుఁడాత్మరూపుఁడగు, నావలనఁ బరమ

సౌఖ్యమొందును ; విషయ ప్రసక్త చిత్తు
లైనవారికీ సుఖము లభ్యంబు గా'' ద
టంచు హరి – భాగవతమున ననఁగ లేదె?

సూ : **అవ్యావృత్త భజనాత్ .** 36

టీక: అవ్యావృత్త భజనాత్ = ఎడతెగని భగవత్సేవ వలనను .

తె. గీ.: **స్వల్పమేఁ విరామములేని భజనమునను.**

వివ : భక్తికిఁ ప్రధానాంగము భజన మగును.
అదియె సాధ్యము సాధనంబై తనర్చు ;
ఈశ్వర ప్రేమ పడయఁ గాంక్షించు వాఁడు
సంతతము హరిభజనంబు సలుప వలయు
దాన నిర్మల ప్రేమ ప్రాప్త మగుచుండు.
భజన లేకయే – ముక్తి, నీశ్వరుని ప్రేమ
నొందఁ దలపోయు వాఁడొక మందబుద్ధి.

★ ★ ★

''నీరము మథించి పడయనౌ నేతి నేని,
ఇసుమునఁ దైలమేని గడించవచ్చు
హరి భజన లేక ఘోర భవాబ్ధి దాట
దుర్లభం'' బని వలుకఁడే ? – తులసిదాసు.
సాధు భక్తికి భజనంబె సాధనంబు,
భక్తి సాధకునకు ముఖ్య వస్తు విదియ;
మతిని విషయ వితతి నుండి మగుడఁ జేసి
సత్వరమ దాని హరికైవసం బొనర్చు.

★ ★ ★

క్రమత విషయ విముఖత వైరాగ్య మగును.
వాసుదేవుని భజన మభ్యాస మగును,
కలుగు నభ్యాస వైరాగ్యముల విశుద్ధ

మైన యీశ్వర ప్రేమ సంప్రాప్త మగును.
కాని, యిపుడు సల్పి మఱొక్క క్షణము మాని,
నేఁడొనర్చుచు నది మఱునాఁడు వదలి
పఱపు ప్రేమంబు–సాదరభక్తి యే–న
ఖండ భజనమేగాదు ; జగంబు నందు
భజన రూపకమైన యభ్యాసమంత
రాయ మదిలేక సతము–సర్వత్రఁ బఱగు
నపుడు సత్కార పూర్వకం బగును – యోగ
దర్శనిని మహర్షి యగు పతంజలి యనె –
''అభ్యసన దీర్ఘ కాల పర్యంత మంత
రాయ రహిత సత్కార పూర్వకముఁ గాఁగ
నిలుచునే దృఢంబయి నెగడు''–ననుచు.
కాన, నిత్య నిరంతరా ఖండ చింత
నమున భగవదాప్తియు సహజముగఁ బొసఁగు

★ ★ ★

''ఇతర విషయము లందుఁ బోనీక చిత్త
మెవఁడు సతము నిత్యంబు స్మరించు నట, మ
హామతీ! నిత్యయుక్తుఁడు నైన యోగి
కమిత సులభంబుగా లభ్యమగుదు నే''న
టంచనఁడె గీతలఁ గృష్ణుఁ డర్జునునకు.

★ ★ ★

విరతి లేకయే భగవంతుఁ బ్రేమ పూర్వ
కముగ స్మరణఁ జేయుచు నిజ కర్మములను
పొనరుపందగు; స్నాన భోజన విహార
ములను సైతము భజనంబు సలుప వలయు.
ఎందుక్షణమేని స్మరణ త్యజించ రాదు.
స్థిరముగ స్వరూప చింతనఁ జేయ బుద్ధి

చాలదే – హరినామ సంస్మరణ మైన
నిరతమును జేయఁదగిన – దా స్మరణ మనసు
ప్రాణముల రెంటినిఁ బవిత్రంబు సలిపి
వాసుదేవ పదాంబుజ పరమ భక్తిఁ
బడయఁ జేయు :– తన్నామ జపంబు ం నందు
సహజ రీతి నుచ్ఛ్వాస నిశ్శ్వాస చలన
ములకు ననుగుణ్యముగ మనంబునను మెల్ల
నగు స్వరంబు మాల్కొనఁగఁ జేయంగఁ దగును.
నామ జపమిది;– సతతంబు ప్రేమ కామి
నిలిచినను గూరు చున్నను మెలఁగు చున్న
బరువులూను చున్నను నిద్రఁబడయుచున్న
మేలుకొని యున్న సలువంగఁ బోలు జపము.

★ ★ ★

అట్టు లభ్యసనము దృఢమైన వాని
మనసు విక్షేప శూన్యత్వమును గడించి,
తనకుఁదా హరి చింతనఁ దవిలి కొనును.
ప్రాయికముగఁ బ్రసిద్ధులౌ భక్త వరులు
సాధుజను లాచరింతు రీ సాధనంబు.
వాసుదేవ స్వరూప ప్రభావ గుణ ర
హస్య చింతఁ దన్నామ జపాదికములఁ
దైల ధార కైవడి నిరంతరముఁ దెంపుఁ
గానక యొనర్పు నదియె 'యఖండ భజన'.

★ ★ ★

సాధకుఁ డెఱుంగ నగు రహస్య మొకటిందు.
ఈశ్వరప్రీతి కొఱకుఁ గావించు నెల్ల
మంచి పనులు 'భజనముగ' నెంచ నగును.

''శ్రవణమును, గీర్తనంబును, స్మరణము, హరి
పాదసేవనం, బర్చన వందనములు,
అధ్యయన సాధుసేవలు, నఖిల భూత
హిత సమాచరణంబు, ఫలేచ్ఛ విడిచి
స్వీయ కర్మంబు లెల్లను జేయుటయును,
పుణ్య తీర్థ సంసేవన ములును. భజన
ముగఁ దలంపనౌ సాధకుఁడగు నతండు.

★ ★ ★

వఱలఁగ నిందు '' అవ్యావృత్తభజన'' – మనుట
ఈశ్వర ప్రేమఁ బెనుచు నీ కృతుల నేది
యేనిఁ బర్యాయముగఁ బొనరింప నగును.

**సూ:** **లోకేఽపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్.** 37

**టీక:** లోకే–అపి = లౌకిక కర్మము లొనర్చుచున్నను; భగవద్గుణ శ్రవణ కీర్తనాత్ = భగవంతుని కల్యాణ గుణములను వినుచుఁ గీర్తించుచుండుట వలన.

**తె.గీ.:** **ఎల్ల లౌకిక కర్మ ప్రవృత్తి నాప**
**రాత్పరు సుగుణ శ్రవణ కీర్తనల కలిమి.**

**వివ:** అనిశమును భగవంతుని మనము నందుఁ
జింతనంబు సేయంగనౌ ;– చెవులు చొనిపి
వరదు గుణము లాలించుచు, వాక్కు తోడ
విష్ణు సంకీర్తనములఁ గావింప వలయు.
శ్రవణ కీర్తనాదులు భక్త జనులఁ గూడి
ప్రీతిఁ జేయఁ బ్రేమం బభివృద్ధి నొందు.
చిత్త మొనరించు శ్రీహరి చింతనంబు
సార్థకంబగు. నన్యేంద్రియములుఁ గూడ
హరికి సంబంధమైన కార్యముల మెలఁగ

★ ★ ★

వినుటఁ బలుకుటలే యెల్ల పనులయందుఁ
బ్రప్రధానంబులై యిందు బఱఁగు చుండు ;
వార్త లేవియో విని యేమొ పలుకు వాని
చిత్త మెటు నిల్పు శ్రీకృష్ణ చింతనమున?
కాని, వీనులు, రసనంబు శ్రీనివాసు
నందు హత్తినేఁ మనసు తదన్యమైన
యింద్రియాళి వేఱొకటఁ జరింప బోక
యీశ్వర పరాయణత్వ మార్జింప నేర్చు.
కర్ణముల తోడ హరి గుణ గణము వినుచు
నాల్కతోడఁ దన్నామముఁ బల్కునేని
జనన సాఫల్య సాధన మనఁగఁ దగును.

★ ★ ★

బ్రతికి యుంట లుచ్ఛ్వాస నిశ్వాసములనొ
నర్చుటలు, భుజించుట మైథున ప్రసక్తిఁ
గనుటలే–పుటుకకు సార్థకంబులేని
వనము లందున బ్రతుకవే పాదపములు?
సలుపదే శ్వాస కుమ్మరి కొలిమి తిత్తి?
భోజనము–మైథునము జంతువులకు లేవె ?
వాసుదేవు వార్తలు కర్ణ పథము లందుఁ
బడి యెఱుంగని వాఁడు ద్విపాద పశువు
శునక ముష్ట్రము గృధ్రంబు సూకరంబు
వాని కంటె మేలని–పల్కు భాగవతము.

★ ★ ★

విష్ణు విననె చెవుల్ సర్ప బిలము లగును,
కమలనాభుఁబల్కని నాల్క కప్పనాల్క,
ఎప్పుడే నధోక్షజాని భాషింప లేని
పాపి వాక్కులు నింద్యముల్ వ్యర్థములగు.

★ ★ ★

ఎవఁడు వాక్కుచే హరిని వచించుచుండు,
నీశ్వరుని లీల లెవఁడు వర్ణించుచుండు,
వాని వాక్కులు సత్యముల్ పావనములు,
మంగళ ప్రదములును సన్మానితములు
నవ నవోన్మేషములు మహానందకరము
లతి రుచిరములు – నాతఁడే యఖిల జగతి
వ్యసన పాథోధి నవలీల నధిగమించి
వ్యయ విరహిత పదంబును బడయఁ జాలు.
భాగవతమున హరి యిట్లు పలుక లేదె ?
''జ్ఞానులును మత్పరులు శ్రద్ధధానులగుచు
నాదృతిని నాగుణములు నిరంతరంబు
వినుచుఁ గీర్తించుచును ముదమును వహించు
వారు నాయందు సద్భక్తి వడయుచుంద్రు''

★ ★ ★

ప్రణతుఁడౌ పరీక్షితున కిట్లనియె శుకుఁడు
''దేవదేవుఁడౌ శ్రీకృష్ణ దివ్యజన్మ
కర్మములను శ్రద్ధా పూర్వకంబు గాఁగ
గీర్తనము సేయుచో సర్వ కిల్బిషములు
సమయు, హరి రుచిరావతారములు విక్ర
మంబులును బాలలీలాదికంబు లాల
కించినన్ బఠించిన సంస్మరించినన్ భ
వాబ్ధి దరియించుచుఁ బరమహంస లభ్య
పదము, హరి పరాభక్తినిఁ బడయు నరుఁడు''
మఱియు హరిసూక్తి శుకుఁడిట్లు తెలుఁగఁ బలికె.
''అవ్యయానంద ఘనుని, యనంత గుణుని
బ్రహ్మమైన నాయందు సద్భక్తిఁ గనిన

మానవుఁడు కోరు వస్తువెందేనిలే, ద
వాప్త కాముఁడు గృతకృత్యుఁడై వెలుంగు''

★ ★ ★

కృష్ణనామ సంస్మరణ సంకీర్తనంబ
నంత ఫలవంత మగును; దన్నామ శబ్ద
మావరించు పర్యంత మా యావరణము
పావనంబగు; అంతిమ శ్వాస నెట్టి
భావమున నేని నా శ్రీనివాస నామ
సంస్మరణ తోడ నసువుల సంత్యజించు
భక్తుఁడెవ్వట్టునన్ యమ భయముఁ గనఁడు

★ ★ ★

సాధునింద, నామాంతర చర్చ, దేశ
కావమానంబు, శాస్త్ర గర్హణము, మఱియు
నామశబ్దార్థ వాదంబు, నామశక్తిఁ
బాపములు సేయుటయుఁ, గ్రతు వ్రతము లెల్ల
నామ సమములం చెన్నుట, నాస్తికునకు
నామము నెఱుంగఁ బెట్టుట, నామశక్తి
నెఱిఁగియున్ బ్రేమఁగనకుంట, నెల్ల విషయ
ముల నహంకార మమకార ములను గనుట
యనెడి పది యపరాధము లడఁగునటుల
నామ జపకీర్తనంబు లొనర్ప వలయు.

★ ★ ★

సంజ్ఞ నేన్ బరిహాసంపు సరణి నేని,
లీల నేనిఁ గాదే నవ హేళి నేనిఁ
గృష్ణ నామ సంస్మరణఁ గావించు టెల్ల
యఘ హారంబుఁ బావనమందు రాత్మ విదులు
తెలియ కేనియు లెస్సగఁ దెలిసి యేని

జనులు హరినామ కీర్తన సలిపిరేని,
ఇంధనము లగ్ని చేత దహింపఁబడెడి
సరణి పాపచయంబు నాశంబు నొందు.

★ ★ ★

దేవహూతియుఁ గపిలుతోఁ దెలిపెనిటుల ;–
''అనఘ; నీ నామమును రసనాగ్ర మందుఁ
దాల్చు చండాలుఁడేని నుత్తముఁడె యగును;
యజ్ఞ దాన తపో నిగమాధ్యయనము
లైన నామ సంస్మరణ తుల్యముల గావు''.

★ ★ ★

భయము నొందిన వాఁడేనిఁ బతితుఁడేని
నార్తుఁడేన్, వివశత్వము నందు నాతఁ
డైన హరిభజనము సల్పినంత మాత్ర
భాస్కరుం డంధకారంబుఁ బాపు నటుల,
వాయు వంబుదంబులఁ ద్రోలి వేయు రీతి,
వాసుదేవుఁడు నామప్రభావ గరిమ
భక్తులోనఁ బ్రవేశించి, పాప తాప
ముల నడంచు; ''కష్టంబులు పొలుచువేళ
హరియె స్మర్తవ్యుఁ'' డనుచు మున్ వ్యాసుఁ డనఁడె!
వివశుఁడేని నామము పేర్మిఁ బెను ఫలములఁ
బడయుఁ బ్రేమఁ గొల్చెడి సాధువరుల వేఱఁ
బలుక నేల ?– తద్భక్తి సంప్రాప్తి కొఱకు
కృష్ణ నామ లీలా గుణ కీర్తులన్ ని
తాంత కీర్తనా కర్ణన చింతనం బ
నంత ఫలమని నిత్య నిరంతరంబు
సంతసమున సల్పుటె మహా సాధనంబు.

సూ : **ముఖ్యతస్తు మహత్కృపయైవ**
**భగవత్కృపాలేశా ద్వా.** 38

టీక : ముఖ్యతః- తు= ముఖ్యముగను; (అందు) (ప్రేమభక్తి ప్రాప్తి సాధన); మహత్-కృపయా- ఏవ= మహాత్ముల కరుణ వలననే; భగవత్కృపాలేశాత్ - వా = భగవానుని కరుణా లేశము వలనఁ గాని; ( సంభవతి= కలుగుచున్నదిం) (లభ్యమగుచున్నది.).

తె. గీ: **పరమ సాధు మహాత్ముల కరుణ యేని**
**హరికృపాలేశమేని ముఖ్యమగు దీన.**

వివ: ప్రేమ భక్తి కై విషయముల్ విషయసక్తి
త్యజన సేయుట, నవిరళ హరిభజనము.
శ్రవణ కీర్తన లను మూఁడు సాధనములఁ
బలికి, సురమౌని - యొకటియై స్వబలమునను
మూటి బలముల సమకూర్చ మేటి యగు మ
హాత్ములౌ భక్త వరుల యవ్యాజకరుణ
యేని, హరి కృపాలేశము గాని ముఖ్య
సాధనము శ్రేష్ఠమని యిట సన్నుతించె.
సాధుజనులు కృపాళురు సహజముగను.
వారి యెడల శ్రద్ధయును విశ్వాసమూని,
సఖ్య మొనరించు టనినఁ గష్టమగు పనియు;
ఆమహాభక్త సంసక్తి ప్రాప్తమైన
నెల్ల విషయముల్ తమయంత డుర్లిపోవు.
సాధుసంగతి గలిగిన శ్రవణ కీర్త
నములు రేయింబవళ్లు నంతరము లేక
జరుగుచునె యుండు; దానఁ దత్స్మరణ నతఁడు
మఱువ నెంచిన నించుకేన్ మఱవుఁ గనఁడు.

★ ★ ★

మఱియు నే మహాత్ముండు కృపామాత్రముననె
యోముచును ఫలరూపమౌ ప్రేమభక్తి
సంశ్రితున కిడఁ జాలు – నా సాధువరుండు
పండితుండు – సదాచార మాత్రుండనాక
కేవలము భగవానుఁడణ భావమూని
యీశ్వరు యజించు నటు యజియించ వలయు.

★ ★ ★

ఆ మహాత్ముని స్నేహ మనంత ఫలద
మనఁడె ? విజ్ఞాన మయుండు మహర్షి కృష్ణ
చరణ కమల రసామృతాస్వాద ముదిత
చేతనుండు ఁబ్రేమమూర్తియౌ సూతుఁ డిటుల ;–
''క్షణమయేణ భగవత్సంగి సంగమునకు
స్వర్గమేనియు మఱి, యపవర్గ మేని
నేగతి నొకింత యేన్ దుల దూఁగ వనిన
మర్త్యలోక సౌఖ్యంబుల మాట లేల ?''

★ ★ ★

ముక్తి – శుద్ధ చిత్తంబు చేఁ బొందనగును;
అదియె సాధుసంగతి ఫల మనఁగ రాదు.
సాధు సాంగత్య భాగ్య లేశమును బోల
ముక్తి తగదు;– సర్వైశ్వర్య పూర్ణ మాధు
రీ రసానూన లీలా విహారి యైన
కృష్ణునకు నిత్యసంగియౌ ప్రేమభక్తు
కరుణయే లభ్యమైన మోక్షమననేల ?
ప్రేమరూప భక్తియును బ్రాప్తించుఁ గాదె!
స్వచ్ఛమగు భగవద్భక్తిఁ బడయ నీక
చెఱచు ముక్తిని నొక పిశాచిగఁ దలంచి
వాసుదేవ భక్తుఁడు దానిఁ ద్రోసివేయు.

★ ★ ★

ఈశ్వర కృపాలవంబడి యెవరి పైనఁ
బఱఁగు. వాఁడు సద్భక్తుల ప్రాపుఁ గాంచి,
జ్ఞాన యోగాదులకుఁ జిక్క రాని హరినిఁ
దనకు స్వాధీనుఁగాఁ జేసి కొనును ;– భాగ
వతమునం దుద్ధవునితోడఁ బలికె శౌరి:–
''ఉద్ధవా! యన్యసంగతు లుడుగఁ జేయు
పరమ సాధుసంగతికి నేఁ బట్టు వడుదు.
విమల యోగ ధర్మ జ్ఞాన వేద పఠన
ములుఁ; దపోవ్రత త్యాగముల్ పూర్తవిధులు
యజ్ఞములు, దక్షిణలును, బుణ్యావగాహ
నములు, యమనియమములు నన్ వశునిఁజేయ
నేర'' – వనుచు;– ఈ పైఁ గర్మ నిచయముల స
కాముఁడై చేసెనేని స్వర్గతుల నొందు;
ప్రతిఫలాపేక్ష సర్వము వదలి చేయు
నాతఁడంతః కరణ శుద్ధి నంది ముక్తుఁ
డగును;– మాధుర్య లీలా విహారి నంద
నందనున్ జేర సర్వతంత్ర స్వతంత్ర
మై, యనన్యంబుఁ, బావనంబైన దొక్క
సాజ ప్రేమయ;– దీనికి సాధనాంత
ర ప్రసక్తి లే దీ పవిత్రమగు ప్రేమ
పరమ భాగవతుల్ మహా పురుషులైన
సాధువుల నాశ్రయించి కాంచంగ నగును.

★ ★ ★

జీవి నెద్దాని నీశుఁడు ప్రోవ లోనఁ
దలఁచుఁ, దత్కృపాలేశ మాత్రమున నిట్టి
ప్రేమ భక్తి జనించుట కేమి లెక్క?

ఈశ్వరుండు నిత్యముఁ గృపామృత రసోరు
వృష్టిఁ గుఱిపించుఁ దద్వర్ష బిందు వొకటి
యైన సాధు భక్తానుగ్రహంబు లేక
జీవి నాల్కపైఁబడ, దిట దేవమౌని
యా మహాత్ముల సాంగత్య మమిత దుర్ల
భంబని వచించెఁ బిదవ సూత్రంబునందు.

సూ: **మహత్సంగస్తు దుర్లభో௨గమ్యో௨మోఘశ్చ.** 39

టీక: మహత్–సంగః–తు= మహాత్ముల సాంగత్యమనిననో; దుర్లభః = పొంద సాధ్యము కానిది; అగమ్యః = ఎఱుఁగ రానిది ; అమోఘఃచ = తిరుగు లేనిదియు (వ్యర్థము కానిదియు); (భవతి = అగుచున్నది).

**తె. గీ.: ఆ మహాత్ముల సాంగత్యమనిన, దుర్ల
భంబగమ్యమమోఘమై పఱఁగుచుండు.**

వివ: అవనియందు స్వధర్మ పరాయణుండు
దైవసంపత్సహితుఁడు, సద్వర్తనుండు
సత్స్వభావుండు దొఱకుట చాల యరిది.
కలిగిననను సదాచారులుఁ గర్మపరులు,
జ్ఞానులగు మానవోత్తముల్ కలరు ;– కాని,
పరమ మగు ప్రేమభక్తి సంపదలఁ దనరి
జ్ఞాన కర్మ యోగులు సదా కాంక్ష సేయు
నీశ్వర ప్రేమ నిజకృపా దృష్టి మాత్రఁ
బఱపెడి మహాత్ములుంటఁ జొప్పడదు; కలిగి
రేని, దుర్లభమగు వారి నెఱిఁగి కొనుట.

★ ★ ★

బాహ్య రూపముచేఁ దెలుపంగ రాదు.
వేషధారులుఁ గపటులు వెలికిఁ గొన్ని

విషయముల నా మహాత్మ్ముల విధి నటింత్రు ?
గనుల నుండి బాష్పంబులఁ గార్చుటలును,
ఏడ్చుటలు, నవ్వుటలు మాత్రమే తలంప
విమల ప్రేమ భక్తుని లక్షణములు కావు.
ఇట్టి వెలివర్తనల నిర్ణయింప రాదు.
సత్యమగు ప్రేమ భక్తుఁడు స్వవిషయంబు
నెపుడు నెవరితోనేఁ బ్రకటించు కొనఁడు,
పరమ నిస్పృహుఁడౌ నిట్టి భాగవతుని
ప్రాప్తిఁ గనుటయే కడుఁ గష్ట మగును; గాన.
నతని సంసక్తి దుర్లభం బనఁగఁ బడియె.

★ ★ ★

ఎప్పుడేఁ భాగ్యవశమున నెఱిఁగి యేని
నెఱుఁగకేఁ సాధుసంగ మార్జింపఁ గనిన
వ్యర్థమదికా దమోఘమై వరలుకతన.
ప్రాయికముగ సాత్వికుఁడు సద్వర్తనుఁడగు
సూరిదర్శనమే చిత్తశుద్ధి నొసఁగి.
పాప తాప దైన్యంబులఁ బాపుచుండ, –
నీశ్వర ప్రేమపూరిత హృదయుఁ డగుచు
భూరి సత్కృపానం దైక మూర్తి యైన
భగవదీయుఁడౌ సాధు సద్భక్త వరుని
దర్శనం బనంత ఫలప్రదంబు గాదె!

★ ★ ★

మనుజుఁ డమవస నాటి రేయినిఁ బరుండి
యుదయమైనను దానింక నిదుర నుండి
యెఱుఁగఁ జాలఁడు గాని, వాఁడెఱుఁగకున్నఁ
దత్ప్రకాశంబు భాస్కరోదయము తోడఁ
గలుగుఁ గాదె! – దరిద్రుఁడై కష్టమొందు

మిత్రుఁదలఁచి కోటీశుఁడ మేయ ధనము
వ్రాసియిచ్చెనయేని బేఁద భాగ్యవంతుఁ
డగును జూవె! – వాఁడా వార్త నాలకించు
వరకుఁ దన దరిద్రత నెంచి వనరు చుండు.
అవ్విధమునఁ బ్రేమియును మహాత్ముఁడైన
భాగవతుఁ డెవ్వరికి నేనిఁ బ్రాప్తమ మగుడు
నెఱిఁగిన నెఱుంగకున్నఁ దత్పరమ కరుణ,
వాని మోహాంధకారంబు జ్ఞాన భాస్క
రోదయంబునఁ బాపి యత్యుత్తమమగు
ప్రేమ రూప భాగ్యంబుఁ బ్రాపింపఁ జేయు,
అట్టి దీతఁ డెఱుంగు పర్యంతమును ము
దంబుఁగన నేరఁ; డదియు సత్వరము తోఁచు ;
కాన, సాధుసంగతి యమోఘంబు. మఱీ, య
వశ్య ఫలదాయి యని యిటఁ బలుకఁ బడియె.

సూ : **లభ్యతేఽపి తత్కృపయైవ.** 40

టీక: లభ్యతే–అపి = (ప్రేమభక్తి (లేక) సాధుసంగమము) పొందఁబడినది యగుటయు; తత్–కృపయా– ఏవ = ఆ భగవంతుని కరుణ చేతనే .

తె. గీ.: **ప్రాప్తమగుటయు నా పరాత్పరుని కృపయ.**

వివ: ఈశ్వరుని కృప లేకున్న నెవ్వఁడేని
భాగవత సంగమ ప్రాప్తిఁ బడయలేఁడు
ఎవని సర్వేశ్వరుఁ డనుగ్రహింప నెంచుఁ
దెలియ నతనికిఁ దన్ను బంధింపఁజాలు
ప్రేమ నెంతయు దాన ప్రాపింపఁ జేయు.
సత్యముగ నీశ్వరుని కృప–సాధు కరుణ
యును బరస్పరాధారము నొందు చుండు.

సాధు సంగతి లేక యీశ్వరుని కరుణఁ
గనుట దుర్లభ, మా హరి కరుణ లేక
యా మహాత్మ్మ సంసక్తి లభ్యంబు గాదు.

★ ★ ★

హనుమ సంగతిచే విభీషణుఁడు గనఁడె!
పరమ దుర్లభమౌ రామ భద్రు కరుణ.

**సూ: తస్మింస్తజ్జనే భేదాऽభావాత్. 41**

టీక: తస్మిన్=ఆ భగవానునియందు ; తత్–జనే = తదీయుడగు భాగవతుని యందు; భేద– అభావాత్= భేదము లేని కారణమున.

**తె.గీ: స్వామికిఁ దదీయునకు భేద మేమి లేమి.**

వివ: భాగవతుఁ డీశ్వర స్వరూపమగు; శ్రుతులుఁ
బలుకు '' బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి'' – యనుచు.
భాగవత సేవయే భగవంతుఁ సేవ;
భక్త హృదయంబునన్ భగవానుఁడుండు
భక్తుఁడుండు నెప్పుడు భగవంతు నందు.

★ ★ ★

''సాధువే నాకు హృదయము, సాధు హృదయ
మేన యగుదు; నాకంటె వారితర మెఱుఁగ
రేను వారినిఁగా కన్యమెఱుఁగ'' – నమచు
భాగవతమున శ్రీహరి పలుకలేదె!

★ ★ ★

భరతుఁడా రామ భజన తత్పరతఁదనర
రాముఁడు దలంచు భరతు నిరంతరంబు.
పరమ ప్రేమ స్వరూపలౌ వ్రజయువతుల
భక్తిఁగూర్చి యర్జునుతోడఁ బలుకు వేళ
ననఁడె కృష్ణుఁడు ;– ''నాదు మాహాత్మ్య విధము,

నాదు పూజయు, నా శ్రద్ధ నా మనోగ
తంబు లర్జునా! గోపకాంతలె యథార్థ
మెఱుఁగువా రన్యులెవరేని నెఱుఁగ " రనుచు

★ ★ ★

"సర్వ భూతము లందున సముఁడ, లేడు
ప్రియుఁడుఁ గానియు నాకు నప్రియుఁడుఁ గాని;
ఎవరు భక్తితో నను భజియింతు రుంద్రు
వారు నా యందు నేనుందు వారి యంద".
టంచు – గీతలన్ శ్రీకృష్ణు డనగ లేదె ?

★ ★ ★

భక్తవరుఁ డీశ్వర ప్రేమవార్ధి మునిఁగి
స్వీయ బాహ్యరూపము నందు స్మృతిని విడిచి
పడయు దైవ స్వరూపాను భవము సతము.
వ్రేత లీశ్వర లాలా విభూతి నెఱిఁగి
హరిని నెమకుచుఁ దన్మయ తాప్తిఁ – గనిరి
దాన భాగవతుఁడు భగవానుఁ డొకఁడ.

**సూ: తదేవ సాధ్యతాం తదేవ సాధ్యతామ్. 42**

**టీక :** తత్–ఏవ=దానినే మహాత్ముల కరుణనే; (పరమభక్తి సాధననే); సాధ్యతామ్= సాధింపవఁదగును; తత్–ఏవ సాధ్యతామ్=అదియే సాధింపఁబడుఁగాక! (దానినే సాధింతురు గాక!)

**తె.గీ.: ఇదియ సాధింపుఁ డిదియ సాధింపుఁ డెపుడు**

వి.వ. ఈశ్వర ప్రేమఁ బడయఁ గాంక్షించు వాఁడు
సాధు సంసక్తికై కృషి సలుపవలయుఁ
దీవ్రముగ; హరికృపను బ్రాప్తించునదియు.
సాధు సంగమ బలమున సమయుఁ బాప

తాపములుఁగల్గు నా పరాత్పరుని కరుణ.
ఇచట నొకరహస్యంబు గ్రహింప నగును.
అతి బలాఢ్య దయామేయుఁడైన నృపతి
గలఁ డొకండనుకొనుఁడు ; ఆత్మవిభుండు
ప్రేమ నెల్లరయెదుటఁ జూపెట్టఁబోడు ;
పాలనంబున ఁబలు రాచ పనులయందుఁ
బ్రకటితము సేయు ప్రభు తాప్రభావములను.
తనకుఁదాఁ బ్రేమఁ బ్రకటింపఁ దలఁపడెవుడు
ప్రజలు తనుఁ జేరఁ దలఁచిన వారి వారి
ధర్మపద్ధతి వర్తింపఁ దలఁప వలయు.
ప్రభువు ప్రేమ ప్రభావంబు ప్రజల కెఱుఁగ
జేయ నుద్యోగి గాక, యాత్మీయుఁ డగుచు
ప్రభువు ప్రేమ చర్చల యందుఁ బాలుగొనెడి
వాఁడె యోగ్యుఁడు ; సకలంబు వాఁడెయెఱుఁగు.
నృపతి ప్రేమ నార్జింపఁగ నెంచు మనుజా
లీ మహాత్ముని కరుణ నార్జింప వలయు.
దాన, నతఁడు నృప ప్రేమ తత్త్వ మెఱుక
పఱచి, పాత్రతా సిద్ధినిఁ బఱపి, రాజా
దరికిఁ గొని యెఱింగించును; దన విధానఁ
బ్రేమ గోష్ఠి నీతనికిఁ బ్రాపింపఁ జేయు.

* * *

అటుల నీశ్వరుండు స్వకీయమైన ప్రేమఁ
దనకుఁదాఁ బ్రకటించుకోఁ దలఁపుఁ గనఁడు.
ప్రేమ శిక్షను బడయ గోపికల దరికిఁ
బంపఁడే? యుద్ధవుని మున్ను వాసుదేవుఁ ;

డా పరాత్పర ప్రేమ రహస్య మెల్ల
ప్రేమి యగు భక్త వరునకే వేద్య మగును.
భగవదాజ్ఞ లేకయె ప్రేమ భక్తుఁడేనిఁ
బరులతోఁ ప్రేమ తత్త్వముఁ బలుకఁబోఁడు.

★ ★ ★

ఆశ్రయించిన వాని మహాపురుషుఁడు
పాత్రతా సిద్ధిఁ గూర్చును ప్రథమ మందు.
నిర్మలై కాంతభక్తి, సన్నిష్ఠ, హృదయ
వీథిఁ గల్గు వాఁడీశ్వర ప్రేమ కొఱకు
రోదనము సేయు మది ; నార్త నాదమాల
కించి, యానందమయుఁడు సర్వేశ్వరుండు
అంతరాత్మయై వినుచు, దయార్ద్ర పూర్ణుఁ
డగుట. నాతని దరికిఁ బ్రేమాస్పదుఁడగు
భక్తు నొకనిఁ బుత్తెంచును ; వాఁడుఁ దొలుత
నఖిలగతులఁ బరీక్షించి యతని ప్రేమ
కామ శూన్యము నిష్కళంకంబు నైన
వాని ప్రభున కెఱింగించు ; భగవదాజ్ఞఁ
య్యైన, వానికి బ్రేమ రహస్య మెఱుఁగఁ
బలుకుఁ గ్రమముగ ; దుదకు నా భక్త వర్యుఁ
డీశ్వర ప్రేమ రాజ్యమందే వసించి
భగవదీయుఁడై యానంద పదము నొందు.

★ ★ ★

కాన నీశ్వర ప్రేమకై కాంక్ష సేయు
వాఁడు పాత్రతా సిద్ధినిఁ బడయ వలయుఁ
బ్రథమమున; నారద మహర్షి పలికినట్టి
సాధనములందు సుదృఢ విశ్వాసమూని

దాన భగవంతు కరుణ, నద్దాన భగవ
దీయ సంసక్తిఁ బడయు; సుంతేని దీనిఁ
గానఁడేఁ శతజన్మలకైన నాప
రాత్పర ప్రేమఁ బడయు మార్గంబు లేదు.

★ ★ ★

ముక్తి కధికారులైన—సద్భక్త హృదయ
మందు నీ ప్రేమ వాసన నణఁగనీక
సంతతము ప్రేమభక్తి ప్రచార కాంక్ష
నూని, వారి కీశ్వరుఁడు సాయుజ్య ముక్తి
నొసఁగ ; ఁడద్దాన సద్భక్త విసర మెల్ల
ప్రేమలీలా సుఖంబును విడిచి, ముక్తి
నెప్పుడే నుపార్జింపఁగ నిచ్ఛఁగనరు.
సత్యముగ ముక్తులయ్యు నీ సాధులెల్ల
ప్రేమ వితరణార్థంబ యీ పృథివి యందుఁ
దిరుగుచు వసించు చుందు; రీ పరమ సాధు
లరయ నవ్యాజ సత్కృపా పరులు గానఁ
దీ ప్రయత్నమును భగవత్కృపఁ గడించు
వారిఁ బావన దర్శన స్పర్శ భాష
ణములఁ దనుపుచుఁ బ్రేమ దానం బొనర్తు;
రామహాత్ములు సతతము నట్టి ప్రేమ
నభిలషించు వారలకై ప్రయత్నముగను
వెదకు చుందురు; ఈశ్వర ప్రేమ భిక్షఁ
దగిన యెడఁ బెట్టుటయె వారి ధర్మమగును.
కాన, భగవదీయులును మహానుభావు
లైన ప్రేమభక్తులను సమాశ్రయించి
వారి కరుణ యుపార్జింపఁగ వలయు నరుఁడు

★ ★ ★

# 6. ప్రేమభక్తి - ప్రధానబాధ - కుసంగతి

సూత్ర : దుస్సంగః సర్వథైవ త్యాజ్యః 43

టీక : దుస్-సంగః = దుర్జన సాంగత్యము; సర్వథా = ఎల్ల విధముల చేత; త్యాజ్యః - ఏవ = విడువ ందగినదే సుమా!

**తె. గీ. సర్వథా త్యాజ్యమగును దుస్సంగమంబు.**

వివ :- సాధుజన సంగమంబు ప్రశంస సలిపి,
యిచట దుస్సంగతిని నిషేధించుచుండె.
హరికథా చర్చ, నామ జపాభిరతులు
జ్ఞాన వైరాగ్య భక్తి విజ్ఞానములును
శాంతి సత్యదయాశౌచసత్ప్రవర్త
నములు, సాధుసంగతినిఁ బ్రాప్త మగునటుల,-
లోక వార్తలు, చర్చలు, లోకనింద
లరయ నవివేక భోగ దురాచరణలు
దంభ మద మాన కోప మాత్సర్యములును
సకల దుర్గుణంబులు దుష్టసంగమమున
ప్రభవమొందుడుఁ బాప పరాయణుఁడయి
ప్రబలమౌ విషయాసక్తిఁ బడయు జనుఁడు.
సకల దుర్గుణముల దురాచార వితతి
నసుర సంపత్తి నొందు దుష్టాను వర్తి.
మంచి గుణముల నన్నిటి మాయఁ జేసి
సర్వనాశ మొసంగు దుస్సంగమంబు.
స్నేహపూర్ణయుఁ, బరమ సుశీల, ప్రేమ

రూపయౌదేవి కైకేయి–పాపి మంథ
రా కుసంగతిచే మహాప్రభువు – ప్రాణ
పతి దశరథునకు, సుతుఁడు భరతునకును
పరమ హితులౌ నయోధ్యా నివాసులకును
అత్యధిక శోక కారణం బగుచుఁ దుదకు
దుర్భరంబగు వైధవ్య దుఃఖ మొందె,
ప్రాణతుల్యుఁడౌ భరతుచే వదలఁ బడదె ?

★ ★ ★

శకుని దుస్సంగ మమె భయానకము, మిగుల
ప్రళయ కరమైన భారత రణము నకును
గారణంబయ్యె; – తల్లితోఁ గపిలుఁ డనఁడె!
''పరమ నీచులతోఁ గూడి తిరుగు వాఁడు
సత్య శౌచ దయా బుద్ధి శమ దమములు
శ్రీయు లజ్జ యావమానముఁ బాయు; సతము
కామినీ కాంచనాసక్తి గలిగి, దాన
ఘోర నరకంబునందునఁ గూలుచుండు;
కాన, నీచ సంసక్తికై కడఁగువాఁడ
శాంతచిత్తుఁడు, మూర్ఖుఁడు స్తబ్ధమతియుఁ,
గామినీజన క్రీడామృగంబు సుమ్మ''.
నీచసంగ మెవ్వారికేని నింద్యమగును;
అందు ; – నీశ్వర ప్రేమకై యరయు వాఁడు
సకల విధముల దుర్జన సంగమంబు
విడువ వలె ; – రాముఁడనఁడె – ''విభీషణా! క
రంబు నరకంబు మేలు దుర్జన సమాజ
సంగమము కంటె ; నద్ది పాసంగ కుండు
గాత! '' – మని మున్ను ;– దుష్టసంగమము, దుర్జ
న ప్రసక్తియే గర్హ్య మనంగ రాదు.

ఈశ్వర ప్రేమకున్ విరుద్ధేచ్ఛ బొడమం
జేసి, యింద్రియములను గ్రసించు విషయ
మెద్ది యేనియు నరుఁడాదరింపఁ దగదు.
ఇదియుఁ జేతనమేన్ జడ మేనిఁ జూడ
రాదు; తద్గాథలేన్ విన రాదు, వార్త
లేని – గ్రంథములేన్ బఠియింపరాదు ;
ఇట్టి చిత్రము లేని వీక్షించరాదు !
ఇట్టివి భుజింపరాదు, గ్రహింపరాదు;
తాకఁగారాదు – తుదకవి తలఁపరాదు.

★ ★ ★

ఇచట నొక మాట మదిని గ్రహింప వలయు:–
సాధ్వ సాధు భావంబుల జనన మొంది
కాంచు నభివృద్ధి నీవది కారణముల :–
స్థాన, మన్నంబు, జలమును, సన్నిహితులు,
నిరుగుపొరుగును, దృశ్య సాహిత్యములును,
తలఁపులును, వృత్త్యుపాసనల్ '' – కలుగునివ్వి
సాత్వికములైన – ప్రభవించు సత్వ గుణము
రాజసము తామసము లేని ప్రభవ మొందుఁ
దద్గుణంబులు – వాన నుత్పన్న మొందు
దుష్పథప్రవృత్తి; ప్రతీతి తూలి పోవు;
దాన–దుర్జన సంసక్తి తగదు–తగదు.

★ ★ ★

''హరి మయము విశ్వమంతయు ననెడి వట్ల
సుజన దుర్జన భేదంపు చొఱవ యేమి'' ?–
యనఁగ రాదు; విశ్వంబు శ్రీహరి మయంబ;
నందియుంబించు కేని లేదిందు ; – కాని
దృష్టి జ్ఞాన మయంబుఁ గావించి, జగము
బ్రహ్మ మయముఁగ వీక్షింప వలయు నెప్పుడు.

**సూ:** **కామక్రోధ మోహ స్మృతిభ్రంశ బుద్ధినాశ సర్వనాశకారణత్వాత్.** **44**

టీక: కామక్రోధమోహ స్మృతిభ్రంశ బుద్ధినాశసర్వనాశ కారణత్వాత్ = (ఈ దుష్ట సంగమము); కామము– క్రోధము మోహము– స్మృతిభ్రష్టత– బుద్ధినాశనము – సర్వనాశనములకు కారణమైన దగుట చేత.

**తె.గీ.:** **కామ కోప మోహంబులఁ గలుగఁ జేసి**
**మఱపుఁ గూరిచి, బుద్ధిని మాటు పఱచి,**
**యఖిల నాశనమును గూర్చు నట్టి దగుట.**

వివ: దైవలీలా రహస్య కథాదికంబు
లకఁ దలఁపనీక, భోగ కాలమున మాత్ర
క్షణిక తృప్తి నొసంగు విషయము లందు
నాశయే కూర్చు సర్వ వినాశనంబు.

పెద్దకాలము చిత్త మే విషయమును ద
లంచు నందు నాసక్తి జనించు చుండు;
అఖిల లౌకిక విషయంబు లందుఁ గాని,
వానికిన్ వశ వర్తులౌ వారి తోడ
వాఙ్మనః క్రియలందు నెప్పగిదిఁ బొసఁగు
సంగమంబున నాసక్తి జనన మొందు;
అట్టి యాసక్తిచేఁ గోర్కె పుట్టు, – నిట్టి
కామమే పాప వితతికిఁ గారణంబు.
కామ తృప్తికై లోభంబు గలుగు; దృప్తిఁ
బడయదే నది క్రోధ రూపంబుఁదాల్చు;

కృష్ణు నిట్లు గీతలను బ్రశ్నించె నరుఁడు
''వృష్ణి కులదీప! పురుషుఁడు భృత్యు వగిదిఁ
గోరకుండియుఁ దా బలాత్కారముగను
బ్రేరణము చేయఁబడు వాని విధినిఁ బాప
కర్మముల ఁజేయు చుండు నే కతన ? '' – యనిన.
''ఫల్గునా! రజోగుణ సంభవంబు నైన
యిట్టి కామమే క్రోధమౌ; నిది మహాశ
నంబు, ఘోర పాప స్వరూపంబు, గాన
దీని నిందు శాత్రవునిఁగాఁ దెలిసికొను'' మ
టంచు హరి యుత్తరం బిచ్చె నర్జునునకు.

కామ కామి కీడేరవు కాంక్ష లెల్ల ;
ప్రాయికముగఁ గోరికలు వైఫల్య మొందు,
కామ విఫలతఁ గ్రోధంబు గలుగు చుండు ;
ప్రభవమొందఁ గ్రోధము – విచారము వివేక
మంతయును బాయు ; దాన హితాహితంబు
లరయ లేక పిశాచంబు నటు వినాశ
మునకు జతనంబు సలుపు; – నీ మోహమునను
మతి గతించును – స్మృతియును మాయు చుండు
స్మృతి నశించిన బుద్ధి నశించు, బుద్ధి
నమసి పోయిన నిహపర సౌఖ్య పదము
నుండి డుల్లి సర్వ వినాశ మొందు నరుఁడు.
కనుఁడి గీతల శ్రీకృష్ణుఁ డనిన సూక్తి
''విషయ చింతనచే నుద్భవించు చుండు
దాని యందున నాసక్తి మానవునకుఁ
గామ మాసక్తి చేతను గలుగు, నిట్టి

కామము వలనఁ గ్రోధంబు గలుగు విజయ,
పుట్టుఁ గ్రోధ మూలంబున మోహ, మట్టి
మోహమున స్మృతి భ్రంశముఁ బుట్టు, స్మృతి వి
నాశనంబున బుద్ధియు నాశనమగు
బుద్ధి నాశనమునఁ జెడుఁ బురుషుఁ – డనుచు.

విషయ చింతనమును మఱి విషయలోలు
రైన జనుల కూటు వను బ్రయత్నమునను
విడువఁగాఁ దగు నీశ్వర ప్రేమి యెవుడు.

**సూ: తరంగాయితా అపీమే సంగాత్సముద్రాయంతి. 45**

టీక : ఇమే= ఇవి ; తరంగాయితాః అపి = చిన్న అలలవలె నుండినను; సంగాత్= (దుష్టజన) సాంగత్యమువలన; సముద్రాయంతి = సముద్రము లగుచున్నవి.

**తె.గీ: అలలె యగునివి జలధులౌఁ జెలిమి బలిమి.**

వివ: సాంతముగ దోషముల నెల్ల సమయఁ జేయఁ
డేని శేష దోషము నలయించు నరుని ;
ఇంధనములందు నిప్పు రవ్వేనిఁ గాని
వాయు బలమున విస్తృతిఁ బడయుఁ గాదె!
అటుల – దోషము నతి స్వల్పమైనఁ గాని,
కాంచు నభివృద్ధి దుష్ట సంగమము వలన.
ప్రథమమున గోర్కె క్రోధరూపంబు వడయు ;
తరఁగ రూపుఁగా గనుడి; యీ తరఁగ దుష్ట
సంగమంబునఁ బెంపొందు సాగరముగ ;
హృదయ మంతయు నది యావరించి, సద్వి
చారమునకు లేశము తావొసంగఁ బోదు.

కాన సర్వ నాశంబును గలుగఁ జేయు.

''సద్గుణములు మాయందు విస్తారమున్న
స్వల్ప దోషము లేవేని నమరుఁ గాక
దుష్ట సాంగత్యమునఁ గల్గు నష్టి యేమి ? ''.
యనుచు-నిర్లక్ష్యము వహించు టనుచితంబ ;
సర్వగతుల త్యాజ్యము దుష్ట సంగమంబు.



# 7. మాయను తరించు వారెవరు ?

సూత్ర : కస్తరతి కస్తరతి మాయాం? - యః సంగాం
స్త్యజతి యోమహానుభావం సేవతే నిర్మమో భవతి. 46

టీక : కః తరతి = ఎవఁడు తరించుచున్నాఁడు?; కః = ఎవఁడు; మాయామ్ = (ఇంద్రియ గోచర మగు ప్రపంచమును) మాయను; తరతి = తరించుచున్నాడు ? యః సంగాన్ త్యజతి = ఎవఁడు సంసక్తులను విడుచుచున్నాఁడో ; యః మహానుభావం సేవతే = ఎవఁడు మహాత్ము నాశ్రయించి సేవించుచున్నాఁడో ; నిర్-మమో-భవతి = ( జగతి యందు గల సర్వ పదార్థములందు ) మమత్వమును ( నాదియను బుద్ధి నుండి) విడివడిన వాఁడగుచున్నాఁడో.

తె.గీ : ఎవఁడు తరియించుఁ - దరియించు నెవఁడు మాయ ?
ఎల్ల సంగములఁ ద్యజియించు వాఁడు
విజ్ఞాని మహాత్ముఁ జేరి సేవించు వాఁడు,
నెపుడు నిర్మమత్వంబు వహించు వాఁడు

వివ: నదిని దాటఁ దలంచు మానవున కవస
రములు కాలుసేతులు - నీఁదు ప్రజ్ఞ లెపుడు;
నీరు నవలకుఁ ద్రోయఁగా నేర వలయు
నీరమును ద్రోయఁ డేని మునింగి పోవు.
అతి భయద దుస్తరమగు మాయా స్రవంతిఁ
గడవఁ దలఁ పోయు వాఁడహంకారపూర
సకల విషయ సంగమ రూప జలము లెలమి
వెంట వెంట నావలఁ ద్రోచి వేయ వలయు;
నీ యహంకార సంసక్తి నెల్లఁ ద్రోయఁ

జాలఁడేని మాయా నదీ జలము లందు
మునిఁగి యతల తలంబును బొందు నతఁడు.
దాన సంగ సంత్య జన మత్యవసరంబు.

ఈఁద నేర్చిన నందందు సేదఁ దీర్చు
కొనఁగ విశ్రాంతికిని తావు లొనర వలయు;
మాయ యను నదిన్ సంగమ తోయములను
ద్రోసి వేయు మాత్రనఁ గృతార్థుండు గాఁడు.
విశ్రమ స్థలంబులను సేవింప వలయు.
భాగవత సుధామయ పూర్ణ వచనము లె-వి
రామ దేశముల్ ; తద్భుల ప్రాప్తి నొంది
జనుఁడు మాయా స్రవంతిని సంతరించు.
సజ్జనంబుల సేవించు సాధకుండు
శ్రమము లేశమేన్ లేక పారంబుఁ జేరు.
భాగవత సాధువర్య కృపా కటాక్ష
పోత మూఁతగా మాయా సముద్రమును ద
రించు జీవి ; యట్లగుట - వచించె సాధు
సేవ సాధనీయంబని దేవమౌని.
భాగవతమున శ్రీహరి వలుకలేదె!
''జలముల మునుంగు చుండిన జనున కోడ
యటుల నీ మహా భయద భవాబ్ధి యందుఁ
బడి మునింగెడి జీవికి బ్రహ్మవిదుఁడు.
శాంత చిత్తుఁడు ప్రేమియౌ సాధు వరుఁడె
భద్రమగు పరమావలంబన'' మటంచు.

పరమ సాధుల సేవచేఁ బాప తాప
మోహములు రూపు మాయు సంపూర్ణముగను.
అంధకారము చలియు భయంబు గలదె?
వహ్నిని సమాశ్ర యించెడి వానికెపుడు.
భాగవత జనసేవచేఁ బాప రూప
మైన శీతము, జనన మృత్యాత్మకమగు
భయము, మోహాంధ కారముఁ బాసిపోవు.
కృష్ణ నిర్మల ప్రేమ భక్తికిఁ బ్రధాన
సాధనము మహాపురుషుల చరణసేవ
అనఁడె తండ్రితో మున్ను ప్రహ్లాదుఁడెలమి.

''సాధుజన చరణాబ్జరజంబు మనుజుఁ
డొందల ధరింపఁ డేని ననర్థ హరణ
శీలమౌ హరిభక్తి నార్జింపనేరఁ''
డనుచు ; – భరతుఁడనెన్ రుహూగణుని తోడ; –
''జ్ఞానము, తపంబు, యజ్ఞము దాన మాగ
మాధ్యయనములు సకల గార్హస్థ్య ధర్మ
ములును, జలవహ్ని సూర్య సేవలును సలుపుఁ
గాక, సాధుపాద రజోఽభిషేక భాగ్య
భాజనుఁడు గాని వానికిఁ బరమ దుర్ల
భమగు శ్రీహరి ప్రేమ ప్రాప్తంబు గాదు.
కావున రుహూగణా! దానిఁగాంచు ;'' – మనుచు
గీతలందునఁ గనుడి శ్రీకృష్ణ సూక్తి
''పార్థ! ప్రణిపాతమునఁ బరిప్రశ్న వలన
నెలమి సాధుల సేవించి తెలిసి కొనుము;
ఆత్మ రూపంబు బాగుగ నరయు జ్ఞాన

నిష్ఠలుపదేశ మొనరింత్రు నీకు దీని''

సాధుజన సేవ యనునెడ – సాధువులను
జేరి, కాయిక సేవలు సేయు నదియు
కాదు; అదియు యథాశక్తిగా నొనర్ప
నగును : – కాని వారల యాజ్ఞ లాదరమునఁ
గనక, నడువక వారి మార్గమున, వారి
యభిమతానుసరణి జీవయాత్ర సేయఁ
బోని నరుని సేవలు వ్యర్థములగుఁ గాదె!
మఱియుఁ దత్ప్రాప్తికిని బాధ 'మమత' – కలదు.
'మమత' కలదేని సాధు సంబంధ మొదవఁ
బోదు; నాయిల్లు, నామేను, నాదు ధనము
నాదు పరివారమని, యిట్లు – 'నాది' – 'నాది'
'నాది' – యని, పలుగతుల బంధనము లందుఁ
జిక్కి, కాన నేరఁడు సాధుసేవ నరుఁడు.

భాగవత సేవయను మణి ప్రభల కలిమి
'మమత' – యను పెను చీఁకటి సమసిపోవు.
అట్టి సాధు సంగమ లబ్ధికై నఁ దొలుత
నించు కేనియు 'మమత' త్యజించ వలయు.
మమత సంబంధమగు విషయము లనిత్య
ములును మోహ మూలంబులన్ బుద్ధి నెఱిఁగి,
వాని సర్వథా త్యజియింప వలయు నరుఁడు.
ఇచట ''నాయది'' యను వస్తు విశేషము కేనిఁ
గలుగఁ బోదని తెలియఁగా వలయు ; మనుజుఁ
డీ శరీరముఁ దన్నుఁగా నెఱుఁగు చుండు;
అదియె నశియించు చుండ నన్యమగు వస్తు

వేది యితనిది యగు ? నిట్టు లితర మందు
'నాది' – యనుట కేవలము నజ్ఞాన మగును.
మాయను దరించుటకు నీ 'మమత్వ' మును స
మూలముగ నాశనము చేయ మేలు; మమత
విడిచిన నరుఁడె మాయను గడవఁ జాలు.

**సూ :** **యో వివిక్త స్థానం సేవతే,**
**యో లోకబంధ మున్మూలయతి,**
**నిస్త్రైగుణ్యో భవతి,**
**యోగక్షేమం త్యజతి.** 47

**టీక :** యః వివిక్త స్థానం సేవతే = ఎవఁడు ఏకాంత మగు పవిత్ర స్థలము నాశ్రయించు చున్నాఁడో ; యః లోకబంధమ్– ఉత్– మూలయతి= ఎవఁడు లౌకికములగు బంధములను మొదలంటఁ బెఱకు చున్నాఁడో; (యః) నిస్త్రైగుణ్యః భవతి = (ఎవఁడు) త్రిగుణముల నుండి విడి వడిన వాఁడగు చున్నాడో; యః యోగ క్షేమం త్యజతి = ( ఎవఁడు) ఆర్జన రక్షణములను విడుచు చున్నాఁడో.

**తే.గీ:** **నిర్జన ప్రదేశంబున నెగడు వాఁడు,**
**ఎల్ల లోక బంధములఁ ద్యజించువాఁడు,**
**త్రిగుణములఁ బూర్ణముగను వర్జించు వాఁడు,**
**యోగమును క్షేమమును సైత ముడుగు వాఁడు.**

**వివ:** మాయ నుండి యెల్లరుఁ దరింపంగఁ బూర్వ
సూత్రమున మూఁడుపాయముల్ సొరిదిఁ బలికి,
ఇందు నాల్గు పాయంబులు పొందు పఱచి,
పిదప రెండు సూత్రంబుల విస్తరించె
నంచిత మగు రీతి నుపాయ పంచకంబు.

రేయుఁబవలు మమత్వంబు వృద్ధి పఱచు
వస్తు సంసక్తి నరునకుఁ బ్రాప్తమైన,
మమత వానిపైఁ బాయదు ; మమత — మతినిఁ
దాఱుమాఱు గావించి బంధంబుఁ గూర్చు;
కాన సాధకుం డెప్పు డేకాంత వాస
మును బొనర్పనౌ; గీతా ప్రబోధ వేళ —
''అణఁచి సక్తి సుత సతీ గృహాదు లందు
మమత లేక యుండుటయు, సంప్రాప్తమైన
యెడల నిష్టమేని — ననిష్టమేని సర్వ
కాలముల సమ చిత్తంబుఁ గలిగి యుంట;
అమరనాథ తనూజ ! నాయందనన్య
యోగమున నియమిత భక్తి నుండుటయును,
జన విహీనము నౌ ప్రదేశమున నుంట
జనుల కూటంబులందు నాసక్తి విడుట
జ్ఞాన లక్షణ'' — మనుచుఁ బల్కెడె ? — మురారి.
సాధనమునకై మనుజుండు జతన మెంత
సలుపు చున్నను విషయ సంసక్తి విడని
జనుల కూటువ, నజ్ఞాన జనకమైన
విషయ సముదాయ మొయ్యన విడువఁడేని,
ఈశ్వరుని యందు మనసు లయింపఁ బోదు.
కాన సాధకుఁ డెప్పు డేకాంతవాసి
యగుచు భక్తి సాధనఁ జేయ నగు;— ముకుంద
దివ్యభక్తి నార్జింప యత్నించు వాఁడు
లౌకికములైన విషయముల్ వదల వలయు.
అడఁగు లోక సంసక్తి యేకాంత వాసి,
కవుడు లోక బంధములుఁ దమంత నడఁగు.

వాసుదేవ రహస్య ప్రభావమునకు
వ్యసన మృతి రూపమౌ లోక వాసనకును
అంతరముఁ జింత సేయఁ దమంతఁ దాము
నాశనంబొందు లోక బంధంబులెల్ల.

భక్తి సాధకుఁడగు వాఁడు వదల వలయుఁ
ద్రిగుణముల ;– వానిచే నెల్ల జగము పొలుచు;
త్రిగుణముల కార్యమే లోకమగును గాన
లౌకిక పదార్థముల నాస లేక, రక్తిఁ
గనక యుంట నిస్త్రై గుణ్యమనఁగఁ బడును.
అట్టి స్థితి ప్రపంచాతీత మండ్రు బుధులు.
విషయ సంసక్తి గలిగి తద్విషయ కామి
యైన మనుజుఁడు గుణబద్ధుఁ డగుచునుండు.
భగవదాసక్తిఁ బ్రేమను బడయువాఁడు
త్రిగుణముల నవలీలఁ బరిత్యజించుఁ;
తలఁపఁబోఁడు యోగక్షేమముల నతండు;
వాని లోభపెట్టునది ప్రపంచమందుఁ
గానఁబడదు నిస్త్రైగుణ్యుఁడైన కతన.

ఈశ్వర ప్రేమి యగుఁగాన నితఁడు మోక్ష
సిద్ధిఁ గాంచు పట్టునను నిస్పృహతఁ గనును.
లేని దానిఁ గూర్చుట యోగమౌను ; ప్రాప్త
మైన దానిఁ గాచుట క్షేమమనఁగఁ బడును.
భక్త వరుఁడి వేవియుఁ దలంపంగ బోక
మాధవ ప్రేమ మందె నిమగ్నుఁ డగుచు,
నీశ్వర ప్రేరితుండయి యెపుడు నీశ్వ
రానుకూల కర్మంబుల నాచరించుచు

భక్తు యోగము క్షేమము స్వయముగా వ
హించు నీశ్వరుఁడిట్లు వచించు- గీత;
''నితర మేదియుఁ దలఁపక యెవరు నన్ను
జింత సేయుచు మది నుపాసించు చుందు
రట్టి నిత్యాభి యుక్తులు నైన వారి
కెపుడు విహిత యోగ క్షేమ మేన యిడుదు''.
ననుచు :- భోజనాదిక చింత గనఁగ రాదు ;
భక్తుఁ డీశ్వరున్ విశ్వసింపంగఁ బోక
సత్యము సదాచరణముఁ బరిత్యజించి,
పాప పథమాశ్రయించెనేని వాఁడుఁ గూఁడ
నాస్తికుఁడగు; భక్తులమని యనెడివారు
భోజనాదిక చింతలఁ బొందు చుందు
రకట విశ్వంభరుడైన హరి స్వకీయ
దాస జనుల నుపేక్షింపఁ దలచునేమి?

**సూ :** **యః కర్మఫలం త్యజతి- కర్మాణి సన్న్యస్యతి-**
**తతో నిర్ద్వంద్వో భవతి .** 48

టీక : యః కర్మఫలం త్యజతి = ఎవఁడు సకల కర్మఫలమును విడుచుచున్నాఁడో; కర్మాణీ = స్వార్థపరతఁ గూర్చు కర్మములను; సన్న్యస్యతి =విడుచుచున్నాఁడో; తతః =దానివలన; నిర్ద్వంద్వః భవతి = సుఖదుఃఖాది ద్వంద్వముల నుండి విడి వడిన వాఁడగుచున్నాఁడో;

**తె. గీ :** **కర్మ ఫలముల విడనాడఁ గలుగు వాఁడు**
**ఎల్ల కర్మంబులను సన్న్యసించు వాఁడు**
**అటులఁ గావించి నిర్ద్వంద్వుఁడైన వాఁడు.**

వివ : సుంతయేని యోగక్షేమ చింతలేని
యతనిఁ గర్మఫల త్యాగి యందు ; రిచట

నుండియే ప్రేమభక్తి తానుదయమొందు.
సాధకున కేది యాదర్శ సాధనంబొ
యదియె ప్రేమ భక్తునకు సహజ గుణంబు.
భక్తుఁడే స్వల్పమేని నీశ్వరుని కొఱకె
యాచరించును ;- కనఁడు స్వార్థాభిలాషఁ
గలుగ దతనికి సంసక్తి కర్మములను
నేనిఁ దత్కర్మ ఫలమందు నైనఁ గాని;
యంత్రి యీశ్వరుఁడనుచుఁ దా యంత్ర మనుచు
స్వల్పమే నొనర్పంగఁ బోననుచు నరయు
నతఁడె కర్మఫలత్యాగి యనఁగఁ బడును.
మనసు బుద్ధినిఁ బూర్ణ సమర్పణంబు
సలుపు వాని యహంకృతి సమయఁ జేయు
నీశ్వరుఁడు స్వయంబుగ వాని హృదిని నిలిచి
యెల్ల కర్మంబు లెలమిఁ జేయించు చుండు;
అతఁడు సంపూర్ణ కర్మ సన్న్యాసియగుచు
నఖిల విధముల నిర్ద్వంద్వుఁడై తనర్చు
సౌఖ్య దుఃఖముల్ లాభ నష్టములు, మఱి, జ
యాప జయములు, స్వపరంబు లాది యైన
ద్వంద్వముల తోడఁ గార్య మీతనికి లేదు.
ఇట్టి సహజ పదంబు నార్జించు దనుక
కార్య కర్మ ఫలంబును గడకఁ ద్రోసి
యీశ్వర విరుద్ధ కర్మంబు లెల్ల విడిచి
ద్వంద్వములఁ బాయవలె భక్తి భాజనుండు.
గీతలందునఁ గృష్ణుఁడి శ్రీకృష్ణ సూక్తి
"వేదములనంగఁ ద్రైగుణ్య విషయములగు

దానఁ ద్రిగుణ వర్జితుఁడవై ద్వంద్వములను
వదలి, నిత్య సత్వస్థతఁ బాయకుండ
యోగమును క్షేమమును సైత ముడుగు మీవు.
ఎప్పుడేనియు నే నరుఁడేనిఁ గర్మ
మొక్క క్షణమేనిఁ జేయక యుండఁ డఖిల
జనులు ప్రకృతి సంభవములౌ గుణములకు వి
ధేయులై, పార్థ ! కర్మముల్ చేయుచుంద్రు.

ఫల్గునా! దేహధారియౌ వాని కెందుఁ
గర్మముల విడనాడఁగాఁ గాదు ; కానఁ
గర్మ ఫలముల యందున గాంక్ష వదలు
వాఁడె పో 'త్యాగి' యనుపేరఁ బలుకఁ బడును.
కర్మముల యందనీ కధికార మొనర
వలయుఁ? గర్మఫలంబుల వలదు కోరఁ,
గర్మఫల కారణం బీవు గాకు మెందుఁ,
గర్మముల విడనాడఁగాఁ గాంక్షఁ గొనకు''.
''కర్మసన్న్యాసము'' నఁ గామ్య కర్మముడిగి,
యెల్ల విహిత కర్మము లాచరించి, యట్టి
కర్మఫలముల యందెట్టి కాంక్షలేక
ద్వంద్వ రహితుఁడై మెలఁగును భక్తుఁడెపుడు.

**సూ : వేదానపి సన్న్యస్యతి, కేవల మవిచ్ఛిన్నానురాగం లభతే. 49**

టీక : ( యః = ఎవఁడు) ; వేదాన్-అపి-సన్న్యస్యతి = వైదిక కర్మములను సైతము విడుచుచున్నాఁడో ; కేవలమ్ = కల్మషరహితమైన ( అనన్యమైన) ; అవిచ్ఛిన్న - అనురాగమ్ = ఎడతెగని ప్రేమను ; లభతే = పొందుచున్నాఁడో

**తె. గీ. : తుదకు వేదము లేనియు వదలు వాఁడ**
**ఖండితై కాను రాగంబుఁ గాంచు వాఁడు.**

వివ: త్రిగుణమయ ప్రపంచమున వర్తిల్లు వేద
ములను ద్యజియించు టనఁగఁ గోర్కెలను విడుట
యగు ; సకామ భావ త్యాగ మరయ వేద
వర్జనంబని యెంచనౌ ప్రాజ్ఞుఁ ; డమర
ముని వచించు ప్రేమావస్థఁ గనిన భక్తుఁ
డేక మవ్యయా ఖండమౌ కృష్ణ ప్రేమ
వార్నిధిని మున్గి, తన్మయత్వంబు నొందుఁ;
గాన, వేదాశ్రయము తను దాన యడఁగు
కలుగు లౌకిక వైదిక కర్మములనె
వేనియుఁ యథావిధి నాచరింపఁ బోఁడు .
సకల నియమముల్ తమ యంత సమసి పోవు ;
వానికీ ప్రేమ నియమమె వఱఁగు నెపుడు;
ఇయ్యదియె శాస్త్ర నియమమై యెసఁగు చుండు
ఎల్ల వేద శాస్త్రములు జీవేశ్వరైక్య
సాధనార్థంబ యీ ప్రపంచమునఁ బొలిచె.
వేద చోదిత కృతులు నా విధిని సాయ
పడున వేని భక్తుఁ డొనర్ప వలయు నెపుడు
వైదికములైన కర్మముల్ భక్తి వృద్ధి
పఱచు నవిగ నుండఁగ వలె; భక్తుఁ డట్టి
వానినే సదా స్వీకరింపంగ వలయు;
తక్కు కర్మముల్ విడనాడఁ దగు నతండు.
మోహము నడంచి, భగవాను బొందఁ జేయు
నెవియొ వాని భక్తుఁడు నిర్ణయించు కొని, త
దాచరణ స్వధర్మంబుగ నరయ వలయు.
సతము తత్స్వధర్మాత్మక శ్రౌత కృతుల
నాచరించుచోఁ బెరలు తమంత డుల్లు.

ఇట్టి కర్మంబులును ఫలాపేక్ష వదలి
సలుపఁదగు సతంబును భక్తి సాధకుండు.
ఇదియె ''వేదసన్న్యాస'' మం చెఱుఁగ నగును.
ఆత్మ వేదికీ శ్రౌత కర్మాదికముల
నే ప్రయోజనమును గల్గ దెప్పు డేని
వాహినిఁ దరించు నావల పడవ యటుల.

★ ★ ★

ఎల్ల యామ్నాయముల నాశ్రయించి పడయు
చరమ ఫలముఁ బొందిన ప్రేమి సహజ తృప్తిఁ
గాంచి, యాతని నవియె వర్జించుచుండు.
ఇట్టి త్యజన–తిరస్కార హేతు వనుచుఁ
దలఁపఁ దగదు ; – తృప్తికిని నిదాన మగుట
వీఁడు బుద్ధి పూర్వకముగ విడఁడు శ్రుతుల.
అవియె–పూర్ణ కామునిఁ గాగ నతని నెఱిఁగి
స్వాధికార మీ ప్రేమిపైఁ బఱుఁపఁ బోవు.
విధి నిషేధ మయంబైన వేదముల స
ముత్తరించి కేవలము మహోన్నతంబు
నద్వయుఁ బనిర్వచనీయ మైన కృష్ణ
ప్రేమమున నీతని మనంబు వెల్లి విరిసి
పరమ తృప్తినిఁ గను ; ప్రేమ వరుఁడు ; కృష్ణ
పూర్ణ ప్రేమకు సహజ ప్రబోధ మూర్తి
యగు; – స్వయంబుగ భగవానుఁ డతనియందు
దివ్య ప్రేమ రూపంబునఁ దేజరిల్లి
యాత్మ లీలలఁ బ్రకటించు నద్భుతముగ.

**సూ: సతరతి సతరతి సలోకాం స్తార యతి.** **50**

టీక : సః = (అట్టి) వాఁడు ; తరతి = తరించు చున్నాడు; సః తరతి = వాఁడే తరించు చున్నాఁడు; (సః = అట్టివాఁడు) లోకాన్ = లోకము లోని జీవు లందఱను; తారయతి = తరింపఁ జేయు చున్నాఁడు.

**తె.గీ: అతఁడె తరియించుఁ దరియించు నతఁడె, యెల్ల**
**ప్రాణులఁ దరింపఁగాఁ జేయు వలఁతి యతఁడె.**

వివ: నారద మునీంద్రుఁ డిట్టు లానంద భరిత
మానసుం డగుచుఁ బ్రకటింపం దొడంగె ;–
ఈశ్వర ప్రేమ పూర్ణుఁడై యెవఁడు పొలుచు
నతఁడె తరియించుఁ బ్రాణుల నాతఁడే త
రింపఁ జేయఁగా నేర్పరి ; యాతఁడె భవ
వారిధి తరణ తరణియుఁ దారణంబు.

★ ★ ★

భాగవతమున హరి యిట్లు పలుక లేదె !
''నాదు భక్తి యుక్తుఁడు భువనమును బావ
నంబు సేయు'' – నటంచు;– మునె నలువ దార
వదగు సూత్రంబు నందు ''నెవ్వాఁడు మాయఁ
గడచు?'' నను ప్రశ్న కుత్తరం బిడుచు, నాల్గు
సూత్రములఁ బ్రేమ సాధన సూచకముగ
ప్రేమి లక్షణంబుల నెల్ల విశద పఱచె.
ముందు సూత్రంబులఁ బ్రేమ పూర్ణులైన
వార లశ్రమంబున నెట్టి పదము వడయఁ
గలరొ యా ప్రేమ రూపంబుఁ బలుక నుండె.

# 8. ప్రేమ భక్తి-గౌణభక్తి-వాని స్వరూపము

సూత్ర: అనిర్వచనీయం ప్రేమ స్వరూపమ్ 51

టీక: ప్రేమ స్వరూపమ్ = ప్రేమ యొక్క సహజ రూపము; అనిర్వచనీయమ్ = అట్టిదని వచింప నలవికానిది.

తె.గీ: ప్రేమ తత్త్వ మిట్లని నిరూపింప రాదు.

వివ: ప్రేమకును బరమాత్మకు భేద మెందుఁ
గలుఁగ బోదు ; బ్రహ్మంబును బలుక నగునె ?
'నేతి'-'నేతి' - యంచు వచించి, నిగమములును
మౌనము వహించు ; అటులె ప్రేమమును దెలుప
వాక్కునకు నందఁబోదు;- ప్రపంచ మందు
నిష్ట వస్తు వేదేనిఁ బ్రాప్తించి నపుడు,
దాని వార్త విన్నప్పుడుఁ దాఁకినపుడు
గలియునపుడుఁ బ్రియోక్తులఁ బలుకు నపుడు
స్వాంతమునఁ గల్గు మోదానుభవము వర్ణ
నంబు సేయుటకే దుర్లభంబనంగ
వాక్కునకుఁ జొప్పడునె ప్రేమ వర్ణనంబు ?
వలను పడునేని నది ప్రేమ బాహ్య విధము ;
ప్రేమ వస్తు వనుభవైక వేద్యమగును.
''అనుభవింపంగ నగుఁ బ్రేమ మనసునందుఁ
ప్రేమ యెందుండు నచట వర్తించు మనసు.
మనసు లేకున్న వాక్కు వర్ణనము సేయఁ
దగిన సామర్థ్య మెటులఁ బొందంగ నేర్చు ?''

ననుచు సీతకు సందేశ మంపు నపుడు
హనుమతో రాముఁడవ్విధి ననఁడె మున్ను ?

★ ★ ★

కాని, యే స్వల్పమేనిఁ బల్కంగఁ బడిన
పట్టునందది బాహ్య రూపంబ సుమ్ము !
ప్రేమ ప్రాప్తింపకున్న నా ప్రేమ తత్త్వ
మెఱుఁగఁబడ దేరికేనిఁ, బ్రాప్తించె నేని
మనసు గతిఁబాసి ప్రేమాబ్ధి మగ్నమగును.
నీటిపైఁ బడు మనుజుని మాట యెఱుఁగఁ
బడును వాఁడు మునుంగఁడేఁ; – వారి మునిఁగి
యతల తలముఁ జేరినఁ బల్క నగునె ? వాని;
కటుల బ్రేమ వార్ధి నిమగ్నుఁడైన వాఁడు
లేశమేని వచింపఁగా లేఁడు ; మునిఁగి
మునుఁగ కున్నంత వరకుఁ బల్కునది యెల్ల
పైని పైని వాక్యంబులై పఱఁగుచుండు.

★ ★ ★

ఎందు మునిఁగిన వాఁడు భాషింప లేఁడు ;
పలికెనేని వాఁడెఱుఁగని వాఁడె యగును.
అత్యగాధమౌ ప్రేమ జలాశయమున
మునిఁగి పలికెడి మేటి యెందుననో పొలుచు!

**సూ: మూక రసా స్వాదన వత్. 52**

టీక: మూక రస– ఆస్వాదనవత్ = మూఁగవాఁడు (మధుర) తనముఁ గ్రోలునప్పటి స్థితివలె.

**తె.గీ: స్వాదు రసముఁ గ్రోలిన మూఁగ చందమునను.**

వివ: కలదు మూఁగ కేనియు రసగ్రహణశక్తి ;
వాని యనుభూతిఁ బలుకఁగ వాక్కులేదు,

అతుల ప్రేమి ప్రేమామృత మనుభవించి
యనుపమానంద మగ్నుఁడౌ ;- నట్టిఁ డేని
నిట్టి దని దాని రూపు వచింపఁ జాలఁ
డన్యులకు ;ఁ బ్రేమమునఁ దన్మయత్వ మొందు.
ప్రేమ తత్త్వాను భూతి వర్ణింపలేని
మాత్రనది మిథ్య యని తలంపంగ రాదు.
మూఁగ తనకుఁ దాను రసానుభూతి నెఱుఁగు,
నటులఁ బ్రేమానుభవముఁ దానాత్మ నెఱుఁగు.
గాని, భక్తుఁ డిట్లనుచుఁ బల్కఁగ లేఁడు.
ప్రేమ- భక్తునిఁ దనువుచు వెలికిఁ దోఁచు.
ఎవఁడౌ తాను-దానెయ్యది యెఱుఁగు చుండె
నో - యెఱుంగఁడు ప్రేమ మయుండు ;- పలికెఁ
జెలులతో రాధ యివ్విధి, '' చెలియ ! కృష్ణ
ప్రేమ రూపమిట్లని నిరూపింపఁ జాల,
నది గ్రహింప లే-నే స్వల్పమైన నెఱుఁగ
నేర్తు నేని నద్దాని వర్ణింపఁ దగిన
బాస నేరఁగ నోపను వీసమేని.
ఇది యెఱుంగు దొకింత-నా హృదయమందుఁ
గృష్ణ స్పర్శ మించుక సోకనేని వైళ
మే నశించును నా తెలివెల్ల-ననుచు.

సూ: **ప్రకా (శ) శ్యతే క్వాఽపి పాత్రే.** 53

టీక : (తత్- ఆప్రేమ) క్వ-అపి = ఏకాలమందైనను- ఏప్రదేశమందైనను; పాత్రే = తగిన పాత్రమందు; ప్రకాశ్యతే = ప్రకటిత మగుచున్నది.

తె. గీ : **తగిన పాత్రమందెవుడది నెగడుచుండు.**

వివ: వాక్కు వలనఁ బ్రేమ స్వరూపంబుఁ దెలుప
రాదనెడి భాషితము యథార్థంబ యగును.
అయినఁ జిరము ప్రేమోన్మత్తుఁడౌ మహాత్ము
తనువు-మనము-సంశుద్ధినిఁ గనుఁడు నాతఁ
డఖిల విశ్వంబు మఱచి, దివ్య ప్రమత్త
చేష్టితుండగు ;- ప్రేమ మించించు కతని
నుండి లోకమునకు వెలుఁగొందు చుండు.
అట్టి యెడనేనిఁ గేవల మతని వాక్కు
వలన మఱియు నేత్రంబుల వలనఁ గాక
తనువునన్ రోమరోమ మందునను ప్రేమ
కిరణములు తామె వెలువడి కెరలుచుండు.
అట్టి ప్రేమ ప్రకాశము నరయఁ గేవ
లము పరాత్మ దివ్య ప్రకాశము-నిజంబు !
ఇట్టి దివ్య తేజంబు నెందెందొ యరుదు
గా మహాత్ముల యందుఁ బ్రకాశ మొందు.

**సూ: గుణరహితం-కామనారహితం ప్రతిక్షణ వర్ధమాన
మవిచ్ఛిన్నం సూక్ష్మతరమనుభవరూపమ్. 54**

టీక: గుణ రహితం = (ఆ ప్రేమ) త్రిగుణములచే విడువఁబడి నదియు ; కామనారహితమ్ = స్వార్థ ఫలాపేక్ష లేనిదియు; ప్రతి క్షణ వర్ధమానమ్ = క్షణ క్షణ మభివృద్ధి నొందు నదియు; అవి చ్ఛిన్నమ్ = ఎడబాటు ( తెంపు) లేనిదియు ; సూక్ష్మతరమ్ = మిక్కిలి సూక్ష్మమైనదియు; అనుభవరూపమ్ = (వాఙ్మనంబుల కందరాక) స్వానుభవమే రూపము గాఁ గలదనియు (అగుచున్నది)

**తె.గీ.: ప్రేమ-గుణ రహితంబును, గామనా వి
హీనమును-బ్రతిక్షణ వర్ధమాన మగుచు
మఱి, యవిచ్ఛిన్నమును సూక్ష్మ తరముఁగేవ
లానుభవ రూపమై తనరారుచుండు**

వివ: గుణము నెందేనిఁ గన–దానఁ బొనరు ప్రేమ ;
గుణముఁ గనఁడేని నా ప్రేమ యణఁగు నట ; య
థార్థమగు ప్రేమ గుణ సక్తి నందఁ బోదు
ప్రేమి కిట్టి ప్రేమాస్పద విషయమందుఁ
గలదె గుణదోష చర్చావకాశమేని ?
తెలియు నిది సహజము గుణాతీత మగును ;
త్రిగుణముల దేనిచేత బాధింపఁ బడదు.

★ ★ ★

కామనా బుద్ధి తోపదు ప్రేమి యందుఁ
బ్రేమకుఁ మూలమౌ వస్తు ప్రీతి తక్క ;
స్వార్థ విషయ వాసన ప్రేమి కమరఁ బోదు
స్వ విషయాభిలాష జనించు క్షణము నందె
పావన ప్రేమ కల్మషత్వంబు నొందుఁ;
గాన, ఁగామనా సహితంబు గాదు ప్రేమ

★ ★ ★

స్వచ్ఛమగు ప్రేమ క్షీణతఁ బడయుఁ బోదు ;
క్షణము క్షణ మభివృద్ధినిఁ గాంచు చుండుఁ ;
బఱఁగఁ బ్రేమకుఁ బరిసమాప్తంబు లేదు.
ప్రేమ తఱుగయ్యె ననుచు భావించుఁ బ్రేమి ;
ఏ యవస్థ యందును బ్రేమ వృద్ధి నొందె
ననుచుఁ దలఁపఁ డింకను బ్రయత్నంబు సలుపు
సర్వగతులఁ బ్రేమిని నిది సహజ మగుచు
వెలయు ;– విచ్ఛేద రహితమౌ ప్రేమ సంత
తప్ర వృద్ధి క్రమంబు నాతంక పఱుఁపఁ
బడదు;– పెంపును గనుచుండుఁ బవలు రేలు.

★ ★ ★

హృదయ గుహను నిక్షిప్తమై యెసఁగు కతన
సూక్ష్మముల యందు మిక్కిలి సూక్ష్మ మగుచుఁ
బ్రేమగతి యితరులకుఁ గన్పింపఁ బోదు.
అనుభవైక వేద్యంబయి యలరు నదియు ;
అరయఁ బ్రేమ మానంద మయంబ యగును.
ఇదియు నానంద మయుఁడైన కృష్ణు తోల
'యంబుఁ గని ప్రేమి నానంద మందఁ జేయు.

**సూ : తత్ప్రాప్య తదేవావలోకయతి– తదేవ శృణోతి**
**తదేవ భాషయతి – తదేవ చింత యతి. 55**

టీక : తత్ = ఆ ప్రేమ భక్తి ; ప్రాప్య – పొందఁ బడినది యగుచుండగా; ( ఆ ప్రేమి) తత్– ఏవ –అవలోకయతి = ఆ ప్రేమ పాత్రమైన వస్తువునే చూచు చుండును; తత్– ఏవ– శృణోతి = దానినే వినును; తత్–ఏవ – భాషయతి = దానినే భాషింప జేయును ; తత్– ఏవ – చింతయతి = దానిని గూర్చియే చింతించును.

**తె. గీ. : దానిఁ బొందెనేఁ బ్రేమి యుద్దానినే స**
**తంబుఁ గనుచుండు, వినుచుండు దానిఁ గూర్చి**
**యే, వచించు దానినె, దానినే స్మరించు.**

వివ: అనుపమ ప్రేమ దివ్య రసాంబు రాశి
మగ్నుఁ డగుచుఁ బ్రేమానంద మయుడు నైన
ప్రేమి యెల్లెడ – రసమయ ప్రేమమయము
నైన ప్రియతమునే చూచు, నన్యమైన
వస్తువును గనలేఁడీ యవస్థనున్న
వ్రజ పురంధ్రి యొక్కతె మున్ను బలికె నిటుల ;
''శ్యామమీ కుంజ వనమెల్ల, యమున శ్యామ
మాకసము శ్యామ మగు, శ్యామ మంబుదంబు ;

అఖిలమును శ్యామ భరితమై యలరు చుండె ;
చంద్ర సూర్యుల తేజంబు శ్యామ మగును.
నీలకంఠ కంఠము శ్యామ లీలఁ బొలుచు,
నమల శ్రుత్యక్షరంబులు శ్యామ మగును,
దీప శిఖ శ్యామ మగు, నర దేవతలకు
నందరాని పరబ్రహ్మ శ్యామ '' – మనుచు.
శ్యామ సుందరు నోర్తిట్లు లభినుతించె :–
' నగరములఁ బల్లెలం దరణ్యంబు లందు,
వాటికల, నెల్ల వనములఁ బథములందు
యామునీ తట తరు నికుంజాంతరముల
హార హీర దివ్యాభరణాదులందు
గోపికల గాయకుల, మఱి, గోకులమున
గోధనముల వత్సముల నంభోధరముల
నెందు నెందు వీక్షింప నందందు శ్యామ
సుందరుని మాత్రమే కనుల్ చూచు ; ''–ననుచు,

★ ★ ★

కర్ణముల శబ్ద మేదైనఁ గాని వినఁగఁ
బడిన నది – ప్రేమ గీతికా స్వర లహరిగ
భావనము సేయు ప్రేమియౌ వాఁడు సతము ;
ప్రియతముండు నౌ రాధికా కృష్ణ దివ్య
సరస సంగీత మాధురీ సాధు రీతిఁ
బఱగు మురళీ రవంబుఁగా నెఱుఁగు చుండు.
వాక్కుచేఁ గృష్ణ ప్రేమ శబ్దంబుఁ గాక
యితర మెయ్యది యేని భాషింపఁ బోఁడు ;
ప్రేమమయు గుణగానంబు విడువఁ డెప్పుడు.

★ ★ ★

పద పదంబునఁ – బ్రియతమ వరమ పురుష
స్వాదు ప్రేమ రసామృతాస్వాదనాను
భవముఁ గాంచుచుఁ దృప్తినిఁ బడయుఁ బోని
రసనచే సదా తదమృత రసముఁ గ్రోల
నాస వహియించుఁ బ్రేమి ; యన్యంబు నెపుడు
వాని మతి తలంపదు ప్రేమ పాత్రమైన
మాధవాఖండ రాజ్య పూర్ణాధికార
మునకు నేక ప్రదేశమై తనరి ;– మనసు
అన్య కల్పనా స్మృతికిఁ దావైన నిడక
వాసుదేవు ప్రేమ స్వరూపంబునొందు

★ ★ ★

అవయవమ్ము లెల్లను తదీయానుభవము
నొంది తద్విషయంబునే పొందు చుండు ;
కృష్ణునే కనుల్ నిరత మీక్షించు చుండు ;
అనుపమంబు శబ్ద బ్రహ్మ మమిత మధుర
మైన వేణు గానమె చెవు లాలకించు ;
రాధికా ప్రియు నంగ సౌరభ్య మే గ్ర
హించు నాసిక ; నాల్క తదేక సరణి
సలుపుఁ గృష్ణ ప్రేమామృతా స్వాదనంబు;
అఖిల సౌంధర్య మధుర రసాంబురాశి
బృందఫల–మమందానంద కందమైన
నంద నందనాంగా స్పర్శనానుభవముఁ
గాంచుచుండును దత్ప్రేమి కాయమెపుడు ;
హరి నినాదమె వినుచుండు నాకసమున,
వాయువందున గోవిందు స్పర్శఁ గాంచు,
అగ్నియందుఁ గృష్ణజ్యోతి నరయుచుండు,

జలములందు ముకుందు రసంబె పడయు,
కుతలి శౌరి గంధమునె మూర్కొను నతండు.
అఖిల విశ్వము హరి పరివ్యాప్త మగుట
నెల్లెడల మాధురీరస మెసఁగు చుండు.
ప్రేమములకెల్ల ప్రేమయై వెలయునెల్ల
యందు - నానందములకు నానందమగును.
అరయ సకలము ప్రేమ మయంబు ;- రసమ
యంబు ;- నానంద మయమునౌ హరి మయంబు.

★ ★ ★

సృష్టి నెల్లెడ-నధికమే - నించు కేనిఁ
దోఁచు నానంద సరస మాధుర్యములగు
దృశ్య-ద్రష్టలు మధురమై యెసఁగు చుంద్రు.
అఖిలమును - 'నీవు' - 'నేఁ'- మధురాత్మకము లె ;
మఱి, పరానందరస సుధామయము నైన
మహిత మధురాధి పతియపో మధుర తమము.
ఇట్లు ప్రేమ భక్తుని దృష్టి కెల్లయెడల
బ్రేమమయ భగవానుఁడే వెలయు చుండు ;
ప్రేమియును భగవానుని దృష్టిఁ బొలుచు.
గీతలందు వచింపఁడే కృష్ణుఁ డిటుల :-
'' ఎవఁడు సకలంబునందు నీక్షించు నన్ను ;
ఎవఁడు నాయందు సకల మీక్షించుచుండు
జగతి వానికి నేఁ బరోక్షంబు నొంద ;
వాఁడు నాకుఁ బరోక్షంబు గాఁడ'' టంచు.

ఈ యవస్థను బ్రేమి వచింపరాని
దివ్యప్రేమ రసామృతాబ్ధిని మునుంగు ;

వెలయునిదె-పరాభక్తి నాఁ బ్రేమ భక్తి
యనఁగ ;- నిదియె 'భూమానంద' - మైతనర్చు
ఎల్లెడల వ్యాప్తమగుచు, నహీన మగుచు
ననుపమమగు భూమానందమునకు - స్వల్ప
సుఖమునకుఁ దారతమ్యము శ్రుతులు నివ్వి
ధమున వచియించు :- ''నెందు నన్యమును గనఁడొ -
యన్యము వినండొ- ఎఱుగఁడో -యదియె 'భూమ'
మగును ; ఎందున నన్యము నరయఁ గలఁడొ
ఆలకించునొ - యెఱుఁగునో - యదియె - 'అల్ప'
మగును ;- భూమమౌ నదియపో 'అమృత' మగును ;
అల్పమే మృత్యువగుఁ గాన నఖిల గతుల
నాశ రహితము-మఱియు, సనాతనంబు
మధురమును - సత్యమగును ప్రేమంబు సతము.

**సూ: గౌణీ త్రిథా గుణభేదా దార్తాది భేదాద్వా. 56**

టీక : గౌణీ = గౌణభక్తి (త్రిగుణములకు సంబంధించిన భక్తి) ప్రేమభక్తిగాక సాధారణముగ మానవులు సలుపు భక్తి ; గుణభేదాత్ = సత్త్వ రజస్తమో గుణ భేదముల ననుసరించి గాని ; వా = లేక ; ఆర్త- ఆది భేదాత్ = ఆర్తుఁడు - జిజ్ఞాసువు - అర్థార్థి భేదముల ననుసరించిగాని ; త్రిథా = మూఁడు విధములు; (భవతి = అగుచున్నది).

**తె.గీ. ; అమరెడిని గౌణభక్తి యార్తాది భేద**
**మునను గుణ విభేదంబుచే ముప్విధముల.**

వివ: వేల్పు తపసి శ్రీ భగవాను ప్రేమతత్త్వ
మెల్లఁ బ్రేమ భక్తునకుఁ బ్రాపింపఁ జేయ
విమలమైన పరాభక్తి వివరణంబు
వెనుక సూత్రంబు దనుకఁ గావించె ; నదియె

భాగవతమం ''దహైతుక భక్తి '' – యనుచు,
మఱియు, ''నిర్గుణ భక్తి'' నాఁ బఱఁగి గీత
లందు జ్ఞానికి సాధనం బనఁగఁ బడియె.
అరయనా యహైతుక భక్తియందు – భక్త
భావ వృత్తి కర్మగతి ప్రవాహములు, ని
రంతరము నిజముగ భగవంతుఁ జేరి
యంద లీనముఁ గను; వాని స్వాంత మెపుడ
నన్యసరణి నిష్కామత్వమందు నెల్ల
కృతుల నీశ్వర ప్రీతిగ నతఁడు సలుపు

★ ★ ★

కృష్ణుఁడనఁడె? నిర్గుణ భక్తి గీతలందు ;
''సవ్యసాచి ! యార్తుండు జిజ్ఞాసు వనఁగ
మఱియు నర్థార్థి జ్ఞానినాఁ బఱఁగు నిట్టి
నాల్గు విధముల జనులు పుణ్యాత్మకులు, భ
జించు చుందురు నన్ను సమంచితముగ.
వార లందఱిలో నేక భక్తి గలిగి,
అర్జునా! నిత్యయుక్తాత్ముఁ డైన జ్ఞాని
శ్రేష్ఠుఁడగు ; జ్ఞాని కేనతి ప్రియుఁడ నగుదు ;
వాఁడు మిక్కిలి ప్రియమైన వాఁడు నాకు.
పెక్కు జన్మంబు లెత్తిన పిదప జ్ఞాన
వంతుఁడై యీ సమస్తము వాసుదేవుఁ
డొక్కఁడే యను నిశ్చయ మొందఁ గలుగు
నా మహాత్ముఁడు దుర్లభుండగు '' నటంచు.

★ ★ ★

వాఁడు భగవత్స్వరూపుఁడై పఱఁగు ; వాని
కంటె భిన్నులయి, గుణాధికార భేద
మునను గౌణ భక్తులు పొల్తు ముప్విధముల.

తలఁప సాత్త్విక రాజస తామసులన ;
ఆర్త జిజ్ఞాసు లర్థార్థు లనఁగ ; నందు ; –
పాప హరణార్థమై కర్మ ఫలము నెల్ల
ఈశ్వరార్పణ బుద్ధిఁ గావించి, పూజ
నాదికములు కర్తవ్య మంచరసి, భేద
సరణి సల్పెడి భక్తియె సాత్త్వికంబు !

★ ★ ★

అతులితైశ్వర్య యశములం దాశగలిగి
భేద దృష్టినిఁ గని, ప్రతిమాదికములఁ
బూజనా రూపమగు భక్తి రాజసంబు ;

★ ★ ★

దంభమాన హింసోగ్ర మాత్సర్యములకు
ద్వేషమునకుఁ దానకమయి భేదదృష్టిఁ
దవిలి సలిపెడి భక్తియె తామసంబు.

★ ★ ★

అర్థకామి – జిజ్ఞాసువు – నార్తుఁ డనఁగ
త్రివిధ భక్తులు గీతలఁ దెలుపఁ బడిరి.
వారి భక్తి యేనియు గౌణ భక్తియగును.
గౌణ భక్తి నా గుణయుత మైన భక్తి.

★ ★ ★

అవనిని వికుంఠ మొంద నర్థార్థి కోరు,
దేని నెఱిఁగిన సకలంబు దెలియఁ బడునో
దాని జిజ్ఞాసు వెపుడుఁ బొందంగఁ దలఁ చు ;
జనన మరణాత్మకమగు కష్టములఁ బాసి,
యవ్యయానంద పదమొంద నార్తుఁ డెంచు

★ ★ ★

త్రి గతులగు వీరు భగవాను త్రివిధ తత్త్వ
ములగు 'సచ్చిదానందముల్' దెలుపు వారు;
త్రి పథములు భగవంతుఁ బొందించుఁ దుదకు
★ ★ ★
గౌణ భక్తి సాధనమగుఁ గాని,– దాని
వలనఁ గలుగఁబో దీశ్వర ప్రాప్తి ; యైన
సుకృతుఁడగు గౌణ భక్తి సాధకుఁడు నేని ;
చిరమనుష్ఠాన మవ్విధిఁ జేయఁ జేయ
నంత్యమున నీశ్వరానుగ్రహమున నతఁడు
తత్ప్రసాద సంసిద్ధి కత్యంత ముఖ్య
సాధనాత్మక మగుచు, సాక్షాద్రమాప
తి స్వరూపమౌ ప్రేమ భక్తిని గడించు.
★ ★ ★
అరయుఁడీ భగవద్భక్తి యందుఁ గలవి
శేష, – మన్యమార్గముల నార్జింపరాని
యీశ్వరాత్మక ప్రేమ ప్రాప్తించుఁ దుదకు.
అట్టి గౌణ భక్తులును ఋణ్యాత్ము లనఘు
లుత్తముల ; వారి యందున బత్తి యేది
యో యొకానొక విధమున నొప్పు చుండు
ధ్యాన భజనార్చన సమాశ్రయాది గతుల ;
అట్టివాని ఫలం బీశ్వరాప్తి యగు ; న
టే విధంబున నేఁ వాసుదేవునందు
భక్తి సేయుట జీవి కవశ్య మగును.
అన్నిటను మిన్న సాత్వికమైన భక్తి.
అఖిల భువన వైభవమే ననర్థ మనుచుఁ
బరమ ధన పరమార్థ మీశ్వరుడె యని, య
థార్థముగ నమ్మి ప్రాకృతార్థాద్రి యటులఁ
బఱువఁ గానగు నీశ్వర భక్తి నరుఁడు.
★ ★ ★

**సూ : ఉత్తర స్మా దుత్తరస్మా త్పూర్వ పూర్వా శ్రేయాయ భవతి. 57**

టీక: ఉత్తరస్మాత్– ఉత్తరస్మాత్ = తరువాత తరువాత దానికంటె; పూర్వ పూర్వా = తొలుత తొలుతవి ; శ్రేయాయ– భవతి = మేలుకొఱకగుచున్నది. ( మేలు కలిగించునది యగుచున్నది.)

**తె. గీ. : పూర్వపూర్వముల్ పర పరములకు లెస్స.**

వివ: శ్రేయమన 'ముఖ్యభక్తి' – నాఁ జెప్ప నగును ;
ముఖ్యభక్తి పరాభక్తిఁ బొందఁ జేయు.
సాత్వికము ముఖ్యభక్తికి సన్నిహితము.
భక్తిపథ వర్తనంబులు ప్రాణికోటిఁ
దామసము రాజసమునకుఁ దార్చు, రాజ
సంబు సాత్వింకంబునకు మార్గంబుఁ జూపు

★ ★ ★

పఱచు ముఖ్య భక్తికి నార్త భక్తి త్రోవ,
నార్త భక్తి జిజ్ఞాసచే నమరు చుండు
బడయు జిజ్ఞాస నర్థార్థి భక్తి కతన

★ ★ ★

ఐహికములఁ బోఁద్రోసి పరార్థ మెఱిఁగి
యార్తిమై భగవద్విరహమును బాపు
ముఖ్య భక్తినిఁ బడసి, తన్మూలమున న
నన్యమౌ 'పరాభక్తి' ఁ దా నందుఁ బ్రాణి

★ ★ ★

రాజసము తామసము కంటె, రాజసమున
కంటె సాత్వికంబును శుభంకరమ ; యధిక
మగును జిజ్ఞాసభక్తి యర్థార్థ భక్తి
కంటె ; జిజ్ఞాస భక్తినిఁ గడచు నార్త
భక్తి యివి యన్నియును గౌణ భక్తు లగును.

★ ★ ★

# 9. భక్తి సౌలభ్యము - మహత్త్వము

సూత్ర : అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ. 58

టీక : భక్తౌ = భగవద్భక్తియందు; అన్యస్మాత్=ఇతరములకంటె, సౌలభ్యం= సులభత్వము, (సులభభావము) ( అస్తి= ఉన్నది).

తె.గీ: అన్యము కంటె సులభ సాధ్యంబు భక్తి.

వివ: ప్రేమ తత్త్వ మిట్లని నిరూపింప నలవి
కాదనుచుఁ బూర్వమందుఁ బల్కంగఁ బడియె.
అది వచింప రాకున్న నభ్యాసవశతఁ
బడసి, యద్దాని ననుభవింపంగ నగును.
విశ్వమున నెందొ యొకదానఁ బ్రేమఁ బఱువఁ
బోని యే జీవి నేనియుఁ గానఁ బోము
ప్రాకృతప్రేమ స్థిరత శుభ్రతలఁ గూర్చి
యీశ్వరాభి ముఖంబుఁ గావింతు మేని
అదియె భక్తియౌ ; సులభ సాధ్యంబు దాని
నెఱుఁగఁ బడయఁగ ; – ఈ ప్రేమ నెందో యెపుడొ
స్వల్పమేనియుఁ గనఁ బోని ప్రాణి లేదు ;

★ ★ ★

జ్ఞాన యోగ కర్మంబుల కంటె శ్రేష్ఠ
మనుచు భక్తి మహిమఁ గొనియాడి, సూత్ర
కారుఁ డిట్టి భక్తిప్రాప్తి జ్ఞానముఖ్య
సాధనలనెల్ల సులభము సహజమనియె,
ఇట్టి భక్తి గడింపఁగ నెందు విద్య
లేని, ధనమేఁ గులీనతలేని, నుత్త
మంపు వర్ణాశ్రమాది ధర్మములు నేని

నఖిల వేద వేదాంతాధ్యయనము లేని,
పటువిరక్తులేన్ దగవు ; కేవలము సరళ
భావమున భగవంతుఁ గృపావయోధి
యెడల విశ్వాసమును గల్గి యెల్లవేళ
లందుఁ బ్రేమమై స్మరియింప నమరు భక్తి
దీని సౌలభ్య మెంతయుఁ దెల్ల మగును.
ఈశ్వరుని కరుణామృత మెల్ల యెడల
నెల్ల జీవులపైఁ బ్రవహించు చుండు.
ఎవ్వఁడీ దయాసింధువు నెఱిఁగి విశ్వ
సింపఁడో యట్టిజీవి వంచింపఁ బడును.

★ ★ ★

''సర్వ భూతములందు నేఁ సముఁడ, లేఁడు
ప్రియుఁడు గానియు నాకు నప్రియుఁడుఁ గాని ;
ఎవరు భక్తితో నను భజియింతు రుంద్రు
వారు నా యందు ; నే నుండు వారి యందు,
అఖిల యజ్ఞ తపంబుల ననుభవించు
వాని సర్వభువన మహేశ్వరుని, మఱియు,
నఖిల భూత హితా సక్తుఁడైన నన్ను
నెఱిఁగిన యతండు శాంతి వహించు '' – నను చుఁ
గృష్ణుఁడు వచింపఁడే ? తొల్లి గీతలందు.

★ ★ ★

ఈశ్వరుని గాఢముగ విశ్వసించు వాఁడు
నిరతమును సత్కృపాబ్ధి మునింగి యుండు ;
నెల్లకాలంబు నెల్లెడ నెల్ల దెసలఁ
బైన లోపల సత్కృపా భరితుఁడగును.
వాసుదేవుని కరుణా ప్రభావ మునను
బాప తాప విముక్తినిఁ బడసి జీవి

దైవ భక్తికి నధికారియై వెలుంగు.
భూరి విశ్వాస నిశ్చయముల గడించి
యీశ్వరు ననన్య భక్తి సేవింప – నెల్ల
వార లధికారు లగుదురు. ; బాలురేని
వృద్ధు లేనియు, యువకులేన్ వెలఁదులేని
బ్రాహ్మణ క్షత్రియులు నేని వైశ్య శూద్రు
లన్య లెవరేని నధికారు లగుచునుంద్రు.

★ ★ ★

సకల భూతము లందున సముఁడు నగుట
నొకనిఁ ద్రోసి గ్రహింపఁ డింకొకని ప్రభువు
ఈశ్వరుని కృప నెల్లర నెల్ల యెడలఁ
బఱఁగునని నమ్మి, నమ్మిక స్థిరము సేయ
భక్తి నొడ గూర్చు సాధనల్ ప్రాప్త మగును
దమకుఁ దామ ; కృష్ణుండు గీతల ననండె ?
''ఇతర విషయము లందుఁ బోనీక చిత్త
మెవఁడు సతము నిత్యంబు స్మరించునర్ మ
హామతీ ! నిత్య యుక్తుఁడునైన యోగి
కమిత సులభంబుఁగా నంద నగుదు '' ; ననుచు.

★ ★ ★

భక్తి యితర సాధనల లభ్యంబుఁ గాదు :
పడయనగు మార్గ మీశ్వర భజన మొకటె.

సూ: **ప్రమాణాంతరస్యా నపేక్షత్వాత్**
**స్వయం ప్రమాణ త్వాత్.** 59

టీక : ప్రమాణ–అంతరస్య = ఇతర ప్రమాణము యొక్క; న–అపేక్ష త్వాత్ = అపేక్ష లేనిది కావున (తనకంటె నితర ప్రమాణములపై నాధార పడనిది కావున) ; స్వయం= తనకుఁ దానే ; ప్రమాణ త్వాత్ = ప్రమాణమైన దగుట చేత.

తె.గీ. : ఇతరమౌ ప్రమాణము నపేక్షింపఁ బోక
తనకుఁదాఁ బ్రమాణంబయి తనరు కతన.

వివ: భక్తి మార్గాను వర్తియౌ వాఁడు సతము
భక్తి సౌఖ్యంబుఁ దను దాన పడయు చుండు ;
తనకుఁదా దోఁచు సౌఖ్య నిర్ధారణంబు ;
అతఁడు తన లోన నా సౌఖ్య మనుభవించు,
పెర ప్రమాణముతో నవసరము లేదు.
భర్తృ సంగ సౌఖ్యంబును బడయు భార్య
కన్యయౌ సుతకేమి పల్కంగ నేర్చు ?
భక్తి సౌఖ్యాను భవ మొక్క భక్తునకె యె
ఱుంగ నగుఁ గాని, యొరుల కెఱుంగ రాదు.
దాని వివరింపఁ బలుకులేఁ గాన రావు.
అటులఁ బుణ్యాత్ముకులును మహానుభావు
లైన భక్తులు కోర్కెల నణఁచి వైచి,
యీశ్వర ప్రేమఁ గోరి తదీయ కృపకుఁ
బాత్రులై యెల్ల గతులను వాసుదేవు
ప్రేమ పెంపొంద నిజ చిత్త వృత్తు లడఁచి,
మోదముననను సర్వాంగముల్ పులకరింపఁ,
గనుల బాష్పముల్ గుఱియు, గద్గదిక పొడమ,
భక్తి సౌఖ్యాను భవమును బడయు చుంద్రు.

★ ★ ★

భక్తి సౌలభ్యగతి యిందుఁ బలుకఁ బడియె.
ఇతర నూతన వస్తువు నెఱిఁగి కొనఁ బ్ర
మాణమొండేదొ వలయుఁ ; బ్రేమంబు నెఱుఁగ
నటులఁ గాదు ; స్వయంబ వేద్యంబు 'భక్తి',
స్వసుఖ దుఃఖము లెడ నిరూపణము లేల ?

వాని నెఱుఁగఁగ నన్య ప్రమాణ మేల ?
స్వాను భవమును ద్రోసి రాజనఁగఁ జాల
దెట్టి వాదమే ; ననుభూతియే ప్రమాణ
మితర హేతువు లెందు సమ్మతము గావు.

**సూ : శాంతి రూపాత్ పరమానంద రూపాచ్చ** 60

టీక : శాంతిరూపాత్ = (మనశ్శాంతి కలిగించునదగుట వలన.) శాంతి రూపమైన దగుటచేత; పరమ– ఆనంద రూపాత్–చ= శ్రేష్ఠమైన ఆనంద రూపమగుట చేతను.

**తె.గీ. : రూఢ శాంతి పరానంద రూపమగుట.**

విఙ: ప్రాప్యమౌ నీశ్వర స్వరూపంబు శాంతి
మయము, మఱి, సచ్చిదానంద మయము నగును.
ఆత్మ– ప్రేమ రూపమునఁ దా నవతరించు ;
అరయ సచ్చిదానంద మయంబు – శాంతి
మయము శ్రీ వాసుదేవు ప్రేమంబుఁ గూడ.
సచ్చిదానంద రూపుఁ డీశ్వరుఁడు స్వీయ
మైన 'హ్లాదినీ'–యను శక్తి నాశ్రయించి
పరమ ప్రేమ రూపంబును బడయుఁ ; బ్రేమ
మూల మగుచు నానందోప భోగ మొందు.
ఈశ్వరానంద లీలయై యెసఁగు నిదియ.

★ ★ ★

ప్రేమ మూల మంచని యిందుఁ బేరుకొనిన
పరమ సచ్చిదానంద రూపం బదెందుఁ
బ్రాకృతము గాదు ; త్రిగుణ వివర్జితంబు.
నిర్గుణాత్మకమై యిది నెగడు చుండు,
శాంతి సచ్చిదానందాంశ సహిత మగుచు

దైవ యోగమాయాఢ్య ప్రభావమునను
దివ్యతను వెల్ల వేళలఁ దేజరిల్లు,
అట్టులగుట నాత్మారాములైన మునులు,
ననఘ మతులు జీవన్ముక్తులైన నరులు
వ్యాస నారద శుక జనకాదు లెల్ల
దివ్యగుణ భూషణములకు, దివ్యగంధ
నవ్య సౌందర్య మురళీ నినాదములకు
ముగ్ధులైరి ; — జగంబులఁ బుట్టఁ జేసి,
యావరణఁ గూర్చు మలిన మాయాగుణ ప్ర
కాశమిది యనఁ బొసఁగదు లేశమేని ;
మాయ మొదలంటఁ గోయు బ్రహ్మ స్వరూపు
లౌ మహాత్ముల వంచించి, యాసఁ బెనిచి,
తనదు చక్కి కాకర్షించు కొనెడి దగునె ?
పలుకు నిర్గుణ వాదులే బ్రహ్మరూప
మవ్యయానంద శాంతి మయంబటంచు,
నిగమ సంచయ మెవ్వాని 'నేతి'—'నేతి'—
యనుచు సాంకేతికంబుగ నరసి కొనునొ,
ఆ పరానంద మయుఁడు, మాయాతిరిక్తుఁ
డైన పరమాత్మ — భక్తుల కధిక ప్రియత
ముండునా నొప్పు ; — శాంతి సముద్రుఁడనిన,
నవ్య యానంద సాగరుండనుచుఁ బలుకఁ
బడిన, నయ్యది యాథార్థ్య వర్ణనంబు
గాదు ; భగవాను నందలి గాఢ ప్రేమ
శాంతి సచ్చిదానంద రసాత్మకమని
నారదుండిందు ప్రేమ వర్ణనము చేసె.

★ ★ ★

# 10. భక్తి సాధనము- అంతరాయము

సూత్ర: లోక హానౌ చింతా నకార్యా;
నివేదితాత్మ లోక వేద త్వాత్. 61

టీక: లోక హానౌ = లోక సంబంధమగు వ్యసనముల - (విషయముల); చింతా = విచారము (వగపు); నకార్యా = తగనిది; నివేదిత - ఆత్మలోక వేద త్వాత్ = (భగవంతునకు) అర్పింపఁ బడిన స్వకీయ లౌకిక వైదిక కర్మములు గలవాఁ డగుట వలన.

తె.గీ: వ్యాకులత లోక హానికై పడయ రాదు
కలుగు స్వీయ లౌకిక వేద కర్మవితతి
నీశ్వరున కర్పణంబుఁ గావించు కతన.

వివ: తనకుఁ గల సర్వ మీశ్వరార్పణము సేయు
భక్తజనున కెద్దాన సంబంధ మొదవు ?
ఇతర మేదేనిఁ జింతింప నేమి కలదు ?
అతని కఖిలముఁ బ్రియ తముఁడైన యీశ్వ
రుండు గాక, చింతింప వేఱొండు లేదు
ధన జన సతీసుతాదులేదారియైనఁ
దలఁపఁడవ్వాని, మున్నె, తాఁగల పదార్థ
సమితి హరికి సమర్పించి, సర్వ గతులఁ
దాన కించనుఁ డౌట ; నవ్వానిఁ దలఁప
వ్యవధి గలదె ? మనం బెట్టు లమరు? - నదియు
తనదు చింత లడంచు చింతామణీ వి
చింతనామృత మత్తయై చెలఁగు చుండు.
ఆశ్రితావన భక్త చిత్తాపహారి

చతురచోర చూడామణి – శ్రితునిచిత్త
మింక నాతని వశముఁ గావింపఁబోఁడు

★ ★ ★

కాన, నతఁడు చిత్తాపభావమైన కతన
విషయ చింతన మెట్లు గావింప నేర్చు?
దాన – నీ ప్రేమ తత్త్వ పథానువర్తి
యైన వాని కంటదు లోక హాని చింత
సంతతంబును సకలార్థ సాధనమగు
కృష్ణ పాదాబ్జముల సంస్మరింప నేర్చు
భక్తజనుఁ డన్యచింతలఁ బడయఁబోఁడుఁ

★ ★ ★

భువన సృష్టి రక్షణ లయంబులను సలుపు
వాఁడు సర్వేశ్వరుండని భక్తుఁ డెంచి,
యఖిలమును వాసుదేవ మయముగఁ గాంచి,
స్వీయ విధ్యుక్తములను గావించు భక్తుఁ
డాత్మ యందెవ్వుడేనియు వ్యసన పడఁడు
విశ్వకల్యాణకరుఁడుగా విశ్వసించు
నీశ్వరుని ; లోకచింత వహించఁ డెందు.

★ ★ ★

భక్తజన సేవ కోరఁడు వాసుఁదేవుఁ
డతి దయాళువు సర్వ నియంత యగుట
జీవ సంచయములు తన సేవచేసి
రక్షణ మపేక్ష సేయు మార్గంబుఁ గూర్చి
స్వీయ లీలలఁ బఱవు నీ విశ్వ మందు.
అటుల – హరి – హరి రూపమౌ ప్రాణి కోటి
సేవ సలుపవ భక్తుల కిడు సావకాశ

మట్టి యెడ నీశ్వరుఁడు లోకహానియెడలఁ
గలఁత బొందఁడు – భక్తు ఁ గలఁగ నీఁడు.

సూ: **నతద సిద్ధౌ (తత్సిద్ధౌ) లోక వ్యవహారో హేయః**
**కింతు ఫల త్యాగస్తత్సాధనంచ కార్యమేవ.** 62

టీక : తత్– అసిద్ధౌ = ఆ భక్తి సిద్ధించనంత దనుక ; (తత్సిద్ధౌ = భక్తి సిద్ధి యందు – భక్తి సిద్ధి పడసిన పిదప) ; లోక వ్యవహారః = లౌకిక వ్యాపారము; నహేయః = విడువఁ దగనిది ; కింతు = కాని; ఫలత్యాగః = కర్మఫలత్యాగము ; తత్ – సాధనమ్–చ=(భక్తి) దాని సాధనమును ; కార్యమ్– ఏవ = ఆచరింపఁ దగినదే.

తె. గీ. : **భక్తియందున సిద్ధి ప్రాప్తమగు దనుక**
**(సంప్రాప్తమైన)**
**లౌకిక శ్రౌత కర్మముల్ వదలరాదు;**
**కాని, సత్కర్మములు ఫలకాంక్ష వదలి**
**సలుపుచును, జేయఁ దగు భక్తి సాధనంబు.**

వివ: ప్రేమ సిద్ధి భక్తునకుఁ బ్రాప్తించె నేని
లౌకికాది కర్మంబు లెల్లను దమంత
వదలి పోవును ; బుద్ధిపూర్వకము గాగ
వాని వీడఁ గూడదు ; సమర్పణ మనంగ –
''కర్మ ఫల కాంక్ష మానసికముగ విడుట ''
ఎవఁడు ప్రేమోచ్చ దశ గడియించు, నతఁడు
విధి నిషేధంబులను దాటి వెలయుచుండుఁ;
గాన, నవ్వాని స్వయముగఁ గర్మ వితతి
విధి నియమ బంధ ముక్తమై వీడిపోవు ;
అది పరాకాష్ఠయౌ స్థితి యంద యొదవు.

★ ★ ★

ఎవఁడు భక్తి నెపంబున నెటిఁగి యెటిఁగి
శాస్త్ర నియమాను సరణి వర్జనము సేయు

భక్తి సిద్ధి నతం డెందు బడయ లేఁడు
అఖిల లౌకికాది వ్యవహారములను
దా నెఱింగి త్యజింపఁగఁ దగదటంచుఁ
బలికె సూత్రకారుం డిందుఁ బ్రస్ఫుటముగ
ఫలము నందలి కోరిక వదలి నియత
కర్మములఁ జేయునగును ; నిష్కామకర్మ
మాచరించు నాతఁడు లోకహాని చింతఁ
గాంచనేరఁ డయ్యదియు నాసించ దతని,

★ ★ ★

''ఆత్మ యందున రతి మఱి, యాత్మఁ దృప్తి
నాత్మయందున సంతుష్టి నంద నేర్చు
నట్టి మానవుం డొనరింప నర్హమైన
కర్మ మీ జగం బందునఁ గలుగఁ బోదు.
కర్మ మొనరింప ఫలమేమి కాంచం డతఁడు
కర్మ మొనరింపమినిఁ గీడుఁ గాంచఁ డట్టి
బ్రహ్మవేత్తకు సర్వ జీవముల వలన
నే ప్రయోజనమైన లేదింద్ర తనయ !
కాన కార్య కర్మము ఫల కాంక్ష వదలి
చేయు చుండుము సతతంబు శ్వేతవాహ !
విహిత కర్మంబులను ఫలా పేక్ష లేక
సలుపు చుండిన మోక్షంబుగలుగు; '' – నను చు
గీతల వచించు వేళ శ్రీకృష్ణుఁ డనఁడె ?
ప్రభువు ప్రీతికై నిష్కామ భావ సరణిఁ
గలిగి పొనరించు లౌకిక కర్మ చయము
భక్తి సిద్ధ సాధనమునై వఱఁగుచుండు.

సూ : స్త్రీ ధన నాస్తిక వైరి చరిత్రం న శ్రవణీయమ్ 63

టీక : స్త్రీ- ధన- నాస్తిక-వైరి చరిత్రమ్ = కాంతలకు సంబంధమైన, కనక సంబంధమైన, నాస్తికుల సంబంధమైన, పగఱ సంబంధమైన విషయముల (వృత్తాంతములను) నెప్పుడును; న- శ్రవణీయమ్ = వినఁగఁ దగదు.

**తె.గీ. : భామినీ ధన నాస్తిక వైరి కథల**
**భక్తుఁడెప్పుడే నాలకింపంగ రాదు.**

వివ : పూర్వ సూత్రంబునను – ''గర్మములను విడువఁ
బోక, యీశ్వరార్పణ బుద్ధి లౌకికాది
కర్మము లొనర్పదగు ఫల కాంక్ష వదలి ''
యనుచు వచియించి, ప్రేమ పథానువర్తి
యట్టి లౌకిక కర్మము లాచరించు
వాఁడ యైనను దా నాడు వారిఁ గూర్చి,
ధనముఁ గూర్చియు, నాస్తిక జనులఁ గూర్చి,
శాత్రవులఁ గూర్చి చేయు ప్రసంగముల వి
నంగరాదని యిటఁ దెల్పె నారదుండు.
ఉవిదల చరిత్రముల మది తవిలె నేని
ఈశ్వరుఁ దలంపఁగా నిచ్చగించఁ బోదు
కామినీ చింతనంబునఁ గామ మొదవు,
కామ మీ భక్తునకు బాధకారి మిగుల.
వెలఁదులను గూర్చి వార్తల వినియెనేనిఁ
జదివెనేనిఁ జూచెనయేని నొదవు నవుడ
యంగనాచింత ; భక్తి పథానువర్తి
కామినులఁ గూర్చి యెందుఁ బల్కంగ రాదు.
వెలఁది పలుకులఁ బాటల వినఁగ రాదు.
చెలువ కతలను గూర్చి చర్చింప రాదు,
స్త్రీల చిత్రంబు లెందుఁ జిత్రింప రాదు,

పొలతులను జేరి యూరక మెలఁగ రాదు ;
అరయఁగు లకాంత తోడ గార్హస్థ్య ధర్మ
సరణి నడుచుచో దాని దోసమనఁ దగదు, ;
వెలఁదులను గూర్చి పలికిన వినిన, జిత్ర
ములఁ గనిన వారలకు హాని గలుగు నిజము.

★ ★ ★

అంగనాసంగ, మంగనా సంగి సంగ
మములఁ గలిగెడి మోహబంధము – మఱెట్టి
చెలిమి వలననేఁ నరునకుఁ గలుఁగఁ బోదు.
మఱియుఁ, గామినీ సంగులఁ దఱియు వారు
నారక కవాటమును జొచ్చువారె'' యనుచు
భాగవతమున శుకయోగి పలుక లేదె ?
పురుషులకు నెట్లు సుదతుల పొందు తగదో –
కామినుల కట్లు పురుష సంగతియుఁ దగదు.

★ ★ ★

ధనము నందునఁ జిత్తము తవిలె నేని
లోభము జనించు మది, ధనలోభ మెపుడు
పాడమె–నవుడు న్యాయాఽన్యాయ బుద్ధి యడఁగు ;
మనుజుఁ డంతట సన్మార్గమును త్యజించి
యర్థసిద్ధికై చొచ్చు నన్యాయ పథము,
కాన, ధనముఁ గూర్చియు, ధన గర్వితాత్మ
లనుభవించెడు భోగములను గురించి,
బిరుదు పలుకులఁ గూరిచి వినఁగ రాదు

★ ★ ★

జగతి నీశ్వరు నందు శాస్త్రముల యందు
నమ్మకము లేని మనుజుఁడు 'నాస్తి కుండు ',
'ఈశ్వరుఁడు కలం' డని విశ్వసించఁ బోని

వాని కంటె నీ జగతికి వైరి లేఁడు.
''ఇందునేమి పొసంగు ? – నందేమి వస్తు
వలరు ? – ఈశ్వరుఁ డనుట కేవలము మిథ్య
ఈశ్వరుని యథార్థంబుగ నెవరు గనిరి ?
' ఆత్మ ' – యన కల్పనా మాత్రమగు '' – నటంచు
వదరుబోతు మాటల నిట్లు పలుకు వారు ;
ఈశ్వరుని శాస్త్రములను నిందించువారు
నౌ కుతార్కికులను దఱియంగ రాదు
కలసినను నాస్తికుల, వారి కథలు వినిన
నీశ్వరునియం దవిశ్వాస హృదయ మొదవు.
ఈశ్వరుని యెడ శ్రద్ధ నశించె నేని
ప్రబల పతన కారణమగు భక్తునకును,
కాన నాస్తిక జనుల సంగతియుఁ దగదు.

★ ★ ★

వాస్తవముగ భక్తున కెందు వైరి లేఁడు
పరమ భక్తుండు సకల ప్రపంచ మందు
వ్యాప్తమై వెలింగెడి యుపాస్యమగు కృష్ణుఁ
గనెడి వాఁడెవ్వరిని వైరిఁగాగఁ జూచు ?
శ్రీ మహాదేవుఁ డనఁడె ? '' శ్రీరామచరణ
రతుల కుమ ! కామ మద కోప మతులు లేవు.
భువనమును నిజప్రభుమయ ముగను గాంచు
భక్తజనున కెయ్యెడ లేఁడు వైరి '' – యనుచు.
కాని భక్తి యందున సిద్ధి కలుగు దనుక
సాధకుండిట్లు తలఁప నౌ స్వాంతమందు.
''ఈ సమస్తంబు మత్ప్రభు వీశ్వరుండె
కాని యన్యంబు లేదు నిక్కముగ – ననుచు,
ఇట్టి స్థితి యందు భ్రాంతిచే నెవ్వరేని

ద్వేష వైరముల్ చూపిన భక్తవరుఁడు
వానిఁ గూర్చి లేశముఁ దలంపంగ రాదు –
వినఁగ రాదు – క్రోధం బుద్భవించు కతన
తన కధీనంబు గాని చిత్తంబు కంటె
వైరి యెవ్వఁడు లేఁ డెందు వాస్తవముగ;
ఒరులు పగఁ గొన్నఁ దా నూరకుంట లెస్స.

★ ★ ★

కామినీ చింతనంబునఁ గామ మొదవు ;
అమరు లోభము ధన చింతనమునఁ జేసి ;
నాస్తికుల చింతనంబున నాశ మొందు
ప్రభువు నందునఁ బొలుచు విశ్వాస మెల్ల;
వైరిజన చింతనమునఁ గోపంబు గలుగు ;
కాన, నీ నాల్గిటిని భక్తుడైన వాఁడు
చేతనగు నంతవరకు వర్జింపవలయు.

**సూ : అభిమాన దంభాదికమ్ త్యాజ్యమ్. 64**

టీక : అభిమాన–దంభ– ఆదికం = అభిమానము – దంభము మొదలగు వానిని ;
త్యాజ్యమ్ = విడువఁదగును.

**తే. గీ. : వదలనగు నభిమాన దంబాదికముల.**

వివ : భామినీ ధన నాస్తిక వైరి చరిత
ములకుఁ జెవి యొగ్గ రాదని పూర్వ సూత్ర
మందుఁ బ్రవచించి, యట్లు సమాచరించు
నతఁడు – '' నేఁ గామినీ ధన త్యాగి నగుదు,
నేను పరమాస్తికుండనై నెగడు వాఁడ
నే నజాతవైరి '' నని గర్వించరాదు.
పతన హేతువౌ నభిమాన భావమెపుడు.

★ ★ ★

శక్తి వర్ణ కులాశ్రమాచార రూప
విత్త బుద్ధి విద్యాపద వితతిఁ గాంచి
భక్తుఁ డభిమాన మెప్పుడుఁ బడయరాదు.
అరయ సద్వస్తువులు సద్గుణాదికములుఁ
దగిన సాధన లొకటఁ బ్రాప్త మగునేని
ఈశ్వరుని కృప నవి లభియించె ననుచు
మదినిఁ దలపోసి గర్వంబు మానవలయు.
కలుగు నభిమానమున నధికమగు హాని
'ఏన్ నిరభిమాని' - ననుచు స్ఫురింపఁ జేయు
నట్టి యభిమాన బుద్ధియేన్ హానికరము

★ ★ ★

ఎలమి నభిమానమును నశియింపఁ జేయు
నుత్తమం బౌనుపాయ మిం దొకటి కలదు.
సతము దీనతన్ - వినయ నమ్రతలఁ గనుట.
పాయు నభిమానము వినమ్ర భక్తి వలన.
ఇవ్విధిని దంభమేనిఁ ద్యజింపవలయు.

★ ★ ★

నైజ భావ దోషమున ధనాభిమాన
లోభమునఁ బైకి సుగుణముల్ చూపుట యును;
భక్తుఁ డటుల ధర్మాత్ముని వలెను మిపుల
త్యాగి వలెఁ బైకిఁ గపట వర్తనుఁడు నగుటఁ,
బలుకఁ బడు నట్టి రీతి దంభం బనంగ.
దాంభికము గల్గు పురుషు సాధనపథంబు
నతుల దుర్గమ్య కంటకాన్వితము సుమ్ము ;
తాను వెలిఁ గపటాకృతుల్ తాల్చియున్న
మతిని విద్యాక్రియా కుశలతలఁ గనడు.

నిరభి మానత్వమును మఱి సరళత యును
భక్తి సాధనమున దోడు పడును మిగుల.
బాధకము లభిమాన దంభములు రెండుఁ,
బలుకఁ బడునవి యసుర సంపద లనంగ ;
'దంభమాదిగ' – ననుచు సూత్రమున నుంట
నసుర సంపదలవి పరిత్యాజ్యములని
సూత్రకారుఁ డియ్యెడలఁ బ్రస్ఫుటముఁ జేసె.

★ ★ ★

గీతలందు భాషింపఁడే ! కృష్ణుఁ డిటుల ;
''కవ్వడీ ! యభిమాన మజ్ఞానదాంభి
కములు, దర్పంబు, పరుసదనము దురాగ్ర
హంబులివి దైత్య సంపద యందుఁ బుట్టు
మనుజ సంచయములకు సంప్రాప్త మగును.

దైవ సంపద వలన బంధంబుఁ దలఁగు
దైత్య సంపద వలన బంధంబు గలుగు;
దైవ సంపద యందు నుద్భవము నొంది
తీవు గాన దుఃఖింపకుమీ ! కిరీటి !
అర్జునా ! దైవమని, మఱి, యాసురమని
భూత సృష్టి ద్వివిధములఁ బొలుచు, నందు,
దైవము వచింపఁ బడె సవిస్తరత, నింక
నాసురంబు వచించెద నాలకింపు.

ఎఱుఁగరు ప్రవృత్తి యేని నివృత్తి యేని
నాసుర స్వభావోపేతులైన జనులు;
వారలకు లేవు శౌచ మాచారములును,
సత్యమనేమొ యెఱుఁగరు ; సవ్యసాచి !

జగమసత్యము నప్రతిష్ఠం బనీశ
మును, బరస్పర సంజాతము, ఘనకామ
హేతుకం బంతకన్న వేఱేమి లేద
టంచు వాదింతు రవ్వార, లార్యవినుత !

ఇట్టి పెడ బుద్ధి సముపాశ్రయించి వార
లల్పమతులును నష్టాత్ములగుచుఁ బార్థ !
భయద కర్మపరాయణుల్ పరమవైరు
లై జగంబు నేఁపఁగ జన్మలందు చుంద్రు
ఆశ్రయించి నింప నశక్యమైన కామ
మును, విజయ! యసద్గ్రాహ్యములను గ్రహించి
మోహమున, మాన మద దంభ పూర్ణులైన
వారు వర్తింపుదు రశు చివ్రత నిరూఢి .

అపరిమేయముఁ బ్రళయాంతమైన చింత
నాశ్రయించిన వారలై స్వాంతములను
బార్థ! కామోప భోగముల్ పరము లనుచు,
నిదియపో సాధ్యమని నిశ్చయించు చంద్రు.
సవ్యసాచి! యాశాపాస శతనిబుద్ధు
లగుచుఁ, గామ కోపములె ముఖ్యములు గాగ
నరసి,, కామ భోగార్థ మన్యాయముగను
వార లర్థ సంచయములఁ గోరు చుంద్రు.

ఈ పదార్థంబు నాచేత నిపుడు పొందఁ
బడియె; నీ మనోరథమును బడయఁ గలను;
కలుగు నా కిప్పటికి నిది కలుగుజిమ్మ
యీ ధనమ్మును గూడ నాకింక మీఁద

చంపc బడియె నా చేత నీ శత్రు వితర
శాత్రవుల నెల్ల నిcక మీcద సంహరింతు ;
ఏన - భోగిని, నేన పో యీశ్వరుcడను
నేన సిద్ధుcడ, బలశాలి, నేన సుఖిని ;

సత్కులోద్భవుcడను ధనశాలి నగుచు
నేన, నా సమానుండన్యుc డెవcడు గలcడు?
యజ్ఞము లొనర్తు, నిచ్చెద, హర్ష మేన
కాంతు, నని మోహ మొంది యజ్ఞానమునను

అపరిమిత చిత్త విభ్రాంతులగుచు మోహ
మనెడి వలలోc దగుల్కొని యనవరతముc
గామ భోగ ప్రసక్తినిc గలిగి, కూలు
చుందు రశుచియౌ నరకంబు నందు – విజయ!

తమ్ముc దారె మెచ్చు కొనుచు స్తబ్ధు లగుచు
నమిత విత్తాభిమాన మదాన్వితులయి
యవిధి పూర్వకముగ వారలాచరింత్రు
యజ్ఞ సంచయముల దాంభికార్థముగను.

బల మహంకృతి కామ క్రోధములు దర్ప
మును వహించి స్వీయేతర తనువు లందుc
బొలిచి వెలుగొందు నన్ ద్వేషబుద్ధిc గని. య
సూయcబొందుచు నుంద్రు విశుద్ధ చరిత !

అశుభులును ద్వేషపరులుc గ్రూరాత్ము లైన
యట్టి మానవాధముల నిరంతరంబు
భూరి భయదోగ్ర సంసారములను బుట్టు
వొందcగ నొనర్తు రాక్షస యోనులందు.

అసుర యోనులయందు వా రవ్విధమున
జననముల నొంది, మఱి, జన్మ జన్మమునను
మూఢమతు లౌచుఁ జెడి, నన్ను పొందలేక
యంతకంటె నీచపు గతులందు చుంద్రు.
ఫల్గునా! కామ కోప లోభములు మూఁడు
నాత్మ నాశన మూలము లగుచు, నరక
మునకు మూఁడు ద్వారంబులై పొసగుగాన
వీని మూఁటిని విజ్ఞాని విడువ వలయు.

పాండవేయ మధ్యమ! తమో ద్వారములనఁ
బఱుఁగు నీత్రితయంబును వదలు నతఁడె,
శ్రేయమొన గూర్చు దానినిఁ జేయు చుండు,
నట్టిదానను గను శ్రేష్ఠమైన గతిని.

శాస్త్ర నియమము లెల్ల వర్జనము సేసి
యెవఁడు నడుచుచు నుండు స్వాభీష్ట సరణి,
నతఁడు సిద్ధినిఁ గనఁడు, సౌఖ్యంబు నేనిఁ
బడయఁగా లేఁడు, కాంచఁడు పరమ పదము''.

★ ★ ★

అనెడి కృష్ణ సూక్తుల భక్తుఁ డాత్మ నిలిపి,
వదలవలె నభిమాన దంభాదికముల.

★ ★ ★

సూ : **తదర్పితాఖిలాచారస్సన్ కామక్రోధాభిమానాదికమ్**
**తస్మిన్నేవ కరణీయమ్** 65

టీక: తత్–అర్పిత–అఖిల– ఆచారః సన్ = ఈశ్వరున కర్పింపఁబడిన సకల ప్రవర్తనలు గల వాఁడగుచు ; కామక్రోధ–అభిమాన– ఆదికమ్ = కామము కోపము అభిమానము మొదలగునవి ( కలిగినయెడల భక్తుడు ); తస్మిన్– ఏవ = ఆ భగవానుని యందే; కరణీయమ్ = ఆచరింపనగును. ( ప్రదర్శింపనగును.)

తే. గీ. : ఎల్ల కృతుల నీశ్వరున కర్పించి మెలఁగు
నపుడు కామ కోపాభిమానాదికములు
నెగడెనే నవి హరి యందనెఱప నగును.

వివ: ఈశ్వరునకు సమస్త మర్పించు నాతఁ
డింకఁ గామాదు లెటుఁ బ్రదర్శింపఁ గలఁడు ?
భక్తు ప్రేమ కీశ్వరుఁడెట్లు పాత్రమగునొ
యటుల కాదుకోపాదులకతఁడె పొసఁగు.
విషయపరులైన జనముల విధముఁదోఁచు
కామ కోపాభిమానాదికములు భక్తు
నందు లేవు ; దుర్గుణ రూప మాసురంబు
నైన కామాదికము పరిత్యాజ్య మనుచుఁ
దొలుతఁ బలుకంగఁ బడియె; భక్తుఁడగు వాని
కెందు దూషితమౌ కామ మెసఁగఁ బోదు.
విషయసక్తియు హింసయు ద్వేష మాగ్ర
హంబు లట్టి భక్తుని హృదయమున లేవు ;
దాంభికుల యభిమాన తత్త్వంబు గలుగ
దెట్టి దుర్గుణ బీజము నేనిఁ గనము.
సౌఖ్య విషయిక మైన వాసనయు లేని
భక్తునకు దోష మెందుండి ప్రాప్త మగును?

★ ★ ★

ప్రియ తముఁడగు నీశునకు సంతృప్తి సుఖము
లందజేయు టాతని జీవితాశయంబు ;
వాసుదేవ సుఖైక తత్పరతఁ గనిన
గోపికల భావమొంది భక్తుండు తనరు.
కాంచుఁ డాతఁడు లోక సంస్కార బుద్ధి ;
శీలమాన కులంబులు సిగ్గనెవ

భోగ దేహగేహ విమోక్షములను బుద్ధి ;
మఱచి, లీనంబు నొందు నీశ్వరుని యందు
భక్త వర్యుఁడు దివ్య స్వభావుఁ డగుట
నతని కామాదికములు దివ్యములె యగును.
అతి విరాగ జీవన్ముక్తులైన మౌను
లీశ్వరుని చిత్రలీల లాలించి పాడి
యనవరతమును జరితార్థులై చరింత్రు.
మఱచి సకలంబు, సతత మీశ్వరుఁడె కామి
తార్థవస్తువుగా నలరారు వారు
ప్రభువు దర్శన కామ తత్పరత ప్రగ్గి
పరితపించి వేఁడుచు లట్లు పలుకు చుంద్రు
'' కృష్ణ! దేవా ! దయిత! జగదేకబాంధ
వా! చపల! కరుణా రసైకాంబు రాశి !
నాయకా! రమణా! నయనాభిరామ!
కనుల తనివి తీరఁగ నిన్నుఁ గాంచు టెపుడో? ''
అనుచుఁ బరితపించుచు నుందు రనవరతము.

★ ★ ★

కృష్ణ గత జీవయైన రుక్మిణి వచించె
''అచ్యుతా! త్రిభువన సుందరా! త్వదీయ
విమల గుణముల వీనుల విందు సేయు
వారి యంగ తాపంబు సర్వం బడంగు ;
నేత్రములు గల్గు ఫలమెల్ల నిన్ను గనుటె;
ఇట్టి నీ రూప గుణము లాలించి నాదు
స్వాంత మఖిలంబు మఱచి నీ యందుఁ దవిలె.

శ్రీనివాస! విద్యారూప శీలకులవ
యోధన ప్రభావముల నీకొరులె వార
లీడు?– పురుష సింహంబ! పెండ్లాడఁ గోర
కుందురే ? బుద్ధిమతులునుఁ గుణవతులును
గులవతులు నైన పడుచులు ; జలజ నయన!

•శివునివంటి మహాత్ము లనవరతంబు
స్వీయ మోహ నివృత్తికై నీ యమోఘ
చరణ సారసామల రజస్స్నపన మెపుడుఁ
గాంక్షసేయరె? నీ యనుగ్రహము నిందుఁ
బడయఁ జాలనేన్ నియమిత వ్రత నిరూఢి
నసువులను బాసి శతజన్మలైనఁ గాని
యోర్చి, నీ ప్రాపుఁ దుదకు నేనొందు'' దనుచు

★ ★ ★

కృష్ణ పట్టపు రాణులు ప్రీతి యెసఁగఁ
బలుకఁ బోరె ? ద్రౌపది తోడఁ, ''చెలువ మిన్న !
ప్రథిత సామ్రాజ్యముల, స్వర్గరాజ్యమునను
భౌమపద – సిద్ధపద – బ్రహ్మపదము లందు,
మోక్షవైకుంఠముల నేని బుద్ధి చొఱదు ;
కోరుదుము కమలా కుచ కుంకుమ ప్ర
శస్త గంధిత శ్రీకృష్ణ చరణ రజము
నౌదలల ధరింపఁగ సతం'' బనుచు ; –మఱియు,
శ్రీముకుందుని పాదరాజీవ యుగ్మ
మందు నానందమయు భక్తి నందఁ గలుగు
నతని పదముల నంటి నిరంతరంబు
రహినిఁ బరువెత్తు మోక్ష సామ్రాజ్యలక్ష్మి

★ ★ ★

విశ్రుతముగాదె యతువిత ప్రేమమయులు
పరమభక్త శిరోమణుల్ వ్రజసుదతులు
కను మొఱంగిన కృష్ణునకై తపించి
యనిరి యివ్విధి విహ్వాల స్వాంత లగుచు.
'' సంసరణ భీతి నీ పాద సరసిజముల
శరణ మొందు జనంబులఁ గరుణఁ గాంచి
నీదు వరదా భయకరంబు నెమ్మి యొసఁగి,
కోరికల సకలంబును గూర్పఁ బోవె ?
సిరినిఁ జేపట్టు నీ కరసరసిజంబు
నొకట మా శిరంబుల యందు నునుపఁ గదవె!
వ్రజజనార్తి నివారక! పరమపురుష!
చిఱు నగవు మాత్రమున భక్త చిత్త కలిత
గర్వ మడగింతు ; నీదు కింకరుల మైన
మమ్ముఁ గృపనేలి, మురిపెంపు మఱువు లొలుకు
నాననముఁ జూపఁ గదె! యార్తి హరణ ! రమణ !
చక్కఁ బ్రోవవె ? నీ పాద సంశ్రితులను?,
సిరి యొనర్పదె సతతంబు సేవనీకు
తలఁచు మాత్ర భక్తుల యాపదలను బాపి,
సకల శుభములఁ గూరుతు క్ష్మావిభూష
అలఘు కల్యాణ మయ సుశీతల పదాంబు
జములఁ - దపియించు మాదు వక్షముల నిలువు
ప్రియతమా ! '' యని మఱ విలపింపఁ బోరె ?
ప్రేమ భక్తు లివ్విధిఁ గామ పీడితులయి
యెలమి విలపింత్రు సతము శ్రీకృష్ణ కొఱకు

★ ★ ★

లీల డాగుడు మూఁతల కేళి నెఱపు
పరమ లీలా విహారి గోపాల మౌళి
శ్రితుల ప్రేమానులాపముల్ చెవులఁ బడఁగ
సలలిత ప్రేమ మయ బంధములకుఁ జిక్కి,
త్రిభువన మనోజ్ఞమును సురార్థితము, యోగి
దుర్లభంబు, మహర్షి సత్పురుష చిత్త
హారకంబు, సమస్త లోకాద్భుతైక
సరస సౌందర్య మాధుర్య చాతురీ ప్ర
కర్షణం బమలానంద కంద మనఁగ,
మార శతకోటి శోభనా కార మమర
సిగను పింఛము - మురళినిఁ జేతఁ దాల్చి
మందహాసాంచిత ముఖారవింద మెసఁగ
మంద గమనంబునన్ వారి ముందుఁ బొడమి,
పరమ దివ్య కృపాపూర వర్షధార.
లొనర వర్షించు నెడ మోదమునను దోఁగు
వ్రజ పురంధ్రుల భాగ్యంబుఁ బలుక నగునె ?

★ ★ ★

అమల భక్తి ప్రపూర్ణుఁడౌ నతఁడు - తనకుఁ
గలుగునది యెల్ల ప్రభు పాద జలజముల స
మర్పణము సేసి, మఱియు, నిట్లాలపించు.
" బ్రతుకొ - చావొ - యేమైన నీపాలఁ బడితి
సలుపు మెట్లైన, నీ పదాబ్జములె శరణు,
మరణ మొందిన నా మేనఁ బఱఁగు పంచ
భూతములు కృష్ణ! నీ సేవఁ బొందుఁ గాత!
వారిజాసను సత్కృపా ప్రాప్తి కతనఁ
బంచతన్ బొంది భూత విభాగమైన

నాదు మేనఁ జెలంగు ధరాది తత్త్వ
ములును శ్రీకృష్ణ సేవలఁ బొలుచుఁ గ్రమత ;
రాక పోకల ప్రభుని మార్గమునఁ గలిసి,
వ్రజ కిశోరుని క్రీడాసరమునఁ జేరి,
మోముఁగ్గై సేయు దర్పణముననుు నిలిచి,
వెన్ను వ్యజనానిలంబుల విస్తరించి,
ఆత్మధవు విశ్రమ స్థలి నావరించి,
జీవుఁ డిటు లుపాధి దొలంగి పోవు కతన
కృష్ణు హృది లీన మొంది మోదించుఁ గాత''
మనును భక్తుఁడు ; – కల 'కామ' మతని కదియ.

★ ★ ★

ఇంకఁ గోప తత్త్వము గమనింపుఁ డిందు.
కృష్ణుఁ డొకనాఁడు కోప వివృద్ధి కరము
నైన పనిసేయ రాధిక యలిగి, చెలులఁ
గాంచి '' ఇఁకఁ గృష్ణుపేరెత్తఁగాదు మీకు ;
ఏను వినరాదు ; మాట లింకేమి గలవు ?
నలుపు వస్తువుల్ సైత మంటంగఁ బోను:
కాటుకఁ ద్యజింతు, వలదింకఁ గస్తురియును ;
అలిపిక ధ్వనుల విన రాదు ; నలువు మబ్బు
కురియు నీరమే యదనునఁ గొనుగ రాదు
విరహ తాపంబుచే మేను వ్రేఁగుఁగాక
వలదు–కృష్ణు సంగతి యింక వలదు–వలదు.''

★ ★ ★

అని వచించె ; – సుదామాదు లాటలందుఁ
గృష్ణుఁ డొనరించు గోల సహింప లేక
కనలి, వారెల్ల రొకట యోచనము సేసి
కృష్ణు విడ నాడఁగా నిశ్చయించి కొనిరి ;

ఐక్య కంఠంబుతో నిట్టులనిరి, – ''కృష్ణ!
ఇంక మీఁదట నిన్నుఁ ద్యజించినాము
మాదటికి రాకు – మాటాడ రాదటంచు ;
కాని, కృష్ణుఁడే దూరమౌ నేని వారి
ప్రాణములు దూర మగుట వారలకుఁ దెలియు ;
వారి మాటలు విని, దూర దూర మేగి
యేకతమునఁ గూర్చున్న శ్రీకృష్ణ చరణ
ముల కెఱింగి, కన్నుల నీర మొలుక, ''రమ్మ –
కృపను మన్నింపు'' – మనుచుఁ బ్రార్థించి, కలిపి
కొనిరి ;– భక్తుల కామము కోప మిటులఁ
దనరు ; – సిద్ధులౌ భక్తులు ననిరి మున్ను
''భక్తి సాధనన్ గామ కోపము లెవేనిఁ
బడయుచో భగవానుపైఁ బఱవుఁ డనుచు,

స్వవిషయంబున నెయ్యది బాధకంబొ
యదియ హరి యెడ సాధకంబై తనర్చు.

★ ★ ★

భాగవతమున శుకయోగి పలికె నిట్లు ;–
''కామ కోపముల్ భయము సఖ్యతయు నైక్య
సౌ హృదాదికంబులు పరేశ్వరుని యంద
పఱుప నగు ; నట్టి దానను భక్త జనులు
తన్మయత్వ సంస్థితినిఁ బొందంగలారు ''
సకలమున కంటె శ్రేష్ఠ మైశ్వర్య మయము
మహిత దివ్య మాధుర్య సంభరితమై త
నర్చి, సర్వాంగ సుందరానంద మయము
నైన వస్తు సంలబ్ధికై యమరు తీవ్ర
కామ మది – కృష్ణ నందు సత్ప్రేమ నెఱపు.

సర్వదా సర్వథా సారసాక్షుం డైన
కృష్ణు నొకనినే పడయం గాంక్షించు వారి
కామ వాసనయును గ్రమ క్రమము గాంగం
బరమ పావనమై వృద్ధిం బడయు చుండు.
ప్రేమ భరిత కోపం బిటు వెలయు చుండు
''నీవు మిగుల నిర్దయుండవు – నిన్ను బెక్కు
గతులం బిలుచుచు నున్న నా కడకు రావు ;
ఎఱింగి కొను – మిదె ; – తుదిసారి నేను బిలుతు ;
నింక మీంద నీవే వెంబడింతు – కృష్ణ!
ఇంక నీతోడ పని నాకదేమి లేదు ;
అనుపమాఖండ దివ్యచింతన ధనంబు
కలదు ; ఆవశ్యకత నీకుం గలిగె నేని
రమ్ము – వేమాటు ; – లేకున్నం బొమ్మ '' టంచు
జాము లెనిమిది చింతనాసక్తిం దవిలి
ప్రేమ భరితాంత రంగుండై ప్రేమి వలుకు.
కామ కోపాభి మానాదికంబులా వ
రేశు నెడం బ్రదర్శించుట యెటులొ దెలుపుం
''దల్లి బిడ్డల'' – సుందరోదాహరణము ;–
అతుల మాతృ పరాయణ యైన శిశువుం
జేరి, బహుమూల్య రత్నముల్ చేతి కిమ్ము,
తియ్యనగు మంచి వస్తులం దినంగ నిమ్ము,
మిక్కుటము గారవించి ప్రేమింపం బొమ్ము,
గొప్పగాం జేసి పలుకుము ; కోటి గతుల
స్వర్గ మోక్షాప్తి వచనముల్ పలికి చూడు

మెన్నియో ; – కాని, మాతృ మాతృ స్తనములు
విడద ;– యితర మేదే నాస పడఁగఁ బోదు.
కోరుటేమి? – యన్యం బెఱుంగుటయు లేద !
శిశు వెఱుంగు నదియును వాంఛించు నదియుఁ
దల్లి యను వస్తు వొక్కటే ; తల్లి కంటె
నన్య మెట్టి దానను దృష్టి నందఁ బోదు.
భక్త కామ మవ్విధినిఁ గేవలము నీశు
కొఱకె యంకితమౌనని యెఱిఁగి కొనుఁడు ;
కామ్యవస్తు వాకృష్ణుఁ డొక్కరుఁడె సుమ్మి.
బిడ్డ తానొక యించుక పెఱిగి యిందు
నందు నడువఁగాఁ గడఁగిన యదను నందు,
నెటులొ పడిపోయి యేడ్వ – నా యేడ్పు వినుడుఁ
దల్లి పఱువు లెత్తుచు బిడ్డఁ దఱిసి నంతఁ
దనకుఁ దాఁబడి, కోపించుఁ దల్లిపైన ;
వచ్చిరాని పల్కుల నిట్లు పలుకు బిడ్డ ;
"ఏల నన్నొంటరిగ డించి యేగి నావు ?
ఇట్లు నను గ్రిందఁ బడ వేసి తేమి ? " – యనుచు ;
మఱియు నభిమానమున మనం బెఱియఁ బలుకు ;
"పొమ్మ – నీతోడ మాటాడఁ బొమ్మ, – నీదు
నొడినిఁ గూర్చుండఁబో" మ్మను ; బుడుతఁ దల్లి
యెత్తి, యెడి యందుఁ జేర్చి పాలీయ నెంచు ;
బిడ్డ దూర దూరముఁ బరువెత్తి యేడ్చు ;
అట్లు శిశువు సేయుట హేతు వరయుఁడిందు ;–
సహజముగ బిడ్డ తల్లిపై స్వాధికార

మెల్లఁ బ్రకటింపఁ జూచును ; తల్లి యావి
ధంబు సర్వ మెఱుంగుట దక్కఁబోదు ;
తనయుఁ డాకలిఁ గొనియెనేన్ తల్లితప్పు !
జాఱి పడెనేని బిడ్డఁడు జనని లోప !
మతనికిని నిద్రరాకున్న నమ్మ దోసఁగు !
తప్పుఁ గోపింప శిక్షింప దక్షుఁడతఁడు

బిడ్డ కోపాభిమానముల్ విధముఁ గనుఁడు
అటుల సంపూర్ణ భక్తుడౌ నతఁడు స్వీయ
కామ కోపాభి మానముల్ సామి యంద
సంతతంబుఁ బ్రదర్శించి శాంతి నొందు.

# 11. ప్రేమాత్మక భక్తుల మహిమ

సూత్ర : త్రిరూప భంగ పూర్వకం నిత్యదాన నిత్యకాంతా
భజనాత్మకం వా - ప్రేమైవ కార్యం - ప్రేమైవ కార్యమ్ 66

టీక : త్రిరూప భంగపూర్వకం = స్వామి-సేవక-సవ ; లేక, పతి-సతి - పతిసేవ; అను మూడు విధములగు రూపముల నతిక్రమించి ; నిత్య దాన (భజన- ఆత్మకం) = అభిన్నమైన సేవక భజన రూప మున్నైన, నిత్యకాంతా - భజన - ఆత్మకం - వా = అభిన్నమైన కాంతాభజన రూపమున నైనఁగాని ; ప్రేమ- ఏవ-కార్యం = ప్రేమయే ఆచరింప నగును. ప్రేమ- ఏవ-కార్యం = ప్రేమయే ఆచరింపఁ దగును.

**తె.గీ :** స్వామి సేవక సేవ రూపముల మూఁటిఁ
దగఁ బరిత్యజించుచు, నిత్యదాస భక్తి
నైన, నిత్యకాంతా భక్తి నైనఁ బ్రేమ
నెఱపఁగాఁదగుఁ, బ్రేమంబు నెఱప నగును.

వివ : ''స్వామి - సేవక - సేవ - రూపంబుల'' నఁగ
త్రివిధ రూపముల్ విడనాడి శ్రీముకుందుఁ
దమినిఁ బ్రేమింపనగు నిత్యదాస భక్తి
నైన నిత్యకాంతా భక్తి నైనగాని
పొసగు దాస కాంతా భావములను రెండుఁ
బఱుపఁ గ్రమముగ నా పరాత్పరుని యందుఁ
దన్మయత్వ స్థితినిఁ గూర్పఁ దగిన వగును.

★ ★ ★

తనువు మనమును బల్కులుఁ దనకుఁ గలుగు
వస్తుచయమును నిష్కామ భావమునను
స్వామి పాదార్పితము సేసి, సామి కంటె

జగతి నితరంబు నెఱుఁగని సరణి నిత్య
దాసభక్తి భావమున కాదర్శమగును

★ ★ ★

''పతియె తను మనోధనగతి మతులు నాశ్ర
యంబు – జీవన ప్రాణమోక్షంబు, లతఁడె
హరియుఁ, బతికంటె నిలఁ బఱపురుషు నెఱుఁగ;
పతిధనంబ నాధనమగు, భర్త్రు తనువె
నా తనువు ; పతి మనమగు నా మనంబు ;
భర్త్రు సేవయె నా సేవ, భర్త్రు గౌర
వంబ నా గౌరవంబగుఁ, బతి పరాభ
వంబ మత్పరాభవమగు భర్త్రు ప్రాణ
మగును నా ప్రాణ'', – మని, యిట్ల నన్య గతినిఁ
బతి పరాయణ – పతిగత ప్రాణ యగుచు
ననవరతము నిష్కామ సేవాప్తిఁ గనుట
లరయ '' నిత్యకాంతా భక్తి'' – యనఁగఁ జెల్లు
విభుని గుణ లుబ్ధతయు కాని, స్వీయ కామ
తృప్తి యెయ్యెడఁ గనరాదు దీని యందు.

★ ★ ★

వాస్తవమ్ముగ నీ రెండు పథము లొకటె ;
సమతయు – నభిన్నతయు రెంట నమరు చుండు ;
స్వీయ విషయంబు లెల్లను విస్మరించి
సేవకుఁడు దాసభక్తిని స్వీకరించు
స్వామి నామగోత్రాదిక సరణి నెల్ల.

★ ★ ★

అవ్విధమునఁ గాంతా భక్తి యందు స్వీయ
నామ గోత్రాదికము పతి నామ గోత్ర
మిళితమగుచుఁ గాంతా భావ మలరు చుండు.

★ ★ ★

స్వామి సేవక కుల గోత్ర సరణి యేక
మగుట దాస్య భావపు మహిమాతిశయము
ఉద్ధవుని తోడ రాధిక యెనరఁ బల్కు
పలుకు లెఱుఁగుఁడు ' బ్రహ్మవైవర్త' మందు,
''కృష్ణ దాస్యంబు, మఱియు శ్రీకృష్ణ భక్తి
వరములందెల్ల శ్రేష్ఠమౌ వరము ; పరమ
పంచ విధ ముక్తులన్ హరిభక్తి యొకటె
శ్రేష్ఠమును గురుతరమయి చెలఁగు చుండు.
బ్రహ్మపద – దేవపద – శక్రపదము లమర
పద మమృతపద సిద్ధి సంపదల కంటెఁ
దలఁపఁగడు దుర్లభము హరిదాస్య'' – మనుచు

అవ్విధమునఁ గాంతా భక్తి యందు ప్రేమి
యైక్యతను బొందు ; – అటు త్రిరూపాత్మకంబు
తనకుఁదా భంగ మొందు ; సూత్రమున, సూత్ర
కారుఁ డేకాత్మతా దర్శకంబుఁ గలిగి,
స్వాంతమందట్టి స్థానంబొసంగి, దాస
బుద్ధినేనిఁ గాంతా భావమునను గాని
హరియెడలఁ బ్రేమ నెఱపుడం చాన తిచ్చె.

**సూ : భక్తా ఏకాంతినో ముఖ్యాః** 67

టీక : ఏకాంతినః= ఈశ్వరునెడ ననన్యప్రేమ గల ; భక్తాః=భక్తులు ; ముఖ్యాః= శ్రేష్ఠులు.

**తె. గీ. : ప్రప్రథము లైకాంతిక భక్తవరులు.**

వివ: పూర్వసూత్రాను సారంబు, పొనరు భక్తి
పథము లందున శ్రీ భగవాను నంద
నన్యభక్తి సల్పెడి యాతఁ డధికుఁడగును,

తనువు మనమును గల సమస్తంబు నీశ్వ
రార్పణంబుఁ గావించి, పరాత్మ చేతి
యంత్రమనఁ బ్రపంచంబున నతఁడు మెలఁగు ;
అతని యాత్మ పరాత్మయం దేకమగును ;
ఇతని మతి హరిమతిని రమించు చుండు ;
ఇతని. కనులకు హరితోఁచు నెల్ల యెడల.
అటుల హరిభక్తి పుంభావుఁ డగుటఁ జేసి
యఖిల భక్తులలో శ్రేష్ఠుఁడగు నతండు.

సూ.: **కంఠావరోధ రోమాంచాశ్రుభిః పరస్పరం**
**లపమానాః పావయంతి కులాని పృథివీంచ.** 68

టీక : కంఠ–అవరోధ, రోమాంచ–అశ్రుభిః = డగ్గుత్తిక, పులకాంకురములు, (స్రవించు) ఆనందబాష్పములతో; పరస్పరం = ఒండొరులు ; లపమానాః =సంభాషించు వారలై ; కులాని = కుల ములను ; పృథివీం–చ = భూతలమును ; పావయంతి = పవిత్రము చేయుచున్నారు.

తె. గీ.: **కనుల బాష్పము లురల, గద్గదిక దోఁప,**
**బులకితాంగులై యొండొరుల్ పలుకు కొంద్ర**
**నన్య భక్త జనుల్ ; పావనం బొనర్తు**
**రన్వయంబుల, మఱియు, నీయవని నెల్ల.**

వివ: అట్టి యేకాంత భక్త సమాగమంబు
లందుఁ బ్రాణస్వరూపుఁ బ్రేమాస్పదుఁడగు
హరినిఁ గూర్చి చర్చించెడి యవసరముల
నవ్యయానంద తత్త్వ విహారు లగుచుఁ
దనరు చున్నను బలుక గద్గదికఁ గాంత్రు ;
తనువు పులకాంకురంబులఁ దనరు చుండు,
రోమ రోమంబు లందుఁ బ్రేమామృతోరు

ధార లుద్గమించుచుండును, తత్ స్థానమందు
నిర్మల ప్రేమకాంతులు నెగడుచుండు ;
అచటి వాతావరణము నత్యంత నిర్మ
లంబు, శాంతంబుఁ, బ్రేమ మయంబు నగును.
అట్టి భక్తులు ప్రేమవిహ్వలులు నగుచుఁ
గనుల మోదాశ్రు ధారలొక్కటఁ స్రవింప
ననుపమ ప్రేమ జలధిని మునిఁగి యుంద్రు.
అట్టిస్థితి దుర్లభముఁ, బవిత్రాచింతంబు ;
ఇట్టి సౌభాగ్య పదవి నార్జించువారు
పావనం బొనర్తురు వారి వంశములను ;
వారి యునికిచే వసుధ పావనము నొందు.

★ ★ ★

అవనిఁ బావనము నొనర్తురనుట ; – పృథివిఁ
గలుగు జీవుల మోహాంధ కారములను
బాపుదురు ప్రేమకాంతులఁ బఱపి చిరము
వార లేకాంతమున నెందొ చేరి, నిత్య
నిర్వికల్ప సమాధి నుండినను గాని
వారి ప్రేమాత్మ కాంతి ప్రవాహములఁ బ్ర
పంచమందు నెల్లెడలను వ్యాపనంబు
సేయు చుందురు ; సద్భక్తి సేయువారు
దానఁ దోఁగి, పావన కృతార్థతలఁ గంద్రు.

★ ★ ★

ఆ పవిత్ర సత్ప్రేమ స్వరూప భక్త
వర తనూస్పర్శ సంగత వాతపోత
మించు కెవ్వాని మేను స్పృశించు, వాఁడు
పావనము నొందు ; శాస్త్రముల్ వలుకు నిటుల ;

''పరమ చిత్సుఖాంబుధి పరబ్రహ్మమందు
మతి లయించిన వాని జన్మమునఁ గులము
పూతమౌఁ; గృతార్థతఁగను మాత ; పుణ్య
వతి యగుచుఁ బొల్చు సర్వ సర్వంసహాయును

★ ★ ★

భాగవతముఁ దెల్పును భగవాను సూక్తి :
''ప్రేమ భరితమై మనసు ద్రవించి, వాక్కు
గద్గదిక నొంది, విరహ దుఃఖమున నేడ్చి,
నవ్వి, లజ్జసర్వము విడనాడి, పెద్ద
యెలుఁగునన్ బాడుచును నటింయించు నాదు
పరమ భక్తుఁడు లోకపావన కరుండు ''.

**సూ : తీర్థీ కుర్వంతి తీర్థాని సుకర్మీ కుర్వంతి కర్మాణి**
**సచ్ఛాస్త్రీ కుర్వంతి శాస్త్రాణి.** 69

టీక : తీర్థాని = పవిత్రస్థలములను ; తీర్థీకుర్వంతి = మిక్కిలి పవిత్రములుగ చేయు చున్నారు ; కర్మాణి =సకల కర్మములను; సుకర్మీ కుర్వంతి=చక్కగ నెరవేర్పఁబడినవిగఁ జేయు చున్నారు ; శాస్త్రాణి=ఎల్ల శాస్త్రములను; సత్–శాస్త్రీ కుర్వంతి = చక్కని ప్రమాణములైనవిగఁ జేయుచున్నారు.

**తే. గీ. : తీర్థముల మిక్కిలి పవిత్ర తీర్థములుగ**
**కర్మములను మిక్కిలి పుణ్య కర్మములుగ**
**శాస్త్రముల మహోత్కృష్టమౌ శాస్త్రములుగఁ,**
**బఱుపఁగ వలంతు లేకాంత భక్త జనులు.**

వివ: పాపులౌ నరనారులఁ బావనులుగఁ
బాపదూరులుగ నొనర్ప నోపుఁ దీర్థ
చయము ; కాని, తత్పాప సంసర్గమునను
మలిన మొందు తీర్థంబు; లా మలినమెల్ల
నడఁచి కొన నేర్చు భక్త సమాగమమున

★ ★ ★

గంగను ధరిత్రికినిఁ దేరఁ గడఁగి తపము
సలుపుడు భగీరథుండు, సాక్షాత్కరించి
యమర నది పల్కెను ; – ''భగీరథా ! ధరిత్రి
కెటుల రానేర్తు ? భూస్థలినెల్ల పాప
జనులు నను జేరి, తత్కల్మషంబు లెల్లఁ
గడుగు కొంద్రు నాయందుఁ, దత్కలుషసంచ
యంబు నెవ్విధి నెచటఁ ద్రోయంగ నేర్తు ?
దీని కేమి యోచించితో తెలుపు'' ; – మనిన ;
''సాధువులు న్యస్త చిత్తులు శాంతి పరులు
బ్రహ్మ నిష్ఠులు లోక పావనులు నైన
భక్త వరులు, తల్లీ ! నీప్రవాహమందు
స్నాన మొనరింపఁగఁ దదంగ సంగమమున
నడఁగు చుండు నీ పాప చయంబు లెల్ల
నఘభిదుండగు హరి వారలందు నుంట''
నని భగీరథ నృపతి తాననియెఁ దొల్లి

★ ★ ★

హరినిఁ బొగడు ప్రచేతను లనిరి యిట్లు
''స్వామి! తీర్థంబు లెల్లఁ బావనము సేయఁ
బృథివి నీ భక్తవరులు చరించు చుందు
రట్టి పరమ భాగవత సమాగమంబు
నురు భవార్తులకు రుచింప కుండు నేమి ? ''

★ ★ ★

తెలిపె నిటు విదురునితో యుథిష్ఠిరుండు ;
''దేవ! మిము వంటి భక్తులు తీర్థరూపు
లిట్టి మీ హృది హరి వసియించు కతనఁ
బాప జనసంగమున నఘ పంకిలమగు
తీర్థములకుఁ దీర్థత్వసిద్ధి నిడుచుంద్రు ''

అటుల భక్తులు శాస్త్రోక్తమైన యెట్టి
కర్మము లొనర్తు రవియె సత్కర్మములగు ;
నెట్టి శాస్త్రంబు వారాదరించుచుందు
రదియె సచ్ఛాస్త్రమగుచుఁ బ్రఖ్యాతి నొందు,
ఇదియు నత్యుక్తిగాదు ; – వారెట్టి భూమి
యందు వసియింతురే నదియందుఁ, గొలఁకు
నందు స్నానం బొనర్తురో యదియ తీర్థ
రాజ మగు ; నట్టి సద్భక్తి భాజనుండు
పలువు కర్మముల్ సత్కర్మములుగఁ బఱఁగు ;
పలుకు పలుకులు సచ్ఛాస్త్రములుగ నెగడు ;
ఆతని నివాసమే తీర్థమై యెసంగు ;
అతని కర్మము సత్కర్మ, మతని వాణి
యలరు సచ్ఛాస్త్ర మగుచు నీయవని యందు.
అమల తీర్థ సత్కర్మ శాస్త్రములఁ గల ర
హస్యముల నెఱింగిన నిందు నమరు భావ
చతురిమంబది చక్కగ మతికినెక్కు.

సూ : **తన్మయాః** 70

టీక : (యతః = ఏలయనిన; తే = ఆ యేకాంత భక్తులు) ; తత్–మయాః : ఈశ్వర ప్రేమ స్వరూపులైనవారు, (కావున)

తె. గీ : **వారు తన్మయులై యున్న కారణమున.**

వివ: తటిని జలధిఁ జేరుడు సముద్రత్వ మొందు
నటుల భక్తుఁడు తన తనూస్వాంత బుద్ధ్య
హంకృతులను సర్వంబుఁ బ్రేమాస్పదుఁడగు
ప్రభున కర్పించి, యా భగవంతు తోడఁ
దన్మయత నొందు ; నట్టి సద్భక్త వరుఁడు

వాస్తవముగ సాక్షాద్భగవత్స్వరూపుఁ
డగు ; నతండెందున వసించు నాసమస్త
మైన స్థూల సూక్ష్మప్త వాతావరణము
కడుఁ బవిత్రమై పొలుచు ; నక్కారణమున
మహిని నాతని సంబంధ మాత్రముననె
తీర్థ కర్మ శాస్త్రంబు లెంతేన్విశుద్ధ
ములగు ; నివ్విధి సద్భక్తు మూలముననె
దైవమును – దైవనామము – దైవభక్తి
మహిమ పెంపొందు ; నతని సమాగమంబుఁ
గనిన ఘోర పాపాత్ములౌ జనులునేని
సంతరింతురు భయద సంసరణవార్ధి.

**సూ : మోదంతే పితరో నృత్యంతి దేవతాః**
**సనాథా చేయం భూర్భవతి** 71

టీక : పితరః = పితృదేవతలు ; మోదంతే = సంతోషించు చున్నారు ; దేవతాః = దేవతలు ; నృత్యంతి = ( ఆనందమున) నాట్యము చేయుచున్నారు; ఇయం భూః = ఈ భూమి; సనాథా–చ–భవతి రక్షకుఁడు గలిగినది అగుచున్నది.

**తె. గీ. : అట్టి భక్తుఁడు పుట్టువు నందఁగాంచి ,**
**పితృగణము మోదమొందు దేవతలు నెల్ల**
**నాట్య మొనరింత్రు భువియు సనాథ యగును.**

వివ: భక్తజనుఁ డెల్లరకును శుభప్రదుండు ;
కడఁగి యాతఁడొనర్చెడి కర్మములును
భువన కల్యాణకరములై పొగడికఁగను.
ఆతని ప్రభావగరిమఁ, బ్రజాళి యందు
ధర్మపథరక్తి భక్తి శ్రద్ధలు జనించి
పొదలు ; పితృ దేవతా కార్యముల నపేక్ష

మఱియు, విశ్వాస మొనరు ; ధర్మపథదూరు
లైనవారు క్రమ్మఱ స్వీయ కర్మాదికంబు
లాచరించుచుఁ బితృ దేవతాచయములఁ
దృప్తి పఱతురు ; దాన మోదింత్రు వారు.
భక్తవర్యుల భక్తి ప్రభావమునను
వారి పూర్వాపరంబులౌ వంశములు త
రించుఁ; దమ కులంబున నెప్పుడేని భక్తుఁ
డొకఁడు పొడమినఁగని మోక్షమొందు టింక
నిశ్చయంబని పితరులు నెమ్మి నమ్మి
హర్ష సంభరిత స్వాంతు లగుచు నుంద్రు ;
''పుట్టువొందెను మా వంశమునను భక్త
వరుఁడు మమ్మిఁక నుద్ధరింపంగలం డ
టంచుఁ జేతులఁ జఱచుదు రతనిపితరు
లాతని పితామహులును నాట్యములొనర్తు ''
రనుచుఁ దెలుపదె ! పద్మపురాణ సూక్తి

★ ★ ★

విహ్వలత – హరి దర్శనాపేక్ష
భక్తు లెద్దాననేన్ దృష్టిఁ బడయఁ గదురుబోరు.
దానఁ, బ్రేమస్వరూపయౌ తల్లి తనదు
బిడ్డనొడియందుఁ జేర్చి, తృప్తి నిడునటుల–
సచ్చిదానంద రూపుఁడీశ్వరుఁడు – దివ్య
సన్ను తాకారమూని సాక్షాత్కరించు.
అటుల హరి పొడముటయె దేవాళి కహిత
మాచరించు రాక్షస నాశ సూచకంబు.
భక్తుఁడుద్భవించుడు భగవానుఁడింకఁ
బ్రకటమగునని, మిగుల విశ్వాస మూని

దేవతలు నాట్యమాడి మోదించుచుండ్రు.
స్వామి యేని ధర్మాత్ముఁడౌ భక్తుఁడేనిఁ
బోడము దనుక యనాథయౌ భూమి ; భక్తుఁ
డుదయ మొందుఁడుఁ బ్రేమ పెంపొందవ-లేఁగ
వెంటఁ బఱతెంచు గోమాత విధముఁ దోఁవ
నా పరాత్పరుఁ డొనరఁ బ్రత్యక్ష మగును ;
కాన, భక్తుఁడు పుట్టువుఁ గనిన యంతఁ
బుడమికాంత సనాథయై పొలుచుచుండు
అఖిల ధర్మంబులను బరిత్యజన సలిపి
యీశ్వరుని యందు హృదిని లయింపఁ జేయు
నాతఁడీ లోకమందుఁ జేయంగఁ దగిన
కర్మమెట్టిది యేనియుఁ గానరాదు.
భూజమూలంబునకు నీరు పోయువాఁడు
తరువు నా పాద తలమును దనుపు చుండు ;
ప్రాణమునొకంట సంతృప్తిఁ బఱపువాఁడు
ఇంద్రియోత్కరమునకు సంతృప్తిఁ గూర్చు ;
సకల జగదీశ్వరుండు మోక్షప్రదాత
యైన భగవానుఁడే తృప్తి నొందె నేని
నెల్ల పితరుల – దేవతల్ పృథివి యెల్ల
తుష్టి వారాశి యందున దోఁగుఁ గాదె !

**సూ : నాస్తితేషు జాతివిద్యారూపకుల ధనక్రియాదిభేదః 72**

టీక: తేషు = వారియందు ( అనన్య భక్తులందు) ; జాతి–విద్యా–రూప కుల–ధన–క్రియా– ఆదిభేదః = జాతి, విద్య, రూపము, కులము ధనము, వృత్తి మొదలగు భేధములు ; న–అస్తి = లేవు.

తే.గీ.: అట్టి భక్తుల జాతి విద్యాస్వరూప
ధనకుల క్రియాదిక విభేదంబు లేదు.

వివ: జాతి విద్యాకుల క్రియా సంపదా కృ
తులు ప్రధానముల్ గావు భక్తుల నటంచు
నిచట సూత్రకారుఁడు మన కెఱుక పఱచె ;
బ్రాహ్మణుండైన లేక శూద్రభవుడైన,
చదువరియయ్యెనఁ జదువని జనుఁడెయ్యైన,
రూపసియె య్యైన లేక కురూపియ్యైన,
గొప్ప కులము వాఁడేౕ – నీచ కులజుఁడైన,
విత్తవంతుఁడైనను నిరుపేదయ్యైన
నెవఁడు సకల మీశ్వరునకర్పించి, తనదు
హృదిఁ బరాత్పరునందు లయింపఁజేయు
వాఁడు భక్తిరూపంబగు పరమ దుర్ల
భ ప్రశస్త విత్తంబును బడయు చుండు ;
జననమొందె గుహుఁడు నీచ జాతియందు
'సజను' నారయుఁడీ! కసాయి జాతివాఁడు,
శబరిఁ, బరికింపుడీ ! కిరాత జాతికాంత,
అఱయ ధ్రువుఁడు చదువులేని యర్భకుండు,
హనుమయు విభీషణుండు రూపరులు గారు
వానరాసుర నీచాన్వవాయ భవులు ;
తలఁప విదుర సుదాములు ధన విహీను
లా వ్రజాంగన లనినఁ గ్రియా రహితలు;
పఱఁగ భక్తి ప్రపత్తి ప్రభావ గరిమ
వీరలెల్లరు భగవాను ప్రేమవడసి,
చిరము ప్రేమపాత్రములైరి హరికి నిందు

★ ★ ★

అఖిల సత్కర్మ ఫలరూపమైన భక్తి
పఱఁగు నెవ్వాని హృది, వాఁడె భక్తుఁడగును ;
వాఁడెపో – సర్వసుగుణ సంపన్నుఁడగును.
తులసి రామచరిత్ర సూక్తులను వినుఁడు !
''ఎవని హృది రాముపదములఁ దవిలియుండు
వాఁడె పండితాగ్రసరుఁడు. వాఁడె జ్ఞాత
ధర్మపథ వర్తనుఁడు – కులత్రాత వాఁడె.
నిష్కపటబుద్ధి రాము ధ్యానించు నెవఁడు ;
నీతి నిపుణుఁడు చతురుఁడై నెగడు నతఁడు ;
సకల వేద సిద్ధాంత విజ్ఞాని యతఁడు,
ధీరుఁడాతండు మఱి రణధీరుఁ డతఁడు ''.
భక్తుఁడెందుఁదా సుగుణ సంపన్నుఁ డాఢ్యుఁ
డనుచు, నెల్లరచేఁ బూజలందఁ గోరు
ననుచు, వర్ణాశ్రమాధికులైన వారిఁ
గలిసి భోజన పానాదికములు సేయ
వారిప్రోలను దన యాధిపత్య సరణిఁ
బఱుపఁగోరు వాఁడని తలంపంగరాదు.
భక్తుఁడగు నభిమాన వివర్జితుండు ;
మఱల నూతన కపటాభి మానమూని,
యిట్టి బుద్ధి వహించుట యేటిమాట ?
అట్టిమతి గల్గినేని బక్తుఁడనఁగఁ బడఁడు.
భక్తి – వర్ణాశ్రమముల తత్త్వములు వేఱు ;
అట్టి భక్తిపేరిటను వర్ణాశ్రమముల
గౌరవము నాశన మొనర్పఁ గడఁగువాఁడు
భక్తియెడలఁ జెడనిమచ్చఁ బఱపువాఁడ,
కాన, భక్తిమార్గానఁ బ్రయాణమైన

సాధకుండు త్రోయంగారాదు శాస్త్రసరణి
ఇట్టి తలంపుల కేనిం దావీయరాదు.
జగతిం బ్రారబ్ధ కర్మానుసారముగను
చదువు ధనము లొక్కొక్కెడం గదురం బోవు
ఆపగిదు డిందినను జాతి రూప కులము
లాది యగునవి పొందిన – నందకున్నం
దఱుగుం బెరుంగులుండినను భక్తజనులందు
నుచ్చ నీచభావంబుల నొందందగదు.
భక్తి సంబంధమునంజేసి భక్తునందు
జాతి భేదాది మూల నీచత్వగతులొ
కప్పుడేని నారోపించు టనుచితంబు.
వినమే ? ''భక్తులందున జాతి భేదబుద్ధి
చలుపందగ '' – దను వైష్ణవ శాస్త్రసూక్తి..

★ ★ ★

విదితము లపరాధంబు లర్వదయు నాల్గు.
ఇతర మీశ్వరుతో సరినెంచు చుంట
వేదముల్ పౌరుషేయముల్గాం దలంచుట,
జాతి భేదబుద్ధిని భక్త జనులం గనుట,
గురుని సామాన్య నరుండని యరయుచుంట,
దైవమూర్తి మృచ్ఛిలలను దలంపుం గనుట,
తత్ప్రసాదము నితర ఖాద్యముగం గొనుట
ప్రభు పదోదక మితర నీరముగం గనుట,
తులసి సామాన్య తరువని తలంచు చుంట,
ఆవుం బశుమాత్ర బుద్ధిని నరయుచుంట,
భాగవత గీత లలంతి కావ్యంబు లనుట,

దైవలీలలు మనుజ కృత్యంబు లనుట
ప్రాకృత సుఖంబు ప్రభులీల పగిదిఁ గనుట,
హరికి ప్రేతలు పరకాంత లనుచుఁ గనుట,
రాసలీలలఁ గామవర్తనము లనుట,
హరిమహోత్సవముల మైల యంటె ననుట,
శ్రీశునెడ, శాస్త్రములను నాస్తికతఁ గనుట.
సందియము ధర్మకృతులందు బొందుచుంట,
ధర్మపరిపాలనమున మాంద్యంబుఁ గనుట,
భక్తులఁ గుతర్కములను లోఁబఱుపఁ గనుట
సాధు జన గుణదోష చర్చలకు దిగుట,
తాన - యధికుఁడ నవియెడి తలఁపుఁ గనుట,
అన్యదేవతా శాస్త్ర గర్హణాలు సేత,
ప్రభుని మూర్తి కెదురఁ బీఁట పైన నుంట,
స్వామి కెదురుగఁ బాదరక్షలను గొనుట,
ప్రభు నెదుట సుమమాల ధారణము సేత,
స్వామి కెదుట దండముఁ జేతఁ బట్టి చనుట,
ప్రభున కెదుటను నీలాంబరమునఁ జనుట,
దంతధావనఁ జేయకే దాయుచుంట,
ధౌతిగాక తన్మందిరాంతరముఁ జనుట,
సామికెదుర జేతులుఁ గాళ్ళుఁ జాచుచుంట,
స్వామి కెదుటఁ దాంబూల చర్వణముఁ గొనుట,
తత్సమక్షంబునందుఁ బెద్దగను నగుట
చేయరాని కార్యంబులఁ జేయు చుంట,
గరితలను గూడి యిందందుఁ దిరుగు చుంట,

క్రోధ వివశ వర్తనలకు గుఱియు నగుట,
తత్సమక్షమం దొరులకు దండ మిడుట,
పూతి గంధుల మందిరంబునకుఁ గొనుట,
మదముఁగూర్చు పదార్థముల్ కొదక తినుట,
అన్యమానావమతుల జోక్య ంబుఁ గనుట
కామ కోపాది చేష్టలఁ గడఁగుటయును,
సాధు లతిథులయెడఁ బ్రేమ చలువ కుంట,
తానె భక్తపుణ్యాత్ముఁడన్ దలఁపు గనుట,
నాస్తికాది దుర్జనుల స్నేహంబుఁ గనుట,
ఆపదల దోస మీశ్వరు నందు నిడుట
తగని పనులు చేయుటకునై ధర్మ మిడుట,
అన్యులఁ గలంచి తా ధర్మినని తలఁచుట,
సతి సుత విపన్న సాధు పోషణాల విడుట,
స్వేష్టమని సామికిడి తింట ; ఇడక తినుట,
స్వామి పేరను శపథముల్ సలుపు చుంట,
ఈశ్వరుని పేర ధనము నార్జించు చుంట,
ఈశుఁ గాదని యొరునకై యాశఁ గనుట,
శాస్త్రమర్యాదలెల్ల నాశనము సేత,
జ్ఞాని గాకయె తద్వ్యథా చరణఁ గనుట
వివిధ వైష్ణవ తరతమ భిదలఁ గనుట,
దేవతలవలెఁ బనుల వర్తించుచుంట,
ప్రభునియవతార లీలాపవాద చర్చ
ఇతరు ''దేవుఁడీ'' వని గేలి కేని ననుట.
హరి ' సుఖాపేక్షి' యను తలంపైనఁ గనుట,

తత్ప్రసాదాదికములు లుబ్ధత నొసఁగుట,
స్వామి మూర్తి నామము లవజ్ఞతను గనుట.
అహిత భయ కష్టముల నొందు ప్రాణి కిడుట,
వాదములలోఁగి నాస్తికత్వంబుఁ గనుట,
జన్మకర్మము లవతార సరణిఁ గనుట,
ద్వైతబుద్ధి తద్యుగళ రూపమునఁ గనుట,

★ ★ ★

క్రమత నరువది నాల్గపరాధములుగఁ
బ్రకటితంబగు వైష్ణవ గ్రంథములను ;
భక్తి పథవర్తి యెఱుఁగఁగా వలయు వీని.

**సూ : యతస్త దీయాః** 73

టీక : యతః=ఏలయునిన ; తదియాః=(వారు) భాగవతులు (భగవదీయులు)

**తె. గీ. : భక్తు తెల్లవారలు భాగవతులు గాన.**

విమ : భక్తజనులు సద్భక్తి ప్రభావ గరిమ
నీశ్వర స్వరూపులునయి యెసఁగు చుంద్రు
భక్త భగవానులఁ బరస్పరము భేద
బుద్ధి పొసఁగఁగా బోవ- దిర్వుర నొకప్పు
డేని నెట్టికారణమున హెచ్చు తగ్గ
లొనరఁగాఁ బోవ దిరువురు నొక్కరూప
''జ్ఞానియన నాత్మయేయన నా మతంబు''
'' ఎవఁడు సకలంబునందు నీక్షించు నన్ను
నెవఁడు నాయందు సకల మీక్షించు చుండు,
జగతి వానికినేఁ బరోక్షంబు నొంద
వాఁడు నాకుఁ బరోక్షంబు గాఁడ'' నియెడి

కృష్ణ సూక్తుల నరయుడి గీతలందు
''కట్టె సూటిదిగాని, వంకరదిగాని
యగ్ని యందునఁ గాలిన నగ్ని యగును ;
అందు ఋజావక్రదోషంబు లమరి యుండుఁ
గాక, కరము నందునఁ బూనఁగా దరంబె ?
అని వచించు ' ప్రబోధ సుధాకరంబు'.

★ ★ ★

ఈశ్వరుని దృష్టి సములు సూ! యెల్లవారు;
వారి భక్తిమార్గములు వేర్వేఱులైన
నెల్లరొక వస్తువునె యాశ్రయించు చుందు
రెల్లరొక్క సంఘమునకె చెల్లు చుంద్రు
భక్తునకుఁ బ్రాణికోటి దైవస్వరూప
మగుట నెల్లర సమదృష్టి నరయునతఁడు.

★ ★ ★

# 12. వాద వివాద రూప విఘ్నము

సూత్ర: వాదో నావలంబ్యః 74

టీక: వాదః = వాగ్వివాదము ; న–అవలంబ్యః = అవలంభింపఁ దగనిది. (ప్రవేశింపఁ దగనిది)

తే. గీ. భక్తుఁడు కడంగఁగా రాదు వాదమునకు.

వివ: భక్తి సాధకునకు నిది పరమ హితము
భక్తునకు నెందు వాద వివాదములను
సక్తిఁ గల్పించుకొన నవసరము లేదు.
భక్తుఁడు ప్రతిక్షణము భగవాను భజన
మగ్నుఁడై యుండ నన్యకర్మము లొనర్పఁ
జాలఁడనినఁ దర్కముల ప్రస్తావమేమి?
'' సృష్టి యెపుడయ్యె? నెటులయ్యె ? నెందుకయ్యె;
నిట్టి దాని మూల పదార్థమేది యగు ? '' న
టంచు నెఱుఁగఁగాఁ దగు నవశ్యకత లేదు
అతని కీశ్వరుఁడొకఁడ సమస్తమనెడి
దృష్టి నిశ్చితంబై యభివృద్ధి నొందు,
ఈశ్వరుండెవు డెఱిఁగింప నిచ్ఛగించు
నతఁ డెఱింగించుఁ దత్త్వరహస్య మపుడ
'' ఎవు డెఱింగించునో ? యెఱింగించు వాఁడో ?
యెఱుక పఱపఁడో ? '' – యను చింతయేనిఁ గనఁడు ;
ప్రియతముఁడునైన భగవాను విషయ మొకటి
తక్క–నన్యమౌ విషయ చింతనముఁ గనఁడు.

★ ★ ★

ఒనరఁబోదు తర్కమునఁ దత్త్వోపలబ్ధి ;
''తర్కమప్రతిష్ఠిత '' – మని, తగ వచించు
బ్రహ్మసూత్రముల్ ; మఱి–కఠోపనిషదుక్తి
'' తర్కమునను తత్త్వప్రాప్తితనర '' –దనదె ?
సత్యతత్త్వము శుద్ధులౌ సాధువుల స
మక్షమునఁ దనుదాన ప్రత్య క్షమగును ;

★ ★ ★

తత్త్వ బోధంబు పొసఁగు వాదమున నసెడి
పలుకు లొక్క విధంబున వాస్తవంబు ;
అట్టి వాద విధంబు వేఱైన దగును ;
శ్రద్ధ గలిగి శిష్యుండు జిజ్ఞాసు వగుచు
గురువు ముోలఁ దర్కింప నా గురువు ప్రబల
తర్కమునను సిద్ధాంత బోధంబుఁ బఱపి
శిష్య శంకా నివారణ సేయు ; నిట్టి
తర్కమించు కేనియు దూషితంబు గాదు.
ఆగ్రహావేశ తర్క మనర్థకరము,
వాదమున మనంబాగ్రహ వశమునొందు :
పరమ సిద్ధాంత లక్ష్య మావలకుఁ దలఁగు ;
దొసఁగు లరయుచు, నొండొరుల్ దొసఁగు లెన్ని
కొనుచు, మఱిచెడి, చెడఁ దిట్టికొనుచు నుందు,
రడఁగును వివేక, మాగ్రహ మావరించుఁ,
బలుకు దుడుకు హెచ్చగును ; పెద్దలు వచింత్రు
''వాదముల వృద్ధిఁగను వైరవహ్ని'' – యనుచు

★ ★ ★

వాదములకు గడంగెడి వారి చెలిమిఁ
బఱువఁదగ దెయ్యెడల భక్తి పథికులకును

తార్కికుల బారినుండి సాధ్యమగునంత
దనుక దూరంబుఁ గానుంట తగిన పనియు,
ధరణిఁ బ్రారబ్ధ వశమునఁ దర్క వాది
తో సమాగమం బెందేనిఁ దొడరునేని
వినఁదగును వాని వాదంబు వినయమునను;
పలుకఁగా రాదు మాఱట పలుకు లెందు ;
ఇంధనము లేని యగ్ని శమించుఁ దాన,
మౌనమఖిలార్థ సాధనమ్మైన దనెడి
సూక్తి మఱువఁగరానిది భక్తులకును

★ ★ ★

స్వపథమున, నిష్టవస్తు విశ్వాసములను,
సాధనను, సంశయముఁ గూర్పఁజాలు నట్టి
యితర తార్కిక భాష లాలింప రాదు.
ఇతర మనముల నెవు డలయింప రాదు,
అట్టి పలుకు లెవ్వరి తోడ నాడ రాదు,
తగిన వైనను లేకున్నఁ దగనివైన
పలుకు లెచ్చటనేఁ జెవిఁబడిన, వినును
గాని, భక్తుఁడు తర్కించు కాంక్షఁ జేసి
యెదిరి లోఁగొని, స్వమతంబుఁ గుదురు పఱుప
వాదములకు నెందేనిఁ బాల్పడఁడు ; కాని,
శ్రద్ధదనరి, యెఱుంగ నాసక్తిఁ గలిగి
యుడుగువారికిఁ దెలుపఁగా నగును సుమ్మి !
యుక్తమని తోఁచినది కోరకున్న నొరుల
కెవరికేఁ హితబుద్ధి వచింపఁదగును
వాదసరణి కెయ్యెడలఁ బాల్పడఁగరాదు.

★ ★ ★

వ్యర్థముగఁ బల్కఁగారాదు ; పలుకకున్నఁ
బనులు కావని తోఁచెనేఁ బలుకఁజెల్లు ;
పలుకు నేర్పుకై వాదించు తలఁపు వలదు.
ఎవరితోన్ వైరమేన్ హాస్యమేనిఁ దగదు.
పరుల దొసఁగు లెన్నుటయు, హృద్వ్యధల నిడుట
తగదు ; తన్నును దనధు మతంబు ఘనతఁ
బొగడు కొనరాదు ; పరులను దెగడరాదు.
కటువు లనరాదు, వాక్ఫలకాంక్ష దగదు.
ఇతర వాక్కుల దోషంబు లెంచరాదు
ఇతర విశ్వాసముల సంశయింపరాదు.
సత్య మధుర ప్రియంబులు – శాంతి హితక
రంబు లౌ భాషణములు – యోగ్యంబులగును.
తక్కు వేళలం దీశ్వర ధ్యాన నామ
సంస్మరణములఁ బ్రొద్దుఁ బుచ్చంగఁ జెల్లు.
అనవసరవాక్కు లెప్పుడు నాడరాదు –
అట్టికాలమంతయు వ్యర్థమగును గాన ;
వాదముల నెప్పుడేని నీశ్వరుని ప్రేమ
గాని, తత్ప్రాప్తియేన్ లేక జ్ఞానమేనిఁ
గలుగఁ బోదని దృఢముగఁ దెలియ నగును
తర్కమున నహంకృతియుఁ, గ్రోధంబు, హింస,
మఱియు ద్వేషంబు వైరసమాజి పెఱుగు;
కాన, వాదంబులకుఁ దొలంగంగ వలయు.

సూ: **బాహుల్యావకాశా దని యతత్వాచ్చ.** 75

టీక : బాహుల్య–అవకాశత్వాత్ = పెక్కువిధములగు భేదాభిప్రాయములకు అవకాశముండుటచేత ; అని యతత్వాత్–చ = హేతువాదరూపమైన ఏయభిప్రాయము సమగ్రముగాని కారణముచేతను, (వాదమునకు గడంగరాదు)

తే.గీ. : అందు బహుళావకాశంబు లమరు కతన
మఱియు నియమ విహీనమై పఱఁగుఁ గాన

వివ: వాదమది–కూడదని మున్ను బలికి, సూత్ర
కారుఁడిచట వాక్రుచ్చెఁ దత్కారణముల
క్రమత నుత్తర ప్రత్యుత్తరములఁ బెఱుగుఁ
బారమరయము వాద వివాదములకు ;
ఇరు తెగలవారు వార్వారి యిచ్చ మెచ్చు
నట్టిమతము సమర్థించు నాసఁజేసి
పలుకు బెళుకుల జడివానఁ బఱపు చుంద్రు
ఈశ్వర కృపాలవము మాత్ర నెందు నెఱుఁగఁ
దగిన యర్థంబు చిక్కదు తర్కములకు
సఫలతఁ గనండు తార్కిక సరణి నెవఁడు
వాదమును నల్పి సల్పి వ్రాన్పడెనయేని
అదనునకు యుక్తివాదంబు గుదుర దేనిఁ
జెలఁగి యం దొక్కరుండు పైఁజేయి యైన
నితరుఁడట్టి సిద్ధాంతము నియ్యకొనఁడు ;
కనిన నదియు సిద్ధాంతంబుఁగాని కతన.

★ ★ ★

ఎవ్వఁడేనొండు పథి విశ్వసించి, యట్టి
దానఁ జనుచున్న బుద్ధి భేదంబుఁ బఱుప
రాదనుచు గీతలను బల్కు లేదె ? శౌరి.
'' జ్ఞాని యజ్ఞానియౌ కర్మసంగునకును
బుద్ధి భేదంబుఁ గలిగింపఁ బోలదెందుఁ;
గడఁగి నిష్కామ్యముగ సర్వ కర్మము లొన
రించుచును వారి చేతఁ జేయింప వలయు ''

★ ★ ★

''ప్రకృతి గుణముల వలన విభ్రమముఁ జెంది
సకల విషయేంద్రియముల నాసక్తులగుచు
జ్ఞాన హీనులు–మందులు– నైన వారిఁ
జలన మొందింపఁ గారాదు సజ్జనుండు''

★ ★ ★

పలుకుల మనంబునన్ బొంద నలవి కాని
వస్తువును గూర్చి వాదింప ఫలము లేదు ;
వారి వారి సామర్థ్యాను సారముగను
అట్టి వస్తు పరిజ్ఞాన మమరు చుండు,
నందు నేవాద మేఁ దోస-మనఁగ రాదు.
స్వానుభవమున నొకకాలమందు యుక్త
మనుచుఁ దోఁచిన దొకకాల మందుఁ గాదు.

★ ★ ★

కాన, నిట్టి వివాదంపుఁ గాలమెల్ల
వ్యర్థమగు భక్తజనునకు ? నఖిల గతులఁ
బ్రియతముఁడగు శ్రీభగవాను విశ్వసించి,
సంతతంబు నిష్కపట నిష్కామబుద్ధి
గలిగి, మిగుల శ్రద్ధాపూర్వకంబుఁ గాగ
భక్తజనుఁ డీశ్వరుని భజింపంగనగును.
వాదముల నీశ్వర ప్రేమఁ బడయరాదు ;
భక్తి మాత్రంబుచే దానిఁ బడయుఁ దగును.

# 13. భక్తిప్రధాన సహాయకములు

సూత్ర : భక్తిశాస్త్రాణి మననీయాని
తదుద్బోధక కర్మాణ్యపి కరణీ యాని 76

టీక : భక్తిశాస్త్రాణి = భక్తికి సంబంధించిన ; శాస్త్రభోధలు = భక్తిని ప్రబోధించు శాస్త్రములు; మననీయాని = మననము చేయఁ దగినవి: తత్ – ఉద్బోధక కర్మాణి–అపి = భక్తిని అభివృద్ధి పఱచు ఆచరణలును ( భాగవత ధర్మములును) ; కరణీయాని= ఆచరింపఁదగినవి.

తె. గీ. ప్రేమ భక్తి సంప్రాప్తికై విడకభక్తి
శాస్త్రములమననముఁ జేయఁ జను సతంబు
భక్తిఁ బెనుచు సత్కృతు లొనర్పంగఁదగును.

వివ: భక్తి కాములకే గ్రంథ పఠన మేని
నెట్టి కర్మంబు లొనరించు టేనిఁదగని
వని తలఁచ రాదు ; వాదము లవల ద్రోయ
శ్రీపరేశ్వర భక్తి నిరూపణములు
భక్తి మాహాత్మ్య సాధనోద్భాసితములు,
నీశ్వర ప్రియభక్త సుకృత చరితలు
భక్తి పరవశ సాధుప్రభావములు, ర
హస్య గుణ వర్ణనములుఁ జెన్నారు కృతులుఁ,
జదువఁ దగును ; సద్భక్తి శాస్త్రములఁ గనుచు,
భక్తసాధు మహాత్ముల వాక్కు వినుచు –
నున్న నీశ్వర ప్రేమ మభ్యుదయ మొందు.

★ ★ ★

ఈశ్వరుని, భక్తినిఁ హసియించు కృతులు,
ప్రభుమహత్త్వ మల్పము సేసి పలుకు నవియు,

సాధు భక్త దూషణలు పొసంగు నవియు,
వివిధ లౌకిక విషయ ప్రవిష్టితములు
నైన గ్రంథంబు లెప్పుడు నేని వినఁగఁ
దగదు.– భక్తుఁడు పఠియింపఁ దగదు–తగదు.
స్వామి భక్తి, భక్తజన ప్రభావ హీన
మైన కృతి భక్త లాభదాయకము గాదు.
కామ క్రోధ రాగ ద్వేష కరము లగుచు
జగతి వైర విరోధ మాత్సర్యములకుఁ
దావలంబైన గ్రంథముల్ తాకరాదు.
''నలువ యంతటి వాఁడేనిఁ బలుకుఁగాక
ప్రథిత శాస్త్రంబె కాని, పురాణమైనఁ
గాని, హరిభక్తి కానరాదేని, దాని
వినఁగఁ దగ'' దని విబుధులౌ పెద్దలనరె ;

★ ★ ★

భక్తి పథమున మెలఁకువఁ బఱపి, వృద్ధిఁ
గూర్చు కర్మముల్ భక్తుఁ డొనర్చదగును.
భక్తి కాముఁడౌ మనుజుఁడు పాప కర్మ
ములను వర్జింపఁ దగును సంపూర్ణముగను
విషయ సక్తుఁడై యఘకృతుల్ విడువలేక
'భక్తుఁడ' నటుంచుఁ దలఁచు నేని ' భ్రాంతుఁ' డతడు ;
కాద, – తెలిసియే భ్రమనొందఁ గడఁగు వాఁడు.

★ ★ ★

భక్తి సంప్రాప్తికినిఁ దోడుపడు ప్రధాన
చర్యలను భక్తి కాముఁడు సలుప వలయు
భాగవత ధర్మ కర్మ తత్పరత గలిగి.

1. స్వీయ వర్ణాశ్రమాచార విధుల నోపి
నంత దనుకఁ బాలింపఁగా నగు సతంబు,
త్యాగ పూర్ణాచరణము సన్న్యాసులకును
బ్రహ్మచర్య వానప్రస్థ వరుల కగును ;
అనిశ మీశ్వర ప్రీత్యర్థమై గృహస్థు
లెల్లఁ దల్లి దండ్రుల, నింతిఁ బిల్లలను, స్వ
జనుల, నాశ్రితులను దమశక్తి కొలదిఁ
బ్రేమ సత్కారములెలర్ప నోమవలయు,
న్యాయ సత్యపూర్వక జీవనంబు నెఱపి
శాస్త్రవిహిత యజ్ఞాదులఁ జలుపఁ దగును.

2. వలువ నగును సదాచార పాలనంబు.

3. సాధుసంగ మీశ్వర గుణశ్రవణ కీర్త
నంబుఁ జింతన మెప్పు డొనర్పదగును.

4. సంతతంబు భగవన్నామ జపముఁ గీర్త
నంబు, సంస్మరణంబుఁ బొనర్ప నగును

5. ప్రభు సమర్చనస్తుతులఁ బ్రార్థనల నంద
నములఁ బొనరింపఁగా నగు విమల మతిని.

6. సాధు భక్తుల సేవలు సలిపి, వారి
యానతులు శ్రద్ధ దవిలి చేయంగ నగును.

7. పావనక్షేత్ర తీర్థ సేవలును వలయు.

8. దీన జనములపై దయ నూని, శక్తి
కొలఁదిని మనస్తనూ ధనములను, వారి
కుచిత సేవలఁ బొనరించు చుండ వలయు

9. ఎల్లకర్మముల్ హరికి నర్పించ వలయు

10. ఎల్ల ప్రాణులయందు సర్వేశుఁ జూడ

నభ్యసింపనౌ భక్తి పథాను వర్తి
భాగవతమున శ్రీహరి పలికె నిటుల
''ఉద్ధవా ! మత్కథామృత శ్రద్ధఁ దవిలి
నాదు నామస్మరణ కీర్తనములు, మత్స
మర్చనా నిష్ఠ, సంస్తవనాదికములు,
సాదరమున మత్పరిచర్య, పలువఁజాలి
యెల్ల యవయవంబుల నమస్కృతుల నిడుచు
నాదు భక్తుల నధికార్చనలను దనిపి,
యెల్ల ప్రాణుల నన్ను నీక్షించు చుండి,
నా కొఱకుఁ గర్మములను బొనర్పనేర్చి,

పలుకులను నాదు గుణచర్చ చలువఁ గలిగి
మనసు నా కొఱకై సమర్పణము సేసి
యజ్ఞ జపతపో హోమదానాది విహిత
కర్మముల నాకుఁగాఁ జేయఁ గడఁగి, ప్రేమ
వెలయు నాత్మ నివేదనోపేత ధర్మ
ములను నన్నుపాసించు వారలకుఁ బరమ
భక్తి జనియించు నాయందు ; వారి కింకఁ
బడయఁదగిన యర్థంబ దెయ్యెడల లేదు.

★ ★ ★

తనకుఁ బ్రియుఁడగు భక్తు లక్షణములెల్ల
గీతలందునఁ బలికె శ్రీకృష్ణుఁ డిటుల ;
''సర్వ భూతంబులందు ద్వేషంబు వదలి,
పొంది మైత్రినిఁ గనికర మొంది, మమత
విడిచి, లోన నహంకార ముడిగి, దుఃఖ
సౌఖ్యముల సమచిత్తుఁడై క్షమ వహించి ;
నిత్యసంతుష్టుఁడును, మఱి, నియమితాత్ముఁ

డగుచు, యోగియై, దృఢ నిశ్చయంబు గదుర
మనసు బుద్ధిని నా యందుఁ జొనుప నేర్చు
నాదు భక్తుఁడౌ వాఁడెసూ! నా ప్రియుండు
జడియకుండు నెవ్వానికీ జగములన్ని
జగములన్నిటి కెవ్వఁడు జడియకుండు
నలుక, భయము నుద్వేగము హర్షములను
విడువఁజాలిన వాఁడు మత్ప్రియుఁడు, పార్థ!
దక్షుఁడును విశుద్ధుండ నపేక్షుఁడు మఱి
భయ విరహితుఁడు, నిష్పక్షపాత రతుఁడు,
సర్వ సంకల్ప రహితుఁడై సంచరించు
నాదు భక్తుఁడు ఫల్గునా! నా ప్రియుండు
ఎవఁడు హర్షింపఁడో – ద్వేషమెవఁడు గనఁడొ,
ఎవఁడు దుఃఖంబు నొందఁడో – యెవఁడు కోరఁ
డనఘ! యెవఁడు శుభాశుభ త్యాగియగునొ
యట్టి భక్తుఁడె పో ప్రియుఁడగును నాకు.
శత్రులందును మఱియును మిత్రులందు,
మానమందున మఱి యవమానమందు,
వివిధ సుఖదుఃఖముల, ఁజలి వేడములను
సమత మెలఁగుచుఁ,దృజియించి సంగమంబు ;
అఖిల నిందాస్తుతులను దుల్యముగ నెంచి,
మౌనియై, తృప్తి నెద్దాన నైనఁ గనుచు,
వాసరహితుఁడు, సుస్థిర స్వాంతుఁడగుచు,
నాదు భక్తి నిఁ గనువాఁడు నాప్రియుండు
శ్రద్ధగలవారలైనన్ను సర్వ ముఖ్యుఁ
డనుచు నెవ్వారలిట్టి ధర్మామృతంబుఁ

గవ్వఁడీ ! యుపాసింపఁగాఁగలరో యట్టి
నాదు భక్తులే యిష్టులు నాకు మిగుల"

★ ★ ★

వాసుదేవుఁడు పల్కిన భక్త లక్ష
ణములు సిద్ధ భక్తుల సహజముగఁ బొలుచు ;
సాధకులు వీని నాదర్శ సరణిఁ గనుచు,
వానిఁ బడయు నాచరణలు పఱుప వలయు.
అవ్విధంబున భక్తి శాస్త్రాధ్యయనము
మననమును జేయుచును భక్తిఁ బెనుచు సాధ
నంబు లొనరింప, యోగి జనంబులకు న
గమ్యమౌ ప్రేమ భక్తినిఁ గాంచు నరుఁడు.

**సూ : సుఖ దుఃఖేచ్ఛా లాభాది త్యక్తే కాలే**
**ప్రతీక్ష్య మాణే క్షణార్ధమపి వ్యర్థం న నేయమ్ 77**

టీక : సుఖ–దుఃఖ– ఇచ్ఛా–లాభ–అది త్యక్తే=సుఖము, దుఃఖము, కోరిక, లాభము మొదలగువానిచే విడివడు ; కాలే = కాలము; ప్రతీక్ష్యమాణే = నిరీక్షింపఁ బడినదై; క్షణ–అర్ధమ్–అపి=అర్ధక్షణమైనను; వ్యర్థమ్= నిష్ప్రయోజనముగ; న–నేయమ్ =కడపఁదగనిది.

**తె. గీ. : సుకము దుఃఖము మఱియుఁ, గోరికయు లాభ**
**మాదియగు వాని లెస్సఁగ నడఁగఁజేయు**
**కాలమెదురుఁ జూచుచు నఱ క్షణముఁ గాని**
**వ్యర్థ కార్యాచరణలఁ ద్రోయంగ రాదు.**

వివ: ఇందు సందేహ మిసుమంత యేని లేదు
భక్తి సంసిద్ధి నరునకు ప్రాప్తమైన
సౌఖ్య దుఃఖముల్ లాభనష్టంబులాది
యైన ద్వంద్వముల్ తమ యంత నడఁగుఁ గాన

నెట్టి వస్తువందిచ్చు జనింపఁ బోదు.
కాని, యట్టి యుత్తమ శుభకాలమును ద
లంచికొని కేవలము నిరీక్షించువాఁడు
''తరఁగలడఁగుడు మునిఁగెడు తలఁపుగలిగి
జలధి తీరంబు నందున నిలుచు వాఁడ''.
దానిఁ బడయఁగ నెట్టి సాధనము సేయఁ
డేని, నేటి దుర్దశ యదియెల్ల సమసి,
యట్టి శుభదశ తనకుఁదా నుట్టిపడదు.
నరుని బ్రతుకే క్షణంబేమొ! యెఱుఁగ రాదు
ప్రళయమే త్రుటిఁ గలుగునో తెలియలేము
''ఈ వయస్సు వచ్చిన – హరిసేవ సలుపు
కొనుద'' – మనుబుద్ధి లవమేనిఁ జొనువరాదు.
ఎవ్వఁడేస్థితి యందున్న నెల్లగతుల
నాతఁడాస్థితి నుండియే హరికృపాప్తిఁ
బడయు సాధన లభ్యసింపంగ వలయు ;
అఱక్షణంబేని జాగు చేయంగ రాదు ;
ఒక్కొక క్షణంబు మిత్తికి నోగిరంబు ;
ఆయువటు చెల్లనిఁక సమయంబ దెపుడు ?

★ ★ ★

'' బాల్యమిది – యాటపాటలఁ బఱుపఁ దగును,
యౌవనంబిది – విషయ సుఖాప్తి కగును,
తగును హరిసేవ సలుప వార్ధక్యమఁ '' ద
టంచు నెంచిన వృద్ధుఁడౌ నంత దనుక
మృత్యువు గ్రసింపదని చెప్ప నెవరితరము ?
మృత్యు నిష్ఠుర కరవాల మెల్ల వేళ
లందు శిరముపై నొగి యూఁగులాడుచుండు.
భ్రమరము విధాన నశియించుఁ బామరుండు!

★ ★ ★

కలదు షట్పద ; మొక్కటఁ గమల మందుఁ
జేరి రసపాన మత్తయై చేష్ట లుడిగె ;
ప్రొద్దు గ్రుంకె, నంతటఁ దమ్మి మోడ్చి కొనియె
సాల కుజమునేఁ దొలువఁగఁ జాలు మేటి
తేఁటి విషయ సంసక్తిమై పాటునొంది,
చిక్కువడి పద్మమున నిట్లు చింత సేనె ;
''నిశి గడచె – సుప్రభాతంబు పొసఁగు నింక,
నర్కుఁడుదయించు, హసియించు నబ్జలక్ష్మి
వెడలి పోయెద, – నందాక విడకయుందు
సలిపెదను మకరంద రసాస్వదనము ''
అని, తలంచిన కమల కోశాంతరస్థ
బంభరం బయ్యయో మదేభంబు నోటఁ
బడియెఁ గంజంబు తోడ ; నా భ్రమర హృదయ
మందు కోర్కి నిల్చెను హృదయంబు నంద ''.

★ ★ ★

ఈ పనులు పూర్తియైన భజింతు హరి న
టంచు నాలోచనములు చేయంగ రాదు.
కోరు కోర్కు లెన్నటికినిఁ దీఱఁబోవు ;
తీఱెఁబో – తత్సమాప్తి హత్తించి పోవుఁ
గ్రొత్తక్రొత్తల ; – నవి జీవిఁ గ్రుంగఁదీయు,
భ్రాంతికర మపూర్ణము క్షణ భంగురంబు
లైన లౌకిక వస్తు సంప్రాప్తి కతన
లేదు సంతృప్తి – యేనాఁడు లేదు – లేదు.
తృప్తియెందే నొకింత సంప్రాప్తమైన
స్థిరము గాదది ; యట్టి యస్థిరమునైన
దాన దుఃఖము పొసఁగు ;– నద్దాన విషయ

కామి తపియించి తపియించి, కడకుఁ జచ్చు.
పుడమి విషయ భోగముల సంపూర్ణతృప్తిఁ
బడయు సమయంబునకు నాస పడఁగఁ బోక
తొలుత హరి భజనము బుద్ధి నిలువ నగును.

★ ★ ★

సాధు సాంగత్యమున సమార్జనము సేయు
నీశ్వరధ్యాన సంస్మరణేచ్ఛ, నియమి
తా చరణమునందు నునుపఁ గాలాంతరంబు
కొఱకు వేచియుండుటయును గూడదెపుడు.
ఇంతలో నేమి మదికెక్కు నెట్లు మాఱు
నో – యెఱుంగను; – యుండఁబో దొక్క రీతి
కాయిక స్థితి, మానసిక ప్రవృత్తి
మాఱుచుండు ననుక్షణం బా రహస్య
మెఱిఁగి, యింద్రియ దార్ఢ్యత యెసఁగు నపుడె
వార్ధకత పై గొనకమున్నె భజన మనన
సాధనములఁ గూర్పఁగవలె సాధకుండు.

★ ★ ★

భర్తృహరి సుభాషితము జ్ఞాపకము గొనుఁడు.
''కాయ నిలయమ్ము శిథిలమ్ము గాక మున్నె,
ఘోరవార్ధక రుజలు పైకొనకమున్నె,
యింద్రియముల బలంబు క్షీణించు మున్నె
జనుఁడు మేల్పనుల్ సరిదిద్ది కొనఁగ వలయు ;
ఇల్లు కాలుచో బావిఁ ద్రవ్వించ నేమి ?''

★ ★ ★

''ప్రభునిఁ గూర్చి భక్త జనంబు పలుకు నిటుల
దినదినం బాయువది చనుఁ గనుచు నుండ
యౌవనంబు నానాట క్షయంబు నొందు,

సురిగిపోయిన దినమది మరలరాదు,
దండధరుఁడు క్రూరుఁడు – జగద్భక్షకుండు
సిరయుఁ జంచల, జీవంబు మెఱవు, కాన,
శరణమిడు మార్త భవవార్ధి తరణ చరణ !''
''వాసుదేవ ! నీ పద కంజ పంజరాంత
రంబునన్ నాదు మానస రాజహంస
నీక్షణంబ ప్రవేశింపనిమ్ము ; మరణ
సమయమున కఫ వాత పిత్తములు కంఠ
మాఁగ, నిన్ను స్మరియింప సాధ్యంబదౌనె ?''

★ ★ ★

స్వల్ప కాలమేఁ శ్రీహరి భజనఁ గాక
యొకట వ్యర్థంబుఁగాఁ జేయకుంట మేలు
హరిభజనఁ జెల్లు కాలమే సార్థకంబు ;
శేషమది వ్యర్థమగు, నట్టి స్థితి నెఱింగి
కాల మూల్యంబు గుర్తించి, క్షణము క్షణము
సావధానులై, లోభి నిజార్థమటులఁ
గాల మీశ్వర చింతనఁ గడుపఁ జెల్లు.
హరిభజన లేని స్థితి కంటె హానిలేదు
'' ఏ ముహూర్తమేనియు క్షణమేనిఁ గాని
హరిభజనఁగాక వ్యయమైన నదియు హాని:
యదె మహచ్ఛిద్ర, మదియె మోహంబు, భ్రమయు''.

★ ★ ★

హరి భజనకు వీలగు వేళ నరయ రాదు :
అరయుచున్న జీవిత మెల్ల వ్యర్థమగును.
ఒనరు నర జీవనమున సర్వోత్తమంబు
మఱియు నాదరణీయ కర్మంబు, వాసు
దేవభజనం బదొక్కటె ; యీ విధమున

భజన సేయుంగఁ జేయంగ ప్రభు కృపాప్తి
దనర సౌఖ్యదుఃఖాదిక ద్వంద్వ చయము
తమకుఁ దామెప్పుడో యుపశమన మొందు.
శ్రీ ముకుందుని నిర్మల ప్రేమదీప్తి
భక్తు హృదిని వెల్గొందు, విశ్వంబు నందు
నెల్లదిక్కుల నంతట నీ మహత్త్వ
శుద్ధ సుస్నిగ్ధ శీతల జ్యోతి పొడమి
మెఱయు ;— భక్తు నానందంపు మేరలేదు.

★ ★ ★

భక్తి పరిణామ మేమని భావ మందు
నైత మరయఁగ రాదెందు సాధకుండు.
వాని విధి— ప్రేమపూర్వక భజనమొకటె ;
ప్రభుని ప్రేమకై ప్రేమంబుఁ బఱుపనగును.
భజన సలుపుట సహజమై పరిణమించు
భజనలేకున్న నాతఁడు బ్రతుకలేఁడు;
ఏదియున్న లేకున్న సహించఁ గలఁడు
భజన మెడఁబెనయేన్ సహింపంగఁ బోఁడు
భాగవతసూక్తిఁ గనుఁడి యిప్పట్టు నందు.
''ధ్యాననిష్ఠలొ సురలకే నందరాని
యనుపమాఖండమౌ త్రిలోకైక వైభ
వంబుఁ జూపిన నర్ధ క్షణంబు నేని
హరి పదాంబుజ ధ్యానామృతా స్వదనము
వదలఁ బోదు హృద్భృంగంబు వైష్ణవునకు

★ ★ ★

''మోక్షమును గోర, జ్ఞాన విస్ఫూర్తిఁ గోర
వైభవము బుద్ధి సిద్ధి సంపదలఁ గోర
మహితకీర్తిని శుభ పరంపరలఁ గోర

యెట్టి యోనులందేని నర్ణ బుట్టఁబంపు
మేను ప్రార్థింతు నాకిమ్ము! యింతమాత్ర-
నీదు పాదాంబుజములందు నిర్మలంపుఁ
బ్రేమ-కారణ శూన్యమౌ ప్రేమ-పిచ్చి
ప్రేమ-కేవలమును గ్రుడ్డి ప్రేమ-మఱియుఁ
బ్రేమ మయ ప్రేమ-ప్రియతమ ప్రేమ - సతముఁ
దినదినం బభివృద్ధి నొందింపు నాథ! ''
అనుచు డగ్గుత్తికను భక్తుఁ డడుగుచుండు.

★ ★ ★

ఆదిశంకర దేశిక పాదు లనఁడె ?
లలిత ఫణితిని సౌందర్యలహరి యందు ;
''మోక్షమర్థింప - వైభవా పేక్ష లేదు ;
ఎఱుఁగ విజ్ఞాన కాంక్ష, సుఖేచ్ఛ వలదు ;
ఎందుఁ బుట్టిన యాచింతు నిదియ తల్లి !
'శాంభవీ'! 'భవానీ!' యను జపము నిమ్ము ''!

★ ★ ★

కాన, భక్తుఁడీ విధముఁ జక్కఁగ నెఱింగి
సాధ్యమగు నంత దనుక నేక్షణముఁ గాని
వ్యర్థముగఁ బుచ్చఁ గూడదే యదను నందు.

**సూ: అహింసా సత్య శౌచ దయాస్తిక్యాది**
**చారిత్ర్యాణి పరిపాలనీ యాని** 78

టీక : అహింసా-సత్య-శౌచ-దయా- ఆస్తిక్య- ఆది చారిత్ర్యాణి = అహింస, సత్యము, శౌచము, దయ, దైవవిశ్వాసము మొదలగు సత్ప్రవర్తనలు ; పరిపాలనీయాని = (లెస్సగ సమ కూర్చుకొని) రక్షింపఁదగినవి.

**తె.గీ. : సాధకుఁడహింస సత్యంబు శౌచ దయలు**
**ఆస్తికత్వాదు లనెడి సేవ్యంబులైన**
**యీ సదాచారములను బాలించ వలయు.**

వివ: సారిది డెబ్బరి యూరవ సూత్రమందు
భక్తిఁ బెనుచు కర్మము లొనర్పంగ వలయు
నని వచింపంగఁ బడె ; – నిందు నట్టి క్రియలు
మఱియు, సద్గుణములచేత మహితమగుచు
ముఖ్య పంచవిధాచారములను భక్తుఁ
డెపుడుఁ బాటించనగునని యిందు సూత్ర
కారుఁడవ్వాని యావశ్య కతలఁ బలికె.

★ ★ ★

దైవ సంపత్తి భక్త స్వభావ మగును
భక్తి యున్నచో దైవసంపత్తి యుండు
తెలియ నేరక కొందఱు పలుకు చుంద్రు
''భక్తి సలుపుము – భక్తుఁడౌ వాని కెందు,
సద్గుణములు లేకున్న దోసంబు లేదు.
మనుజునకు నెందుఁబాప సంబంధమున్న
భక్తుఁడయ్యెనేని జాలు ; – పాపము లడంగు''
నంచు ; – నానుడుల్ యుక్తి శూన్యంబు లగును
ప్రొద్దు పొడిచియుఁ జీకటుల్ పొసఁగు ననుట ;–
వే వెలుఁగు దోఁపఁ జీకటుల్ విచ్చిపోవు
నన్ని దెసలను కాంతులు వ్యాప్త మొందు
భక్తిరవితోఁప దైవ సంపత్ప్రకాశ
మాక్షణంబ వెల్గొందెడి నన్ని యెడల ;
కాని, యొక రీతి నిదియు యుక్తి మయి చెల్లు
పరమ సిద్ధమహాత్ములౌ భక్తవరుల
బాహ్య వర్తనాదులు బోధ పడని వగును.
వారియందు నీదైవ సంపదలు పొదలు.
అగుణ మొకటి తోఁచిన దురూహ్యంబు మనకు
దైవ సంపద్గుణాది విస్తరణ లేని
వాఁడు సాధువు–భక్తుఁడు గాఁడు నిజము

★ ★ ★

సాధకుండెప్డు తన పరీక్షార్థ మీగు
ణంబు లాధారములుగఁ గానంగ నగును.
ప్రభువు చింతన–దైవ సంపద్వివృద్ధి
యగుకొలఁది భక్తి మార్గంబునందు నున్న
తస్థితినిఁ గాంచు వాఁడని తలఁపఁ జనును.
ఈ జగచ్చింత నంబులు వృద్ధి నొంది
దైవ సంపదఁ బడయుంగఁ బోవఁడేని
భక్తుడున్నతస్థితి లేనివాఁడు;– నిజము.
విషయ చింతన నానాటఁబెఱిగి, యాను
రప్రవృత్తి పెంపొందెనేఁ భ్రష్టుఁ డతడు

* * *

ప్రేమమై జగన్నాథు స్మరించు చుంట,
భాగవతధర్మ దైవసంపద్గుణములు –
వాని జీవన పద్ధతి ; భక్తుఁడీ ద్వ
యంబుఁ దక్కఁ , దక్కనవి సర్వంబు విడుచు
భగవదాజ్ఞాను సారియై పఱఁగు నతఁడు ;
సిద్ధ భక్తుల జీవన పద్ధతుల నొ
కంటఁ దనకుఁ జొప్పడిన మార్గమునఁ బోవు
నియమ మది కాదు ; స్వేచ్ఛమై నెగడు నదియు
కాని, యతనికే యాసక్తి గాని, మమత,
కామమును, వాసనయు, నహంకార మోహ
ములును, జీవన పద్ధతిఁ బొదలఁ బోవు.
ఎందు నేకారణమున నేదేని నొకట
వాని జీవన పద్ధతికైన, సహజ
ధర్మమున నీశ్వర ప్రేమ తత్త్వమునకుఁ
బొందు పొసఁగని స్థితి యొండు పొసరె నేని

భగవదాజ్ఞను బొంది, తప్పక స్వధర్మ
రక్షణార్థమై 'నీతి' దూరముగఁ ద్రోయు
వెలయు భరతుఁ, బ్రహ్లాదు, విభీషణుఁ, వ్ర
జాంగనల నుదాహరణార్థ మరయుఁ డిందు
వారు భగవ దనుగ్రహప్రాప్తి కొఱకు
తల్లిఁ దండ్రిని, మఱియు, సోదరుని, ధవులఁ
గా దనుచు వారి యాజ్ఞలఁ గడచి నారు.

★ ★ ★

అందు సూక్ష్మబుద్ధినిఁ గనుగొందు మేని
నవి సదాచార నీతి బాహ్యములు గావు.
ఈశు ప్రేమధర్మంబుఁ బాలించు పొంటె
నెపుడు భక్తుఁడు కష్ట సహిష్ణు వగును.
సకల విధి నిషేధంబు లీశ్వర పదాంబు
జార్పితము చేయు టరయ వేఱైన స్థితియ.
అటు సమర్పించు వాఁడు చేయండెదేని,
విధి నిషేధ భారంబిఁకా పిచ్చ భక్తు
శిరము నుండి తొలంగి వేర్పఱుపఁ బడును.
వాఁడు మోయంగఁ దగియున్న బరువు లేదు ;
వాని యందు దోసము వీసమైన లేదు.
కాని, యిట సాధకునకుఁ బల్కంగఁ బడియె
సాధకుఁడు సావధానుఁడై శాస్త్ర విహిత
సద్గుణములు సదాచార సరణి నెఱిఁగి
వాని నార్జించి పాలించ వలయు సుమ్మి !
పైనఁ దెలుపఁగాఁబడు గుణ పంచకంబు
నట్టివాని స్వరూపము లరయఁ దగును

★ ★ ★

తలంపుచేఁ బల్కుచే మఱి, తనువు చేత
నపుడొ-మఱి, యెప్పుడే నెట్టి ప్రాణినైన
నెవ్విధమున నేబాధ నొందించకుంట ;
ఎల్లరకు నెల్ల వేళల నెల్ల గతుల
సౌఖ్యమిడు కార్యములు మాత్ర సలుపు చుంట
యను సదాచారమె ''యహింస'' యనఁగ బడును.

★ ★ ★

కని, విని, యెఱింగినది యథాక్రమముగాఁగఁ
బలుకు వ్రాతల సైగలఁబరుల కెఱుక
పఱచు నదియె ''సత్యం'' బని పలుకఁబడును
మఱియుఁ, బలుకుచో సత్యము, మధుర హితక
రంబులైన భాషణలె యోగ్యంబు లగును ;
సత్యమాడుచో-కఠిన భాషణలు తగవు
స్వాభిమాన ప్రకటనార్థ మదియుఁ గాదు.
ద్వేషవైర నిందాదుల తెఱవుఁ బోక
తనకు నొరునకుఁ దగు మేలు పెనువఁ జాలి
సత్యమధురములైన భాషణలు వలయు
ఇందు వెన్నెలల్ కాంతుల నీనుచున్నఁ
జల్లఁదనమును సైత మొసంగు చుండు;
అటుల భక్తుల నుడులు సత్య మధురములు
నై ప్రకాశక శాంతి దాయకములుగను
పొనరఁ దగు ; నొరుల కహితమును ఘటించు
నర్థి సత్యమేః వాంఛనీయంబు గాదు

★ ★ ★

శౌచము వెలి లోపల నవశ్యంబు వలయు
జల మృదాదుల మైసుద్ధఁ జలుపు చుంట
అన్య విత్తాపహరణ క్రియలను మాని
శాస్త్ర విహితకృతుల ధనార్జనము సేత ;
శుద్ధమౌ స్థలంబందున శుద్ధుఁ డగుచు
ధౌతియగు వానిచే నిషిద్ధములు గాని
భోజ్యముల నీశ్వరార్పణముగ నొనర్చి
స్థిమిత చిత్తంబుతోడ భుజించు చుంట ;
విమల నిష్కపటంబును ప్రేమ పూర్ణ
మైన నడవడితోఁ బను లరయు చుంట ;
శక్తి కొలఁదిని అతిథుల సత్కరించి
నిజ గృహంబును హరి నామ నినదముల న
శేష పావనంబుఁగ నెప్డుఁ జేయు చుంట ;
శాస్త్ర విహితాచరణమున సకల బాహ్య
కర్మముల విశుద్ధంబులుగా సలుపుట
బాహ్య శౌచ మటంచును బలుకఁ బడును

★ ★ ★

దంభ వైరాభిమాన క్రోధములుఁ గాంక్ష,
వ్యసన మీర్ష్యయు ద్వేషముఁ బాపచింత
నంబు, వ్యర్థ విషయ చింతనంబు లనెడి
దోసముల యథాశక్తిని దూరములుగ
విడిచి, మనసున సరళత ప్రేమ వినయ
శాంతి వైరాగ్యములను, ప్రసన్నత యును
సద్విషయ చింతనము, హరి స్మరణ మనన
కీర్తనాదుల హృదిశుద్ధిఁ గీలు కొలుపు
చుంట '' ఆంతర శౌచమై'' యొప్పు చుండు.

★ ★ ★

ఇంట నేనియు మఱి యొరు నింట నేని,
మిత్రుఁడే నుదాసీనుఁడేఁ శత్రుఁడైన
దుఃఖితుండగు నాతని దుఃఖ దశను
గనిన, భేద భావంబును గాంచఁ బోక
హృదయమున వ్యాకులతను వహించుట యును ;
శక్తి కొలఁదిని కష్టముల్ సైచి యైన
త్యాగబుద్ధి నాతని వ్యథల్ తలఁగ జేయఁ
జాలు పనులను దగురీతిఁ జలుపు చుంట ;
సకల జీవుల యెడలను సర్వకాల
ముల యథాశక్తి నవ్విధి మెలఁగుచుంట;
అన్యజీవులకును దుఃఖ మహితమొసఁగు
పనుల నెల్లవేళల యందు వదలు చుంట ;
మఱియు, దేశంబు నందు సమాజ మందు
నెట్టి యాచారవర్తన లితర జీవ
ములకు నహితంబులౌ – వానిఁ బూర్ణముఁగ ని
వారణము సేయఁదగు నట్టి పనులు పలువు
చుండుటలు ''దయ'' యను పేర నొప్పు చుండు

  

దైవమందున, మఱియు, శాస్త్రంబు లందుఁ
బఱఁగు ప్రత్యక్షరమున విశ్వాస మూన
వలయు ;–భగవంతుఁ డనువాఁడు గలఁడతండు
ఎల్లెడల నిండి యుండు, సర్వేశుఁ డతఁడు
సర్వ శక్తిమంతుండును, సర్వవిదుఁడు
పరమ కరుణాళువు, సుహృద్వరుఁడు భక్త
వత్సలుండును, మఱి, దీన బాంధవుండు ;
ఎవుడు నెల్లెడలఁ బ్రకాశించు నాతఁ

డనుచు సుదృఢ విశ్వాసంబుఁ గనెడి వాని
సకల పాప తాపంబులు సమసి పోవుఁ
దమకుఁ దామ ; దైవమున గాఢమగు నమ్మ
కంబు తొలుత నన్నిటను ముఖ్యంబు సుమ్మి !

★ ★ ★

భగవదస్తిత్వమునఁ దత్ప్రభావ గుణము
లందు విశ్వాసమొందు కొలంది మనసు
సహజముగ లగ్నమొందు నీశ్వరుని యందు
నరుఁడెదేఁ గోర –సకల భాండారము హరి ;
"జ్ఞానమన– జ్ఞాన రూపకుఁడౌ నతండు,
ప్రేమఁ గోరుచో – నాతఁడు ప్రేమ మయుఁడు ;
తగఁబ్రమోదమా! – ఆనంద ధాముఁ డతఁడు;
మఱి, విరక్తియా !– వైరాగ్య మయుఁ డతండు,
ధనమ ? – లచ్చి యాసామి పాదములఁగొలుచు,
వఱఁగ నైశ్వర్య మనిన – విశ్వంబు నందు
వఱలు నైశ్వర్య మతని యైశ్వర్య మందు
నొక్క యంశంబదగునొ?– కోదొ? · తలంప ;
కీరితియ ? – యాతఁడగు ప్రావు కీర్తినదికి ;
పృథివి సౌందర్య మాధుర్య ప్రేమములును,
ప్రబల మైత్రియు జ్ఞాన వైరాగ్యములును,
సన్ను తైశ్వర్య ధనభోగ సౌఖ్యములును,
ఇంద్రియములచే నెఱిఁగి యూహింపఁ దగిన
వన్ని భగవాను స్వల్పాంశ మగునొ ? కావొ!
జగతిఁ గల పదార్థంబు లీశ్వర మహాబ్ధి
యందు నొక జల కణ మది యగునొ ! యేమొ!"
ఇట్లు భగవానుఁడని విశ్వసించు వాఁడు

దైవమును బాసి యొక్క యర్ధ క్షణంబు
నేని వేఱొంట మనసును బూనఁ బోఁడు ;
పుడమి, క్షణిక భోగములవి పొడము చున్న
నాశమొందుచు నున్న నానంద శోక
ముల వహింపఁగఁ బోవఁ డెప్పుడును ; గాన
నట్టి " ఆస్తిక్యత " ను భక్తుఁ డంద వలయు
★ ★ ★
కనుఁడు విష్ణుపురాణ సూక్తిని నొకింత :-
అల, హిరణ్య కశిపు నాజ్ఞ ననుసరించి
శత సహస్ర దుర్దాంత రాక్షసులు చేరి
భూరి శస్త్రాస్త్రములఁ జేతఁ బూని, చావ .
మోదఁ బఱతేఱఁ గాంచి ప్రహ్లాదుఁ డనఁడె ?
"అసురులార! నాసామి శ్రీహరి కలండు"
అస్త్ర శస్త్రాళిఁ గలఁడు ; మీయందుఁ గలఁడు
కలఁడు నాయందుఁ ; గలఁడీ జగాన నెల్ల
పట్టులం - దిట్టి సత్య ప్రభావమునను
మీ మహాస్త్ర శస్త్రములు నన్నేమి చేయు ? "
అసుర శస్త్రా స్త్రముల నెల్ల వ్యర్థమయ్యె
నించు కేనిఁ బ్రహ్లాదు హింసించ లేక
★ ★ ★
చటుల విషసర్పముల, వాని పటు విషముల
దంతి చయముఁ దద్వజ్రాభ దంత కోటి
నరసెఁ దనసామి హరిని ప్రహ్లాదుఁ; డతనిఁ
గలఁచ లేవయ్యె నిన్ని - యేకొలఁది నేని !
★ ★ ★

అగ్నిఁ ద్రోసిరి ప్రహ్లాదు – నగ్ని యందుఁ
గాంచె నవనీల నీరదాకారు హరిని ;
అనియెఁ బ్రహ్లాదుఁ డయ్యెడ జనకు తోడ ;–
''అవిరళానిల ప్రేరితుండైన వహ్ని
జనక ! లవమేనినన్ గాల్పఁ జాలఁ డయ్యె !
పద్మములు నలు వైపులఁ బఱచి నటులఁ
జల్లనై నాకు సౌఖ్య మొసంగె వహ్ని.''

★ ★ ★

తమిఁ బురోహితుల్ ప్రహ్లాదు సమయఁ జేయఁ
గృత్యను సృజించి, వెసఁ బ్రయోగించ – నదియుఁ
బరమభక్తుఁ బ్రహ్లాదునిఁ దఱియ నోడి,
మగిడి, యాపురోధసులను మడియఁ జేయఁ
గనికరం బూని, ప్రహ్లాదుఁ డనియె నిట్లు ;
''విశ్వమయుఁడు లోకగురుండు విష్ణులెల్ల
ప్రాణు లందును వ్యాపించు వాఁడ యేనిఁ
బఱగ నిట్టి సత్య ప్రభావంబు కతన
వెసఁ బురోహితుల్ తిరిగి జీవింత్రు గాత ! ''

★ ★ ★

'' సర్వగతు ననపాయు నక్షయుని విష్ణు –
నన్ను వధియింపఁ బలు ప్రయత్నములు సేయు
వారలందు సైతము చూచు వాఁడ నేని,
వెండి యీ పురోహితులు జీవింత్రు గాత ! ''
అనెడి ప్రహ్లాదు '' ఆస్తిక తాప్తి''ఁ జేసి
బ్రతుకఁ జాలిరి యా పురోహితులు మరల.
చివర కల్ల హిరణ్య కశిపుని ప్రశ్న
మునకు సుదృఢంబు నిశ్చయమును వహించి,

త్రొమ్ము వితిచి ప్రహ్లాదుఁడు నెమ్మిఁ బలికె
''కలఁడు నాసామి – యంతటఁ గలడు ! కలఁడు !
కలఁడు !– ' ఈ కంబమందేనిఁ, గలఁడు – తండ్రి!
అనెడి సేవకు నుడులు ప్రత్యక్ష సత్య
ములు నొనర్పఁ గంబము నుండి పొడమె నృహరి
ఎట్టి సుదృఢ నిశ్చయమిది ! యెట్టి యద్భు
తైక పరిణామ! '' మాస్తికత్వ'' మన నిదియ !
భక్తుఁ డాస్తికత్వము పెంపు వడయ వలయు
నట్టి స్థితిఁగూర్చు కృతులు సేయంగ నగును

★ ★ ★

అరయ నిందు '' ఆస్తిక్యాదు'' లనుటఁ జేసి,
దైవ సంపత్తి మఱియును దైవ గుణము
లవి – సమాదరణీయంబు లనుచు, సూత్ర
కారుఁ డిచట సంకేతించె ; – శౌరి వినిచె
దైవ సంపత్తిఁ గూర్చి గీతలను ; – వినుఁడి.
అభయమును సత్వ సంశుద్ధి, యార్జవంబు
జ్ఞాన యోగంబు నందునఁ గదల కుంట,
దమము స్వాధ్యాయమును, దాన తపము లరయ
సత్యమ క్రోధము నహింస శాంతి మార్ద
వంబు, సకల భూతంబులఁ బరమ కరుణ,
చపలత వహింపకుంట, లజ్జయు నలోల
తయును, గొండెముల్ పలుకక తలఁగు చుంట,
క్షమము తేజంబు ధృతియు శౌచంబు స్వాభి
మాన రహితత్వమును, ద్రోహ మతిని విడుట
దైవ సంపత్తి తోడ నుద్భవము నొందు
వాఁడు వడయుచు నుండును ; పాండవేయ !''

అట్టి దైవసంపద భక్తునంద పొలుచుఁ
గాన భక్తుని ''దైవునిఁ''గా వచింత్రు.
కనుఁడి విష్ణుపురాణ సూక్తిని నొకింత :-
''ఈ జగంబున జీవంబు లిరు విధములఁ
బరిగణితములు '' దైవు-లాసురు'' లనంగ ;
'దైవు' లని యందురు భగవద్భక్త జనుల
వారి కన్య 'లాసురు' లనఁబడుచు నుంద్రు.

**సూ :** **సర్వదా సర్వభావేన నిశ్చింతితై**
**ర్భగవానేవ భజనీయః** 79

**టీక:** సర్వదా = ఎల్లప్పుడు ; సర్వభావేన = ఎల్లభావములచేత; నిశ్చింతితైః (నిశ్చితైః) = ఎల్లవిచారములను పరిత్యజించిన వారిచే ; భగవాన్- ఏవ = ఆ భగవంతుడొకడే; భజనీయః = భజింపఁదగినవాఁడు

**తె. గీ. :** **సర్వ కాలంబు లందున సర్వగతుల**
**నన్య చింతల విడిచి, యనన్య భక్తి**
**భజన సేయంగఁ దగు భగవాను నొకని.**

వివ. అద్భుత మహత్త్వమీ సూత్రమందుఁ గలదు.
ప్రేమ పథికుఁడౌ భక్తుఁడు ప్రేమ పాత్రుఁ
డైన భగవంతు భజన సేయఁదగు విధముఁ
బలికెఁ జక్కని రీతి దేవర్షి యిచట
వాస్తవంబున శ్రీభగవాను దివ్య
గుణ రహస్య ప్రభావాళిఁ గూర్చి యుక్త
రీతి నెఱిఁగిన వాఁడుఁ, ద ద్రీతి సాధు
జనుల వలన నెఱింగి విశ్వాసమూను
సుకృతి, భగవంతుఁగాదని త్రికరణముల
నెప్పుడే నొండు పనిచేయ నెట్లుగోరు ?

పేదవాఁడొకటఁ బరుసవేదిఁ గనిన
నింకఁ గోరునే వాఁడన్య మేదియైన ?
పరమ తత్త్వంబు శ్రీభగవానుఁ డొకఁడ ;
అతఁడె సకల విశ్వమునకు గతియు సుమ్ము!
ఆతఁ డొకఁడె సర్వాధారుఁడై తనర్చు ;
సర్వ శక్తిమంతుండును – సకల సుగుణ
నిధియు, సౌందర్య మాధుర్య నిలయుఁ డతఁడు
జ్ఞానవైరాగ్య రూపుఁ డైశ్వర్య శాలి
ప్రవిమలానంద కంద విగ్రహుఁ డతండు
ఇన్ని కలిగియుఁ బరమ సుహృదుఁడు నగుచు
నెపుడుఁ జేయూఁత నిడి దారి నెఱుఁగఁ బఱచు
కని యిది, సకామి యేని నకామి యేని
భూరి విషయుండవటుఁ డేన్ ముముక్షు వేనిఁ,
జేరు సాధకుండేనియు, సిద్ధుఁడేని
నిట్టి భగవాను 'గాద' ని యెవ్వఁడితరు
నఱ క్షణంబైన భజియింప నాస సేయు ?

★ ★ ★

చేరి భగవాను మనము భజింపఁ బోని
కారణము తత్ప్రభావంబుఁ గనమి – నిజము.
వినిన పలుకుల విశ్వాస మునుపఁ బోము
''విశ్వసింపుఁడు భగవాను విశ్వసింపుఁ ''
డనుచు వచియించె నారదుం డమరమౌని.
త్రికరణమ్ముల భగవంతుఁ బ్రియతముని – భ
జింపుఁ డితర చింతనముల నెడల నిండు ;
తల్లి యొడిఁ జేరి బిడ్డ మోదమును గను వి
ధాన ప్రభునాశ్రయించి చింతలను విడుఁడు ;

ప్రభువు శ్రీరాముఁ డెవ్వని రక్షకుండో
వాఁడు చింతింపఁదగు నన్య వస్తు వెందుఁ
గలదె ? సకలంబు వర్జించి, కలసమస్త
వస్తు వాంఛను విడి, భగవాను నెదుట
జగతిఁగల రసంబులు నీరసంబు లనుచుఁ
దలఁచి, కోటి కందర్ప కుదర్ప దళన
సరస సౌందర్య సారుఁడౌ, శ్యామ సుంద
రాంగు నెదుట జగద్రూపరాశులెల్ల
హేయములుగఁ దలంచి, తదీయ భజన
యందుఁ జిత్తంబు హత్తింప నగును. సతము

★ ★ ★

హృదయ మావరేశునకె యర్పింపఁజెల్లు
పలు భరంబులు హరి పైన వదలి మనుఁడు!
మనసుచే నా పరేశు సంస్మరణఁ గనుఁడు!
హరి విచారంబు బుద్ధిచేఁ బఱుపుఁ డెపుడు
ప్రభుని గుణ కీర్తనల్ నోఁట బలుకుఁ డెందు
శ్రీసుగుణలీల లెప్పుడుఁ జెవుల వినుఁడు!
రసనచేఁ గృష్ణుని ప్రసాద రసముఁ గొనుఁడు!
మూర్కొనుఁడు నాస ప్రభుపదాంబుజ రజంబు
తనువుచే శ్రీహరి స్పర్శ ననుభవింపుఁ
డక్షులఁ గాంతి పుంజమౌ హరినిఁ గనుఁడు!
చేతులఁ బరేశు సేవలఁ జేయుఁ డెపుడు
వపు మనో ధనముల మహాప్రభున కిడుఁడు!

★ ★ ★

పృథివిఁగల పదార్థము లాదరించి, వాని
యందు మమత వహించెడి నంత దనుకఁ
గలుగఁ బోదు నిశ్చింతయే కొలఁది యేని

అంతవంతముల్ క్షణభంగురాత్మకములు
నరయఁ బరివర్త నాస్పదమ్మైన వస్తు
కోటి యెప్పుడేన్ నిశ్చింతఁ గూర్పఁబబోదు.
మమత నాసక్తి వీనిపై సమయఁ జేసి,
వస్తువుల వాని వానికే వదల నగును.
వరఁగ నన్నిటి నీశ్వరార్పణము సేసి
భక్తుఁడెల్లెడ నిశ్చింతఁ బడయు చుండు:
నాశభయమే నభావ చింతయునుగాని
కలుగఁ బోదు ; తత్కాంక్షచేఁ గలఁచబడఁడు
పొంది నిశ్చింత, నవ్యయానంద మధురఁ
సుందరాంభోధి దర్శనోత్సుకత మునిగి
స్వామి భజనాత్త చిత్తుఁడౌ వాని కెందు
హృదయ మితరమ్ముఁగన, దన్య మెఱుఁగఁబోదు.
ఎప్పు డైశ్వర్య దృష్టియు నెసఁగ బోదు
ఎట్టి యైశ్వర్య వాసన యెప్పు డేనిఁ
గలిగెఁబో సమస్తైశ్వర్య నిలయమ్మైన
హరి పదాబ్జములఁ లీన మందఁ జేయఁ
దగును సాధక చిత్తుఁ, డద్దాన విషయ
వాసనాత్మక వ్యభిచార భావ ముడిగి
ప్రియ తముండు ప్రాణాధిక విభుని యెడల
ప్రియ పతివ్రతా పత్నియై ప్రేమఁ బఱుప
దగును భక్తుండు; సుందర దాసుఁడనడె ?

★ ★ ★

''పతియె ప్రేమంబు, నేమంబు ప్రాణపతియు,
పతియె క్షేమంబు, భోగ్యంబు ప్రాణపతియు,
పతియె శోక హరుండును, బతియె యెఱుక,
ధ్యానమును – జ్ఞానమును – బుణ్యదానములును
తానములు క్షేత్రతీర్థమతములుఁ బతియు.
పతికి నన్యమౌ ప్రభువు సుగతియు లేఁడు
భక్తుఁ డెల్లగతులఁ బతివ్రతయె సుమ్ము.
జలము విడిచెనేని మీనంబు నిలువ లేదు ;
మణినిఁ గోల్పోవ సర్పంబు మనఁగ లేదు ;
స్వాతి చినుకుకై కను శుక్తి చాతకములు ;
ఇనునకై కొలఁకునఁ దమ్మి యెదురు చూచు
చందురునకై చకోర మాసక్తి నొందు
అటుల భక్తుఁడు స్వామికై యాస సేయు;
అన్య మెఱుఁగఁడు – కోరఁబోఁ–డరయఁ డెపుడు''.

★ ★ ★

భగవదాజ్ఞ గీతల యందుఁ బలుకఁ బడదె ?
''భావమునుపు నాయందు, మద్భక్తిఁ గనుము!
నను యజింపుము ! నాకు వందనము లిడుము
నన్నె చేరఁగాఁ గలవీవు ; నీకుఁ బ్రియుఁడ
వగుదు ; ప్రతిన చేయుదు విజయా ! నిజంబు . ''
''ఎల్ల ధర్మంబులను ద్యజియించి నన్ను
నొకని మాత్రమ శరణంబు నొందు ; మేను
సకల పాప చయంబుల సమయఁ జేసి
ముక్తు నొనరింతు నిను, జింతఁ బొంద వలదు ''

★ ★ ★

కనుఁడి! భగవానుఁ డిటు ప్రతిజ్ఞా సమేత
ముగ నెఱుంగఁ బల్కినఁ జెడు బుద్ధి బలిమిఁ
జేసి యెల్ల భావముల నిశ్చింత నెప్పు
డీశ్వరుని భజింపఁగ నెంచ మేని నింక
లేఁ డభాగ్యుఁడు మనకంటె – లేఁడు – లేఁడు.
అరసి యీ సూక్తిఁ బరమ కల్యాణమనుచు
నిలిచియున్నఁ గూర్చున్నను, నిదురనున్న
మేలుకొనియున్న, నెపుడెట్లు మెలఁగుచున్న
ప్రభు పవిత్ర సామర్థ్యంపు ప్రౌఢి నెఱిఁగి,
సౌఖ్య దుఃఖముల్ – లాభ నష్టములు – పుటుక
చావు లాదియౌ చింతల సమయఁ జేసి,
యనవరతము నిశ్చింత ననన్య మతిని
హరి భజన కీర్తనములఁ జేయంగ నగును.

★ ★ ★

# 14. ప్రేమ భక్తిఫలము - సర్వశ్రేష్ఠత

సూత్ర : సకీర్త్యమానః శీఘ్రమే వావిర్భవతి
అనుభావయతి చ భక్తాన్. 80

టీక : కీర్త్యమానః = కీర్తింపఁబడినవాఁడై ; సః = ఆభగవానుడు; శీఘ్రం ఏవ = వెంటనే; ఆవిర్భవతి = ప్రత్యక్షమగుచున్నాఁడు; భక్తాన్ = ( ఏకాంత) భక్తులను ; అనుభావయతి -చ= ఈశ్వర తత్త్వానుభవము పొందిన వారినిగఁగూడ చేయు చున్నాఁడు.

తె. గీ. ప్రేమపూర్వకముగను గీర్తింపబడి, ప
రాత్ముఁడౌ హరి వేగఁ బ్రత్యక్షమగుచు
భక్తులకు స్వకీయానుభవంబుఁ గూర్చు.

వివ : పూర్వ సూత్ర బోధిత మార్గమున నన్య
భజనచే శీఘ్రముగ భగవానుఁ డెలమి
భక్తు మ్రోలఁ బ్రత్యక్షమై స్వస్వరూప
వాస్త వానుభవంబుఁ గూర్పంగఁజాలు
వరఁగ " ఆవిర్భవించు"- శబ్దమున దైవ
మఖిల దివ్య సౌందర్య రసాత్మక ప్ర
శస్త సాకారమూని సాక్షాత్కరించు
ననుచు నియ్యెడ నెఱుఁగఁగా నగు ; యథార్థ
సరణి నిర్గుణం బన్నను సగుణ మన్నఁ
గన, నిరాకార మనిన, సాకార మనిన
భేద మిసుమంత యేనియు లేదు-లేదు.

  

మనసు బుద్ధుల మించు బ్రహ్మం బతండు,
స్రష్ట, సగుణ నిర్గుణుండగు ప్రభు వతండు ;
అతఁడె లోకనాథుఁడు, జగదంతరాత్మ,
రాముఁడాతండు, కృష్ణుఁడా స్వామియగు, మ
హా శివుండు – మహావిష్ణు వతఁడె సుమ్ము.
పార్వతి, మహాదేవియును, విరాట్పురుషుఁ డతఁడె.
లేదు వీరలందఱ నెట్టి భేద సరణి.
కనిన, భక్తప్రేమను సమాకర్షితుఁడయి
స్వామి తన మహాహ్లాదినీ శక్తిఁ గార
ణముగఁ గైకొని దివ్య చిన్మయ దుకూల
మాలికా గంధ భూషాయుధాళిఁ బూని
సరస భవ్యరూపమున సాక్షాత్కరించి
స్వీయ భక్తుఁ గృతార్థునిఁ జేయు చుండు.
సగుణ మగుణమ్మ భేదంబు నెగడ దనుచు
వేద శాస్త్ర పురాణముల్ విబుధు లంద్రు
''అగుణుఁడజుఁ డరూపకుఁడైన నా పరాత్మ
సగుణుఁడగు భక్త ప్రేమ వశమునఁ జేసి''
యని వచింపఁడె? ''తులసి,'' రామాయణమున

★ ★ ★

మాయచే జగంబందు సంభవము నొందు
రూప సాదృశ్య మిచటఁ బేర్కొనఁగ రాదు
అరయ నిందు వస్తువులు దివ్యములు శుద్ధ
పరమ నిత్యేశ్వర స్వరూపంబు లగును ;
కాన, నట్టి దివ్యపరాత్మకంబునైన
యీశ్వర స్వరూపంబది యెదుటదోప
ఆత్మవిజ్ఞాలో మునుల లయంబు గనిన

మనములేక బునర్భవమొంది, మాన్యమౌ ప
రేశు రూపంబు నందుఁ బ్రత్యేక వస్తు
వరసి, ముగ్ధత్వమును గాంచి యులరు చుండు
ఇంద్రియ వికారమును గూర్చు నెల్ల రూప
రస సుగంధ శబ్ద స్పర్శ విసర మ నను
జిత్త ముపరమించు ముముక్షు వృత్తి యంద ;
కాని, యాత్మ విజ్ఞానులౌ మౌనుల యెడ
నా పరేశు సంబంధమౌ రూపరస సు
గంధ శబ్దముల్ స్పర్శాదికంబు లైన
విషయములు, మాయ చేతఁ గల్పితములైన
త్రిగుణ సంభూతములు గామి, దివ్యసిద్ధి
దాయకములుఁ, బరానంద ధామములగు.
పఱఁగనివి సర్వసుగుణ సంపన్న నిర్గు
ణాత్ముఁడౌ ప్రభు రూపంబు లగుచు నుండు ;
దాన, మోహితులగు చుంద్రు మౌని వరులు

★ ★ ★

ఆదిశంకర దేశికుం డనఁడె ? కృష్ణు
వాకొనుచు మున్ ''ప్రబోధసుధాకరమున'' ;-
''అబ్జ జాండ చయంబు, బ్రత్యండ మందు
బ్రహ్మలను వత్స సహిత గోపకుల, విష్ణు
వులను బల్వుర నజున కద్భుతముఁ గాగ
నగపఱచె నెవ్వ, రేని పాదాంబువుల ధ
రించుఁదల శివుఁ, డట్టి మూర్తిత్రయమున
కన్య, మవికారమును ? జిన్మయంపు నీలి
మమ్మ శ్రీకృష్ణుఁ డగును నిక్క'' మ్మటంచు

★ ★ ★

ఒకట, నిత్యాత్మ నిష్ఠులు యోగివర్యు
లైన సనకాదు లఖిల లోకాధినాథు
శ్రీమహా విష్ణుదేవు దర్శించు పొంటెఁ
జనిరి వైకుంఠ ధామమ్ము ; స్వామి దివ్య
మూర్తి దర్శించు క్షణమున ముగ్ధులైరి.
శ్రీశు సౌందర్య సంపద నెంత దనుకఁ
గనుచు నున్నను వారి వీక్షణము లెందు
నించు కేనియుఁ దృప్తి వహించ వయ్యె.
ఎలమి. వారల నెల్ల మోహితులఁ జేయ
నోపినది హరి సౌందర్య మొకటె కాదు.;
సాఁగిలంబడి మ్రొక్కులు సలుపువేళ
ప్రభువరేణ్య పాదాబ్జ పరాగ మిళిత
తులసి మంజరీ సౌరభా నిలము లోనర
నాశికా మార్గమున హృదంతరముఁ జేరి,
పరమ సచ్చిదానందాను భవ విశిష్టు
లైన మౌనులఁ గలఁచె ; వారందఱికును
బొడమెఁ బులక లానంద విస్ఫూర్తిఁ జేసి.

★ ★ ★

బ్రహ్మ విద్వరిష్ఠుండును రాచ తపసి
యైన జనకుండు నీస్థితి నందెఁ దొల్లి ;
సరస సుందరాంగుల సమక్షమునఁ గాంచి,
ధీరమతి విదేహుండు – విదేహుఁ డయ్యె;
చక్షు యుగ్మ మానంద బాష్పములఁ గురిసె,
జనకునంత వాని విమోహ సక్తుఁ జేయఁ
జాలు నారూప సౌందర్య సారమేమొ !
ధృతి వివేకముల బలిమి స్తిమిత మొందఁ

దలంచెం గాని, ప్రశ్నింపక తప్పదయ్యె ;
కౌశికుని పాదముల మ్రొక్కి కరము భక్తి
జనకుం డేమియో పలుకం గాంక్షను వహించె
హృదయము ద్రవించుడు వివేక మెడలి పోయె.
ధైర్యమునం బల్కం బలుకు గద్గదిక నొందెం
బలుకు నోట వెల్వడుట దుర్భరము నయ్యె.
అట్టి తనస్థితి విస్పష్టమౌ విధాన
నృపతి పల్కిన పలుకు లొక్కింత వినుండు
'' తెలుపంగదె! మౌనినాథ ! యీ దివ్యసుంద
రాంగులౌ బాలకులు ముని వంగ డంపుం
దిలకములో? రాచకొలమున వెలుంగుం గూర్పం
బొడమిరో? గాక, యామ్నాయములవి 'నేతి'-
'నేతి'-యని తెల్పు బ్రహ్మమీ రీతి యుగళ
వేషములం దాల్చి యావిర్భవించె నేమి?
సహజ వైరాగ్యయుతము నా స్వాంత-మిపుడు
కువలయేశునిం గనిన చకోర మటుల
వీరి సందర్శనంబున వివశ మందె ;
దీని కారణమేమి ? యర్థింతు, విమల
భావమున మాటు సేయక పలుకంగదవె!
వీరి - సౌందర్య మూర్తులం బ్రీతిం గనిన
యంత మనసు పరాధీన మందె- సతము
హత్తి యున్న బ్రహ్మనంద మవలం ద్రోసి;''
యనిన- జనకునింగని మందహాస శోభి
తాస్యుండై మౌని నృపు సందియంబుం బాపె

★ ★ ★

కాన, నెట్టి దివ్యాకృతిఁ గాంచు కొలఁదిఁ
గనెడు నిచ్ఛ యంతకు వృద్ధిఁ గాంచు చుండు
నది—విలక్షణమౌ వస్తు వనుచుఁ గనుఁడు!
అనుభవంబున నిది బోధమగుచు నుండు
ఇతర వస్తువుఁగనఁ బ్రబలేచ్ఛ పొడము
దానిఁ బొందిన ప్రథమ సందర్శనమున
వద్భుతానంద మందు సముద్భవించు ;
దాని యుపలబ్ధి సౌలభ్యమైన కొలఁది
నందు నాకర్షణంబల్ల నల్ల నెడలు
కాని, భగవాను సౌందర్య గతియొ—వేఱు
కాంచు కొలఁదిని సంతృప్తిఁగాంచఁబోము.
క్రమత భక్తుని ప్రేమంబు క్షణము—క్షణము
వృద్ధి నొందు కొలంది సర్వేశ్వరేశు
దివ్య సౌందర్య కాంతి ప్రతి క్షణంబు
నంత కంతకు నధికమై యలరు చుండు
క్షణము క్షణము; కొంగ్రొత్తయౌ చక్కఁదనము
నంత కంత కాకర్షణీయ ప్రశస్త
మాధురీ ధుర్యమై యోగి మాన్య మగును.
కనుఁడు!— హరి రూపమది మాయికంబు గాదు ;
అఖిల విధముల నద్ది దివ్యంబు నగును
భక్తు ప్రేమ నాకర్షింపఁ బడుచు మ్రోలఁ
బ్రకటితంబగు ప్రభువు రూపంబు దివ్య
భావ మొసఁగ స్వరూపాను భవముఁ గూర్చు
భక్త జనునకు ; మాధురీ భావ మెదుట
నెసఁగు దనుక భక్తుండు ప్రత్యేక దివ్య
రాజ్యభోగ నిమగ్నుఁడై క్రాలు చుండు.
అతనికీ సమస్తము దివ్యమై తనర్చు ;
వాఁడొకండె మాధుర్య సంపదల ననుభ

వించు ; నొరులకు దీని వీక్షించరాదు –
వినఁగ రాదు ; తన్మయుఁ డయి తనరు నతఁడు ;
వాఁడు భగవాను సత్యానుభవముఁ బడయు,

**సూ :** **త్రి సత్యస్య భక్తిరేవ గరీయసీ,**
**భక్తి రేవ గరీయసి.** 81

టీక : త్రి సత్యస్య = త్రికరణ– త్రికాలముల సత్యమగు భగవానుని యొక్క ; భక్తిః – ఏవ = భక్తియే ; గరీయసీ = శ్రేష్ఠమగుచున్నది. భక్తిః– ఏవ– గరీయసీ= భక్తియే (ఇతర సాధనముల కంటె) శ్రేష్ఠమగు చున్నది.

**తె. గీ. :** **సతము త్రికరణ త్రైకాల్య సత్య దైవ**
**భక్తి యొక్కటే శ్రేష్ఠమై పఱఁగు ; దైవ**
**భక్తియే యెల్ల మిన్నయై పఱలు చుండు.**

వివ: మహిత కాయిక వాచక మానసికము
లైన త్రివిధ సత్యములచే సమర మౌని
నారదగుఁడు భక్తి గరిమముఁ దాన యనుభ
వంబున నెఱింగె ; నద్దానఁబలు తడవలు
'భక్తియేమిన్న' – 'శ్రేష్ఠమౌ భక్తి' – యనియె
అది యపో నిత్య సత్యంబు నైన పలుకు.
ఉపనిషత్తులు నీరీతి నొనరఁ బలుకు ;
''కలుగు సర్వేత రోపాయములను విడువు
మఖిల గతులను భక్తి సమాశ్రయింపు,
భక్త నిష్ఠుండవగు మెప్డు, భక్తి నిష్ఠ
గనుము ;– సర్వ సిద్ధులు భక్తి కతన సిద్ధి
నొందు ; భక్తి కసాధ్య మొండెందు లేదు–''
అని, త్రిపాద విభూతి నారాయణోప
నిషదమల సూక్తి చాటు నిర్ణిద్ర ఫణితి

★ ★ ★

ముక్తియును భక్తిచేఁ గల్గు ముక్తి దాత-
యా పరాత్పరుఁడె సగుణ రూపమును వ
హించి భక్తుని మ్రోలఁ గ్రీడించు చుండు
''కనుఁడు భగవాను శ్రీముఖోద్గతవచస్సు''
బాగుగా ప్రజ్వరిల్లెడి పావకుండు
ఇంధనంబులఁ బెక్కు దహించు పగిది,
ఉద్ధవా ! మద్విషయమునై యొనరు భక్తి
సకల పాప చయింబుల సమయఁ జేయు ''

★ ★ ★

భక్త సాధన రక్ష శ్రీపతియె నెఱవు ;
తత్పుల స్వరూప భగవత్ప్రాప్తి యేనిఁ
దాన సమకూర్చుచుండు ; నందఱును దీని
యందు నధికారులగు చుందు - రటులఁ గాన
నిట్టి భక్తి కంటెను శ్రేష్ఠమేమి కలదు ?
గీత లందున నిట్టి భక్తి ప్రశంసఁ
గృష్ణుఁ డద్దానఁ బలుమాఱు నెఱుఁగ జేసె.
''ఇవ్విధంబున సతము నిన్నే భజించు
భక్తవర్యుల యందు నవ్యక్తమైన
యక్షరంబు నుపాసించు నట్టి వారి
యందు యోగ విత్తము లెవ్వరయ్య! కృష్ణ!''
అనుచుఁ - బృచ్ఛించు నరునితో ననియె శౌరి;
''అనఘ చరిత! చిత్తంబు నాయందు నిలిపి
సతత యుక్తాత్ములై మంచి శ్రద్ధ గలిగి
నన్నుపాసించు చుండు జనముల నిశ్చ
యంబుగా యోగి పుంగవు లని తలంతు''.

★ ★ ★

తను వచో మనస్సత్య సిద్ధాంతమునను
గాని, త్రైకాల్య సత్య వాక్సరణిఁ గాని
'భక్తి శ్రేష్ఠంబు' - 'శ్రేష్ఠమౌ భక్తి' - యనుచు
దేవమౌనియౌ నారదుఁ డీ విధమున
ముక్తకంఠుఁడై తాళముల్ మొఱయఁజఱచి
వారి వాహగంభీర నిస్స్వనము వెలయ
నిచట ఘోషించె జనులాఁదరింపఁజేయ.

సూ: **గుణ మాహాత్మ్యాసక్తి, రూపాసక్తి పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, కాంతాసక్తి, వాత్సల్యాసక్త్యాత్మనివేదనాసక్తి తన్మయతాసక్తి, పరమ విరహాసక్తి, రూపా ఏకథాప్యేకాదశథా భవతి.** 82

టీక : (భక్తిః=దైవభక్తి) ఏకథా-అపి=.ఒకే విధమైనను ; గుణమాహాత్మ్య-అసక్తి= దైవకల్యాణగుణములు మహాత్మ్యమునందు ఆసక్తివహించుట ; రూప- ఆసక్తి = భగవానుని దివ్యరూపము నందాసక్తి వహించుట ; పూజ-ఆసక్తి= భగవంతుని పూజ యందాసక్తివహించుట ; స్మరణ- ఆసక్తి= దైవమును స్మరించుట యందాసక్తి వహించుట ; దాస్య - ఆసక్తి = సర్వేశ్వరుని సేవించుట యందాసక్తి వహించుట ; స్నేహ- ఆసక్తి = జగన్నాధుని చెలిమి యందాసక్తి వహించుట ; వాత్సల్య- అసక్తి = లోకేశ్వరుని బిడ్డగా ప్రేమించుట యందాసక్తి వహించుట; కాంత-ఆసక్తి = భగవంతుని ప్రాణపతిగా ప్రేమించుట యందాసక్తి వహించుట; ఆత్మనివేదన - ఆసక్తి = జగత్ప్రభువునకు తన ఆత్మను సమర్పించుట యందాసక్తి వహించుట ; తన్మయత- ఆసక్తి= భగవంతునందు పూర్ణముగ లయము పొందుట యందాసక్తి వహించుట ; పరమ విరహ- ఆసక్తి = భగవానుని యెడబాటు సహింపలేకుండునట్టి ఆసక్తి వహించుట ; రూపా = రూపము గలదై; ఏకాదశథా = పదొనొకొండు విధములుగ ; భవతి = అగుచున్నది.

తె. గీ.: **ఇట్టి ప్రేమరూపక భక్తి యేకమయ్యు**

స్వామి గుణ మహత్త్వమున – రూపమునఁ–బూజ –
స్మరణమున – దాస్యమున – మైత్రి – వరుని వరుస–
వత్సలతను – స్వాత్మార్పణ పథినిఁ–దన్మ
యత్వముననను – బరమ విరహత్వమందుఁ
బఱఁగ నాసక్తిఁగనుట యఱ్ఱ బదునొకఁడు
విధములుగ జగంబందు శోభిల్లుచుండు.

వివ: తమి, మహాత్ములు ప్రేమరూపమగు భక్తి,
పూర్ణతకు యత్నముల్ సల్పు పూజ్యులందు
నిట్టి యాసక్తు లన్నియు నెసఁగు చుండు –
వ్రజమునందున గోపికా వనిత లటుల ;
వారల నుదాహరించె దేవర్షి మున్నె.
అన్ని గాకున్న, – భక్తుల స్వాభిరుచుల
ననుసరించి యందొండొ –లేకంతకంటె
నధిక భావములనొ హరియందుఁ బ్రేమఁ
బఱువనగు ''ప్రేమ'' – యననేక వస్తువగును,
కాన,-భక్తు ''ప్రేమాసక్తిఁ గలుగు భేద
గతుల నుచ్చ నీ చతలఁ బల్కఁగఁ దగదు.
ఇట్టి భిన్న భిన్నాసక్తు లిచ్చఁ జేసి
ప్రభునిఁ గొల్చి వేవేల్ జనుల్ భక్తులైరి
అరయుఁ డందుఁ గొందఱ నుదాహరణ కొఱకు.

1. దేవమౌని వ్యాసుఁడు – శుకదేవ యాజ్ఞ
వల్క్య కాకభుశుండులు – ఫణిపతియును –
సూత శౌనక శాండిల్య సురనదీసు
తార్జున పరీక్షి దాదులు, నా పరేశు
గుణ మహత్త్వ సంసక్తిచేఁ గనిరి పరము.

2. మిథిల పౌరులు జనక భూమీధవుండు,
దండకను ఋషుల్ గోప కాంతా చయంబు
రూప సక్త భక్తిని హరి ప్రాపుగనిరి.

3. సారసాక్షి లక్ష్మియు, పృథు చక్రవర్తి,
అంబరీషుండు శ్రీ భరతాదులెల్లఁ
బరముఁ గనిరి పూజా సక్త భక్తిఁజేసి,

4. అరయఁ బ్రహ్లాదుఁడు, మఱి, ధ్రువాదులందఁ
గనిరి స్మరణ సంసక్త భక్తినిఁ బరంబు.

5. హనుమ, విదురుఁ డక్రూరుండు నందినారు
పరమ గతిని దాస్యాసక్త భక్తిఁ జేసి.

6. అర్జు నోద్ధవ సంజయు లనఘ చరితుఁ
డౌ సుదాముఁడు శ్రీదాముఁడం దఁగనిరి
పరమ పదము సఖ్యాసక్తి భక్తిఁజేసి

7. అష్ట పట్టపురాణులు నాదియైన
వారు గనిరి కాంతాసక్త భక్తిఁ బరము,

8. అదితి కశ్యపుల్, సుతపయు సుదతి పృశ్ని,
అనఘ మతులైన శతరూప మనువు, లటుల,
కోసలాత్మజా దశరథుల్ ; వాసి గన్న
దేవకీ వసుదేవులు ; దివ్యభాగ్య
పూర్ణులౌ యశోదా నంద ముఖ్యు లీశు
పదము వత్సలతాసక్త భక్తిఁ గనిరి.

9. బలి శిబి విభీషణాదులు పరముఁ బడయఁ
జాలి రాత్మనివేదనా సక్త భక్తి.

10. యాజ్ఞ వల్క్య శుకసనాదులైన జ్ఞాను,
లటు, సుతీక్ష్ణ కౌండి న్యాదులైన మునులు,
పరముఁ దన్మయతాసక్త భక్తిఁగనిరి.

11. పార్థుఁ డుద్ధవుండును వ్రజ వాసులందఁ
జాలిరి పరాత్పరు విరహాసక్త భక్తి.
గోపికల నేకాదశ రూపములగు
ప్రేమ భక్తి వికాసమై పెంపుఁగాంచె.
పైన వివరింపఁబడిన యా భక్తులందు
నిచటఁ బేర్కొన్న విధమొక్కటే వికాస
మొందె ననఁగరా దవ్వారలందు నెట్టి
భావము ప్రధానమో యది పలుకఁ బడియె ;
ఇతరములుఁగూడ నొక కొన్ని యిమిడియుండు.

**సూ : ఇత్యేవం వదంతి జనజల్ప నిర్భయా ఏకమతా**
**కుమార వ్యాస శుక శాండిల్య గర్గ విష్ణు కౌండిన్య**
**శేషోద్ధ వారుణి బలి హనుమ ద్విభీషణాదయో**
**భక్త్యాచార్యాః** 83

టీక: ఇతి– ఏవం = ఈ పైనఁ జెప్పఁబడిన విధమున ; జనజల్ప నిర్భయాః = జనుల ప్రలాపములయెడ భయములేనివారై; ఏక మతాః = ఒకే అభిప్రాయము గలవారై; కుమారః = సనత్కుమారుఁడు ; వ్యాసః = వేద వ్యాసుఁడు ; శుకః = వ్యాస సుతుఁడు శుకయోగి ; శాండిల్యః = శాండిల్య మహాముని ; గర్గః = గర్గ మహాముని ; విష్ణుః = నారాయణుఁడు ( శ్రీ కృష్ణుడు ; నారాయణ ఋషి;) కౌండిన్యః = శాండిల్యుని పుత్రుఁడు కౌండిన్య మహాముని ; శేషః = సంకర్షణుఁడు ( లక్ష్మణుఁడు); ఉద్ధవః = ఉద్ధవుఁడు ; అరుణిః = ( ఊద్దాలకి అరుణి) మహర్షి యైన అరుణి.; బలిః = బలిచక్రవర్తి ; హనుమత్ = హనుమంతుఁడు ; విభీషణః = విభీషణుఁడు ; అదయః = మొదలగు ; భక్తి– అచార్యాః = దైవభక్తి మార్గ ప్రబోదకులు– గురువులు; వదంతి = పలుకుచున్నారు.

తె. గీ. : అని, సనత్కుమారుండును వ్యాస శుకులు,
వెలయు శాండిల్య కౌండిన్య విష్ణు గర్గ
లారుణియును శేషోద్భవుల్ త్యాగశీలి
బలియు, హనుమ ద్విభీషణ ప్రముఖులైన
పరమ భక్తి మతాచార్య వర్యులెల్ల
లోక నిందాస్తుతులను దృణీకరించి
యేక మతిని వాకొనిరి నిర్భీకులగుచు.

వివ: తనర భక్తి తత్త్వమునఁ బ్రధాన పూజ్య
తను గడించు నాచార్య మతం బెఱింగి,
తన నుడికిఁ బుష్టిఁ గూర్ప నిందఱను నిచటఁ
బేరు కొనియె దేవర్షియౌ నారదుండు.
ఇందుఁగల మహా పూరుషులంద అమల
భక్తితత్త్వ విదాచార్య వర్యు; లందు
నిరత ''హరి శరణ '' ధ్యాన నిష్ఠుఁడౌ స
నత్సుతుఁడు భక్తి పథిఁ బ్రధాన ప్రవక్త.
తనకు గురుఁడని తొల్తఁబేర్కొనియె మౌని.
భగవదవతారుఁడైన శ్రీ వ్యాసమౌని
పలికె నష్టాదశ పురాణములను ; భక్తి
తత్త్వమును బోధ సలిపె నుదార పణితి,
భక్తి ఖనియ – శ్రీమద్భాగవత పురాణ ;
మిఁక, శుకుని భక్తిఁ దెలుపఁగ నెవరి తరము ?
భక్తి రస నిధానంబైన భాగవతము
తన్ముఖోద్గతామృత సముద్రంబు గాదె !

ప్రథిత శాండిల్య భక్తి సూత్రములె భక్తి
సరణి నీ మహర్షికి గురుస్థాన మొసఁగె.

గర్గ సంహిత లందున గర్గ మౌని
పలికె శుద్ధ భక్తి రస ప్రవాహ ధునిని.

కలఁడు విష్ణువన్ ఋషి – స్మృతి కారుఁ డొకఁడు ;
ఇచట నారాయణర్షి – శ్రీ కృష్ణుఁ డగుట
భక్తి మార్గోప దిష్టఁగా బ్రస్తుతించి
నారదుండు విష్ణువటంచుఁ బేరు కొనియె.

ఇద్ధ తన్మయతాసక్తి సిద్ధిఁ గనిన
పరమ యోగిఁగాఁ గౌండిన్యుఁ బలుకుచుంద్రు
విష్ణు కల్యాణ గుణముల వినుతి సేయు
వేయినోళ్ల శేషుం డెల్ల వేళలందు
దాస్య భావ గురుత్వ మాతఁడు వహించు ;
మఱియు, దాస స్వరూప లక్ష్మణుఁడనంగ
నవతరించె రామానుజుండై ధరిత్రి.
ఉద్ధవుండు శ్రీకృష్ణ ప్రసిద్ధ హితుఁడు.
ఆరుణి యన – " ఉద్దాలక అరుణి " – యనుచు,
ఋషిగ – బ్రహ్మ నిష్ఠుఁడుగ వచింపఁ బడియె–
నుపనిషత్తుల ;– నాతఁడై యొనరు నిచట

సతత మాత్మ నివేదనాసక్త భక్తి
శస్త మూర్తి నాఁజను బలి చక్రవర్తి
భక్తి బలమునఁ దన ద్వార పాలకునిఁగ
నానఁ బెట్టె శ్రీ భగవాను నంత వాని!

నిర్మలుండుఁ బ్రాఁతః స్మరణీయుఁడైన
హనుమ దాస్య భావంబు మహాద్భుతంబు.

దృఢమతి విభీషణుండు భక్తి ప్రభావ
మునను శ్రీరామ మైత్రినిఁ బొందఁ జాలె.

భక్తి శాస్త్ర సదాచార్య నరులు వీరు,
మఱియుఁ, బలువురు భక్తి తత్పరులు – బుధులు
లోక నిందాస్తుతులను దృణీకరించి
భక్తి మహిమను వేనోళ్లఁ బలికినారు
స్వస్వ జీవన మార్గాను సరణి వారు
భాసురోన్న తత్పస్థితి భక్తి కిడిరి.
నారదుఁడు వీరల మతాను సారమునను
ధృతిమతిని భక్తి భేరి మ్రోయించినాఁడు.

**సూ :** **య ఇదం నారద ప్రోక్తం శివాను శాసనం**
**విశ్వసితి శ్రద్ధత్తే సప్రేష్ఠం లభతే**
**సప్రేష్ఠం లభత ఇతి.** 84

టీక: యః = ఎవఁడు ; ఇదం = ఈ ; నారదప్రోక్తం = నారదుని లెస్సగఁ బలుకఁబడిన; శివ–అను శాసనం = శుభప్రదమైన బోధ ; విశ్వసితి = నమ్ముచున్నాడో; శ్రద్ధత్తే = శ్రద్ధతో ఆచరించు చున్నాఁడో ; సః = వాఁడు ; ప్రేష్ఠమ్ = ప్రియతముఁడైన భగవానుని ; లభతే = పొందుచున్నాఁడు ; స – ప్రేష్ఠం లభత – ఇతి = వాఁడు ప్రియతముఁడైన భగవానుని పొందుచున్నాఁడు.

**తె.గీ. :** **స్వస్తి! నారదోక్త శివానుశాసనంబు,**
**దీన విశ్వాసమును శ్రద్ధఁ బూను వాఁడు**
**ప్రియతముని భగవానుఁ బ్రాపించఁ గలఁడు**
**ప్రియతముని భగవంతుఁ బ్రాపింపఁగలఁడు.**

**వివ :** ఇంత దనుకను భక్తి సిద్ధాంత సరణిఁ
గ్రమతఁ బ్రవచించి, మఱి సూత్రకారుఁ డిందుఁ
దత్ఫలంబు వర్ణించె నుదార రీతి

★ ★ ★

ఈ శివంకరమౌ నుపదేశ మాది
భక్తి తత్త్వ ప్రథమ గురు వర్యుఁడైన
శ్రీపతి శివునకు నుపదేశించి యున్న
దీన విశ్వాసమును శ్రద్ధఁ బూనువాఁడు
ప్రియ తముని భగవంతుఁ బ్రాపింపఁగలఁడ
టంచు నారదమౌని భాషించె మనకు

★ ★ ★

నారదుని భక్తిసూత్రార్థ సారమెల్ల
నీ చరమ సూత్ర మందుఁ జిత్రించఁ బడియె.
గురువు నారదుఁడీకృతిఁ గూర్చె ; నిదియు
పూర్వ దేశిక సమ్మతంబును శివంబు ;
పొనర దీనను విశ్వాస మూని, శ్రద్ధ
ధాఁనుఁడై సదాచరణ తత్పరతఁ గనిన
ధన్యచరితుఁడు తన ప్రియతముని నిశ్చ
యముగఁ బొందును దదనుగ్రహమున ననుచు
భక్తి – యధికారి – విషయ సంబంధములుఁ– ప్ర
యోజనంబు నీ సూత్రార్థ మొనరఁ బలుకు

★ ★ ★

ఉచిత విశ్వాసమును శ్రద్ధ యొనరదేని
నెట్టి కృషి యేని జగతి ఫలించఁ బోదు
సంశయాత్ముఁడౌ వాఁడ వశ్యము నశించు ;
సాధనంబు, విశ్వాసము శ్రద్ధ గలుగు
వానికిది తెల్పఁబడెఁ; గాన భక్తి సలుపు
వాఁడు భగవంతునందు విశ్వాస మూని
శ్రద్ధమై భక్తి సలుపఁగాఁ జనును సతము

★ ★ ★

అన్యసాధనములఁ బ్రభు నన్యరూప
ములను బడయంగ నగుఁ; బ్రేమ కలితభక్తి
పథమునఁ బ్రియతము రూపుఁ బడయ నగును
అట్టి ప్రేమయే చరమంబు నైతనర్చు;
పరమ మోక్షమే సన్న్యసింపంగఁబడెడి ;
అదియ పంచమ పురుషార్థమనఁగఁబడును ;
వసుధ నిదియ పో జీవన పరమ ఫలము

జయము– శ్రీకృష్ణ సాయికి – జయము – జయము
జయము – ప్రేమామృతమునకు – జయము – జయము
జయము – సకల జీవములకు ;– జయము – జయము
భక్తునకు – భక్తికిన్ – భగవానునకును !

నమస్తుభ్యం భగవతే – నిర్గుణాయ గుణాత్మనే
కేవలా యా ద్వితీయాయ గురవే కృష్ణరూపిణే
యోఽహం మమాస్తియత్కించి దిహలోకే పరత్రచ
తత్సర్వం భవతో నాథ ! చరణేషు సమర్పితమ్!

పదేపదే యథాభక్తిః పాదయోస్తవ జాయతే
తథాకురుష్వ దేవేశ నాథస్త్వంనోయతః ప్రభో

పతిపుత్ర సుహృద్భ్రాతృపితృవన్మాతృవద్ధరిమ్
యేధ్యాయంతి సదోద్యుక్తాస్తేభ్యోపీహనమోనమః

ఓమ్
తత్ సత్
శ్రీ కృష్ణార్పణమస్తు

ఓమ్ శ్రీసాయినాథాయ నమః





రచయిత

1973 నుండి ఆధ్యాత్మికాభివృద్ధికి, శ్రీ సాయిబాబా తత్త్వ ప్రచారమునకు తోడ్పడుచున్న

## శ్రీ సాయీ నిలయ ప్రచురణలు

రు. 600-00 విలువగల పుస్తకములు ఉచితం - త్వరపడుడు.

శ్రీశ్రీశ్రీ H.H.B.V. నరసింహస్వామి (Founder A.I.S.S., Madras) గారి ప్రియశిష్యులు. శ్రీ సాయి సారస్వత వాచస్పతి - శ్రీ షిర్డీ సంస్థాన ఆస్థాన ఆంధ్ర విద్వాంస - ఉభయ భాషాప్రవీణ - శ్రీ సాయి భక్త శిఖామణి బిరుదాంకితులు.

## కీ.శే.శ్రీ బాపట్ల హనుమంతరావుగారి రచనలు

ఏమీ! నిన్నుపేక్షింతునా? ఇవి రెండు భాగములు

1. ప్రథమ భాగం : 18 ప్రకరణములు. 440 పుటలు డెమీ రు. 80/-
2. ద్వితీయ భాగం : 32 ప్రకరణములు 584 పుటలు, డెమీ రు. 98/-
3. శ్రీ సాయీ అనుసరణము : 382 పుటలు డెమీ రు. 62/-
4. శ్రీ సాయి కరుణ : 246 పుటలు, డెమీ రు. 62/-
5. శ్రీ సాయినాథ బోధామృతము : 643 సూక్తులు రు. 53/-
6. శ్రీ సాయిబాబా పూజాస్తవములు :136 పుటలు, క్రౌను రు.17/-

7. ప్రేమామృతము (నారదభక్తి సూత్రములు - వ్యాఖ్య) ....................రు.80

8. శ్రీలక్ష్మీనారాయణ స్తోత్రమంజరి....................................................రు. 26.00

9. శ్రీ సాయిబాబాకూడా దేవుడేనా (సందేహనివృత్తి)....................రు.25.00

10. నా సాయి (షిరిడి సాయి-సత్యసాయీ ప్రభువుల అభేదస్థితి.........రు. 26.00

11. శ్రీ రామతీర్థుని నీతి కథలు....................................................రు. 5.00

12. శ్రీ సాయిబాబా ఏకాదశ సూక్తులు..........................................రు. 5.00

13. శ్రీ సాయి సద్గురూ! చాలీసా ....................................................రు. 2.00

14. శ్రీ ఆదిత్య హృదయమ్.............................................................రు. 2.00

15. శ్రీ హనుమాన్ చాలీసా ...........................................................రు. 5.00

16. శ్రీ రామా! ఆపదుద్ధారకా! రామకథ..........................................రు. 10.00

17. శ్రీ సాయీ హనుమసారథి భావ సంగ్రహము2 భాగములు............రు. 13.00

18. శ్రీ సాయీ కవచమ్ ( శ్రీ మూలా పేరన్న శాస్త్రి గారి రచన).......రు. 2.00

19. శ్రీ సాయినాథస్తుతి.....................................................................రు. 3.00

20. శ్రీ దాసగణూ విరచితస్తవనమంజరిప్రచురణ కర్త పద్యానువాదం.రు. 8.00

21. శ్రీ పుండరీక చరిత్రము..............................................................రు. 17.00

22. శ్రీ సాయినాథ స్తోత్రము ...........................................................రు. 3.00

23. శ్రీ సాయి కల్పద్రుమ శతకము ..................................................రు. 5.00

24. శ్రీరామ రక్షాస్తోత్రము ...............................................................రు. 2.00

త్వరలో శ్రీ హనుమంతరావుగారి రచన శ్రీ భగవద్గీతామృతము

మూలశ్లోకము - తెలుగు పద్యానువాదము

పోషకులుగ చేరి మీ పేరు ప్రకటించుకొను సదవకాశము వినియోగించుము!

## మహారాజ పోషక సభ్యత్వం : రు. 1016.00

మీ వంశ వర్ణన - మీరు కోరిన వారి చిత్తరువు Art Paper మీద ; మీ విరాళము వినియోగించే పుస్తకములు 5 ఉచితం.

## రాజపోషక సభ్యత్వం : రు. 503.00

మీరు కోరిన చిత్తరువు, మీ విరాళం ప్రకటన ఇవి 2 పుస్తకములు ఉచితం.

## జీవిత సభ్యత్వం : రు. 350.00 చెల్లించి

1. స్వీకరించగనే మీరు శాశ్వత పోషకులుగ గుర్తింపు పత్రంతో, 25 పుస్తకములు పొందగలరు.
2. మీ విరాళము ప్రకటించే పుస్తకము, తదుపరి విడుదల అయ్యే ప్రతి క్రొత్తపుస్తకము ఒక ప్రతి మీకు ఉచితం.
3. సాధారణ పోషకుల పేర్లు ప్రకటించి విరాళమునకు సరిపడు పుస్తకములు పంపబడును.
4. రుసుం, మనియార్డరు లేక Andhra Bank, Jammulapalem Branch, or State Bank of India,Bapatla Branch మీద, ప్రచురణకర్త పేర D.D. A/c Payee గ పంపవలెను.
5. V.P.P. పద్ధతిలేదు. 6. చెక్కులు స్వీకరించబడవు. 7. తపాలాఖర్చులు అదనము.
8. చిరునామా మార్పులు తెలుపవలెను.
9. పుస్తకములు చేరినట్లు కార్డు, ప్రతిలేఖలో మీ గుర్తింపు నెంబరు తప్పక వ్రాయవలెను.
10. మీ పరిచయులను సభ్యులుగ చేర్చి, ప్రచార యజ్ఞంలో పాల్గొనండి !

**చిరునామా :**

తేది : 20 - 08 - 2000

ఫోన్ : 08643 - 27565

**బాపట్ల వేంకట పార్థసారథి**

శ్రీ సాయీ నిలయమ్

చెరువు జమ్ములపాలెం (పోస్టు)

గుంటూరు జిల్లా - 522 113.